# విశాల నేత్రాలు



రచన

శ్రీ పిలకా గణపతిశాస్త్రి

ప్రచురణ

నిమ్మగడ్డ వెంకట కృష్ణారావు & సన్సు

పార్కురోడ్ — విజయవాడ-1

# రెండు మాటలు

ఈ నవల రచనలో చాలా కాలానికి పూర్వం చెన్నపురంలో శ్రీరామకృష్ణ మఠాధిపతులు శ్రీ రామకృష్ణానందస్వామి ఆంగ్ల గ్రంథం "లైఫ్ ఆఫ్ రామానుజ" నా కెంతో ఉపయోగపడింది. ఈ సందర్భంలో ఇంకా కొన్ని సంస్కృతాంధ్రాంగ్ల గ్రంథాలు కూడా పరిశీలించాను. దీనిలో శ్రీమద్రామానుజులు, హేమసుందరి, రంగనాయకుడు, గోవింద యతి, దాశరథి, అనంతసూరి ఆదిగాగల వారి గాథ చాలా వరకు చరిత్ర ప్రసిద్ధము.

"విశాల నేత్రాల" కృతి స్వీకరించిన ఆప్త మిత్రులు శ్రీ ఇ. కె. కుమార్ గారు ప్రస్తుతం మద్రాసులో సైనమైడ్ ఇండియా లిమిటెడ్ సంస్థలో రీజినల్ మానేజరుగా వ్యవహరిస్తున్నారు. వీరి సహోదరులు శ్రీ ఈయుణ్ణి దేశికాచారిగారు నాకా బాల్య స్నేహితులు. విజయనగర మహారాజ సంస్కృత కళాశాలలో చదువుకొంటున్న సమయంలో నాకు శ్రీ కుమార్ గారి మామగారు స్వర్గీయ కిళాంబి రంగాచార్యులు గారితో పరిచయ భాగ్యం లభించింది. ఆయన బహు గ్రంథ రచయిత. ఆనాడు విజయనగ రాంగ్ల కళాశాల ప్రధానాచార్యులు. ప్రముఖ గణిత శాస్త్రవేత్త.

ఇంతే కాదు. వారి జనకులు శ్రీరామావతారంగారు సంస్కృత కళాశాలలో ప్రధానాచార్యులుగా ఉన్న తరుణంలో

నా కక్కడ అంతేవాసిగా ఉండే అదృష్టం పట్టింది. ఆయన చాలాకాలం విజయనగ రాంగ్ల కళాశాల ప్రధానాచార్యులుగా పనిచేసి, పదవీ విరమణ పిమ్మట సంస్కృత కళాశాల ప్రధానాచార్యు లయినారు. మహా విద్వాంసు లయిన ఆ వృద్ధమూ ర్తి పరిణత సువర్ణాకృతి, విద్యార్థుల యెడల ఆత్మీయాస క్తి నేనెన్నటికి విస్మరించలేను. శ్రీ కుమార్ గారి ఈనాటి కృతి స్వీకృతి నాలో ఆనాటి మనోజ్ఞ స్మృతు లెన్నో రేకె త్తించింది. దీనికి వారి కిదే నా కృతజ్ఞత.

కొంతకాలం క్రితం ఆంధ్ర వార పత్రిక సంపాదకు లీసవల తమ పత్రికలో శ్రీ బాపుగారి మనోహర రేఖా చిత్రాలతో అయిదారు మాసాలపాటు ధారావాహికంగా ప్రకటించి అసంఖ్యాకులయిన ఆంధ్ర పాఠకుల కందించారు. ఈ విషయంలో నా యెడల వారి ఆదరణ చిరస్మరణీయము.

ఇది పు స్తక రూపంలో ప్రకటించిన ఎస్. వి. కృష్ణారావు అండ్ సన్సు సంచాలకులు శ్రీ నిమ్మగడ్డ బాబూ రాజేంద్ర ప్రసాదుగారు ఇంతకు ముందు కొన్ని మంచి పు స్తకాలు ప్రకటించారు. త్వరలోనే మరి కొన్ని ప్రకటించబోతున్నారు. వారి సంస్థ సదా వర్థిల్ల వలెనని ఆశిస్తున్నాను.

చెన్నపురము, పి. గణపతి శాస్త్రి

1-8-63.

# కృతి బహూకృతి

## ఆప్తమిత్రులు శ్రీ ఇ. కె. కుమార్‌గారికి

పరమ కరుణానిధి యతీంద్ర పాదరేణు
పులకితాంగులమై బాష్ప పూర సిక్త
ముఖ యుగళ మాశ్రియః పతి మ్రోల వాంచి
యెడద లుప్పొంగ నెపుడో సేవించినాము

శీతల కవేర జాజల
పూత శరీరముల నూర్ధ్వ పుండ్రమ్ములతో
ప్రాత ర్వేళల దనుజా
రాతిం గొలిచితిమి పాశురమ్ముల రక్తిన్

శ్రీరంగ నిలయమున "నో
హో! రంగేశా! ప్రభూ! కృపాళూ!" అని నో
రారంగా నుతియించితి
మౌరా! కలలై స్ఫురించె నానాటి కతల్!

పోయె నా భక్తి! ఆ శేషశాయి మరల
తానె దిగి వచ్చి, మన సమ్ముఖాన నిలిచి
జాలిపడి పిలిచె నేని "మోసమ్ము చాలు!
పొమ్ము! పొమ్మ"న గలము! నిజమ్ము! నిజము!

కాని, చిర పూర్వ జన్మ పుణ్యాన, స్వామి
దర్శనీయ "విశాల నేత్రాల" తరళ
చంచలా దీప్తిలోన నిండించినాము!
ధన్యతా నంద మెదలలో తాండ వించె!

శ్రీ మద్రామానుజ కరు
ణామృత వర్షమ్ము మిత్రమా! ఇక మనకై
హేమమయమ్మై, స్థిరమై
శ్రీ మంగళశాలి భాగధేయమ్మగుతన్!



# విశాలనేత్రాలు

ఆకాశంలో నీలినీలి మబ్బుల బారులు తెలితెలి వెన్నెల వెలుగులతో దోబూచు లాడుకొంటున్నాయి. నేల మీద వెలుగునీడలు ఒండొంటి ననుసరించి పరుగు లారంభించాయి. నీలమేఘాల పైపైన అంతా వినిర్మలాకాశమే! తెల్లని తేట వెలుగుల పాలసంద్రమే! ఎటువైపు చూచినా మిణుకు మిణుకు మంటున్న చుక్కల తళతళలే! కాని నిచుళాపురంలో అంతట మసక మసక చీకట్లే!

ఊపిరి బిగబట్టుకొని రంగనాయకుడు మామిడి చెట్టు చిటారు కొమ్మమీద కెగబాకుతున్నాడు. ఒళ్ళు అక్కడక్కడ కొంచెం చీరుకుపోయింది. అయినా అతనికి చిన్న చీమ కుట్టి నట్టయినా అనిపించలేదు! అలాగే అతి కష్టంమీద ఆ మామిడి చిటారు కొమ్మ చేరుకొన్నాడు. దానిమీద కూర్చుని నెమ్మది నెమ్మదిగా ముమ్ముందుకు జరిగి దట్టంగా అలముకొన్న చిగురుల గుబురులో తలదాచుకొన్నాడు. తన సంగతి ఎవరయినా పసి కడుతున్నా రేమోనని చాలా జాగ్రత్తగా ఆ మామిడితోపు నాలుగు మూలల పరిశీలించాడు. ఎక్కడ మనిషి జాడ కనిపించ లేదు.

రంగనాయకుడు కొంచెం తల పైకెత్తి తన కెదురుగా రెండు, మూడు బారల దూరంలో, గుడ్డి వెన్నెల వెలుగులో కొంచెం చూచాయగా మెరుస్తున్న మేడ కిటికీ కేసి చూశాడు.

ఉసూరుమని నిట్టూర్చి రెప్పపాటయినా లేని నిశ్చల దృష్టితో ఆ గవాక్షమే పరిశీలిస్తూ ఏదో ఆలోచనలో పడ్డాడు.

ఆకాశంలో దట్టంగా కమ్ముకొన్న మబ్బుల మాటున తల దాచుకొన్న జాబిల్లి క్షణకాలం తళుక్కుమని మెరిసి, తిరిగి మేఘాల మాటునపడి అదృశ్యుడయినాడు. మిణుగురుల మెరుపులలో తళతళలాడుతున్న మామిడి పూ గుత్తుల సువాసన ఆతని హృదయంలో రవంత మైకం రేకెత్తించింది. నిచుళాపురంలో ఎక్కడో మారుమూల ఒక జాగిలం మొరిగింది. పక్కనే కొమ్మ మీద ఉడత తోక పైకెత్తి పరిగెత్తింది. రంగనాయకుడు కొంచెం ఉలిక్కిపడ్డాడు. కాని తమాయించుకొన్నాడు. చిరుగాలికి రాలుతున్న పండుటాకుల గలగల ధ్వని లీలగా అతని హృదయంలో ప్రతిధ్వనించింది.

రాత్రి మూడో యామం కూడా గడిచిపోతున్నది. అయినా అతని కింతవరకు హేమసుందరి సందర్శన భాగ్యం లభించలేదు. అనుకొన్న సమయానికి కొంచెం ముందుగానే తా నక్కడికి వచ్చి ఉండవచ్చునని రంగనాయకు డనుమానించాడు. ఒక వేళ దాసి నాంచారమ్మ ద్వారా పంపించిన కబురు హేమసుందరి కందలేదేమో అని మళ్ళీ కొంచెం మథనపడ్డాడు. రంగనాయకుడు ఒంటి కంతటికి దట్టంగా మసి పూసుకొన్నాడు. బహుశః అందువల్లనే తన రాక హేమసుందరికి తెలిసిఉండక పోవచ్చునని కొంతవరకు సమాధానపడ్డాడు.

శిరస్సు బాగా పైకెత్తి మళ్ళీ ఆ మేడ కిటికీ లోలోపల పరిశీలించాడు. అతని అదృష్టం పండింది! మబ్బుల మాటున దాగిన చందమామ తెర తొలగించుకొని ఇవతలికి వచ్చి,

తెల్లని వెలుగులతో తోటంతా ముంచెత్తుతున్నాడు. ఆ వెలు తురులో అతని రాక హేమసుందరి గుర్తించిందేమో! నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ కిటికీముందు నిలబడింది. సన్నని తీయని కంఠస్వరంతో "మీరేనా! వచ్చారా!" అని పలకరించింది. మామిడి కొమ్మలమీదనించి దిగజారిన వెన్నెల జాలు హేమసుందరి నుదుటిమీద ప్రసరించింది. రంగనాయకు డిప్పుడు ముఖం కొంచెం పైకెత్తి ఆ సుందరి విశాల వినీల నేత్రాల వైపే చూస్తూ మరి బాహ్య ప్రపంచం మాటే విస్మరించాడు!

ఎర్రగా కాగిన పాలవంటి ఆమె శరీరచ్ఛాయ చంద్ర కాంతిలో దృశ్యాదృశ్యంగా భాసించింది. ముంగురులలో వేలాడుతున్న మేలి ముసుగులో కర్ణాభరణాల వరకు విస్తరించిన విశాల విలోచన యుగళి వలలో చిక్కుకొన్న గండు మీల జంటవలె చెంగలించింది. ఇంచుమించుగా ఇరవై యేళ్లు నిండిన వయస్సు ముమ్మరంలో పాల వెన్నెలలో హేమసుందరి రంగనాయకుని కొక అచ్చరలా సాక్షాత్కరించింది! కలగంటున్నానా? మేలుకొన్నానా? అని అతడొక క్షణకాలం లోలోపల వితర్కించుకొన్నాడు.

ఆ సమయంలో వా రుభయులు ఒకరొకరి బిగి కౌగలింతలలో వాలి మైమరిచి నిద్రించాలని ఎంతయినా ఉబలాటపడ్డారు. కాని కొంచెం అప్యాయంగా మాట్లాడుకోవడానికే అవకాశం లభించలేదు. రవంత గొంతెత్తి ప్రసంగిస్తే తమ సంగతి ఎవరయినా ఇట్టే కనిపెట్టివేయవచ్చునని రంగనాయకుడు బాగా తటపటాయించాడు. అలాగే గభీర నిశ్చల దృష్టితో ఆమె సోయగం జుర్రుకొన్నాడు. ఆ క్షణంలో వా రిద్దరి పెదవుల

మీద తరలించిన దరహాసరేఖ ఆకాశంలో అంతట రెల్లు పూల జల్లులా అలముకొన్న వెన్నెల వెలుగులతో మేళవించింది.

అంతలోనే రంగనాయకుని మనస్సులో మెరుపులా ఒక ఆలోచన మెరిసింది. వెనువెంటనే అది ఆమెతో చెప్పి తీరాలని నిశ్చయించుకొన్నాడు. మరి వేచి ఉండలేక, ఊపిరి బిగబట్టి ఒక్క దూకులో ఆ మేడ కిటికీమీది కెగిరి, కాలుజారి పడిపోకుండా ఊచ గట్టిగా పట్టుకొన్నాడు. అతికష్టంమీద చువ్వల మధ్యనించి హేమసుందరి కళ్లు రెండు గట్టిగా ముద్దు పెట్టుకొన్నాడు. చెవిలో ఏదో చెప్పబోయాడు. కాని ముస్ముందుగా చెక్కిలిమీద చిక్కని ముద్దు చిత్రించాడు. ఆ తన్మయతలో మరి తన రహస్యం మాటే మరిచిపోయాడు. గాఢానురాగావేశంతో మైమరిచి హేమసుందరి విశాల నేత్రాలదే పనిగా పెదవుల కద్దుకొన్నాడు. ఆ తమకంలోపడి తమ ఇద్దరి ఉనికి బయటపడిపోగల దన్నమాటే తలపెట్టలేదు.

అంతలోనే హేమసుందరి కెక్కడో చూచాయగా అడుగుల సవ్వడి వినిపించింది. ఉలిక్కిపడి "వెళ్ళిపొండి! వెళ్ళిపొండి!" అని నెమ్మదిగా రంగనాయకుని చెవిలో ఊదింది! సునిశిత దృష్టితో అతడు తిరిగి తోట నాలుగు వైపుల పరిశీలించాడు. ఎక్కడ ఎవ్వరు కనబడలేదు! ఉండి ఉండి చెట్ల కొమ్మల రెమ్మలలో చిరుగాలి చెలరేగింది. మామిడి కొమ్మ గుబురులో అల్లుకొన్న గూటిలో పొంచిఉన్న సాలీడు కొంచెం భయపడి అటు ఇటు పచారు లారంభించింది. రాత్రి వేళ ఆ గూటిమీద జాలువారిన మంచు బిందువులా కదలికలతో నలువైపుల చెదిరి మంచి ముత్యాలవలె తరళించాయి.

జాబిల్లి మళ్లీ నల్ల నల్లని మబ్బులలో పడి అదృశ్యు డయినాడు. తిరిగి నాలుగు మూలల మసక చీకటి అలము కొన్నది. అంతలోనే రంగనాయకుని కా భవంతి సింహద్వారం దగ్గర కావలివా డొకడు కనిపించాడు. ఆ అపరాత్రివేళ వాడ క్కడ గోడ కానుకుని చతికిలపడి నిద్దర బరువుతో జోగు తున్నాడు. అప్పుడప్పుడు కన్నులు నులుముకొని లేచి నలు వైపుల పరకాయిస్తున్నాడు. తలవని తలంపుగా వాడి చూపు రంగనాయకుని మీదపడింది. మరుక్షణంలోనే గొంతెత్తి "దొంగ! దొంగ!" అని గట్టిగా కేకలు పెట్టాడు.

రంగనాయకుని కిక ఊపిరాడలేదు. నెమ్మదిగా హేమ సుందరి చెవిలో తా ననుకొన్న రహస్యం చెప్పి, చెక్కిలి ముద్దు పెట్టుకొని, ఒక్క దూకులో మామిడికొమ్మ మీది కెగిరి రెమ్మలమాటున తలదాచుకొన్నాడు. ఆపైన పారిపోవడాని కనువయిన అవకాశంకోసం ప్రతిక్షణము నిరీక్షించాడు. కాని ఎక్కడ దారి కనబడలేదు! అంతలోనే పరిచారకులు కొందరు మేలుకొని భవంతి ప్రాకారంలో అటు ఇటు పరుగు లారంభిం చారు.

వారిలో ఒకడు ఆకులమాటున అణిగి మణిగి ఉన్న రంగ నాయకుని వైపు చూపుడు వేలెత్తి నిర్దేశించి "అడుగో! దొంగ" అని గట్టిగా గొంతెత్తి కేక పెట్టాడు. రంగనాయకు డొక్క దూకులో చెట్టు చిటారు కొమ్మమీది నించి నేలపై కురికి పక్కనే ఇంకొక చిన్న చెట్టు కొమ్మమీద దాచుకొన్న బాణాకర్ర చేజిక్కించుకొన్నాడు. అదే క్షణంలో పరిచారకు లొక రొకరే పొడుగాటి కర్రలతో అతనితో తలపడ్డారు. మరి

కొందరు చేతికందిన రాళ్ళతో, రప్పలతో రంగనాయకుని మీద ఎడతెగని జడివాన కురిపించారు! అయినా మిక్కిలి చాక చక్యంతో అతడు వారి దారుణాఘాతా లన్ని తప్పించు కొన్నాడు. అయిదారు నిమిషాలవరకు బాణా కర్రల తాకిడి వల్ల చెలరేగిన కోలాహలం భవంతి ప్రాకారంలో అంతటా ప్రతి ధ్వనించింది. అప్పుడప్పుడు ఆ కర్రల ఒరపిడివల్ల బయలుదేరిన విస్ఫులింగాల కాంతి ఆ పోటరుల నేత్రాలలో ప్రతిఫలించింది.

నలుగు రయిదుగురు పరిచారకులు, రంగనాయకుడు మీది మీది కురి గట్టిగా కొట్టిన దెబ్బలతో "అయ్యో!" అయ్యో!" అని అరిచి, స్పృహతప్పి నేలమీద కూలి పోయారు. మిగిలినవా రది గమనించి కొంతదూరం పారిపోయి ఆ వ్యక్తి ఎవ్వరో గుర్తించాలని ఏకాగ్ర వీక్షలతో ప్రయత్నిం చారు. కాని వారి కోరిక నెరవేరలేదు. అతని ముఖంమీద, ఒంటిమీద కాటుకవంటి నల్లని మసి మాత్రమే అస్పష్టంగా కని పించింది. అంతలోనే మిగిలినవారి నొక్కొక్కరినే పడగొట్టి తప్పించుకొని రంగనాయకు డొక్క దూకులో ఆ భవంతి ప్రాకారం గోడమీది కెగిరి, క్షణకాలం నాలుగు మూలల పరి శీలించి, వీధిలో దూకి, కాలికొద్ది పరుగుపెట్టి సందులమ్మట గొందులమ్మటపడి అదృశ్యు డయినాడు!

## 2

ఆ మరునాడు నిచుళా నగరంలో ఎక్కడ విన్నా ఒకటే ఘోష! శృంగార మంజరి భవంతిలో అర్ధరాత్రి దాటిన తర వాత ఎవడో గొప్ప గజదొంగ జొరబడ్డాడు. జమా జట్టీల

వంటి కావలివాళ్ళయిదారుగురు కత్తులతో, కర్రలతో వాడితో తలపడ్డారు. అయినా వాళ్ళందరిని బాణా దెబ్బలతో హూనం చేసి ఆదొంగ ఒక్క-దూకులో భవంతి ప్రాకారం దాటి వీధిలోపడి ఇట్టే మాయమయినాడు! వా డెవడో గాని సాము గరిడీలలో బాగా ఆరితేరిన జగజెట్టి అయితీరాలి! లేకపోతే అంతమంది ఒక్క-మారుగా విసరిన రాళ్ళలో ఒక్క-టీ కూడా వాడికెందుకు తగలలేదు! ఆ పట్టణంలో అంతట గుసగుస లా విధంగా విస్త రించాయి.

క్రీస్తుశకం 11 వ శతాబ్ది ఉత్తరార్థంలో దక్షిణ భారతంలో కాంచీరాజ్యం న్యాయమయిన ప్రజా పరిపాలనంలో ద్రవిడ దేశంలో అంతట బాగా ప్రసిద్ధి కెక్కి-ంది. నిచుళా నగరంలో కాంచీరాజ్య దండనాయకుని పేరు చెబితే పెద్ద పెద్ద గజదొంగలే హడలిపోయేవారు! అదీగాక శృంగారమంజరి సౌధంలో కావలివాళ్ళ కొరతలేదు. అయినా ఆ దుస్సాహసి వాళ్ళందరిని చిత్తుచేసి ఇట్టే తప్పించుకుని పారిపోయాడు! తెల్ల వారేసరికి ఆ విడ్డూరం సంగతి పట్టణంలో నాలుగు వైపుల కార్చిచ్చులా వ్యాపించింది.

బాగా పొద్దెక్కి-న తరువాత ఏ డెనమండుగురు రాజ భటులతో, పెద్ద అట్టహాసంతో పట్టణం తలవరి, శృంగార మంజరి భవంతికి విజయం చేశాడు. ఆతడు వస్తున్నాడన్న మాట వినగానే ఆవేశ్యమాత ఎంతో భయభక్తులతో ఎదురుగా వెళ్ళి తన మేడమీదికి తోడుకుపోయి, రాజ మర్యాదతో గౌరవించింది. చేతులు కట్టుకుని కట్టెదుట నిలిచింది. గత రాత్రి జరిగిన వ్యవహారం తెలిసినంతవరకు ఆదరాబాదరాగా అస్త

వ్యస్తంగా ఏ కరువు పెట్టింది. మధ్య మధ్య చిన్న చిన్న బుడి బుడి దీర్ఘాలు తీసింది.

శృంగార మంజరి చెప్పినదంతా అయిదారు నిమిషాల పాటు విన్నా తలవరి కదేమి అంతుపట్టలేదు ! అడ్డు ప్రశ్నలు వెయ్యడాని కసలా ప్రౌఢాంగన అతనిమాటే చొరనివ్వలేదు ! మాటి మాటికి గుక్క తిప్పుకోకుండా అదే ధోరణిలో తన సోది కొనసాగించింది. ప్రాణం విసిగి మరి ఆ గోడే వినిపించుకోక తల వరి ప్రశ్నించాడు :

"అయితే, ఇంతకి నగలు, నాణ్యాలు ఏమయినా పోయాయా ?"

"లేదు బాబూ ! ఆ శ్రీరంగనాథస్వామి దయవల్ల నగలు గాని, సొమ్ముగాని ఏమి పోలేదు ! అదిగో ! వాడా కిటికీ మీదికి దూకాడట ! అంతలోనే కావలివాళ్ళు మేలుకొని కేకలు పెట్టారట !"

"వాళ్ళ కేమయినా ప్రమాదంగా గాయాలు తగి లాయా ?"

"ఇద్దరు ముగ్గురికి మాత్రమే గట్టి దెబ్బలు తగిలాయి. కాని ప్రాణభయం లేదంటున్నారు !"

తలవరి కొంచెం ఆలోచనలోపడి మళ్ళీ అడిగాడు :

"పోనీ వాడెలా ఉన్నాడో ఎవళ్ళయినా కనిపెట్టారా ?"

"లేదు. ముఖానికి వంటికిదట్టంగా మసిపూసుకొన్నాడట!"

తలవరి మరికొంత సేపాలోచించి శృంగార మంజరి పెద్ద కుమార్తె మాణిక్యవల్లిని తన సమక్షానికి పిలిపించాడు. ఆమె ఒయ్యారం ఒలకబోస్తూ అక్కడికి వచ్చి వంక దణ్ణం పెట్టి

కొంచెం తలవంచుకుని క్రీగంటి చూపుల తూపులు విసురుతూ అతని పార్శ్వంలో నిలబడింది. అంతకు మునుపే మాణిక్యవల్లి కాలి అందెల ఘుల ఘుల ధ్వని విని తలవరి కొంచెం పర ధ్యానంలో పడ్డాడు. చామనచాయే అయినా, దానితో ఆమె అందం మరింతగా ఇనుమడించినదని అత డనుకొన్నాడు. ఉద్వే త్తుగా ఉప్పొంగిన ఆ జవ్వని వక్ష స్థలం మీద ముప్పేట ముత్యాలహారం కదలిక గమనించిన తరవాత, మరికొంత సేప టికివరకు ఆ దొంగ సంగతే మరిచిపోయాడు !

కాని కొంచెం తమాయించుకొన్నాడు. చిరు నవ్వుల రువ్వులతో ఆ గత రాత్రి జరిగిన దొంగతనాన్ని గురించి ప్రశ్నిం చాడు. ఆ అపరాత్రివేళ మాణిక్యవల్లి అదమరచి నిద్రిస్తున్నది. కావలివాళ్ళ గావు కేకలతో ఉలిక్కిపడి లేచింది. కాని అప్ప టికే ఆ దొంగ పారిపోయాడు. ఆమె అదే సంగతి చెప్పింది. ఆపైన తనకేమి తెలియదని మాటాడ కూరుకున్నది. సరస ప్రసంగంతో మరికొంతసేపు సంభాషణ కొనసాగించి, ఆ దొంగ సంగతి గట్టిగా ఆరా తియ్యాలని తలవరి కనిపించింది. కాని ప్రయోజనం కలగలేదు. అతని ఛలోక్తుల దోరణి కవకాశమే దొరకలేదు. ఆమె అలాగే తల వంచుకొని నిలుచున్నది. వయస్సు పైబడ్డకొద్ది మగవారి మనస్సులలో మగువల మీద మమకారం మరింతగా పెంపొందుతున్నదన్న సంగతి ఆమె అంతకుమునుపే గ్రహించుకొన్నది.

మాణిక్యవల్లితో ప్రసంగం ముగిసిన తరువాత శృంగార మంజరి రెండవ కుమార్తెతో కొంచెం మాట్లాడాలని తలవరి అన్నాడు. ఆమె వెనువెంటనే ఆ మిషమీద అక్కడినుంచి

బయలుదేరి హేమసుందరి నిద్రించే పడకగదిలో ప్రవేశించింది. ఆమె అంతకుముందే నిలువుటద్దం ముందు నిలబడి అలంకరణ కొంతవరకు ముగించుకొన్నది. గతరాత్రి రంగనాయకుడు ఎంతో ఆప్యాయంగా కుడి చెక్కిలి మీద అద్దిన ముద్దుముద్ర చీర చెరగుతో నెమ్మది నెమ్మదిగా తుడిచివేసుకొంటున్నది. నల్లనల్లని మసిపూసిన పెదవితో ఆ వయస్సుకాడు రూపొందించిన ఆనీల కళంకం చంద్రబింబం వంటి తన ముఖాన్ని కొత్త కొంగ్రొత్త సొగసు చేకూర్చినదని, అది అలాగే కలకాలం నిలిచిపోతే తన కంతకన్న కావలసినదేమి లేదని ఆమె లోలోపల ఉప్పొంగిపోతున్నది. కాని గత్యంతరంలేక ఉసూరుమని నిట్టూర్చి నిశ్చల దృష్టితో నిలువుటద్దంలో ప్రతిఫలించిన దాని ప్రతిబింబం పరిశీలిస్తున్నది. అతికష్టంమీద ఆనవాలయినా లేకుండా ఆ వలపు గుర్తు చేలాంచలంతో పూర్తిగా తుడిచివేస్తున్నది.

మాణిక్యవల్లి అక్కడ అడుగుపెట్టిన మరుక్షణంలోనే ఆ సంగతి కనిపెట్టింది. కాని ఆ మసి ముద్ర చెక్కిలిమీద ఎలాగ పడిందో ఆమె కవగతం కాలేదు. కాటుక కన్నీటిమచ్చ అయిఉండవచ్చునని మొట్టమొదట అనుకొన్నది. కాని పూర్తిగా సంతృప్తి కలగలేదు. సరే, ఆ రహస్యం సంగతి ఆ తరవాత ఆరా తీయవచ్చునని నిశ్చయించి హేమసుందరికి తలవరి రాక చెప్పింది. ఆమె ఆమాట వినీ వినగానే ఎంతో కంగారుపడి చీర చెరగుతో తొందర తొందరగా చెక్కిలి చక్కగా తుడుచుకొని, అక్కవెంట ఆ రాజాధికారి దగ్గిరికి బయలుదేరింది. ఆ తత్తరపాటంతా ఒక కంట కనిపెట్టిన మాణిక్యవల్లి మనస్సులో అనుమానం మరికొంత బలపడింది.

తలవరి అంతకుమునుపే శృంగారమంజరితో మళ్ళీ ప్రసంగం ప్రారంభించాడు. ఆ హఠాత్సంఘటనతో ఆమె బాగా కంగారు పడినదనీ, అంతేగాని, ఆ వృద్ధాంగనకా గొడవ లోతు లేవీ తెలియవనీ అతడు నిశ్చయించడానికెంతో సేపు పట్ట లేదు. కాని అంతమాత్రంచేత తలవరి కూరట కలగలేదు. హేమసుందరితో మాట్లాడిన తరవాత అసలు రహస్యం కొంత యినా బయటపడవచ్చునని అనుకొన్నాడు. అంతలోనే అక్క-చెల్లెళ్ళిద్దరు అక్కడికి వచ్చి అల్లంతదూరంలో తలలు వంచు కొని నిలుచున్నారు. తలవరి అంతకుపూర్వం హేమసుందరిని చూడకపోలేదు. కాని ఇప్పుడెందు చేతనో ఆమెలో అతని కొక వింత సొగసు గోచరించింది. క్షణకాలం తన కన్నులే నమ్మ లేక "ఆహా! ఎంతటి అందగత్తె!" అనుకొన్నాడు.

మొట్టమొదట చిన్న చిన్న ఛలోక్తులతో సంభాషణ మొదలుపెట్టి నెమ్మదిగా అడిగాడు:

"అయితే హేమసుందరీ! నువ్వప్పుడేం జేస్తున్నావు?" ఆమె కాలి బొటనవేలితో నేలమీద రాస్తూ "ఎప్పుడు?" అని బొమముడి విరిచింది.

"వాడు నీ పడకగది కిటికీ మీదికి దూకినప్పుడు."

"ఆ గొడవ నాకీవేళ ఉదయమే తెలిసింది. నేనప్పు డాదమరచి నిద్రపోతున్నాను."

"పోనీ, ఆ నిద్రలో నయినా వాడు కిటికీ మీదికి దూకిన చప్పుడు వినిపించలేదా?"

"అవును! కొంచెం చూచాయగా వినపడింది."

"మరి అప్పుడేం జేశావు?"

హేమసుందరి రవంత సేపాలోచించి చిట్టచివర కొక సమాధానం ప్రారంభించింది :

"పెద్ద బావురుపిల్లి ఏదో మేడపై అంతస్తు మీదినించి కిందికి దూకిందేమో అనుకొని గట్టిగా ముసుగు తన్నుకుని పడుకున్నాను. అంతలోనే కావలివాళ్ళు గావుకేకలు వినిపించాయి. వల్లమాలిన భయంతో మరింతగా బిగ్రబిగుసుకుపోయాను."

ఆ సమాధానం విని మాణిక్యవల్లి చెల్లెలికేసి కొంచెం విడ్డూరంగా చూసింది. ఇందులో ఏదో చిదంబర రహస్యం ఇమిడి ఉండవచ్చునని అనుమానించింది. కాని ఆ భావం పైపైకేమాత్రము వ్యక్తం కానీయలేదు. అంతలోనే తలవరి హేమసుందరి వైపు సూటిగా చూసి ప్రశ్నించాడు :

"పోనీ, ఆ తరవాతయినా నీకా దొంగ కనిపించాడా ?"

హేమసుందరి ఉసూరుమని నిట్టూర్చి "జమిలి దుప్పటీతో ఒళ్ళంతా కప్పుకున్న తరవాత వల్లమాలిన భయంతో నా కసలు ఊపిరే ఆడలేదు !" అని పెడముఖం పెట్టుకొన్నది.

తలవరి కా ప్రతి సమాధానంతో మతిపోయినట్టయింది. ఇంతకి సొత్తేమి పోలేదు కనక కావలివాళ్ళు బావురుపిల్లిని చూసి అనవరంగా కంగారుపడి కాళ్ళు విరగదొక్కుకున్నారని వెల్లడించి ఆ విషయం అంతటితో విడిచివేస్తే బాగుండునని ఆలోచించాడు. కాని కావలివాళ్ళలో ఇద్దరు ముగ్గురు చావుదెబ్బలతో మంచాలమీద పడి మూలుగుతున్నారు ! అంతటి విడ్డూరం కప్పిపుచ్చడ మెలాగో అతనికి బోధపడలేదు. "పోనీ అ బావురుపిల్లి వాళ్ళందరి మీదికి దూకి గోళ్ళతో రక్కి పారి

పోయిందని తనపై అధికారి దండనాయకునికి నివేదించి, చల్ల చల్లగా ఆ బెడదలోనించి తప్పించుకుని బయటపడితే!—” అని ఆలోచించాడు. కాని ఆ సమాధానం సంగతి ఆలోచిస్తే అత నికే నవ్వు వచ్చింది. పోనీ పట్టణం పొలిమేరలో ఉన్న చిట్టడివి లోనించి వచ్చిన చిరుత పులి వారందరిమీద విరుచుకుపడి గట్టిగా గాయపరిచిందని చెబితేనో! కాని, అది కూడా అతని కంతగా సరి పడలేదు. నిచుళాపుర దండనాయకుడు చండశాసనుడు! అతని దగ్గర ఈ కల్లబొల్లి శషభిషలేవీ పనికిరావు! కనకనే అతనికా ఉపాయం నచ్చలేదు. అదే సమయంలో అతనికి తిరుమలరెడ్డి సంగతి తటాలున స్ఫురించింది. కొంతకాలంనించి మాణిక్యవల్లి అతని ఒద్దికలో ఉంటూ తన అభినయ చాతుర్యంతో నిచుళా పురంలో పేరు, ప్రఖ్యాతి సంపాదించుకొన్నది. అందుచేత ఆ విషయం అతని చెవిని వేస్తే నేటికి కాకపోతే రేపటికయినా అసలు సంగతి బయటపడకపోదని తలవరి నిశ్చయించు కొన్నాడు.

శృంగార మంజరికేసి చూసి “సరే గాని, ఇంతకి నువ్వే మంటావు?” అన్నాడు. అ వేశ్యమాత చేతులు కట్టుకుని “ఏమో బాబూ! నా కిదేమీ అంతుచిక్కడంలేదు. నా చిన్న తనంలో ఇలాంటి దొంగతనా లెన్నడు కని విని ఎరుగను!” అని చెప్పి ఆ సత్యకాలంనాటి మహిమ అభివర్ణించడం మొదలు పెట్టింది. తలవరి ఆమె ధోరణి కడ్డుతగిలి “సరే! దీనికేంలే! ఇంటిదొంగ నీశ్వరుడైనా పట్టలేడన్నమాట ఊరికే పుట్ట లేదులే!” అన్నాడు కొంచెం వెటకారంగా. శృంగారమంజరి ఆ సమాధానంలో గల అంతరార్థం అంతా ఇట్టే కనిపెట్టింది.

"బాబూ! తాత ముత్తాతల నాటినుంచి మా కుటుంబ మర్యాద మీకు తెలుసునుగదా! నేనిప్పుడు ప్రత్యేకంగా విన్నవించుకోవలసినదేమి ఉంది! నా పిల్లలిద్దరు సత్యకాలం నాటివాళ్ళు. ఈ మాయ కలికాలంలో పుట్టవలసినవాళ్ళు కారు!"

"నువ్వంతకన్నా అమాయకురాలివి! పాపం! నోటిలో వేలుపెట్టినా కరవులేవు!" అని వ్యంగ్యంగా నవ్వి బొమముడి విరిచి తలవరి రాజభటులతో బా టక్కడినుంచి బయలుదేరి తిన్నగా తిరుమలరెడ్డి భవంతివైపు సాగిపోయాడు.

ఆవేళ రాత్రి బాగా చీకటిపడినంతవరకు హేమసుంద రితో కొంతసేపు ఏకాంతంగా సంభాషించాలని మాణిక్యవల్లి ఎంతయినా ఆరాటపడింది. కాని అవకాశం లభించలేదు. దీప దీపాళవేళ దాసి తొందర తొందరగా దగ్గిరికి వచ్చి "తిరుమల రెడ్డిగా రీవేళ రాత్రి ఇక్కడికి విజయం చేస్తున్నామని కబురు పంపించారు." అని చెవిలో చెప్పి చల్లచల్లగా లోపలికి జారు కుంది. ఆమాట విని మాణిక్యవల్లి కొంచెంసే పాశ్చర్యపడి, ఉసూరుమని నిట్టూర్చి దిగాలుపడి నిలుచున్నది.

ఇటీవల కొన్నాళ్ళనించి తిరుమలరెడ్డి శృంగార మంజరి భవంతి కంతగా రావడంలేదు. ఒకవేళ ఎప్పుడయినా చుట్టపు చూపుగా వచ్చినా ఎంతసేపు హేమసుందరిమీదే అతని దృష్టి! ఏ కారణంచేతనయినా ఆమెగాని కనబడకపోతే బాగా దిగులు

పడిపోయేవాడు. హేమసుందరి ఆ భవంతిలో ఎక్కడో ఇంకొక చోట కూర్చుని వీణ సాధన ప్రారంభిస్తే తాళంవేస్తూ సరసనే ఉన్న మాణిక్యవల్లితో అంటే అంటనట్టు మాట్లాడేవాడు. హేమసుందరి కాతని ధోరణి బొత్తిగా సరిపడేది కాదు. పని కట్టుకుని దగ్గరికి వచ్చి కూర్చున్నప్పుడు మాత్రం బాగుండదని ఏదో లోకాభిరామాయణం ప్రారంభించేది. అతని వైఖరి గమనించి మాణిక్యవల్లి మూతి, ముక్కు ముడుచుకుని కూర్చునేది. రుసరుసలాడుతూ పడక గదిలోకి వెళ్ళి తలపట్టుకుని పడుకునేది.

అదీగాక శృంగారమంజరి కూడా తిరుమలరెడ్డి ఆటలంతా సాగనీయలేదు. హేమసుందరి ఎవరయినా ఒక మహారాజు ఒద్దికలో ఉండవలసిన చక్కని చుక్క అనీ, తిరుమలరెడ్డివంటి సామాన్య ధనవంతుడా అందాలరాశి కెంత మాత్రము తగడనీ ఆమె గట్టి నమ్మిక. ఇటీవల శృంగారమంజరి భవంతిమీద తిరుమలరెడ్డి శీతకన్ను పడడాని కదీ ఒక ప్రధాన కారణమే. రెడ్డి మొట్టమొదట కాంచీరాజ్య సైన్యంలో చాలా సామాన్య యోధుడుగా కుదురుకొన్నాడు. కాని శక్తి సాహసాలవల్ల క్రమక్రమంగా పైకివచ్చి పర రాజ్యాల మీది దండయాత్రలలో అతి రహస్యంగా చాలా సొత్తు చేజిక్కించుకొన్నాడు. కొంచెం వయస్సు పైబడ్డ తరువాత అతని కొక దొమ్మీ పోరాటంలో గట్టిగా గాయాలు తగిలాయి. కొన్ని మాసాలవరకు తిరిగి కోలుకోలేదు. ఆ తరవాత తన శరీర పరిస్థితి బాగా తిన్నబడలేదన్న మిషమీద చల్లగా ప్రధానాధికారి పదవినుంచి తప్పుకొన్నాడు.

ఇది జరిగి అప్పుడే రెండు మూడేళ్ళయింది. అప్పటినించి

నిచుళాపురంలో ఒక విశాల సౌధంలో నివసిస్తున్నాడు. దండ యాత్రలలో కాంచీరాజ్య సేనాని కన్నుగప్పి, పాండ్యరాజ్య గ్రామాలు కొన్ని కొల్లగొట్టి, రెడ్డి స్వాహాచేసిన ధనరాశి అపారమని ఆ నగరంలో కొంతకాలంవరకు ఒక గట్టి వదంతి వ్యాపించింది. అతడా రోజులలో ఆ నగరంలో వెంచేసిన గోపాలస్వామి ఆలయాని కేడు ప్రాకారాలు కట్టించాడు. అంతటితో సంతృప్తిపడక స్వామి కొక స్వర్ణ కిరీటం కూడా సమర్పించాడు. దానితో అతని అప్రతిష్ఠ చాలావరకు తొలగిపోయింది. ఆపైన ఆ దేవాలయాని కతడొక్కడే తగిన ధర్మకర్త అని ఆ పట్టణంలో గల పెద్ద లందరు ఏకగ్రీవంగా నిర్ణయించారు. ఆ ధర్మనిర్వహణ సందర్భంలోనే ఒకనా డతని కన్ను స్వామి సమక్షంలో గజ్జెకట్టిన మాణిక్యవల్లి మీద పడింది. ఆనాటినుండి వారి అనుబంధం క్రమక్రమంగా దృఢపడింది. మాణిక్యవల్లి గాఢానురాగానికి తిరుమలరెడ్డి అపార ధనరాశి ఒక్కటే ప్రధాన కారణమని వృద్ధులు కొందరేక గ్రీవంగా నిశ్చయించారు. కాని ఆమెకు తనమీద వల్లమాలిన మమకారమే పేరుకొన్నదని రెడ్డి నిశ్చయించుకొన్నాడు. అందువల్లనే ఇటీవల తాను కంటపడగానే హేమసుందరి యెడల అసూయతో అట్టుడికి నట్టుడికిపోతున్నదని అనుకొన్నాడు.

తిరుమలరెడ్డి భవంతి గుమ్మంలో అడుగుపెట్టగానే శృంగారమంజరి ఎంతో అప్యాయంగా ఎదురుగా పోయి, లోపలి కాహ్వానించి, గౌరవించి గతరాత్రి జరిగిన వ్యవహారం సంగ్రహంగా తెలియజేసింది. అతడది తలవరి ముఖతః అంతకు పూర్వమే ఆకళించుకొన్నాడు. ఆ వచ్చినవాడు దొంగ అయి

ఉండడనీ శృంగారమంజరి కన్నుగప్పి మాణిక్యవల్లి కోసమో హేమసుందరి కోసమో వాడా విధంగా లోపలికి రావడానికి ప్రయత్నించి ఉండవచ్చునని అనుమానించాడు. కాని ప్రత్యే కంగా ఎవరికోసం వచ్చినది, ఎంతసేపాలోచించినా అతని కంతు చిక్కలేదు.

తిరుమలరెడ్డి కొంచెం పొడగరి. బలిష్ఠుడు. నేరేడుపండు వంటి వన్నని దేహచ్ఛాయ. విస్తుల నేత్రాలతో, కొంచెం కొన దేరిన నాసికతో, అతనిది చక్కని కనుముక్కు తీరున్న ముఖ మని చూచిన వారి కెవరికయినా స్ఫురించి తీరుతుంది.

శృంగార మంజరితో మరికొంతసేపు మాట్లాడిన తరు వాత ఆ దొంగ సంగతి ఆరా తీయడం అంతకష్టంకాదని రెడ్డి గట్టిగా భరవసా ఇచ్చాడు. అది ఒక పెద్ద పనేకాదు పొమ్మ న్నాడు. అంతేనే గాని తన లోలోపలి అనుమానం మాత్రం పైకి పొక్కనీయలేదు.

తిరుమలరెడ్డి నెమ్మది నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ మాణిక్యవల్లి పడకగదిలో ప్రవేశించాడు. నిశ్చల దీపకాంతిలో, ముప్పేట ముత్యాలహారాల తళతళలో, కర్ణాభరణాల మెరుపు లలో గజ్జెల వడ్డాణం బిగింపులో ఆనాడామె అపూర్వ సౌందర్యం రెడ్డి కెంతో తన్మయత కలిగించింది. చిరు నవ్వులు చిందిస్తూ సమీపించి గాఢంగా కౌగలించుకోవా లనుకున్నాడు. కాని మాణిక్యవల్లి అది కనిపెట్టి తటాలున తప్పించుకొని కొంచెం దూరంగా నిలిచి వినబడీ వినబడనట్టు రుసరుసలాడింది.

"ఈవేళ ఎందుచేతనో ప్రత్యేకంగా నామీద అను గ్రహం కలిగినట్టుందే!"

"నమ్మ, నమ్మకపో ! ఆ దొంగ సంగతి విన్నప్పటినించి నిజంగా నాకు మతిపోయినట్టయింది ! పోనీలే ! ఇంతకి సొత్తేమి పోలేదుగదా ! అదే పదివేలు !"

"పోనీలెండి ! ఈ విధంగానయినా నా మీద కొంచెం దయ కలిగింది !" మాణిక్యవల్లి మూతి బిగించుకుని పాన్పుమీద చదికిలబడింది.

రెడ్డి ఇంకా ఆమె సౌందర్యం తదేకదృష్టితో పరిశీలిస్తూనే ఉన్నాడు. కొంచెం కోలదనము, గుండ్రని నేత్రాలు, చామనచాయ ఆ ముఖానికి పెట్టని అలంకారాలయినాయని అనుకొన్నాడు. "ఎన్నాళ్ళు చూసినా మాణిక్యవల్లి సరికొత్తగానే కనిపిస్తున్నదే !" అనుకొన్నాడు. క్షణకాలం ఆమె వైపలాగే చూసి బొమముడి విరిచి—

"మాణిక్యవల్లీ ! అయితే ఆ దొంగ ఎందుకు వచ్చాడంటావు ?" అన్నాడు.

"ఏమో ! నాకేం తెలుసు ! దొంగల మనస్సుల్లో ఎలాంటి ఆలోచనలు పుట్టుకువస్తాయో పైవారి కెలాగ తెలుస్తాయి !"

ఆ ప్రత్యుత్తరంవల్ల రెడ్డి కేమాత్రము సంతృప్తి కలగ లేదు ! పైగా అది గట్టిగా గుండెలో పొడుచుకుంది. అయినా నిగ్రహించుకొన్నాడు. కొంచెం దగ్గరగా జరిగి, రెండు బుజాల మీద చేతులువేసి తీవ్రంగా ఆమె వైఖరి పరిశీలించి "నీకు తెలుసును !" అన్నాడు.

మాణిక్యవల్లి ఖచ్చితంగా—

"నాకు తెలియదు ! తెలియదు గాక తెలియదు ! అన్యా

యంగా నా మీాద నింద వెయ్యడానికేనా తమ రిక్కడికి దయ చేసింది ?" అని గట్టిగా నిలవరించింది.

అయినా రెడ్డి చలించలేదు. అదే ధోరణిలో మళ్ళీ గద్దించాడు !

"ఎంతలేదన్నా నాకీమాత్రం తెలియదనుకొన్నావా ? ఇంతకి సొత్తేమి పోలేదు. కనక వాడు నీకోసమే వచ్చాడు ! అవునా ? కాదా ? నిజం చెప్పు !"

ఆమె ఆ ప్రశ్న విని నిశ్చల శిలాప్రతిమలా నిర్ఘాంత పడింది. రెండు మూడు క్షణాలదాకా మరి ఆమె నోట మాటే వెలువడలేదు ! "ఆహా ! ఈ మగవా రెంతటి విచిత్రమయిన మనుషులు ! ఈ మధ్యన ఈయన నేనంటే అంటీ అంటనట్టు తప్పించుకుని తిరుగుతున్నారు ! ఆ దొంగ ఎవడో భవంతి కిటికీ మీాద అడుగుపెట్టగానే నామీాద వల్లమాలిన మమకారంతో తలమునక లవుతున్నారు ! ఇప్పు డిక కాదంటే మాత్రం నమ్మ్రుతారు కనకనా !" అసలిలాంటి మనుషులికి పట్టి అసూయ, ఈర్ష్య తప్ప ఆత్మీయత అంటే ఏమో తెలిస్తేనా ! అయ్యో రాత !" అని రవంతసేపు పరిపరివిధాల పరితపించింది. అంత లోనే లోలోపల రాజుకొంటున్న అక్కస్సంతా ఒక్క గుక్కలో వెళ్ళగక్కింది.

"అవును ! నా కోసమే వచ్చాడు ! నిజమే ! మీా కిప్పుడు బాగా సంతృప్తి కలిగిందా ?"

"అలాగా ! అయితే పేరు చెప్పు ! ఈ సాయంత్రంలోగానే వాడిరక్తం కళ్ళ జూస్తాను !" రెడ్డి అట్టుడికిన ట్టుడికి పోయాడు.

"అయితే ముందుగా నన్నే ఈ బాకుతో పొడిచి చంపండి! ఇంతకి నేనేగదా అంతటి ఘోర పాపాని కొడిగట్టిన దాన్ని!"

మాణిక్యవల్లి మరుక్షణంలోనే ఆ పక్కనే ఉన్న దంతం పెట్టెలో దాచిన కైజా రతని కందియబోయింది. కాని అదే క్షణంలో తిరుమలరెడ్డి ఆ సుందరిని తన గాఢా శ్లేషంతో గట్టిగా పొదివి పట్టుకొన్నాడు.

"ఊరికే వేళాకోళాని కన్నాను. ఇంతమాత్రానికే ఇంతగా ఆగ్రహించాలా!"

మాణిక్యవల్లి తటాలున అతని బిగి కౌగిలింతలో నించి తప్పించుకొన్నది. రెడ్డి మళ్ళీ తన తప్పిదం మన్నించవలసినదని బ్రతిమాలుకొన్నాడు. అయినా ఆమె శాంతించలేదు. రుసరుస లాడుతూ నిలవరించింది:

"చాలు చాల్లెండి! మీా వేళాకోళాలు! ఇంతకీ మీాకీ మాట ఎవరు చెప్పారు?"

"ఎవరు చెప్పలేదు! ఊరికే పరిహాసానికన్నాను అంతే!"

"అయితే మరి నన్నింత నిర్బంధించి అడగవలసినంత అవసరం ఏమి వచ్చింది.?"

"మన తలవరి లేడూ! అతగాడు తనకి సాయంచేసి పెట్ట వలసిందని బ్రతిమాలుకొన్నాడు. కనకనే నిన్నిన్నివిధాల నిర్బంధించాను."

"నిజమేనా? నన్ను చంపుగుని తిన్నట్టేనా?"

"నిజమే మాణిక్యవల్లీ! లేకపోతే నాకెందుకీ లేని పోని

రొష్టు !" గోడ పెట్టినట్టొక అబద్ధం కల్పించాడు రెడ్డి. అయినా మాణిక్యవల్లి కంతగా నమ్మకం కలగలేదు.

"ఆ గోపాలస్వామి తోడేనా ?" చూపుడు వేలెత్తి అల్లంత దూరంలో కానవస్తున్న ఆ దేవాలయ గోపురం చూపించింది. సరీగా ఆమె చెప్పినట్టే ఒట్టు పెట్టుకొన్నాడు రెడ్డి.

"అయితే వాడెవడో ! ఎందుకు వచ్చాడో రెండు మూడు రోజులలోనే కనిపెట్టి చెబుతాను. సరిగదా !...మరి నాకేమి బహుమతీ ఇస్తారు ?"

"నువ్వేది కోరుకున్నా సరే !"

"అబ్బా ఏమి ఔదార్యం ! అయినా ఎందుకు మీ కింత తహతహ !"

"సరిసరి ! మళ్ళీ మొదటికి వచ్చావా ? ఈ తాపత్రయం అంతా తలవరి కోసమే అని చెప్పానుగా ! అతగాడు నా ప్రాణ స్నేహితుడు. ఇదే కనక కనిపెట్టకపోతే దండనాయకునివల్ల మాట వస్తుందని భయపడుతున్నాడు."

"అన్నమాట తప్పకూడదు మరి !"

"అంతగా నా మాటమీద నమ్మకం కుదరపోతే, ఇదిగో, ఈ ముద్దుటుంగరం తీసుకో !"

"అక్కరలేదులెండి !"

మాణిక్యవల్లి దూరదూరంగా జరిగి బాగా బెట్టుసరి చేసింది. కాని తిరుమలరెడ్డి తిరిగి ఆ జవ్వనిని తన బిగి కౌగలింతలో అదిమి పట్టుకుని అనామికాంగుళి కా రత్నాలు పొదిగిన అంగుళీయకం చక్కగా అలంకరించి ఆ వేలికణుపు ముద్దు పెట్టుకొన్నాడు.

# 4

మాణిక్యవల్లి, హేమసుందరి శృంగార మంజరి కన్న కుమార్తెలు కారు. వారిద్దరిని ఆమె చాలా చిన్నతనంనించి పెంచి పెద్దవారిని చేసింది. కాంచీ రాజ్యంలో అంతట ప్రసిద్ధి కెక్కిన నృత్యాచార్యులవద్ద ఆ జవ్వను లిద్దరు భరత నృత్య పద్ధతి కూలంకషంగా అభ్యసించారు. వీణా వేణు మృదంగాలలో, గాత్ర సంగీతంలో చక్కని నైపుణి గణించుకొన్నారు. పాండిత్యంలో నృత్య చాకచక్యంలో మాణిక్యవల్లిదే పైచేయి కాని హేమసుందరి అందంలో అక్కకన్న మిక్కిలి మిన్న.

ఆ అక్కచెల్లెళ్ళిద్దరికి తమ తల్లిదండ్రుల పేరులయినా తెలియవు. శృంగారమంజరి తమ కన్నతల్లి కాదని చాలాకాలం క్రితమే వారికి తెలిసింది. దిక్కు, మొక్కులేని పసిపాపల నిద్దరిని చిన్నతనంనించి పెంచి, పెద్దవారిని చేశానని ఆ వేశ్యమాత ఒకనాడు పిచ్చాపాటి మాటల సందర్భంలో తిరుమల రెడ్డితో చెప్పింది. అంతకన్న వివరాలేవి వారికి తెలియలేదు. అవి తెలుసుకుని తీరాలన్న గట్టి పట్టుదల కూడా వారి కెన్నడు కలగలేదు.

ఇద్దరికి చిన్ననాటినించి ఒండొరుల యెడల కొంత అన్యోన్యత ఏర్పడింది. ఉభయులు ఒక రొకరి కెదురుగా కూర్చుని వీణా వేణు మృదంగ సాధనలు కొనసాగించారు. గోపాలస్వామి దేవాలయంలో గజ్జెకట్టి నృత్యం చేశారు. ఒకే కంచంలో తిని, ఒకే మంచంమీద పడుకుని అల్లారు ముద్దుగా పెరిగి పెద్దవా రయినారు.

అయితే, ఇటీవల అక్క మనస్సులో చెల్లెలి యెడల కొంత వైమనస్యం మొలకెత్తింది. ఆమెమీద తిరుమలరెడ్డి కన్ను పడిందని మాణిక్యవల్లి కనిపెట్టడాని కెంతో కాలం పట్ట లేదు. అప్పటినించి ఆమె మనస్సులో ఎడతెగని గుంజాటన బయలుదేరింది. మాణిక్యవల్లి ఎంతటి అపురూపమయిన చీర కావాలన్నా, నగ కావాలన్నా, పీణ కావాలన్నా ఇన్నాళ్ళ నించి అడిగిన వెంటనే ఆమె ఒడిలో పడింది. ఎన్నడు ఏ విధ మయిన లోటు కనబడలేదు. అంతేకాదు. మాణిక్యవల్లి కెన్నడు ఇంకొక సరసుని వైపు కన్నెత్తి చూడవలసినంత అవసరమే కలగలేదు. వయస్సులో కొంచెం పెద్ద అయినా తిరుమలరెడ్డి ఆమె నెంతో అప్యాయంగా కళ్ళ కద్దుకొంటున్నాడు. వా రిద్దరి మధ్య అనుబంధం ప్రారంభమయిన తరవాత, ఇంచుమించుగా రెండు మూడేళ్ళకాలం చీకు చింత లేకుండా ఏవిధమయిన పొరపొచ్చెము లేకుండా ఎంతో హాయిగా గడిచిపోయింది.

కాని ఇప్పుడా సుఖాని కొక పెద్ద ఆడ్డంకి ఏర్పడబోతున్న దని మాణిక్యవల్లి బాగా భయపడింది. మూడు పదుల వయస్సు ముమ్మరం దాటి క్రమక్రమంగా ఆమె నాలుగోపడిలో ప్రవే శించబోతున్నది. ఆనాటి కానాటికి శృంగారమంజరి వృద్ధురా లవుతున్నది. ఆమె హరీమన్న తరవాత తన గతి ఏంకావాలి? తిరుమలరెడ్డి యెడల ఆమె కెన్నడు పల్లమాలిన మమకారం కలగలేదు. అస లటువంటి మమకారంగోడే ఆమె ఎరగదు. కాని అతనిమీద తన కేర్పడినది ప్రగాఢమయిన అనురాగమే అని భ్రమపడింది. అటువంటి పరిస్థితిలో రెడ్డి మనస్సు హేమ సుందరిమీద మొగ్గుతున్నదనీ, మరి అంతకన్న దురన్యాయ్యం

లేదనీ మథనపడింది. తన యావచ్ఛక్తి వినియోగించి ఆ ధోరణి అరికట్టాలని సంకల్పించింది. శాయశక్తులా ప్రయత్నించింది. కాని ప్రయోజనం కలగలేదు. ఎన్నెన్ని విధాల తల బద్దలు కొట్టుకున్నా ఆనాటివరకు కనుచూపుమేరలో వేరే దారి ఏదీ కనబడలేదు. కాని ఇప్పు డామె కట్టెదుట ఏదో ఒక క్రొత్త బాట స్పష్టా స్పష్టంగా గోచరించింది.

అప్పటికి జాము ప్రొద్దెక్కింది. శృంగారమంజరి భవంతి చూరులలో వేలాడగట్టిన వరి వెన్నుల గుత్తులమీద వాలు తున్న రామచిలకల కోలాహలంలో పిచ్చుక లటు ఇటు బెదిరి పారిపోతున్నాయి. నీరెండలో మామిడిపూల గుత్తులమీద వాలుతున్న తేనెటీగల సన్నని సవ్వడి గాలిలో తేలి ఆ పరి సరంలో మంద్ర మంద్రంగా మారుమోగుతున్నది. అల్లంత దూరంలో గోపాలస్వామి దేవాలయం గుడి గంటల ఘోషలో రాజవీథిలో రెండెడ్ల బళ్ళ మువ్వల మోత క్రమక్రమంగా అణగిపోతున్నది. పండు మొగలి రేకువంటి జరీచీర ధరించిన హేమసుందరి బంగారు పూతతో నీరెండలో తళతళ లాడు తున్న పంజరంలో రామచిలుక కొరకు కలకండగుళిక అందిస్తు న్నది. ఆమె సువర్ణ కరకంకణాలు, కర్ణాభరణాలు, ఆ లేత ఎండలో తళతళ లాడుతున్నాయి. హేమసుందరి రామచిలుక కేవో క్రొత్త మాటలు నేర్పాలని ప్రయత్నిస్తున్నది. కాని అది "అక్కా! అక్కా!" అని తన కలవాటయినమాటే రెట్టిస్తున్నది.

అదే క్షణంలో మాణిక్యవల్లి అకస్మాత్తుగా అక్కడికి వచ్చి చెల్లెలి చేతిలో కలకండ ముక్క అందుకొని నోటిలో

వేసుకొన్నది. నిలువునా నిర్ఘాంతపడిన హేమసుందరి చెయ్యి దొరకబుచ్చుకుని "నీతో ఒక రహస్యం మాట్లాడాలి. త్వరగా లోపలికి రా!" అని బలవంత పెట్టింది. కాని హేమసుందరి అక్కడినుంచి కదలలేదు. తిరిగి ఇంకొక పులకండం ముక్క చిలక నోటి కందిస్తూ కనుచూపు మేరలో గోచరిస్తున్న గోపాల స్వామి దేవాలయ గోపురం చిట్టచివరి అంతస్తు కేసి చూసింది. ఆ పైన దానిలో నిలుచున్న ఒక పురుషాకృతి హఠాత్తుగా అదృశ్యమయింది! మాణిక్యవల్లి కనురెప్పపాటు కాలంలో ఆ సంగతి కనిపెట్టినా తన కేమి తెలియనట్టు నటించింది. హేమ సుందరిని తిరిగి లోపలికి రమ్మని బలవంత పెట్టింది.

ఆమె నిలువునా దిగాలుపడి ఉసూరుమని ఒక వేడి నిట్టూర్పు విడిచిపెట్టి గదిలోకి వెళ్ళి పందిరి పట్టెమంచం పట్టు పరుపుమీద చదికిలబడి కొంచెం విసుగుదలతో "ఏమిటా రహస్యం" అని బొమముడి విరిచింది. పరిచారకు లెవరయినా ఆ పరిసరంలో మసులుతున్నారేమోనని నలువైపుల జాగ్రత్తగా పరకాయించి మాణిక్యవల్లి నెమ్మదిగా చెల్లెలి చెవిలో ఊదింది:

"హేమా! నేనొక మాట అడుగుతాను గాని, దాచకుండా ఉన్నది ఉన్నట్టు చెబుతావా?"

"నాకంత దగ్గిర దాచవలసిన రహస్యాలేమి ఉన్నాయి?"

హేమ ఎంతో ఆశ్చర్యపడి అడిగింది.

"అయితే అగడమన్నావా?"

"అడుగు! దానికేం!"

"నిన్న ఉదయం తలవరి మన భవంతికి వచ్చినప్పుడు నీకోసం నే నిక్కడికి వచ్చాను. జ్ఞాపకం ఉందా ?

"అవును. అయితే ఏం ?"

"ఆ సమయంలో చెక్కిలిమీద అద్దుకున్న నల్లని గుర్తేదో చీర చెరగుతో చెరిపివేసుకుంటున్నావు ! అవునా ?"

హేమసుందరి ఆ ప్రశ్న విని లోలోపల ఉలిక్కిపడింది. కాని పైపై కది రవంతయినా వెల్లడి కానీయక తిరిగి నిశ్చల దృష్టితో సమాధానం చెప్పింది.

"అవును ! దానికేం ! అది ఇప్పుడింతగా నిలవరించి అడగవలసినంత పుట్టి మునక ఏమి వచ్చింది ?

"అంత పుట్టి మునక ఏమీ లేదు గాని, అద్దంలాంటి నీ బుగ్గమీద నల్లని నేరేడు పండులాంటి ఆ గుర్తు ఎలాగ వచ్చిందా అని నా కనుమానం కలిగింది. నిన్ననే అడుగు దామను కున్నానుగాని అవకాశం దొరకలేదు."

"సరేలే దానికేం గాని, ఈ గొడవతో నన్నెందు కిలా వేధిస్తున్నావు ?"

"కారణం తరువాత చెబుతానుగాని, ముందు నే నడిగిన దానికి తిన్నగా సమాధానం చెప్పు !"

హేమసుందరి ఆ సూటి ప్రశ్న విని క్షణకాలం లీలగా నవ్వింది. అంతలోనే ఆ నవ్వు రవంత నిగ్రహించుకొని హేలగా సమాధానం చెప్పింది!

"అయ్యో ! వెర్రిదానా ! ఎందుకే నీ కింతటి అపోహ ! ఆ వేళ రాత్రి కావలివాళ్ళ గావు కేకలు విని బిక్కచచ్చి దుప్పటి ముసుగుతన్ని పడుకుని భళ్లుమని తెల్లవారేదాకా

వెక్కి వెక్కి ఏడ్చాను. కాటుక కన్నీరు జారి రెండు చెక్కిళ్ళ మీద నల్ల నల్లని చారిక లేర్పడ్డాయి. నువ్వు నా దగ్గరికి వచ్చే సరికి పైట కొంగుతో అవి తుడుచుకుంటున్నాను అంతే!"

హేమసుందరి ఒక పెద్ద అడ్డు గోడలాంటి అబద్ధం వెన కాల దాక్కోవాలని ప్రయత్నిస్తున్నదని మాణిక్యవల్లి క్షణంలో కనిపెట్టివేసింది. మరి బుజ్జగింపులవల్ల ప్రయోజనం లేదని గ్రహించి గుక్క తిప్పుకోకుండా పెద్ద బెదరింపుతో భయ పెట్టింది.

"హేమా! ఎన్ని విధాల బతిమాలుకున్నా నీకు నా మీద నమ్మకం కలుగలేదు! కాని నీమీద ముమ్మందొక పెద్ద బెడద విరుచుకు పడబోతున్నది సుమా! తలవరి, తిరుమల రెడ్డి కలసి ఆ దొంగ అంతేమో కనుక్కొని తీరాలని గట్టిగా ప్రయత్నిస్తున్నారు. అది ఈ వేళ కాకపోతే రేపయినా తప్ప కుండా బయటపడి తీరుతుంది. మరి చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకుంటే ప్రయోజనంలేదు. ఇద్దరు ముగ్గురు కావలి వాళ్ళ కంతగట్టి గాయాలు తగిలిన తరవాత అది అంతటితో ఆగదు! కాని ముమ్మందుగా ఉన్నమాట కొంచెం నా చెవిని వేశావా మన మర్యాదతోపాటు కుటుంబ మర్యాదకూడా దక్కుతుంది. తిరుమలరెడ్డి అన్యాయంగా నా మీద అనుమాన పడుతున్నారు. తెలిసి కూడా నువ్వు ఆ నింద నామీద తోసి వేసి నంగనాచిలా మాట్లాడకూరుకున్నావు! ఇది ఏమీ బాగులేదు."

"బాగుందమ్మా! బాగుంది! మహా చక్కగా ఉంది!

కాటుక కన్నీటి చారికలు తుడుచుకుంటున్నాను మొర్రో అంటే నమ్మకపోతే నేనేమి చేసేది ?"

హేమసుందరి వెటకారంగా మూతి, ముక్కు అటు ఇటు తిప్పింది. ఆ ప్రశ్నతో మాణిక్యవల్లి కోపం బాగా రెచ్చి పోయింది హేమసుందరికి తన యెడల గడ్డిపరకంత గౌరవం గాని, నమ్మకంగాని, లేవని నిశ్చయించుకొన్నది. అందుచేత ఈ సారి మరింత తీవ్ర స్వరంతో హెచ్చరించింది.

"ఇంకా నిజం చెప్పదలుచుకోలేదు కాదూ ? చిలక నోటికి ఫులకండం అందిస్తూ, ఆ గోపురంపై అంతస్తుమీద నువ్వెవ్వరివైపు చూస్తున్నావో గ్రహించలేదనుకొన్నావా ? నే నంతటి అమాయికురాలిని కానులే ! నా కదంతా తెలిసింది ! కాని నీ మనస్సెలాంటిదో కనిపెట్టాలని ఇందాకటినుంచి ఏమీ ఎరగనట్టు నటిస్తున్నాను. అంతే !"

హేమసుందరి కా బెదరింపుతో కళ్ళ నీళ్ళ పర్యంతం అయింది. ముఖం వెలవెల బోయింది. ఇక ఆ దుర్భర వేదన భరించలేక శిరస్సు వంచివేసుకొన్నది. చెక్కిళ్ళమీద చిక్కని కన్నీరు ధారకట్టి ప్రవహించింది. మాణిక్యవల్లి అ ధోరణి గమ నించి "హేమా ! ఎందుకే నీకింత బెంబేలు ! నే నున్నానుగా ! అదేదో కొంచెం నా చెవిని వెయ్యకూడదా ?" అని గాఢంగా కౌగలించుకొని కన్నీరు తుడిచి మునివేళ్ళతో ముంగురులు సవ రించింది. మాణిక్యవల్లి ఆ విధంగా ఎంతో అప్యాయంగా గుండె కద్దుకొన్న తరువాత హేమ లోలోపలి దుఃఖోద్వేగం నిగ్ర హించుకోలేక అక్క గుండెమీద వాలి కుమిలి కుమిలి వలవిం చింది. మాణిక్యవల్లి తీయతీయని బుజ్జగింపులతో చెల్లెలి

నోదార్చి, అసలు కథ అంతా చల్లచల్లగా సంగ్రహంగా ఆమెచేతే చెప్పించింది. ఆర్ద్ర కంఠంతో హేమసుందరి అక్క చెవిలో చెప్పిన ఆ సంగ్రహ గాథ ఇది.

రంగనాయకుడు విచుళాపురం పొలిమేరలో నివసిస్తున్న వెంకటనాయకుని కడగొట్టు కొడుకు. అతని కిద్దరు అన్నలు. తండ్రి చాల చిన్న భూస్వామి. అతనికిక వేరే అస్తిపాస్తులేవీ లేవు. పెద్ద కొడుకులిద్దరు తండ్రితో బాటు తమకున్న కొంద్ర దున్నుకుంటూ ఎంతో మర్యాదగా కాలక్షేపం చేస్తున్నారు. ఇంచుమించుగా ఒక ఏడాది క్రితం గోపాలస్వామి కళ్యాణ మహోత్సవంలో హేమసుందరికి, రంగనాయకునికి కొంచెం పరిచయం కలిగింది. ఆ పైన క్రమక్రమంగా వారిద్దరికి ఒండొరుల యెడల ప్రగాఢమయిన అనురక్తి ఏర్పడింది.

ఆ వృత్తాంతం విన్న తరువాత మాణిక్యవల్లి అయిదారు నిమిషాల వరకు తాను విన్నది నిజమేనా అని నిర్ఘాంత పడింది. అయితే అసలు సంగతి అంతా తెలిసినందుకెంతో సంతోషించింది. రంగనాయకుడంత రహస్యంగా హేమసుందరి సందర్శన భాగ్యం కోసం పరితపించడానికిగల ప్రధాన కారణమేమో ఇట్టే మంచు విడిపోయినట్టు విడిపోయినదని ఆమె అనుకొన్నది. శృంగారమంజరి హేమసుందరి నెవ్వరయినా ఒక మహారాజు ఒద్దికలో ఉండాలని ఉవ్విళ్ళూరుతున్నది. ఆమె దృష్టిలో తిరుమలరెడ్డివంటి ఐశ్వర్యశాలికూడా సాధారణ ధనికుడే. ఇక రంగనాయకుడు చాలా సామాన్య సంసారి కుమారుడు! వేలకొలది సువర్ణ నాణకాలొక్కమారు గుమ్మరిస్తేనేగాని అతనికి హేమసుందరి సాంగత్య భాగ్యం లభించదు. కనుకనే కాలు

కాలిన పిల్లిలాగ అతడనేక విధాల మాయోపాయాలతో ఆరాట పడుతున్నాడు.

మాణిక్యవల్లి ఇంతకు ముందెన్నడూ నిచుళాపురంలో రంగనాయకుని పేరయినా విని ఉండలేదు. అత డంతటి ప్రసిద్ధుడు కాడు. అందుచేత హేమసుందరి కతని యెడల ఏర్పడిన మమకారం మాణిక్యవల్లి కెంతో ఆశ్చర్యం కలిగించింది. దాని లోతెంతటిదో గ్రహించాలన్న గట్టి పట్టుదల కలిగింది. ఆ పైన మరికొంత సేపే కాగ్ర దృష్టితో చెల్లెలి ముఖవైఖరి పరిశీలించి చిరునవ్వు చిలకరించి హెచ్చరించింది :

"హేమా నిజంగా నీకు మతిపోయింది, లేకపోతే నువ్వెక్కడ! ఆ రంగనాయకు డెక్కడ! నగలా! నాణ్యాలా! మేడలా! మిద్దెలా? ఎందుకే నీకీ లేనిపోని గొడవ! నిజానికి వాళ్ళ కాపూట గడుస్తుందో గడవదో కూడా తెలియదు. నువ్విప్పుడు ప్రత్యేకించి చెప్పేదాకా నేనా వెంకటనాయకుని పేరెన్నడు వినలేదు! ఇక అతని కడగొట్టు కొడుకు మాట వేరే చెప్పాలా? నా మాట విని కాస్త సిరిసంపద లున్నవా రెవరి మీదికయినా మనస్సు మళ్ళించుకో! ఇంకొక నాలుగేళ్ళ పై బడ్డాయంటే మరి నీ మాట ఎవ్వరు తలపెట్టరు సుమా! జాగ్రత్తగా ఆలోచించుకో!"

అయినా హేమసుందరి మరి వంచిన తల పైకెత్తలేదు. వినీ విననట్టు మాట్లాడ కూరుకుని ఉసూరుమని నిట్టూర్చింది. నిజానికి పైపైకి చెల్లెలి క్షేమమే కోరి మాణిక్యవల్లి అనేక విధాలా హిత వుపదేశించింది. అయితే హేమసుందరి కది బొత్తిగా రుచించలేదని గ్రహించుకొని మరి కొంచెం కోపం

తెచ్చుకున్నట్టు నటించింది. హేమ అక్క కఠిన ధోరణి కనిపెట్టి మరి భరించలేక, "మాణిక్యవల్లీ ! నేనేమి చెయ్యను ! ఇక నా అదృష్టం ఇంతే అనుకో ! అయితే ఈ సంగతి మాత్రం అమ్మకి కూడా తెలియకూడదు సుమా ! మరి పాల ముంచినా నీట ముంచినా నీదే భారం !" అని బ్రతిమాలుకొన్నది. అంతలోనే మాణిక్యవల్లి తటస్థ ధోరణి కనిపెట్టి "నీ చిన్నతనంలో ఇంత కన్న పదింతలుపొంగిన అనురాగంతో తల మునకలయి ఉంటావు ! కాని ఇప్పుడొక వింత వైఖరి అలవాటు చేసుకొన్నావు ! అయితే నా కోసమే ఇంతదూరం ఆలోచించి మాట్లాడుతున్నా వనుకో ! కాని నేనేమి చెయ్యను ! ఎన్నెన్ని విధాల ప్రయత్నించినా రవంతయినా మనస్సు నిలవరించుకోలేక పోతున్నాను. నా నుదుటి మీద ఎలాగ రాసివుంటే అలాగే అవుతుంది. అంతే" అని కొనగోటితో చెక్కిళ్ళ మీద జాలువారుతున్న కన్నీరు తుడుచుకొన్నది. గద్గద భారంతో మరి మాట్లాడలేక మౌనం వహించింది.

మాణిక్యవల్లి ఆ సుదీర్ఘ ప్రసంగం విని ఫక్కుమని నవ్వింది.

అయ్యో ! వెర్రిదానా ! నాకా ? చిన్నతనంలో అనురాగమా ! అసలు మన కనురాగా లేమిటే ! సరేగాని నువ్వింక అతని నీ భవంతి దరిమానానికి కూడా రానీయద్దు ! ఇది నేను మీ ఇద్దరి క్షేమము కోరి చెప్పుతున్నమాట ! బాగా జ్ఞాపకం పెట్టుకో ! ఒకవేళ అత డిక్కడికి వచ్చాడంటే మరి ప్రాణాలతో బ్రతికి బయటపడడం మాత్రం కలలోమాట ! కావలి

వాళ్ళిక అతనిని చెయ్యిదాటి పోనీయకు. తెలిసిందా ? జాగ్రత !'

ఆపైన మాణిక్యవల్లి "తిరుమలరెడ్డి వచ్చే వేళయింది ! మరి నేను వెళ్ళాలి !" అని లేచి నిలబడింది. హేమ ఆమె రెండు చేతులు గట్టిగా పట్టుకుని "అక్కా ! ఇవి చేతులు కావనుకో ? కాళ్ళే అనుకో ! ఈ రహస్యం మాత్రం పైకిపొక్క కూడదు సుమా !" అని ఎంతో దీనంగా బ్రతిమాలుకొన్నది. మాణిక్యవల్లి చెల్లెలిని అలవోకగా గుండె కద్దుకుని "హేమా! ఈ రహస్యం బయటపెడితే నా ఒళ్లో ఏమన్నా ఒరుగుతుందా ? ఎందుకే నీకింత ఆరాటం ! భయం లేదులే ?" అని చేతిలో చెయ్యివేసి ఒట్టుపెట్టుకుని బుజ్జగించి తొందర తొందరగా అడుగులు వేసుకుంటూ తన గదిలోకి వెళ్ళిపోయింది. అప్పటి నించి తిరుమలరెడ్డి రాక కోసం నిమేష మొక యుగంగా నిరీక్షించింది.

మాణిక్యవల్లి చల్లని మాటలతో చెల్లెలి కేదో కొంత భరవసా ఇచ్చింది. మరి భయంలేదని ఓదార్చింది. కాని తన పడక గదిలో ప్రవేశించిన తరవాత పట్టరాని ఉల్లాసంతో ఉప్పొంగిపోయింది. తలవని తలంపుగా ఆమె కిప్పుడొక చక్కని దారి దొరికింది. హేమసుందరి కోసం తిరుమలరెడ్డి లోలోపల ఎంతయినా ఉబలాటపడుతున్నాడు. గాని, ఈ గొడవ చెవిని పడిన తరువాత అతని కామె యెడల విపరీతమయిన విరక్తి కలిగి

తీరుతుంది. అంతేకాదు. తన మీద మొలకెత్తిన అనుమానం పూర్తిగా తుడిచిపెట్టుకుపోతుంది. క్రమక్రమంగా తమ ఇద్దరి అనుబంధము బాగా బలపడుతుంది. తన జీవితం నిష్కంటకమై భాగ్యభోగాలతో కలకల లాడుతుంది. ఆపైన ఇంతటి పరమ రహస్యం మిక్కిలి చాకచక్యంతో బయటపెట్టినందు కతని దగ్గిర నుంచి ఒక సరికొత్త బహుమానం కూడా సంపాదించు కోవచ్చును.

ఇక హేమసుందరీ, రంగనాయకుల సంగతి తిరుమలరెడ్డి ద్వారా తలవరి కీమాట తెలిసితీరుతుంది. అందువల్ల రంగ నాయకుని కెప్పటికయినా కారాగార ప్రవేశం కలిగి తీరుతుంది. మరికొంత కాలానికి హేమసుందరి అతని మాటే మరచిపోక మరి చెయ్యకలిగిన దేది లేదు. ఏది ఏమయినా రంగనాయకు డిక తమ భవంతిపైనా కన్నెత్తి చూడడు. ఆ ఉపేక్షతో ప్రాణం విసిగిన హేమసుందరి ఎవరో ఇంకొక ఐశ్వర్యశాలి ప్రాపకం సంపాదించుకొని వేరొకచోటికి వెళ్ళిపోతుంది. శృంగా రమంజరి లోలోపలి సంకల్పం కూడా అదే !...లేకపోతే కుమిలి కుమిలి దుఃఖంతో కట్టకట్టుకుని కళ్ళు మూసుకుని కావేరిలో దూకుతుంది. ఎన్నెన్ని విధాల ఆలోచించినా ఆమె తన దారి విడిచి దూరంగా తొలిగిపోయినట్టే కనిపించింది. అందుచేత ఆ రహస్యం తిరుమలరెడ్డి చెవిలో చెప్పి తీరవలసిందే అని మాణిక్యవల్లి నిశ్చయించుకొన్నది.

కాని ఆ సంగతి తల్లితో చెప్పనని హేమసుందరి చేతిలో చెయ్యివేసి ఒట్టుపెట్టుకొన్నది. అయితే తిరుమలరెడ్డితో చెప్ప నని మాత్రం మాట ఇవ్వలేదు. మాణిక్యవల్లి అది బాగా

లోతుగా ఆలోచించి చేసిన పనే! తల్లితో చెప్పినందువల్ల లేనిపోని గొడవ తప్ప తన ఒడిలో ఒరిగేదే లేదు. కనక ఆమె ఆ రహస్యం గుంభనగా లోలోపలే దాచి వేసుకుని తిరుమల రెడ్డి రాక కోసం ప్రతిక్షణము నిశ్చలదృష్టితో నిరీక్షించింది.

కాని అతడా తరువాత రెండు, మూడు రోజులదాకా శృంగారమంజరి సౌధంవైపే కన్నెత్తి చూడలేదు. అతని ఉపేక్ష కేమి కారణమో! మాణిక్యవల్లి ఎంతగా తలకొట్టుకున్నా బోధపడలేదు. చిట్ట చివరకి, ఆ మరునాడు తమ భవంతి కొకమారు విచ్చేయవలసినదని దాసి నాంచారమ్మ ద్వారా కబురు పంపించింది. ఆమె తిరిగి వచ్చి అలాగే వస్తున్నా మన్నారని చెవిలో చెప్పింది. మాణిక్యవల్లి చక్కని చుట్టుచెంగావి శ్రీరంగం పట్టుచీర ధరించి ఏడు వారాల నగలు పెట్టుకుని మాటిమాటికీ మేడ కిటికీ కానుకొని నిలుచున్నది. ఎట్టకేల కర్ధరాత్రి వేళ రెడ్డి ఆ భవంతి గుమ్మంలో అడుగుపెట్టాడు.

అప్పటికి కందరు ఆదమరచి నిద్రిస్తున్నారు. ఆమె స్వయంగా తానై వీధి తలుపు తెరిచి సిగలో తురుముకున్న తెలిమల్లెపూల సువాసనల గుబాళింపులతో చిరునవ్వుల రువ్వులతో అతనిని లోలోపలి కాహ్వానించింది. తన పడక గదిలో వెండి గొలుసుల తూగుటుయ్యాలమీద కూర్చొబెట్టి, నెమలి కన్నుల పసిడి వీవనతో బడలిక పోగొట్టింది. సరసనే కూర్చొని, ఏదో సరస ప్రసంగం ప్రారంభించి కమ్మని కర్పూర తాంబూలం చిలక లందించింది.

రెడ్డి యాధాలాభంగా అవి అందుకొని నోట పెట్టు కుంటున్నాడు గాని బాగా ముభావంగా ఉన్నాడు. ఏకాగ్ర

దృష్టితో ఏదో ఆలోచిస్తున్నాడు. ఎంతో అప్యాయంగా మాటిమాటికి పలకరించినా మరి సమాధానం మాటే తలపెట్ట లేదు. మాణిక్యవల్లి కతని మనోవేదన హేతువేమి అవగాహన కాలేదు. ప్రాణం విసిగి "ఇదేమిటిలాగ ఉన్నారీవేళ! అని చెక్కిలిమీద పెదవి ఆన్చి అడిగింది. రెడ్డి కొంచెం విసుగు దలతో "సరేగాని ఆ దొంగజాడ ఏమయినా దొరికిందా?" అని సూటిగా ప్రశ్నించాడు. మాణిక్యవల్లి క్షణకాలం నిర్ఘాంత పడి ఉప్పొంగుతున్న ఉత్సాహంతో సమాధానం చెప్పింది:

"దీని కింత గుంజాటన ఎందుకు? వాడి గుట్టంతా బయటపడిపోయింది."

"ఆ! ఆ! నిజంగానే."

"నిజమే! లేకపోతే ఇలాంటి వ్యవహారంలో మీతో వేళాకోళా లాడతా ననుకొన్నారా?"

మాణిక్యవల్లి అతని చెవిలో సంగ్రహంగా రంగనాయకుని సంగతి చెప్పింది. ఆ వృత్తాంతం విన్నీ వినగానే తిరుమల రెడ్డి బాగా దిగాలుపడిపోయాడు. అయిదారు నిముషాలదాకా అతని నోట మాటే వెలువడలేదు! క్రోధావేశంతో కళ్లు రెండు జేవురించాయి.

"ఈ వ్యవహారం ఇలాగ ఎన్నాళ్ళనించి సాగుతూంది?"

"నా కంతబాగా తెలియదుగాని ఇంచుమించుగా అయిదారు నెలలనుంచి అత డెక్కడికి వెళ్ళినా హేమసుందరిని వెంటాడిస్తున్నాడట!"

"అయితే మరి మీా రెవరికి ఈ సంగతే తెలియలేదా?"

మొట్టమొదట రెండు మూడు రోజుల క్రితమే నే నీ

మాట విన్నాను. ఇది ఇంతటి దవ్వుతుందని మా అమ్మ కలలో కూడా అనుకొని ఉండదు! అయినా ఇద్దరి మనస్సులు ఏక మయినప్పుడిక వాళ్ళ నెవరయినా అడ్డుకోగలరా ?"

"సరేగాని, అతగాడి తండ్రి పేరేమిటి ? మళ్ళీ చెప్పు!"

"వెంకటనాయకుడు."

"అతడేమి చేస్తున్నాడు ? ఎక్కడ ఉంటున్నాడు ?

"మన పడమటి పొలిమేరలో కొబ్బరితోపు లేదూ ? దానిలో ఒక చిన్న పెంకుటింటిలో ఉంటున్నాడట! కొడుకు లతో కలిసి ఏదో చిన్న కొంగ్రడ దున్నుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడట."

"మరి వీడి కిదేమిటీ దుర్బుద్ధి ?

"సరిపోయింది వయస్సు మమ్మరంలో ఉన్నప్పుడీ శష భిష లెవరికి కావాలి ?"

"అలాగా !" అని తిరుమలరెడ్డి పళ్ళు పటపట కొరికి "సరే ! ఇక వాడి కాయుర్దాయం మూడినట్టే ! ముక్కలు ముక్కలుగా నరికించి ఉప్పు పాతర వేయించేస్తాను. తిరుమల రెడ్డి అంటే ఎవరో వాడికింకా తిన్నగా బోధపడలేదు కాబోలు! ఇక ముందు తెలుస్తుందిలే !" అని లోలోపలి దుర్యాగహావేశం నిగ్రహించుకోలేక నల్లనల్లని కోడె త్రాచులా రాజుకున్నాడు. రంగనాయకుని సంగతి విన్నంతలోనే రెడ్డి ఇలాగ మారి పోగలడని మాణిక్యవల్లి చూచాయగా నయినా ఊహించి ఉండలేదు. అది విన్న పిమ్మట తన బహుమతి సంగతి ప్రస్తా విస్తాడని ఉబలాటపడింది. కాని అత డామాటే తలపెట్టలేదు.

మాణిక్యవల్లి అతని భుజంమీద చెయ్యివేసి "మీ

కెందు కీ అనవసర శ్రమ కా స్త తలవరి చెవిలో చే స్తే ఆ వ్యవహారమంతా అతడే చూసుకుంటాడు. మనం ఏమి ఎరగ నట్టు మాట్లాడక కూరుకోవడమే మంచిది ! లేకపోతే నలుగురి లోను అనవసరంగా మన కెందుకీ రభస ! ఇంత గొడవయిన తరువాత అతడిక ఈ ఇంటి దరిమానానికి కూడా రాడు !" అని చల్ల చల్లగా తన లోలోపలి పన్నాగం బయటపెట్టింది. ఆ తరు వాత ఆ వ్యవహారం అంతటితో కట్టిపెట్టి సరస ప్రసంగం ప్రారంభించింది. బిగి కౌగిలింతలో బంధించి తిరుమలరెడ్డి కిక ఊపిరే ఆడనీయలేదు. చెక్కిలి ముద్దుపెట్టుకుని నెమ్మదిగా తన బహుమతి సంగతి జ్ఞాపకం చేసింది. కాని రెడ్డి ముఖవైఖరి గమ నించి తటాలున తన గాఢాలింగన బంధం సడలించింది.

రెడ్డి కళ్ళు రెండు ఈదరగాలిలో ఎర్ర ఎర్రని చింత నిప్పుల్లా రాజుకొంటున్నాయి. అయినా అతడెంతో ప్రయ త్నించి పిడికిలి బిగించి లోలోపలి కోపావేశం నిగ్రహించు కొన్నాడు. మాణిక్యవల్లి అది గ్రహించినంతలోనే చిన్న చిరు నవ్వు చిందించి "చూడు నీ కెలాంటి బహుమానం యిస్తానో! మీ వాడలో వాళ్ళంతా మరి దానిమాటే గాని ఇంకొక గొడవే పట్టించుకోరు !" అని కొనగోళ్ళతో కోర మీసాలు సవరించుకొన్నాడు. లోలోపలినించి ఉప్పొంగుతున్న అక్క స్సుతో మేళవించిన చిరునవ్వు అలవోకగా అతని పెదవిమీద తరళించింది. మరి కొంతసేపటివరకు వా రిద్దరు ఏదో లోకాభి రామాయణంలో పడ్డారు. రెడ్డి బాగా పరధ్యానంగా ప్రసం గిస్తున్నాడు. కాని పై పై కది బయటపడనీయలేదు. ఈ వేళ

ఎందుచేతనో అతని మన స్సిక్కడ లేదనీ, ముళ్ళమీద నిలు చున్నట్టున్నాడనీ మాణిక్యవల్లి కనిపెట్టడాని కెంతసేపు పట్టలేదు.

అలాగ మరి కొంతసేపు గడిచిన తరువాత రెడ్డి హఠాత్తుగా ఏదో జ్ఞాపకం వచ్చినట్టు ఆదిరిపడి లేచి నిలుచున్నాడు. మాణిక్యవల్లి ఆ వింత ధోరణి గమనించి ఆశ్చర్యపడి, చెయ్యి దొరకబుచ్చుకుని ఎంతో అనునయంతో "ఎక్కడికి ?" అన్నట్టు బొమముడి విరిచింది. రెడ్డి కొంచెం విసురుగా ఆమె పట్టు విడిపించుకొని నెమ్మదిగా బ్రతిమాలుకొన్నాడు :

అన్నట్టు మాటల సందడిలో పడి మర్చిపోయాను మాణిక్యవల్లీ ! ఈవేళ రాత్రి తలవరి మా భవంతికి వస్తానన్నాడు. ఇంతకుమునుపే అక్కడికి వచ్చి నా కోసం ఎదురు తెన్నులు చూస్తున్నాడు కాబోలును ! మరి నేను వెళ్లాలి."

"ఇంత అపరాత్రి వేళ అంత పుట్టి మునిగిపోయే రాచ కార్యం ఏమి వచ్చింది ?"

"నిలుచున్నపాటుగా అతనితో ఒక వ్యవహారం సంప్రతించాలి."

"అదేదో నేను కొంచెం వినకూడదా ? ఇంతలోనే పరాయిదాన్నయిపోయానా ? పోనీ లెండి !"

మాణిక్యవల్లి రుసరుస లాడుతూ మూతి ముడుచుకుని కూర్చుంది.

"రేపు వచ్చినప్పుడు అంతా సావకాశంగా చెబుతాగా! ఇక క్షణకాలం కూడా వ్యవధిలేదు ! నన్ను పోనీ, నేను వెళ్ళాలి"

అలాగ ఎంతో అప్యాయంగా బ్రతిమాలుకుని తిరుమల

రెడ్డి తొందర తొందరగా అడుగులు వేసుకుంటూ ఆ భవంతి సింహద్వారం సమీపించాడు. మాణిక్యవల్లి సత్వరం గమనంతో వెంటాడించి ఏమో చెప్పబోయింది కాని, అంతలోనే అతడు తలుపులు తెరుచుకుని రాజవీధిలో పడి అదృశ్యు డయినాడు! ఆమె మరి కొంత సేపటికివరకు నోటిమాట వెలువడక వీధి గుమ్మంలో కేవలం శిలామూర్తిలా నిలబడింది. తటాలున తలుపులు బిగించి, నీరసంగా నిట్టూర్చి తిరిగివచ్చి తన పడకగదిలో పందిరి పట్టెమంచంమీద కూలబడింది. ఎంతగా ప్రయత్నించినా తెల తెల్లవారేవరకూ ఆమెకంటికి ఒక్క కునుకయినా పట్టలేదు.

తిరుమలరెడ్డి అపరాత్రివేళ అలాగ నిలుచున్నపాటుగా తన భవంతికి తరలిపోవడాని కేమి కారణమో ఎంతగా ఆలోచించినా ఆమె కవగతం కాలేదు. నిజంగా తలవరితో మాట్లాడడం కోసమే ఆయన తన భవంతికి తరలిపోయినాడా? కాకపోతే ఇంకొక వ్యవహారం ఏమయి ఉంటుంది? రెడ్డి చూచాయగా నయినా అది తనతో చెప్పకపోవడాని కేమి కారణము! ఒకవేళ తలవరితో మాట్లాడడమే నిజమయితే వారి కిప్పుడంత అతి రహస్యంగా ఒక రొకరి చెవి కొరుక్కోవలసినంత తొందర ఏమి వచ్చింది.? అది రంగనాయకునికి సంబంధించిన వ్యవహారమే అయితే సూచనగా నయినా తనతో చెప్పి ఉండవచ్చునే! మరి ఎందుకు చెప్పలేదు. తమ కుటుంబంమీద లేనిపోని బెడద ఏది విరుచుకు పడకుండా ఆ వ్యవహారం అంతా నిమ్మకి నీరెత్తినట్టు పరిష్కారం చేయవలసినదని సలహా ఇచ్చినది తానే కదా! అయినా రెడ్డి తనతో ఆమాటే ప్రస్తావించక పోవడంలో గల అంతరార్థం ఏమయి ఉంటుంది? ఆవిధంగా

అనేక విధాల మథనపడిన తరవాత, ఏదో వేరొక వ్యవహారం మీద తలవరితో మంత్రాంగం కొనసాగించడానికని రెడ్డి అంత తొందరగా తన దగ్గరనించి బయలుదేరి ఉండవచ్చునని అను కొని మాణిక్యవల్లి లోలోపల కొంతవరకు సమాధానపడింది. కాని చిట్టచివరి కది కూడా పూర్తిగా సంతృప్తి కలిగించలేదు. ఆమె చాలా సేవటివరకు అలాగే గుంజాటనపడి, బాగా అలిసిపోయి బళ్ళుమని తెల్లవారిన తరవాత ఒళ్ళెరగని బడలి కతో అదమరచి నిద్రించింది.

తలవరితో అతి రహస్యంగా మాట్లాడాలని చెప్పి రెడ్డి శీఘ్రంగా తన భవంతికి చేరుకొన్నాడు. కాని నిజానికి తలవరి అక్కడికి వస్తాననలేదు. ఆ అపరాత్రివేళ అతనితో సంప్రతించా లని కూడా రెడ్డి తలపెట్టలేదు. అది వట్టి అభూత కల్పన. రంగ నాయకుని వ్యవహారం విన్నప్పటినుంచి అతని కిక ఊపిరే ఆడ లేదు! ఆ పైన ఇక ఒక క్షణమయినా అక్కడ నిలబడలేక అతడా మిషమీద తన భవంతికి తిరిగి వచ్చాడు. కాని తల వరితో సంప్రతించాలని అతని అంతరాంతరంలో ఒక ఆలోచన బయలుదేరకపోలేదు. శయ్యమీద మేను వాల్చిన తరవాత అనేక విధాలయిన ఆందోళనలతో అతనికా రాత్రివేళ చాలా సేపటివరకు ఒక్క కునుకయినా పట్టలేదు. తిరిగి పానుపుదిగి బోనులో పెట్టిన పులిలాగ అదేపనిగా అటు ఇటు పచార్లు ప్రారంభించాడు.

తెల్లవారిన తరవాత మరి వేచి ఉండలేక ఆదరా బాదరాగా స్నానాదికం ముగించుకొని తిన్నగా తలవరి భవంతివైపు సాగిపోయాడు. అత డల్లంతదూరంలో రెడ్డి రాక గమనించి సగౌరవంగా ఎదురుగా వచ్చి తన సౌధం మీదికి తోడుకుపోయి ఏదో పిచ్చాపాటి ప్రారంభించాడు. ఆ సంభాషణ అలాగ మరికొంతసేపు కొనసాగింది. అయినా రెడ్డి తన వ్యవహారం బయటపెట్టలేదు. మరి ఉండబట్టలేక తలవరి ప్రశ్నించాడు.

"ఏదో పెద్ద పని లేకపోతే మీలాంటివారు మా భవంతికి విజయం చేస్తారా ? ఏమిటి విశేషం ?"

రెడ్డి తలవరికి బాగా దగ్గరగా జరిగి "అంత పెద్ద విశేషం ఏమి లేదు గాని ఆ దొంగ సంగతి తెలిసింది." అన్నాడు అతి రహస్యంగా.

కాని తలవరి దాని కంతగా ఆశ్చర్యపడలేదు. "మీవంటివారు తలపెట్టినప్పు డది తెలియకేం జేస్తుంది ! ఇంతకీ ఎవడా దుస్సాహసి ?"

తిరుమలరెడ్డి సంగ్రహంగా రంగనాయకుని వ్యవహారం వెల్లడించాడు. కాని అసలు రహస్యం మాత్రం బయటపెట్టలేదు. సొమ్ము దొంగిలించాలన్న దుర్బుద్ధితోనే అత డంతటి చెడ్డపని తలపెట్టినట్టు ఒక కట్టుకథ కల్పించాడు. కాని అది అంతగా అతకలేదు. కనకనే తలవరికా గాథ పూర్తి సంతృప్తి కల్పించలేదు. కొంచెం తటపటాయిస్తూ మళ్ళీ అడిగాడు :

"సరేగాని ఆ దొంగ రంగనాయకుడే అని మీ కెలాగ తెలిసింది ?"

"కావలివాడొకడు అతగాణ్ణి బాగా గుర్తుపట్టి ఆ సంగతి నా చెవిని వేశాడు."

"ఓహో! అలాగా!" అన్నాడు తలవరి. ఆపైన మరి రంగనాయకుని మాటే తలపెట్టలేదు! ఏదో ఇంకొక సంగతి ప్రస్తావించబోయాడు. తిరుమలరెడ్డి కొంచెం విసుగుదలతో "మరి ఈ సంగతి ఏమి చేదామనుకుంటున్నారు? ఇద్దరు ముగ్గురు కావలివాళ్ళ ఒళ్లు హూనంచేసి అచ్చుపోసిన ఆంబోతులా తిరుగుతున్నాడు వాడు! మీరు కొంచెం గట్టిగా కలగజేసుకుంటేనే గాని వాడి తల పొగరణగదు!" అని తన లోలోపలి అక్కసు కొంత పైకి వెళ్ళగక్కి ఏకాగ్ర దృష్టితో అతని ప్రత్యుత్తరం కోసం నిరీక్షించాడు

అయినా తలవరి ప్రత్యుత్తరం ప్రారంభించలేదు. ఏదో దీర్ఘాలోచనలో పడ్డాడు. మరి వేచిఉండలేక కోరమీసం చిటికెనవేలితో సరిదిద్దుకుని రెడ్డి మళ్ళీ అందుకున్నాడు:

"ఈవేళ ఇది అవుతుంది! రేపు ఇంకొకటి అవుతుంది! దేనికయినా ఒక హద్దు పద్దు ఉండాలి. న్యాయాన్యాయాలొకకంట కనిపెట్టి చూడవలసినవారు మీరే చూచీ చూడనట్టు మాట్లాడకూరుకుంటే ఎలాగ? ఇక ఈ పట్టణంలో ఆలన పాలనలేక అయినవాళ్ళు, కానివాళ్ళు బరితెగించిపోరా? ఇంతకుమును పెప్పుడయినా ఈ రాజ్యంలో ఇలాంటి దురన్యాయాలు జరిగాయా?—"

అంతలోనే తలవరి అకస్మాత్తుగా అతని ధోరణి కడ్డు తగిలి ప్రశాంత స్వరంతో ప్రసంగించాడు:

"అవును మీరన్నది నిజమే! కాదని ఎవరన్నారు?

మొట్టమొదట ఈ దొంగతనం అంతేమో కనుక్కుని తీరాలని ఇది మీ చెవిని వేసినది నేనేకదా? అయితే మనం తొందర పడి కాళ్ళు, చేతులు విరగదొక్కుకుంటే ఎలాగ? వెంకట నాయకుడు నలుగురిలోను తగుదునని తల ఎత్తుకు తిరుగుతున్న పెద్ద మనిషి. ఇన్నాళ్ళనించి ఇంకొకరి గోడే తలపెట్టక ఎంతో మర్యాదగా గుట్టుగా కాలక్షేపం చేస్తున్నాడు. చాలాకాలం నించి నే నతనిని బాగా ఎరుగుదును. ఇక రంగనాయకుని సంగతి. ఇంతకు మును పెన్నడు అత డిటువంటి చెడ్డపనుల జోలికి పోలేదు. మీరేమో నగలు, నాణ్యాలు చేజిక్కించుకు పోవడానికే అత డింతటి దొంగతనం తలపెట్టినట్టు మాట్లాడుతున్నారు!”

“నేను ఒక్కణ్ణే కాదు! కావలివాళ్లు, ఇరుగు పొరుగు పెద్ద మనుష్యులు అందరూ అదే మాట అంటున్నారు!” అన్నాడు రెడ్డి మరికొంత విసుగుదలతో.

తలవరి మళ్లీ మొదలుపెట్టాడు:

“అలాగా!...నేను మీరన్నది కాదనడంలేదు. అయితే ఒక్క విషయం ఉన్నది ఉన్నట్టు మాట్లాడుతున్నాను. అన్యథా భావించకండి! అది సంసారుల భవంతి కాదుగదా! అనేకులనేక విధాలా శృంగారమంజరి ఇంటికి వస్తూ పోతూంటారు. అలాంటప్పుడు రంగనాయకుడు దొంగతనంచెయ్యడం కోసమే అంతపని చేశాడని నిర్ణయించడ మెలాగ? తీగ లాగితే డొంకంతా కదులుతుంది. ఇది మన దండనాయకుల చెవిని పడితే, ముందు మీ పరువు నలుగురి పెద్ద మనుషుల నోళ్ళలోను పడి నలిగి తీరుతుంది. ఊరికే ఉత్తపుణ్యాని కెందుకింత

రభస ! నామాట విని కొంచెం తమాయించి జాగ్రత్తగా ఆలో చించండి !”

“అయితే దొంగ ఇంటిలో జొరబడి కావలివాళ్ళ నంద రిని చావగొట్టి, తన దారిని తాను పారిపోతే, కుక్కిన పేను లాగ నోరు మూసుకుని మాట్లాడ కూరుకోమన్నారా ? ఇదె క్కడి దురన్యాయం ?” రెడ్డి కఠోర స్వరంతో గర్జించాడు.

అయినా తలవరి తొందరపడ లేదు :

“నే నేమి మాట్లాడ కూరుకోమని చెప్పడంలేదు, అన్యా యంగా నామీద నింద వెయ్యకండి ! కావలిస్తే ఇప్పుడే వెళ్ళి మన దండనాయకుల సమక్షంలో నడిచిన వ్యవహారం యావత్తు పూసగుచ్చినట్టు నివేదిస్తాను. అంతేగాని స్వతంత్రించి నేనై ఈ గొడవలో దిగదలుచుకోలేదు. ఆపైన వచ్చే కష్టనిష్ఠురా లన్నింటికి మీదే పూచీ ! మరి నన్నేమన్నా ప్రయోజనంలేదు. శృంగారమంజరి కుటుంబంతోబాటు మీ పేరు కూడా బాగా రచ్చ కెక్కుతుంది. ఇది మీ మేలుకోరి చెబుతున్నమాట ! బాగా ఆలోచించండి. మరి నాకేమిటి సెలవు ! వెంటనే దండ నాయకుల భవంతికి బయలుదేరమంటారా ?”

ఆ ప్రశ్నతో తిరుమలరెడ్డి ఆవేశం బాగా చల్లబడింది. మొట్టమొదట కొండంత ఆశతో అక్కడికి వచ్చాడు. తలవరి వల్ల రంగనాయకునికి కారాగార ప్రవేశం తప్పదనుకొన్నాడు. కాని కథ అడ్డం తిరిగింది. వెంకటనాయకునితో అతనికి అంత సన్నిహిత పరిచయం ఉన్నదని రెడ్డి కేమాత్రము తెలియలేదు. పైగా కొంచెం దూరపు చుట్టరికం కూడా ఉండవచ్చును. తల వరికి గొంతులో పచ్చి వెలక్కాయ చిక్కుకొన్నట్టయింది.

కాని లోలోపలి అక్కసు మాత్రం రాజుకుంటూనే ఉంది. అయినా మరి వేరే గత్యంతరం స్ఫురించలేదు. అంతలోనే తల వరి రవంత అనునయ ధోరణితో ఆ విషయమై తన అభి ప్రాయం వెల్లడించాడు :

"ఇంకొకమాట! రంగనాయకు డింకా ముక్కుపచ్చ లారని పసివాడు. ఇదిగాని తండ్రి చెవిని పడిందంటే అతడిక శృంగారమంజరి వీధి గుమ్మం వైపైనా తొంగిచూడదు. మీరీ గొడవ ఇంతటితో విడిచివేస్తే అన్నీ వాటంతట అవే సర్దుకుపోతాయి. దీనికి మీరేమి అనుమానపడ నక్కరలేదు. స్వయంగా నేనే వెళ్ళి కలగజేసుకుంటాను. సరిగదా! నామాట నమ్మండి. ఇంతా చేస్తే కావలివాళ్ళవరికి ప్రాణాపాయం కలగ లేదు. వాళ్ళందరి గాయాలు క్రమక్రమంగా నయమవు తున్నాయి! కాదంటారా! ఆపైన మీ చిత్తం! ఇక నే నింత కంటె పట్టుబట్టడం భావ్యంకాదు. మన దండనాయకు లెటు వంటి చండశాసనులో మీకు మాత్రం తెలియదు గనకనా!"

ఎంతగా ఆలోచించినా తిరుమలరెడ్డి కేమనడానికి పాలు పోలేదు. మరి కొంతసేపు మౌనం వహించి లోలోపలి కోపా వేశం నిగ్రహించుకుని ఉసూరుమని నిట్టూర్చి ఎట్టకేలకు అంగీ కరించినట్టు నటించాడు.

"మీ రిన్నివిధాల మరి తొందరలేదని భరవసా ఇస్తున్న ప్పుడు నేను కాదు, కూడదని అంటే మాత్రం లాభమేమిటి? సరే, మీ యిష్టం వచ్చినట్టే కానివ్వండి! అయితే రంగ నాయకు డిక శృంగారమంజరి భవంతి చుట్టు ప్రక్కల ఎక్క డయినా అడుగుపెడితే మాత్రం వ్యవహారం చాలా దూరం

దాకా వెళ్ళిపోతుంది. మీ మాటమీద కట్టుబడి నే నింతటితో ఈ వ్యవహారానికి తిలోదకా లిస్తున్నాను. సెలవా ! మరి !"

తిరుమలరెడ్డి తటాలున లేచి నిలుచున్నాడు. తరివరి అతని ధోరణి కనిపెట్టి "ఎంతమాట ! నాకామాత్రం తెలి యదా ?" అని సింహద్వారందాకా సాగిపోయి సగౌరవంగా వీడ్కొన్నాడు. తిరుమలరెడ్డి తిన్నగా తన భవంతికి తిరిగివచ్చి నప్పటినించి బాగా దీర్ఘాలోచనలో పడ్డాడు. తన మాటమీద రంగ నాయకుని తప్పక కారాగార శిక్షపడి తీరగలదని అనుకొన్నాడు. తన యెడల తలవరి కంతటి గొప్ప గౌరవం కలదని గట్టి నమ్మకం. దానిలో కొంత నిజం లేకపోలేదు. కాని చిట్టచివరికి వ్యవహారం అంతా తారుమారయింది. ఇక ఏమి చేయాలి ? తలవరి మాటమీద నిలబడి కొంతకాలం నిమ్మకి నీరెత్తినట్టు మాట్లాడ కూరుకుంటే ? తండ్రికి భయపడి రంగనాయకుడిక హేమసుందరితో తెగతెంపులు చేసుకుని ఏమీ ఎరగనట్టు మాట్లాడ కూరుకుంటాడా ?

రెడ్డికా విషయమై ఏమాత్రము నమ్మకం కలగలేదు. వా రిద్దరి మధ్య ఏర్పడిన అనుబంధం క్రమక్రమంగా దృఢ పడింది. హేమసుందరి వంటి చక్కనిచుక్క వలపు చూరగొన్న భాగ్యశాలి ఏది ఏమయినా సరే, మరి వెనుకంజ వెయ్యడు. వల్లమాలిన వెర్రి వలపుతో తానే తల మునకలై పోతున్నప్పు డిక అతనిమాట వేరే చెప్పాలా ? సైడి బొమ్మవంటి హేమ సుందరి సోయగం తలుచుకోగానే రెడ్డి శరీరం జలదరించింది ! ఉల్లాసావేశంతో ఒకింత పారవశ్యం కలిగింది. గట్టిగా తల పంకించి తొందర తొందరగా మధ్యాహ్న భోజనం ముగించు

కుని మేడమీదికి పోయి శయ్యమీాద మేనువాల్చి తాంబూలసేవ ప్రారంభించాడు.

అప్పటికి మధ్యాహ్నం రెండు జాముల పొద్దు తిరిగింది. ఎండ వేడిమి భరించలేక మేడపై అంతస్తు మీద గూళ్ళలో తలదాచుకున్న పావురాల రెక్కల రెపరెపలతో మేళవించిన సన్నని కలవరం మంద్ర మంద్రంగా వినిపించింది. తోటలో దిగుడు బావిలో తల్లి తాబేలు పిల్లలతో కలిసి అల్ల నల్లన పైకి వచ్చి అటు ఇటు పారాడింది. పనసచెట్టు చిటారు కొమ్మ నంటిపెట్టుకుని వేలాడుతున్న తేనెపట్టు అప్పుడప్పుడే తిరిగిన పైరు గాలిలో రవంత అల్లల్లాడింది. ఆ కదలికలలో చెల రేగిన తేనెటీగల నవ్వడి సన్నని తంబురా శ్రుతిలా ప్రతిధ్వనిం నించింది.

ఏదోవిధంగా రంగనాయకుని పని పట్టించి తీరాలని గట్టిగా ఆలోచిస్తున్న రెడ్డి తన ఎదుట ఉంచిన పైడి పళ్ళెరంలో తాంబూలపు చిలకలయి పోయాయన్న విషయమే గమనించ లేదు. దానితో అతని ఆలోచనాప్రవాహాని కకస్మాత్తుగా ఒక అడ్డంకి ఏర్పడింది. కొంచెం విసుగుదలతో లేచి నిలబడి దాసి ముత్యాలు కోసం ప్రాకారంలో నాలుగు వైపుల పరిశీలిం చాడు. కొంచెం గొంతెత్తి పిలిచాడు. ముత్యాలదివిని దట్టంగా తాంబూలపు చిలకలమర్చిన పళ్ళెంతో అక్కడికి వచ్చి నెమ్మ దిగా అది ఒక పక్కన ఉంచి ఇంకొక ఆజ్ఞకోసం నిరీక్షిస్తూ నిలబడింది.

రెడ్డి ఒక చిలక అందుకొని నోట బెట్టుకొని "ముత్యాలూ! అమ్మగారేం చేస్తున్నారే!" అని అతి రహ

స్యంగా అడిగాడు. తాంబూల చర్వణంతో ఎరుపెక్కిన పెద
విపై చిన్న చిరునవ్వు చిందించాడు.

"ఇంకా లేవలేదు బాబూ! అసలీవేళ పొద్దుటినించి కొంచెం తలనొప్పిగా ఉందన్నారు."

రెడ్డి తన చిటికినవేలి రత్నాంగుళీయకం తీసి పైకెత్తి పట్టుకుని "ఈ వేళ నువ్వొక చిన్న పని చేసిపెట్టాలి" అన్నాడు "ఏమిటది?" అన్నట్టు విస్తుపోయి చూసింది దాసి.

"ఇది అతి రహస్యంగా తీసుకువెళ్ళి హేమసుందరి కిచ్చి రావాలి. ఎందుకని అడిగితే నేను పంపించానని చెప్పు. మాణిక్యవల్లికిగాని శృంగారమంజరికి గాని తెలియకూడదసుమా! తెలిస్తే కొంప లంటుకున్నా యన్నమాటే! ఎల్లాగో అలాగ ఈ పని సాధించుకు రావాలి" రెడ్డి సన్నగా కన్నుగీటి హెచ్చరించాడు.

ముత్యాలు కొంచెం భయపడి రెడ్డి భార్యగాని మేలుకొన్నదేమో అని అటు యిటు పరకాయించింది. కొంత ధైర్యం తెచ్చుకొని దోసిలికట్టి "అమ్మగారికి గాని తెలిస్తే నా కాబోరు దక్కదు బాబూ? మీకేం మారాజులు!" అని తల వంచుకొన్నది.

రెడ్డి ఇంకొక చిలక నోట బెట్టుకుని లీలగానవ్వి "భయం లేదులే! నేనున్నానుగా!" అని గట్టిగా భరవాసా ఇచ్చాడు. అయినా ముత్యాలు మాట్లాడలేదు. అలాగే తలవంచుకుని నిలుచున్నది.

"నువ్వనుకున్న దానికన్న బాగా ఎక్కువగానే ముట్టజెబుతానులే! ఎన్నడు లేనిది ఎందుకే నీకింత బెదురు!"

సంవత్సరం తిరిగే సరికల్లా—

రామచంద్రయ్య పొలము, ఇల్లు సుబ్బారాయుడు కోర్టు వేలంలో తనే పాడి తన బాకి క్రింద స్వంతం చేసుకున్నాడు. కోర్టునుంచి నమ్మను వచ్చిన రోజే మంచంపట్టిన రామచంద్రయ్య నెల తిరిగేసరికల్లా గుటుక్కు మన్నాడు. తండ్రి మరణవార్త విని హైద్రాబాద్‌నుండి టాక్సీలో భార్యతోసహా వచ్చాడు వెంకట్రమణ. కర్మకాండలుచేసి, అందరినీ తన వెంటరమ్మని యథాలాపంగా పిలిచాడు. కాని ఆ ఆహ్వానంలో ఆప్యాయతగాని, అనురాగంకాని కనుపించలేదు. అందుచేతనే జానకమ్మ నిరాకరించింది. వెంకట్రమణ దీర్ఘంగా నిట్టూర్చి భార్యవెంట వెళ్ళిపోయాడు.

వెంకట్రమణ పెద్ద తమ్ముడు శ్రీకృష్ణుడు కోమటి కొట్టులో గుమాస్తాగా చేరాడు. నెలకు జీతం యాభై రూపాయలు. అదే కుటుంబానికి ఆధారం! చిన్నవాడు ఉమాపతి చదువు మానేసి రౌడీల జతలో తిరుగుతున్నాడు! ఎప్పుడో యింటికి రావటము, అందరిమీద తిరగబడటం, చిల్లరడబ్బుల కోసం తల్లిని ఏడిపించడం వాడికి మామూలు విషయమైంది!

మరినాలుగేళ్ళు గడిచిపోయినవి—

ఈలోగా రామచంద్రయ్య సంసారంలో మరికొన్ని సంఘటనలు జరిగిపోయినవి. ఉమాపతి ఒక దొంగతనం చేసి జైలుకు వెళ్ళిపోయాడు. రాజేశ్వరి, సినిమా హాల్లోని ఆపరేటర్‌తో కలిసి యెక్కడకో పారిపోయింది. వారిద్దరి మధ్య అక్రమ సంబంధం ఛాయాఛాయగా యెరిగిన అందరూ

న్నాడు. కాని తల వంచుకుని దీర్ఘాలోచనలో పడిన రెడ్డి వాడి రాకే గమనించలేదు. సింహాచలం రెడ్డి భవంతి తోట మాలి, ఉక్కుముక్కలాంటి మనిషి. వాడికి రెడ్డి ఎంత చెబితే అంత. నిలుచున్నపాటుగా నిప్పులో దూకమన్నా మరి వెను కంజ వెయ్యడు. చాలాకాలంనించి రెడ్డి దగ్గర తోటమాలిగా కుదుర్చుకున్నాడు. మరికొంతసేపలాగ నిలబడిన తరువాత ఎంతో వినయంగా "ఎందుకో పిలిపించారు. బాబూ! ఏమిటి సెలవు!" అన్నాడు.

రెడ్డి తల పైకెత్తి "సింహాచలం! నివ్విప్పుడొక వ్యవహారం చక్కబెట్టుకురావాలి. గట్టిగా నడుం బిగిస్తేనేగాని మన గౌరవం దక్కేటట్టు కనబడడంలేదు.ఎలాగ సాధించుకు వస్తావో మరి!" అని ప్రోత్సాహసూచకంగా చిన్న చిరునవ్వు చిలకరించాడు.

అత డింతకుమును పెన్నడు ఇంతటి మన్నన చవిచూచి ఉండలేదు. రెడ్డి మాటలతో ఉబ్బితబ్బిబ్బయినాడు.

అదేమిటి బాబూ! మీరలాగ సెలవియ్యాలా? ఇన్నా ళ్ళనించి మీ విస్తరిదగ్గర మెతుకు లేరుకుని తిని బతికిన వాళ్ళం కామా! ఇంతకి అంతటి ఇబ్బంది ఏమి వచ్చింది.?

ఆ సమాధానంతో రెడ్డి బాగా ధైర్యం తెచ్చుకొని నెమ్మదిగా తన పన్నాగం బయటపెట్టాడు:

"సింహాచలం! మన గ్రామంలో రంగనాయకుడని కట్టు పోగరుబోతు ఒక డున్నాడులే! వాడి పేరుగాని నువ్వెప్పు డయినా విన్నావా?

"వెంకటనాయఁనింగారి కొడుకుమాటేనా మీరనేది?"

"అవును! వాడి సంగతి మాట్లాడుతున్నాను. అతగాడు

పోద స్త్రమానము మన శృంగారమంజరి మేడచుట్టూ తిరుగుతూ నానాగొడవ చేస్తున్నాడు !"

"వాడికిదేం పొయ్యేకాలం బాబూ!"

"పొయ్యేకాలమే వచ్చింది ! లేకపోతే ఇలాంటి చెడు దారిలో పడతాడా ? వాడి మూలాన పాపం శృంగారమంజరి బాగా బెంగపెట్టుకుని చిక్కి శల్యమయింది. ఈమధ్యన మేడలో జొరబడి కావలి వాళ్ళందరిని చావగొట్టి గోడదూకి పారిపోయాడట ! పాపం శృంగార మంజరి నెత్తినోరు బాదుకుని నాతో మొరపెట్టుకుంది !"

"అయ్యో ! పాపం ! వాడప్పుడే ఇంతటి తుంటరి పనుల్లోకి దిగాడా !"

"ఇంకా మెల్లిగా అంటున్నావా? పాపం వాళ్ళు పీడి బాధ పడలేక ఊరు విడిచిపెట్టి ఎక్కడి కయినా వెళ్ళి తల దాచుకోవాలని అనుకున్నారు."

"అలాగా బాబూ ! అయితే మరి ఏమిటి సెలవు !"

"మరేమీ లేదు. నువ్వు కొంచెం గట్టిగా కలగజేసుకుని వాడి తలపొగరంతా అడిగించివెయ్యాలి. !"

దానితో సింహాచలం గుండెల్లో రాయి పడింది :

"తమరన్నమాట తిన్నగా బోధపడలేదు బాబూ !"

"ఇందులో బోధపడడాని కేముంది ? కాలో చెయ్యో విరిచి ఒకమూల కూచోబెడితేనే గాని వాడి పీడ విరగడయ్యేటట్టు కనబడడంలేదు. ఇది నీకేగాని మరి ఎవరికి సాధ్యమయ్యే పని గాదు."

"బాబూ ! అతగాడు సాము గరిడీలలో బాగా ఆరితేరిన

మనిషి. ఆపైన బాగా బలగం ఉన్నవాడు. ఇది నలుగురి నోళ్ళ లోను పడితే పెద్ద గొడవవుతుందేమో!”

రెడ్డికి చిరాకు తలకెక్కింది.

“నిమ్మకి నీరెత్తినట్టు చేస్తే నలుగురిలోను ఎందుకు పడుతుంది? నీకేమన్నా మతిగాని పోయిందా?”

సింహాచలం మళ్ళీ నీళ్ళు నమిలాడు:

“ఏమో బాబూ! నా కెందుకో భయంగా ఉంది? ఈ సారికి మాత్రం ఇంకెవరినయినా పంపించండి!”

ఆ ప్రతి సమాధానంతో రెడ్డి కొంచెం మండిపడ్డాడు.

“ఇంకెవరి నయినా పంపించేమాటుంటే నోరు విడిచి నిన్నడుగుతానా? ఉద్దండపిండంలా ఉన్నావే! ఎందుకురా నీకింత భయం!”

“భయంకాదు బాబూ! పిల్లలుగలవాణ్ణి. అనవసరంగా గొడవల్లో పడిపోతానేమోనని...”

“ఓరి పిరికిపందా! నువ్వింత అప్రాచ్యుడ వనుకో లేదురా! ఛీ! ఫో! మరి ఎదట నిలబడకు!”

అయినా సింహాచలం చేతులు నులుముకుంటూ అక్కడే నిలబడి కొంచెం తల వంచుకున్నాడు.

అంతలోనే రెడ్డి మళ్ళీ గొంతెత్తి గర్జించాడు:

“ఏం ఎందు కలాగ నిట్రాయిలా నిలబడ్డావు! చేతనయితే చెయ్యి! లేదన్నావా మరి నాకు నీ ముఖం చూపించకు! ఫో! ఏం వినబడడంలేదూ! కదలవేం?

రెడ్డి పెడముఖం పెట్టుకుని కూర్చున్నాడు. మరి గత్యంతరంలేక సింహాచలం గిరుక్కున వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

# 7

సాయంకాలం కొంచెం చల్లబడిన తరవాత నిచుళాపురంలో వీరహనుమానుని దేవాలయం విశాలావరణంలో యువకు లయిదారుగురు ఒకచోట సాము గరడీ లారంభించారు. వారికి మరి కొంత దూరంలో ఇంకొక పదిమంది కత్తిసాము కొనసాగించారు. మరికొంద రింకొకచోట జేరి వేర్వేరు శరీర వ్యాయామాల సాధనలలో నిమగ్ను లయినారు. సాయంకాలం నీరెండ వెలుగులో ఎర్రమన్ను పూసిన వారి శరీరాలు బంగారు విగ్రహాలవలె గోచరించాయి.

రంగనాయకు డా ఆవరణంలో ఇంకొక మూల నిలబడి కుడి ఎడమ చేతులలో నిలువెత్తు బాణాకర్ర తిప్పుతున్నాడు. గోపాలయ్య అతనికి నాలు గయిదు బారల దూరంలో నిలబడి చిన్న చిన్న నిమ్మకాయ లదేపనిగా విసురుతున్నాడు! చిన్ననాటి నించి నేర్చుకొన్న సాము చాకచక్యంతో అవి తన కేమాత్రము తగులకుండా రంగనాయకు డెంతో మెళకువతో తప్పించుకొంటున్నాడు. తప్పి జారి ఒక్క కాయ తగిలినా సరే, అతడు ఓడిపోయినట్టే! అలాగ ఇంచుమించుగా ఒక అరగడియ గడిచిన తరవాత రంగనాయకు డొక పొడుగాటి కరవాలంతో కత్తిసాము ప్రారంభించాడు. గోపాలయ్య ఇనుమడించిన పట్టుదలతో మళ్లీ అతనిమీద నిమ్మకాయల జడివాన కురిపించాడు. అయినా రంగనాయకు డెక్కడ చెక్కు చెదరలేదు! బాణాకర్ర శరవేగంతో గిరగిర తిరిగింది! తుత్తునియలయిన నిమ్మ

కాయ లన్నివైపుల రివ్వురివ్వుమని చెంగలించాయి! మరి కొంత సేపటికి గోపాలయ్య తన పరీక్ష ముగించి "రంగన్నా! ఈవేళ గెలుపు నీదే! నేనే ఓడిపోయాను!" అన్నాడు. అప్పటి కతని పక్కన పేర్చిన నిమ్మకాయల గుట్టలన్ని అయిపోయాయి!

క్రమక్రమంగా రంగనాయకుని బాణాకర్ర విసురు తగ్గింది. "అమ్మయ్య!' అని అతడా బాణా కొనమీద కొంచెం ఆను కొని విజయగర్వంతో విర్రవీగుతూ హేలగా చిరునవ్వు నవ్వి చిందిస్తూ నిలబడ్డాడు. గోపాలయ్య మొట్టమొదట తన మిత్రుడా పరీక్షలో అంత గొప్పగా నెగ్గగలడని ఊహించి ఉండలేదు. "రెండు మూడు కాయలయినా తగలకపోతాయా!" అను కొన్నాడు. అంతచేత ఆనందం పట్టలేక ఎంతో అప్యాయంగా కౌగలించుకొని అనేక విధాల అభినందించాడు.

రంగ నాయకుని కప్పటి కింకా ఇరవై అయిదవ యేడు నిండలేదు! కాని బాగా కండలు తిరిగిన బలిష్ఠ దేహంతో, మూడు పదులు నిండీ నిండనట్టు మిస మిస లాడుతున్నాడని గోపాలయ్య ఆశ్చర్యపడ్డాడు. విశాలమయిన నెన్నుదుటితో, కొనలు తేరిన కనుదోయితో, కొంచెం లేతరంగు ఎర్రమన్ను పై పూతతో మేరవించిన శరీరచ్ఛాయతో అత డెంతటి నెర జాణ నయినా ఇట్టే వలలో వేసుకోగలడని గోపాలయ్య గట్టి నమ్మిక, అయితే ఆటపాటలతో ఆరితేరిన వారవనిత లంతటి బేల గుండె కలవారు కాజాలరని అతనికి తెలియక పోలేదు. అయినా నెచ్చెలి కనుముక్కుతీరుపై అతని కంతటి గౌరవం కలిగింది! అంతేకాదు! అందాలరాశి హేమసుందరి కతనిమీద, అందచందాలమీద పెంపెక్కిన మక్కువ కూడా అంతగా

విశ్వనాథం జాలిపడ్డాడు. ఆమె జాబాపు ఒక యంత్రం! అంతే! ఏనాడో స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకుంది. అధికారం చెలాయిద్దాం అనే వూహకాదు కదా కనీసం, హాయిందాగా వుండాలనైనా ప్రవర్తించదు. ఆమె భారత స్త్రీ! అనుకున్నాడు మనసులోనే తల్లి నిట్టూర్చి విశ్వనాథం!

విశ్వానాథం మేడను అమ్మకానికి పెట్టి అప్పులన్నీ తీర్చేశాడు. నాలుగు గదులుండే సామాన్యమైన యింటికి తరలింది ఆ సంసారం!

మొట్ట మొదటిసారిగా మిల్లు కెళ్ళాడు. మేనేజర్ సుబ్బారాయుడు చిరునవ్వుతో స్వాగతమిచ్చి ఆఫీసుగది లోకి తీసుకెళ్ళాడు. నలుగురు గుమాస్తాలు, ఒక టైపిస్టు, కుషన్ ఛైర్లు - ఎలక్ట్రిక్ పంకాలు ఆఫీసుగది దివ్యంగావుంది.

మిల్లు పరిస్థితినిగురించి తనడగాలనుకుంటుండగానే సుబ్బారాయుడు చెప్పాడు కూలీలంతా రోజురోజుకీ కార్మిక సంఘాలంటూ సోమరిపోతుల్లా తయారవుతూన్నారని, గట్టిగా దండించేందుకు ఆ సంఘాల పెడద అడ్డం వస్తోందని, యంత్రాల్లో కూడా కొన్ని భాగాలు పూర్తిగా పాతవై పోయాయని, అయినా మొత్తంమీద మిల్లు లాభదాయకంగానే నడుస్తూందని చెప్పాడు. "నిల్వ ఏమాత్రం వుంటుందండి?" విశ్వం ప్రశ్నించాడు. సుబ్బారాయుడు గుటకలు మింగుతూ "అయ్యో! ఏముందండి! ఏదో రెండు వంద లుంది. అంతే! పెద్దబాబుగారు రోజూ..."

8)

వాడు. వెంకటనాయకుని ఉపేక్షాదృష్టికి అది ఒక ప్రధాన కారణమే. ఇటీవల రంగనాయకుని దుందుడుకు చేష్ట లెక్కువయినాయని విన్న తరవాత, త్వరలోనే వివాహం జరిపించి ఒక ఇంటివాణ్ణి చెయ్యాలని సంకల్పించుకొన్నాడు. కాని అనుకున్నంత మంచి సంబంధం ఏదీ కలిసిరాలేదు.

సాము పరీక్ష ముగిసిన తరవాత స్నేహితు లిద్దరు చెరొక విల్లు చేపట్టి రకరకాల బాణాల ప్రయోగా లారంభించారు. అంతలోనే రంగనాయకుడు రెండు మూడు సారులు తన వింటి నారి సారించి ఉక్కుకొన అమర్చిన బాణం ఒకటి ఎక్కుపెట్టి అల్లంత దూరంలో కనిపిస్తున్న గోపాలస్వామి ఆలయం ధ్వజస్తంభంవైపు గురిచూచి "గోపాలయ్యా! ఇది సూటిగా వెళ్ళి ఆ ధ్వజస్తంభం కొనకి తగిలి గంటలు గణగణమని మారుమోగితే, ఈ వేళ నే ననుకున్న పని జరిగినట్టే! లేకపోతే మరి కాదన్నమాటే!" అన్నాడు.

మరు క్షణంలోనే ఆ బాణం రివ్వుమని దూసుకుపోయి, ధ్వజస్తంభం కొనతో ఢీకొన్నది. చిరుగంటల సవ్వడి వారి ద్దరి హృదయాలలోను మంద్ర మధురంగా ప్రతిధ్వనించింది. రంగనాయకుడు పట్టరాని ఆనందావేశంతో ఉప్పొంగి, "సరే, మరి నీ బాణం విడిచిపెట్టు!" అన్నాడు. "ఇది ఆ గోపురం పై అంతస్తులోనించి దూసుకుపోతుంది చూడు!" అన్నాడు గోపాలయ్య. కాని అత డన్నట్టు జరగలేదు. "అయ్యో!" అని వేలు కరుచుకున్నాడు గోపాలయ్య. "అన్నీ మనం అనుకున్నట్టు జరుగుతాయా!" అని ఓదార్చాడు రంగనాయకుడు.

ఆనాడు చైత్ర పూర్ణిమ. ఆ వెన్నెల వెల్లువలో గోపాల

స్వామి ఆలయం అప్పుడప్పుడే వికసించిన పెద్ద తెలికలవ పూవులా తరళించింది. దేవళంలో భక్తుల శ్రీసూక్త పురుష సూక్తాల కోలాహలం జేగంటల పెనుసవ్వడులలో స్పష్టాస్పష్టంగా వినిపించింది. తీర్థ ప్రసాదాలు తీసుకున్న తరువాత స్నేహితులిద్దరు ఆలయం లోలోపలి ప్రాకారం చుట్టు ప్రదక్షిణ నమస్కారా లారంభించారు. అవి ముగిసిన పిమ్మట దేవాలయం ఆవరణంలో ఉన్న పుష్కరిణి గట్టుమీద చదికిలబడి ఇష్టాగోష్ఠి ప్రారంభించారు.

స్వామి సందర్శనం కోసం గుమిగూడిన జనం క్రమక్రమంగా పలచబడ్డారు. అర్చకులు కూడా తిరిగి వెళ్ళిపోయారు. అప్పటి కర్ధరాత్రి కావచ్చింది. గోపాలయ్య లేచి నిలబడి "మరి వెళ్ళిపోదామా" అన్నాడు. కాని రంగనాయకుడు ప్రతి సమాధానం చెప్పలేదు. ఏదో ఆలోచిస్తూ అలాగే కూర్చుండిపోయాడు.

"నేను తలపెట్టిన పని ఇంకా పూర్తికాలేదు. ఆపరాత్రి వేళదాకా నాతో కలిసి తిరిగితే మీవాళ్ళేమయినా అనుమానపడతారేమో! పోనీ నువ్వు వెళ్ళిపో!" గోపాలయ్య రవంత సేపు అతనివైపు చూసి "నీ ఆలోచన నాకు తెలిసిందిలే! గోపురం మీదికి పోదామనుకుంటున్నావు, అవునా?" అని సూటిగా ప్రశ్నించాడు.

"అవును! అందుకోసమే కూర్చున్నాను. లేకపోతే ఇంతసేపటిదాకా ఇక్కడ పడిగాపులు పడి ఉండడ మెందుకు?"

"రంగన్నా! నీ కంత కంతకి మతి పోతూంది సుమా! ఈ పున్నమి వెన్నెల్లో ఎవరయినా గుర్తుపడితే"

"ఏది ఏమయినా సరే, నేనీవేళ గోపురం మీదికి వెళ్ళితీరాలి!"

"నా మాట విను! తిరుమలరెడ్డికి తెలిస్తే కొంపలంటుకుంటాయి సుమా!"

"అంటుకోనీ!"

"మధ్య నీ సొమ్మేం పోయింది! రేపిది నలుగురి నోళ్ళలోను పడితే మీ బాబయ్యగారి పరువు, మర్యాద గంగలో కలిసిపోతాయి.!"

"నీది ఎప్పుడు ఒకటే రోకటిపాట! నా కా మాత్రం తెలియకపోలేదు. నా జాగ్రత్త నేను పడగలను!" రుసరుసలాడుతూ చీదరించుకొన్నాడు రంగనాయకుడు. అయినా గోపాలయ్య తన పట్టు విడిచిపెట్టలేదు. రెండు చేతులు గట్టిగా పట్టుకున్నాడు. రంగనాయకుడు ఒక్క ఊపులో అతనిపట్టు విడిపించుకుని పెడముఖం పెట్టుకుని కూర్చున్నాడు. ధుమధుమలాడుతూ శిరస్సు పైకెత్తి గోపుర శిఖరంకేసి చూస్తూ కూర్చున్నాడు. అంతేగాని మరి గోపాలయ్యతో మాట్లాడలేదు. "ఎంతలో ఎంతగా మారిపోయాడు, రంగనాయకుడు!" అనుకున్నాడు గోపాలయ్య. వారిద్దరు ఆ బాల్య మిత్రులు. సహపాఠులు. ఇటీవలే ధోరణులు కొంచెం వేరయ్యాయి. అయినా అతనిని విడిచిపెట్టి వెళ్ళడానికి గోపాలయ్య కేమాత్రము మనస్కరించలేదు. తానే ముందుగా ప్రసంగం ప్రారంభించి" సరేలే! త్వరగా గోపురం మీదికి వెళ్ళి తిరిగిరా! నేను కింది అంతస్తులో కూర్చుంటానులే!" అన్నాడు.

అప్పటి కర్ధరాత్రి దాటింది. కనుచూపు మేరలో

ఎక్కడ మనిషి జాడ గోచరించలేదు. నెచ్చెలితో కలిసి రంగ దాయకుడు గోపురం కింది అంతస్తు చేరుకున్నాడు. గోపాలయ్య అక్కడ ఒక చోట గోడ కానుకుని కూర్చున్నాడు.రంగనాయకు డంతలోనే ఉడుముల్లా చరచరా సాగిపోయి గోపురం పై అంతస్తులో నిలబడి నిశ్చల దృష్టితో శృంగారమంజరి భవంతి పరిశీలించాడు.

కాని ఎంతసేపటికి హేమసుందరి కనబడలేదు. "ధ్వజ స్తంభం గంటలు గణగణమని మారుమోగి నా హేమసుందరి కనబడలే దేదెందుచేత ? అని వితర్కించుకొన్నాడు. తా నక్క డికి వస్తున్నానని ముమ్మందుగా దాసి నాంచారమ్మ ద్వారా కబురు పంపించలేదు ! అయినా తలవని తలంపుగా హేమ సుందరి నొకసారి చూడాలని నిశ్చయించుకున్నాడు. ధ్వజ స్తంభం గంటల గణగణ ధ్వని వారిద్దరు కలిసి ఏర్పరచుకొన్న మనోజ్ఞ ధ్వని సంకేతం. అదీగాక ఆనాడు తా నది ఒక శుభ శకునంగా భావించాడు. కనక తన కోరిక తప్పక నెరవేరగలదని నిశ్చ యించుకొన్నాడు. కాని చిట్టచివరికి ఆశాభంగమే ఎదుర యింది. రెప్పపాటయినా లేని ఏకాగ్ర నిశ్చల దృష్టితో రంగనాయకుడు మరికొంతసే పలాగే పరీక్షించాడు.

శృంగారమంజరి మేడ పై అంతస్తు కిటికీతటాలున తెరుచు కున్నది. ఒక సుందరి కిటికీ చువ్వలమీద ముఖం మోపి నిలుచు న్నది. ఆమె ఎవరో కాదు, హేమసుందరి ! రంగనాయకు డొక అరలిప్త కాలంలోనే గుర్తించాడు ! అతని శరీరం నిలు వునా పులకరించింది.అల్లంత దూరంలో హేమసుందరి ముంగు రుల స్పర్శతో మనోహరాతి మనోహరమయిన పాలవెన్నెల

తన నెన్నుదురు ముద్దు పెట్టుకొంటున్నదని అత డానంద పార వశ్యంతో ఉప్పొంగి క్రమక్రమంగా మైమరచి మరి బాహ్య ప్రపంచమే విస్మరించాడు! ఆ విధంగా ఎంతసేపు నిలుచు న్నాడో అతనికే తెలియదు!

స్వామి పుష్కరిణిలో అప్పు డప్పుడు చిరుమీను లెగిరి పడి తళుక్కుమని మెరిశాయి. దేవాలయావరణంలో దేవ కాంచన పుష్పా లొకటి రెండు ఉండి ఉండి నేలమీద తూలి పడ్డాయి. గోపురం గూళ్ళలో పావురాల కలరవం క్రమక్రమంగా మందగించింది. ఆకాశంలో తారక ఒకటి తటాలున జారిపడింది. క్రమక్రమంగా ఆ పరిసరంలో అంతట నిశ్చల నీరవత అలము కొన్నది.

# 8

రంగనాయకుని కోసం గోపాలయ్య గోపురం కిం దిఅంత స్తులో యించుమించుగా ఒకటి రెండు గడియలసే పలాగే పడి గాపులుపడి కూర్చున్నాడు. అయినా రంగనాయకుడు తిరిగి రాలేదు! ఒకవేళ హేమసుందరి సందర్శనంతో మైమరచి మరి తన మాటే తలపెట్టడం మానివేసేడేమో! రంగనాయకు డెంతకయినా తగినవాడే! సందేహం లేదు. తల పంకించాడు, గోపాలయ్య. కొంచెం చిరాకు అలవోకగా అతని ముఖం మీద అలుముకొన్నది

లేచి నిలుచుని అటు ఇటు పచారు సాగించాడు. మాటి మాటికి శిరస్సు పైకెత్తి రంగనాయకుని రాకకోసం నిరీక్షిం

చాడు. ఇంతటి అపరాత్రివేళ ఇంటికి చేరుకుంటే మాట దక్క-దని బాగా భయపడ్డాడు. ప్రాణం విసిగి మరి వేచిఉండలేక ఒక సారి పై అంతస్తుమీదికి పోయి చూడాలని కూడా ఆలోచించాడు. కాని బాగుండదేమో అని మళ్ళీ సంకోచించాడు. పోనీ రెండు మూడంతస్తులు దాటిపోయి. గట్టిగా గొంతెత్తి, పిలిస్తేనో! మరి మార్గాంతరం లేదని నిశ్చయించుకొని తొందరగా పై అంతస్తు దగ్గరికి బయలు దేరాడు. వడివడిగా పది అడుగులు వేశాడు.

అంతలోనే "అయ్యో!" అని అతని కొక సన్నని ఆక్రోశం వినిపించింది. అది రంగనాయకుని గొంతే! సందేహం లేదు! గోపాలయ్య నిమేష కాలం నిర్ఘాంతపడి తడబడుతున్న అడుగులతో అతి త్వరితగతితో గోపురం పై అంతస్తు సమీపించాడు. పెను పెనుగులాటతో బాటతనికి పెద్ద పెట్ట పిడికిలి పోట్ల సవ్వడి వినిపించింది! గోపాలయ్య ఇంకా పైకెక్కి- చిట్ట చివరి మెట్టు మీద నిలబడ్డాడు. మరి తన కళ్ళే నమ్మలేక పోయాడు.

కారెనుబోతు వంటి ఒక వ్యక్తి రంగనాయకుని తన సందిట ఇరికించుకుని, గట్టిగా అదిమి పట్టుకుని పిడుగులవంటి పిడికిలి పోట్లతో వీపుమీద, మెడమీద, నెత్తిమీద మాటి మాటికి చితక బొడుస్తున్నాడు! రంగనాయకుడా వ్యక్తి రిర జాల జుట్టు పట్టుకుని కింది కీడ్చి కొట్టాలని శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు. కానిఎంతగా పెనుగులాడిన సాధ్యపడడం లేదు అంతలోనే ఆ కారెనుబోతు అతని కాలు దొరకబుచ్చుకొని కింది కీడ్చి గుండెమీద కూర్చుని గొంతు చేజిక్కించుకొన్నాడు.

అంతలోనే రంగనాయకు డొక్క విదిలింపుతో అతని భల్లూకపు పట్టు విడిపించుకొని లేచి కూర్చుని పిడికిలి బిగించి శక్తికొద్ది కణతమీద కొట్టాడు. ! కాని అతడు అప్పటికే బాగా అలసి పోయాడు. అంతలోనే ఆ నూతన వ్యక్తి అమాంతంగా అతని మీద విరుసుకుపడ్డాడు. గట్టిగా బిగించిన పిడికిలితో తిరిగి వారిద్దరిమధ్య పెద్ద పెనుగులాట ప్రారంభ మయింది.

గోపాలయ్య కళ్ళెదట అదంతా ఒక క్షణ కాలంలో జరిగిపోయింది ! ఆ కొత్త వ్యక్తి శిరస్సు చెక్కలయ్యేటట్టు చితకగొట్టడానికి ఏదయినా దొరుకుతుందేమో అని అత డా అంతస్తు నాలుగు వైపుల పరిశీలించాడు. పెద్ద రాయి గిది కనబడలేదు. ఒక మూల విరిగిన రెండు బాణాకర్ర ముక్కలు కనిపించాయి. పిల్లిలా వెళ్ళి ఒక ముక్క అందుకొని తన యావచ్ఛక్తి వినియోగించి ఆ కొత్త వ్యక్తి నడి నెత్తి మీద గట్టిగా కొట్టాడు గోపాలయ్య. మరుక్షణంలోనే "అయ్యో !" అని ఆక్రోశించి వాడక్కడే చాపచుట్టాలా నేల మీద కూలబడ్డాడు. గోపాలయ్య వాడి వీపుమీద మోకా లానించి కూర్చుని తన తలపాగా విప్పి కాళ్ళు చేతులు వెనక్కి విరిచి కట్టి పిడికిలితో మెడమీద ఒక పోటు పొడిచాడు. విల విల తన్నుకుని ఆ వ్యక్తి అతి కష్టంమీద వెనక్కి తిరగబడ్డాడు. అంతలోనే ఇంకొక పిడికిలి పోటుతో వాడి కణత ఖంగుమని మారుమ్రోగింది. అంతే! వాడు మరి కదలలేదు. ఆ దెబ్బతో ప్రాణమే పోయి ఉండవచ్చునని గోపాలయ్య అనుకొన్నాడు. ముక్కు పుటాల దగ్గర వే లుంచి పరిశీలించాడు. అంతగా ప్రాణ భయ మేమి కనబడలేదు.

ఆ పెనుగులాటతో బాగా అలసిపోయి ఒక మూల కూలబడిన రంగనాయకు డప్పటికి కొంచెం తేరుకున్నాడు. తన స్నేహితుని వైపు చూసి సన్నని గద్గదస్వరంతో "వచ్చావా! గోపాలయ్యా!" అని పలకరించాడు. రెండు మూడు కవోష్ణ బాష్పా లతని కనుగొలకులనుండి జారి నేల మీద రాలాయి. "రంగా! ఏమి టిదంతా ?" అని ప్రశ్నించాడు గోపాలయ్య రంగనాయకుడు మరికొంచెం తేరుకుని స్నేహితుని ఆసరాతో లేచి కూర్చుని హీనస్వరంతో జరిగిన కథ మొదలు పెట్టాడు.

"ఏమో నా కిదేమి అంతుపట్టడంలేదు. హేమసుందరి కనిపించిన తరువాత మరికొంతసే పలాగే నిలబడి తిరిగి రెండుమూ డంతస్తులు దాటి కిందికి వచ్చాను. అంతలోనే అకస్మాత్తుగా వీడు నా వెనుకనుంచి వచ్చి బాణాతో వీపు మీద గట్టిగా కొట్టాడు. మళ్ళీ ఇంకొక దెబ్బతో తల పగల గొట్ట వలసిందే! కాని గోడకి తగిలి బాణా రెండు ముక్క లయింది. అయినా మీది కురికి రెండు మూడు సారులు నేలమీది కీడ్చి కొట్టి కాలో చెయ్యో విరిచివేయ్యాలని శాయ శక్తులా ప్రయత్నించాడు. కాని దైవానుగ్రహం వల్ల అది సాధ్యపడ లేదు. నువ్వు ఇక్కడికి వచ్చేటప్పటికే నేను బాగా అలసిపోయాను. ఒక అరగడియ ఆలస్యమయితే వాడు నా గొంతు నులిమి చంపివేసే వాడే! సరిగా సమయానికి వచ్చావు గాని లేక పోతే నేటితో నా ఆయుర్దాయం నిండి పోయేదే!"

రంగనాయకుని గొంతు తిరిగి ప్రగాఢ గద్గదికతో తొణి కిసలాడింది. మరి చెప్పవలసిన దేది లేక మాట్లాడ కూరుకు న్నాడు. అంతలోనే గోపాలయ్య అందుకొన్నాడు.

"సరేగాని ఇంతకీ వీడెవడు ?"

"ఏమో !"

"ఇంతకుమును పెక్కడా వీణ్ణి చూడలేదా ?"

"ఏమో చూచినట్లు జ్ఞాపకంలేదు !"

"అయితే నిన్ను వీడెందుకు కొట్టాడంటావు ?"

"అదే నేను ఆలోచిస్తున్నాను."

"నీకు బాగా దెబ్బలే తగిలినట్లున్నాయి ? లేచి నిలబడ గలవా ?"

"భయంలేదు. మరికొంతసేపు అలసట తీర్చుకుంటే లేచి నిలబడగలను"

అదే సమయంలో కింద పడిన వ్యక్తి కళ్ళు తెరచి కొంచెం అటు ఇటు కదిలాడు. గోపాలయ్య వాడికి బాగా దగ్గిరిగా జరిగి కళ్ళెర్రజేసి గొంతెత్తి గర్జించాడు.

"ఎవడవురా నువ్వు ? నీపే రేమిటి ?"

ఆ వ్యక్తి ప్రతి సమాధానం చెప్పలేదు. సన్నగా మూలి గాడు. అంతే.

"చాల్లే ఈ దొంగ వేషాలింక కట్టిపెట్టు ! లేక పోతే ఇదిగో ఇప్పుడే నీ గొంతు నులిపి రెండు కాళ్ళు దొరకబుచ్చు కుని నేలమీదికి విసిరివేస్తాను ! జాగ్రత్త ! తిన్నగా సమాధానం చెప్పు !"

ఆ బెదిరింపుతో ఆ వ్యక్తి హడిలిపోయి "సింహాచలం బాబూ !" అన్నాడు.

గోపాలయ్య మళ్ళీ గర్జించాడు.

"అయితే నువ్వెక్కడ ఉంటున్నావు ? ఇంత అపరాత్రి ఇక్కడ కెందుకు వచ్చావు ? నిజం చెప్పు నీకేమి భయంలేదు: లేకపోతే నీకీనాటితో భూమి ఋణం తీరిందన్న మాటే ! తెలిసిందా ?

సింహాచలం మరి గత్యంతరం లేక తిరుమలరెడ్డి తన్నిక్కడికి వంపించిన సంగతి బయట పెట్టాడు. ఆ సంగతి మాత్రం మరి ఎవ్వరితోను చెప్పవద్దని డగ్గుత్తికతో బ్రతిమాలుకొన్నాడు: రెడ్డి గట్టిగా బెదిరించి బలవంతం చేసినందువల్లనే ఇటువంటి అఘాయిత్య పని తలపెట్టినట్టు అంతేగాని దానిలో తన తప్పేమీ లేనట్టు చెప్పి తప్పించుకొన్నాడు. పేదవాడినని, పిల్లలు కలవాడననీ ఆ తప్పిదం మన్నించవలసినదనీ మాటి మాటికి మొరపెట్టుకున్నాడు. రంగనాయకుని వాడి సంగతి కొంచెం బోధపడింది. అయితే తిరుమలరెడ్డి తనమీద అంతగా పగబట్టడానికి గల అసలు కారణ మేమో అవగాహన కాలేదు. రంగనాయకు డెన్నెన్ని విధాల భయపెట్టినా వాడు తన కంతకన్న ఏమి తెలియదని మొరపెట్టుకున్నాడు. గోపాలయ్య తిరిగి తిరిగి గద్దించినా రవంతయినా వాడి ధోరణి మారలేదు.

'ఆయన అసలు రహస్యం నాలాటివాళ్ళతో చెబుతారా బాబూ ! పొంచిఉండి మిమ్మల్ని గట్టిగా కొట్టిరమ్మన్నారు. కొట్టాను. అంతే ! ఆయన మాటగాని కాదంటే పిల్లలు, నేను

మలమల మాడి చావలిసిందే! ఎటుచూసినా మాలాంటి వాళ్ళ బతుకు లింతే బాబూ! రెండు మూడు రోజులనుంచి మిమ్మల్ని వెంటాడిస్తూనే ఉన్నాను. కాని మీ రది గమనించనేలేదు! అప్పుడప్పుడు గోపురం మీదికి మీ రొక్కరే రావడం కని పెట్టాను. మీకంటే ముందే వచ్చి ఈవేళ ఈ అంతస్తు గదిలో కిటికీ వెనకాల|దాక్కున్నాను. అంతేగాని సొత్తు దోచుకోవా లని మాత్రం నే నిక్కడికి రా లేదు! గోపాలస్వామి సాక్షిగా, సత్యప్రమాణ పూర్తిగా ఉన్నది ఉన్నట్టు మనవిచేసుకొంటు న్నాను. నా మాట నమ్మండి! పిల్లలు గలవాణ్ణి! రక్షిం చండి!"

రంగనాయకుడు కొంచెం ఆలోచనలో పడ్డాడు. శృంగార మంజరి తన సంగతి ఏదో విధంగా కనిపెట్టి తిరుమలరెడ్డి చెవిని వేసి ఉండవచ్చునని ఊహించాడు. అతడే ఇంతటి చెడ్డపని చేయించి ఉండవచ్చునని నిశ్చయించి తలపంకించాడు. దయ తలచి విడిచిపెట్టవలసినదని సింహాచలం తిరిగి ఇంకొకమారు మొరపెట్టుకొన్నాడు. దెబ్బలతో ఎంతగా బాధపడుతున్నా ఆ దీనాక్రోశం విన్న తరవాత రంగనాయకుని మనస్సు కొంచెం మెత్తబడింది. కట్టు విప్పి విడిచిపెట్టవలసినదని గోపాలయ్యతో అన్నాడు.

కాని అతడు దాని కంగీకరించలేదు. సింహాచలాన్ని అలాగే తీసుకుపోయి తలవరి కప్పగించగలనని భీష్మించుకుని కూర్చున్నాడు. జల జల ప్రవహిస్తున్న కన్నీటితో వాడు మళ్ళీ రంగనాయకుని వైపు తిరిగి మన్నించవలసినదని బ్రతిమాలు కొన్నాడు. అప్పటికి అర్థరాత్రి మూడవ జాము కూడా గడి

చింది. దెబ్బలవల్ల నయితేనేమి, నిద్రలేమివల్ల నయితేనేమి రంగనాయకుడు బాగా అలిసిపోయాడు. నిజం చెబితే విడిచి పెట్టగలనని గోపాలయ్యమాట ఇచ్చాడు. అదీగాక సింహాచలాన్ని తలవరి కప్పగించడంవల్ల లేనిపోని బెడద తనమీద విరుచుకుపడగలదని కూడా సంకోచించాడు. దానాదీనా వాణ్ణి విడిచిపెట్టవలసినదని గట్టిగా పట్టుపట్టాడు.

గోపాలయ్య ఎట్టకేల కంగీకరించాడు. కట్టు విప్పి ఎప్పుడు ఇలాంటి పాడుపనులు చెయ్యవద్దని గట్టిగా హెచ్చరించి వాణ్ణి విడిచిపెట్టాడు. సింహాచలం వారిద్దరి పాదాలమీద సాగిలపడి దణ్ణాలుపెట్టి స్వామికి నమస్కరించి లెంపలు వేసుకుని చేతులు కట్టుకుని నిలుచున్నాడు. వారు ముగ్గురు గోపురం దిగి ఆలయ సింహద్వారం దాటి వీధిలో పడ్డారు. సింహాచలం తాను చెప్పిన రహస్యం బయటపెట్టవద్దని మళ్ళీ కాళ్ళా వేళ్లా పడి బ్రతిమాలుకొన్నాడు. మిక్కిలి అడకువతో సెలవు తీసుకుని తిరుమలరెడ్డి భవంతివైపు సాగిపోయాడు. గోపాలయ్య స్నేహితునికి కొంచెం ఆసరా ఇచ్చి నడిపిస్తూ "రంగా! జాలిపడి విడిచిపెట్టావుగాని వీడు వట్టి దొంగ వెధవ! నమ్మడానికి వీల్లేదు! ఒక కంట కనిపెట్టి ఉంటాలి సుమా! జాగ్రత్త!" అని హెచ్చరించాడు. "ఆఁ, నాకు వీ డొక లెక్కా!" అన్నట్టు హేళనగా ఒక చిరునవ్వు చిందించాడు రంగనాయకుడు. నాలు గయిదు అడుగులు వేసిన తరవాత గోపాలయ్య మళ్లీ అందుకున్నాడు:

"రంగా! వీడి కిలాంటి పనులలో అట్టే బాగా చెయ్యి తిరిగినట్టు కనబడడం లేదే!"

"సరిసరి ! చెయ్యి తిరిగినవా డయితే ఈ డీపాటికి మనల నిద్దరిని మహామ్మాయం చేసి ఉండేవాడే ! అంతదాకా ఎందుకు? నువ్వు కొంచెం ఆలస్యం చేస్తే నాగతి ఇక ఆ స్వామికే ఎరుక!"

"సరేగాని తిరుమలరెడ్డికి నీమీాద ఇంత అక్కసు ఎందుకు కలిగిందో మాత్రం తిన్నగా బోధపడటంలేదు !"

"ఇందులో బోధపడడానికి కేముంది? ఆ ఇంట్లో ఎవరో నా సంగతి పసిగట్టి అతని చెవిని వేసి ఉంటారు. సింహాచలం చెప్పింది చాలావరకు నిజమే అయిఉంటుంది."

రంగనాయకుడు గోపాలయ్య భుజంమీాద చెయ్యి వేసి నెమ్మది నెమ్మదిగా నడక సాగించాడు. వారిద్దరూ నిచుళా పురం పొలిమేరలో ఉన్న ఇంటికి చేరుకునేసరికి పెరటిలో కోడికూత వినిపించింది. వెంకటనాయుకు డింకా అప్పటికి నిద్ర లేవలేదు. కాని రంగనాయకుని తల్లి లేచి ఇంట్లో ఏవేవో పనులు చేసుకుంటున్నది. అతడది పసికట్టి నెమ్మదిగా తలుపుతట్టి "అమ్మా!" అని పిలిచి చల్లచల్లగా లోపలికి జారుకోబోయాడు. హేమసుందరి వ్యవహారం అంతటితో పూర్తిగా కట్టిపెట్టమని స్నేహితుని చెవిలో చెప్పి గోపాలయ్య ఆ ఇంటి కల్లంత దూరంలోఉన్న తన పొలంలో ప్రవేశించాడు.

తెల్లవారేసరికి వెంకటనాయకుని ఇంట పెద్ద రభస ప్రారంభమైంది. విపరీతమైన నిస్త్రాణతో రవంతసేపు కన్ను మూసిన రంగనాయకునికి ఆ కోలాహలంతో కొంచం మెళకువ

వచ్చింది. క్రమక్రమంగా తగిలిన గాయాలెటువంటివో బాగా తెలిసివచ్చింది. సింహాచలం బాణాతో వీపుమీద కొట్టిన దెబ్బ వల్ల పొడుగాటి దద్దురు లేచింది. పిడికిలి పోట్లతో మెడ బాగా వాచింది. వీపుమీద తగిలిన దెబ్బలతో సలుపు, పోటు ప్రారంభ మయ్యాయి. గోపురంపై అంతస్తుమీద పడిపోయినప్పుడు గాని, గోపాలయ్య ఆసరాతో ఇంటికి నడిచి వచ్చినప్పుడు గాని, రంగనాయకుని కంతగా గట్టి దెబ్బలు తగిలినట్టు స్ఫురించలేదు. కాని కొంచెంసేపు కన్ను మూసి మేలుకొన్న తరవాత ఆ గాయా లన్నీ క్రమక్రమంగా వాడి వాడి శూలాలై వేధించాయి. ఎంతగా యమయాతన అనుభవిస్తున్నా రంగనాయకు డది రవంతయినా పైకి వ్యక్తం కానీయలేదు. ఊపిరి బిగబట్టి ఆ విప రీత యాతన అతి కష్టంమీద లోలోపలే నిగ్రహించు కొన్నాడు.

అతని గది కల్లంత దూరంలో పెరటిలో తల్లి దండ్రుల మధ్య బయలుదేరిన వాగ్వాదం మాటిమాటికి పెచ్చు పెరిగి పోతున్నది. తల్లి లక్ష్మీదేవమ్మ కొంచెం సర్ది చెబుతున్నది. కాని బ్రతిమాలుకొంటున్న కొద్దీ వెంకటనాయకుడు అహం కారావేశంతో హుంకరిస్తున్నాడు! రంగనాయకునికి మొట్ట మొదట ఆ మాట లంత విస్పష్టంగా వినిపించలేదు. కాని ఇప్పు డవి అతని మనోవీథిలో ఖంగుమని మారుమ్రోగుతున్నాయి! వెంకటనాయకుడు రుసరుసలాడుతూ గద్దించాడు:

"సరేగాని, భళ్ళుమని తెల్లవారేదాకా వీ డెక్కడ ఉన్నట్టు? ఏమి చేస్తూన్నట్టు?"

ధించిన అన్ని బాధలనుంచి మైమరపింపజేసి, ప్రకృతిమాత నన్ను తన ఒడిలోకి లాక్కొని చిచ్చికొట్టినట్లు, స్ఫురించింది.

"గుడ్ ఈవెనింగ్!"

హఠాత్తుగా తలెత్తి చూశాను. నా యెదురుగా సూర్యనారాయణ నిలుచుని వున్నాడు. అతని ముఖంలో చిరునవ్వు వింతగా మెరసిపోతూంది. పరామర్శల అనంతరం యిద్దరం చాలసేపు మౌనంగా కూర్చున్నాం. ఛాయానాధుడు తన ప్రేయసీ ఒడిలోకి చేరుకున్నాడు. చీకటి తెర కప్పుతోంది.

"మీరు గుమాస్తాగిరిలోనే వుండదలుచుకున్నారా!"

ఉన్నట్టుండి హఠాత్తుగా ప్రశ్నించిన సూర్యనారాయణ ప్రశ్న నన్ను కొద్దిగా ఆశ్చర్యపరచింది. తలెత్తి అతనివైపు పరిశీలనగా చూచి యేదో అనబోయేలోగా అతనే అన్నాడు—

"చూడండి! మేము స్కూల్ ఫయినల్ గాళ్ళం! అందులోను పెళ్ళి, పెటాకులు అన్నీ ముగిసినాయి. మాకున్న ఖర్మో గత్యంతరం లేదు. డిగ్రీ వుండీ మీరు యీ నికృష్టమైన ఉద్యోగాన్ని అంటి పెట్టుకోవటంలో అర్థంలేదు."

సూర్యనారాయణ మాటలు నాకు వింతగా విన్పించినవి. నిరుద్యోగ పిశాచి విద్యావంతులయిన యువకుల్ని కబళిస్తూ పట్టిన యీ రోజుల్లో గగనకుసుమంలా చేతికి దొరికిన వుద్యోగం వదులుకోమంటున్నాడా ఈ ప్రబుద్ధుడని మనసులో తలచి 'అయితే! రాజీనామా యిమ్మంటారా!' నెమ్మది

లుట్టంకించి రెట్టించి ధుమధుమలాడుతూ ఏవేవో లేనిపోని గొడవలలో పడ్డారు.

ఆ తరువాత గోపాలయ్య వెంకటనాయకునికి ఇంటి గుమ్మంలో కనిపించాడు. అతనిని చూచిన పిమ్మట వారిద్దరు తిరిగి వాగ్వాదం ప్రారంభించలేదు. మరి కొంతసేపటికి పెరటిలో లేగదూడ గొంతెత్తి "అంభా" అని అరిచింది. పాలు పితికే వేళ దాటిపోయిందని లక్ష్మీదేవమ్మ తొందర తొందరగా అక్కడినించి వెళ్ళిపోయింది. గోపాలయ్య లోపలికి వస్తూనే రంగనాయకుడు ఎక్కడ ఉన్నాడని అడిగాడు.

"ఆ ప్రబుద్ధుడింకా లేవలేదులా ఉంది! అదిగో, ఆ పక్క గదిలో పడుకున్నాడేమో!" అన్నాడు వెంకటనాయకుడు రుసరుసలాడుతూ. గోపాలయ్య ఆ గదిలో అడుగుపెట్టి నిలువునా నిర్ఘాంతపడి, "ఇదేమిటి? ఇలాగున్నావు? జ్వరం గాని తగిలిందా?" అని పక్కమీద కూర్చుని దుప్పటి ముసుగు కొంచెం తొలగించి ఒంటిమీద చెయ్యివేసి "అబ్బా! ఒళ్ళు పేలిపోతూందే!" అన్నాడు.

వెంకటనాయకుని కప్పటివరకు కుమారుని వాస్తవ పరిస్థితి ఆవంతయినా అవగాహన కాలేదు. గోపాలయ్య నోట జ్వరమన్న మాట వెలువడిన పిమ్మట వెంటనే కొడుకున్న గదిలో ప్రవేశించాడు. రంగనాయకుడొక తుంగచాపమీద పరిచిన బూరుగుదూది పరుపుమీద కాళ్లు చేతులు ముడుచుకుని పడుకున్నాడు. కుమారుని ముఖవైఖరిని గమనించి వెంకటనాయకుడు ఎంతో ఆశ్చర్యపడి, మరి కొంతసేపటివరకు నోట మాటే వెలువడక అలాగే నిలుచున్నాడు! దుప్పటి ముసుగు కొంచెం

తొలిగించి వీపుమీద చెయ్యివేసి పెద్ద జ్వెరి గొడ్డులా తేరు కున్న దద్దురు గమనించి "ఇదేమిటి రంగన్నా ! ఈ దెబ్బ ఎక్కడ తగిలిందిరా ?" అని గట్టిగా గద్దించాడు. రంగనాయకుడు ఆ ప్రశ్న విని ఇంకొక వైపు తిరిగి పడుకుని సన్నగా మూలి గాడు. అంతే గాని ప్రతి సమాధానం చెప్పలేదు ! వెంకట నాయకు డిక భరించలేక గోపాలయ్యకేసి చురచుర చూసి ఎడ తెగని ప్రశ్నల జడివాన కురిపించాడు :

"ఏమిరా, గోపాలయ్యా ! రాత్రి మీా రిద్దరు ఎక్కడికి వెళ్ళారు ? భళ్ళుమని తెల్లారేదాకా ఏమి చేస్తున్నారు ? వీడికి ఈ గట్టి దెబ్బలన్నీ ఎక్కడ తగిలాయి ? ఎవరు కొట్టారు ? ఎందుకు కొట్టారు ? అయ్యయ్యో ! ఒళ్ళంతా హూనమయి పోయినట్టుందే ! మాట్లాడవేమిరా ?"

అవి అన్నీ సాము గరడీల సాధనలో తగిలిన గాయాలని చెప్పి నెచ్చెలిని ఆ చిక్కులోనించి తప్పించవచ్చునని మొట్ట మొదట ఆలోచించాడు గోపాలయ్య. అయితే ఆ సాధన ఎంతగా మితిమీరినా ముఖంమీాదద, కణతలుమీా, మెడ మీాద, అంతటి గట్టి గాయాలు తగలవు. అదీ గాక రంగనాయకుని కేసి చూసినవారు అతడేదో పెద్ద కొట్లాటలో ఇరుక్కుని ఉండవచ్చునని ఇట్టే కనిపెట్టివేయగలరని అనుమా నించాడు. కనక వట్టి అబద్ధాలాడడంవల్ల లాభంలేదని గ్రహించు కొన్నాడు. అందుచేత వాస్తవస్థితి బయటపెట్టక, అసత్యంతో బాగా మేళవించిన నిజం కొంచెం వెల్లడించాడు :

"అంతగా విడ్డూరమేమి జరగలేదు, మామా ! సాము గరిడీ అయిన తరవాత నిన్న సాయంకాలం మే మిద్దరము స్వామి

దర్శనం చేసుకొని, చాలాసేపు చల్లగాలిలో గోపురంమీద కూర్చున్నాము. ఆ తరవాత ఇద్దరం కలిసి తిరిగి వస్తూంటే, తప్ప తాగిన వాడెవడో అకస్మాత్తుగా బాణాకర్రతో మామీద విరుచుకుపడ్డాడు. వాడెవడో గాని పోతపోసిన ఉక్కు స్తంభంలా ఉన్నాడు! ఎంతసేపు పెనుగులాడినా వాడిదే పై చెయ్యి అయింది! ఇక లాభంలేదని పొలాలమ్మట పరుగు మొదలు పెట్టాము. అయినా చాలా సేపటిదాకా వాడు మమ్మల్ని వెంటాడించడం మానలేదు. చిట్టచివరికి ఎలాగో అలాగ తప్పించుకొని తెల్లతెల్లవారేవేళ ఇంటికి జేరుకున్నాము. పొద్దున్నే లేచి ఎవరి మొహం చూశామో గాని చావు తప్పి కన్ను లొట్టపోయినంతపని అయింది."

"అయితే నీ ఒంటిమీద ఒక్క దెబ్బకూడా పడలే దెందు చేత?"

ఆ ప్రశ్నతో గోపాలయ్య బాగా ఇరుకులో పడ్డాడు. కాని కొంచెం మెళకువతో తప్పించుకొన్నాడు:

"వస్తూనే వాడు రంగన్నమీద విరుచుకుపడ్డాడు మామా! కనకనే ముందుగా మీవాడికి గట్టి దెబ్బలు తగి లాయి. నేను పక్కపక్కనే నిలబడి తప్పించుకుంటూ ఎదురు దెబ్బలు తీశాను. ఇందుచేత నాకేమీ గాయాలు తగల లేదు."

వెంకటనాయకుడు క్షణకాలం గోపాలయ్య వైపు తీవ్రంగా చూసి తల పంకించాడు. జరిగిన కథ బయటపెట్ట కుండా అతడేదో కట్టుకథ అల్లుతున్నాడని గ్రహించడాని కతని కెంతోసేపు పట్టలేదు. రంగనాయకుని దుందుడుకు చేష్టల సంగతి

తలవరి అంతకుమునుపే వెంకటనాయకుని చెవిలో వేశాడు. అంతలోనే ఇంత గొడవ జరిగింది! అందుచేత ఈ రభసలో ఏదో అంతరార్థం ఉండితీరాలని అత డూహించుకొన్నాడు. అట్టుడికినట్టుడికిపోతూ మళ్ళీ గద్దించాడు :

"ఒరేయ్ గోపాలయ్యా! కల్లబొల్లి మాటలు చెప్పి నమ్మించడానికి నేనేమన్నా పాలు తాగుతున్న పసివాణ్ణను కొన్నావా? ఆ మాత్రం గ్రహించుకోలే ననుకొన్నావా? మీ రిద్దరు కలిసి శృంగారమంజరి భవంతిలో జొరబడి చేసిన అల్లరి నాకు తెలియలేదను కొన్నావా? ఊరికే ఉత్త పుణ్యానికని దారమ్మట పోయేవా డెవడో మీమీద పడి ఎందుకు కొడతాడు? అసలు వా డెవడు? అర్ధరాత్రివేళ అంత రభస ఎందుకు జరిగింది? ఇప్పుడయినా మించిపోయిన దేమి లేదు! ఉన్నది ఉన్నట్టు చెప్పు! నీకేమి భయంలేదు! నే నున్నానుగా! మాట్లాడవేం!"

"నిజమే మామా! ఇంతకంటె మేము ఏ పాపము ఎర గము! ఎవరో మామీద అసూయకొద్ది లేనిపోని అపనింద కల్పించి వుంటారు! నమ్ము! నమ్మకపో! తప్పతాగిన తుంటరి ఎవడో మా మీద విరుచుపడితే ఎలాగో అలాగ తల వంచు కుని ప్రాణాలతో బయటపడ్డాము ఇంతకన్న మావల్ల జరిగిన అపరాధ మేది లేదు!"

ఆ సమాధానం వినీ వినగానే వెంకటనాయకుడు మరింతగా మండిపడ్డాడు :

"చాల్చాల్లే నేర్చావు! నువ్వు చెప్పకపోతే ఈ వేళ కాకపోతే రేపటికయినా నా కిది తెలియదనుకొన్నావా?

అసలు సీమూలానే మావా డిలాగ పాడయిపోతున్నాడు! మీ వాళ్ళతో చెప్పి నీ సంగతి నేను కనుక్కుంటాగా!...పొలం లేదు! పుట్రలేదు. పనిలేదు! పాటలేదు! పొద్దస్తమానము అచ్చు పోసిన ఆంబోతుల్లా తిరగడమేనా మీరు చేసేపని ! ఇన్ని ఏళ్ళు వచ్చినా కాస్త మంచి చెడ్డ తెలియకపోతే ఇంకెప్పుడు వస్తుం దిరా బుద్ధి ! మాట్లాడవేం !"

అలాగ దులిపివేసి గట్టిగా చీవాట్లు పెట్టిన తరవాత గోపాలయ్య మరి వంచిన తల పైకెత్తలేదు ! అన్యాయంగా తనమీద కూడా లేనిపోని నింద వేస్తున్నాడని అతని కెంత యినా రోషం వచ్చింది ! కాని గత్యంతరం లేక ఒకటి రెండు నిమిషాలపాటు అలాగే నిలబడి రవంత గాద్గదికతో రుసరుస లాడుతూ గిరుక్కున వెనక్కి తిరిగి ఒక్క అంగలో వీధిలో పడ్డాడు ! మొట్టమొదటినించి ఆ రభస అంతా విన్న లక్ష్మీ దేవమ్మ ఇక భరించలేక తన పని మధ్యలోనే తొందర తొంద రగా అక్కడికి వచ్చి భర్తకేసి తిరిగి రుసరుస లాడింది :

"శుభమల్లే తెల్లవారగానే ఇదేమిటండి! ఈ గోల! ఆ గోపాలయ్యని పట్టుకుని అలాగ దులిపేస్తున్నా రేమిటి? పరాయి పిల్లవాణ్ణి పట్టుకుని అంతంత లేసి మాటలంటే బాగుం టుందా ? ఇంతకీ పాపం వాడేం జేశాడు ?"

"ఏం జేశాడా ? అదిగో, ఆ గదిలోకి వెళ్ళి నీ కొడుకు ఒళ్ళు ఎలాగ హూనమయిపోయిందో చూడు ! నిన్న రాత్రి తప్ప తాగినవా డెవడో పిణ్ణి వాణ్ణి చావగొట్టి చెవులు మూశా డట ! ఇంతకి ఇదంతా ఎందుకు జరిగిందో చెప్పమంటే వీడు

గాని, వాడుగాని అసలు సంగతి బయటపెట్టరే ! బెల్లంకొట్టిన రాళ్ళలాగ మాట్లాడకూరుకుంటారే! ఇక నేనేమి చేసేది ?"

వెనువెంటనే లక్ష్మీదేవమ్మ ఆ పక్కగదిలోకి వెళ్ళి కొడుకు ఒంటిమీద దుప్పటి తొలగించి చూసి నిలువునా దిగాలుపడి నేలమీద చదికిలబడి బుడి బుడి దీర్ఘాలు మొదలు పెట్టింది :

"అయ్యో ! ఇదేమిటి నాయనా ! వీపుమీద ఈ దద్దురు! ఒళ్ళంతా ఇలాగ వాచిపోయిందేమిటి ?... బాగా జ్వరం కూడా తగిలినట్టుందే !...ఎంతసేపు ఒళ్ళెరుగని వీరావేశమేగాని కాస్త కట్టుకట్టి కాపటం పెట్టాలని కూడా తోచలేదేమండీ ! మీకు ! ఎన్నేళ్ళు పైబడినా ఏమిటి ప్రయోజనం ! కాస్త ఇంగితజ్ఞానం లేకపోయాక !...అయ్యో ! రాత ! ఇంతకి ఒకరిని అనవలసిన పని ఏమి ఉంది ? చేజేతులా చేసుకున్న కర్మ అంతా అనుభవించక తప్పతుందా !"

వెంకటనాయకుడిక ఆ అధిక్షేపణ వినలేక, ధుమధుమలాడుతు పెరటిలోకి వెళ్ళిపోయి, హఠాత్తుగా పలుకుతాడు తెంచుకుని పాలు కుడుచుకుంటున్న కోడెదూడ మీద తన అక్కస్సంతా వెళ్ళగక్కుకున్నాడు ! ఆ పైన లక్ష్మీదేవమ్మ కొడుకు గాయాల కన్నిటికి జాగ్రత్తగా కట్టుకట్టి, వేణ్ణీళ్ళతో ఒంటికి కాపటంపెట్టి పెరటిలో ఉన్న పెనిమిటి దగ్గరికి వెళ్ళి నెమ్మదిగా ప్రాధేయపడింది.

"ఏమండీ ! మాట్లాడరేం ! అబ్బాయి ఒళ్ళు పేలిపోతూందండీ ! కాస్త కుమ్మరి గురవయ్యనొకసారి పిలుచుకురండీ !"

అయినా వెంకటనాయకుని దుర్వాగ్రహ ధోరణి తగ్గ లేదు :

"మరేం భయంలేదు! దానంతట అదే తగ్గిపోతుంది. నా కిప్పుడు బొత్తిగా           పొలం వెళ్ళి పని చూసు కోవాలి !"

లక్ష్మీదేవమ్మ తెల్లబోయింది. "ఎందుకండీ మీకంత కోపం ! వాడేమి చేశాడని ! చిన్నతనంలో మీరు మాత్రం దుందుడుకు చేష్టలు చెయ్యలేదా ఏమిటి ? మాట్లాడ రేం ? పోనీలెండి ! మీరు వెళ్ళకపోతే నేనే వెళ్ళి పిలుచుకువస్తాను." ఆ తిరస్కార ధోరణితో వెంకటనాయకుడు భగ్గుమని మండి పడ్డాడు :

"గుమ్మందాటి వీధిలో అడుగుపెట్టిచూడు ! నిన్నేం జేస్తానో !"

"ఏమిటి చేస్తారు ! మనమేమన్నా మహారాజులమా ! అంతఃపుర మర్యాదలతో అగ్గగలాడిపోవడానికి ? మింగ మెతుకు లేదు ! మీసాలకు సంపెంగ నూనె ! అన్నట్టుంది మన పని !"

ఆ సమాధానం సూటిగా వెళ్ళి వెంకటనాయకుని నిండు గుండెలో నిశితశూలంగా నాటుకొన్నది. అతని ముత్తాత కాంచీ రాజ్యాని కొక చిన్న సామంత ప్రభువు ! ఇప్పుడా సిరిసంపద లేవీ లేకపోయినా, అత డటువంటి మర్యాదతోనే ఈనాటివరకు తన సంసారయాత్ర కొనసాగించుకొంటున్నాడు. ఎక్కడో మారు మూల వీధిలో ఉన్న కుమ్మరి గురవయ్య ఇంటికి బయలుదేరు తున్నానని భార్య అనగానే అతని రాజసాని కొక గట్టి దెబ్బ

తగ్గిలింది. తమ ప్రస్తుత సాధారణ పరిస్థితి జ్ఞప్తికి రాగానే లోలోపలి అహంకారం కోడెత్రాచులా బుసకొట్టి కస్సుమని చెల రేగింది:

"సరే! వెళ్ళు! కాని గుమ్మందాటి వీధిలోకి వెళ్ళావంటే మళ్ళీ నిన్ని ఇంటిలో అడుగుపెట్ట నివ్వను! తెలిసిందా?"

"పోనీ! నాకేమన్నా అంత గతి కడుక్కు-పోయిందనుకున్నారా! తిన్నగా మావాళ్ళ ఇంటికి వెళ్ళిపోతాను. వాళ్ళు నా కింత ముద్ద పడవెయ్యకపోరు లెండి!"

"వెళ్ళు ఇప్పుడే వెళ్ళిపో! నీతో బాటు నీ కొడుకుని కూడా తీసుకుపో! వీడిమూలాన్ని నేనీ మధ్య నలుగురిలోను తల ఎత్తుకుని తిరగలేకుండా ఉన్నాను! తెలిసిందా? ఎందుకెందుకని ఇన్నాళ్ళనించి ఓపికపట్టి మాట్లాడ కూరుకున్నాను. ఇహ నేను వాడి మొహం చూడదలుచుకోలేదు! నాకు కోపమే రాదు గాని, వస్తే అంతే! నువ్వూ వాడు కలిసి కట్టకట్టుకుని కావేరిలో దూకండి! ఏం నన్నేమన్నా బెదిరిద్దా మనుకుంటున్నావా?"

దుస్సహ క్రోధావేశంతో వెంకటనాయకుడు గజగజ వణికిపోయాడు.

పెనిమిటి ఆ విధంగా నోటికి వచ్చినట్టు గట్టిగా దులిపి వేసేసరికి లక్ష్మీదేవమ్మ మారు మాటాడలేక గుడ్ల నీరు కుక్కుకుని, బుడి బుడి దీర్ఘాలతో పెద్ద రాగాలు మొదలుపెట్టింది. ఆ దుఃఖావేశంలో పడి ఆమె మరి కుమ్మరి గురవయ్యమాటే తలపెట్టలేదు!

రంగనాయకునికి తల్లిదండ్రుల మధ్య నడిచిన రభస అంతా విస్పష్టంగా వినిపించింది. క్రమక్రమంగా గాయాలబాధ ఇనుమడిస్తున్న ట్టనిపించింది. తన యావచ్ఛక్తి వినియోగించి, ఊపిరి బిగబట్టి అతడా యమయాతన అంతా లోలోపలే నిగ్రహించుకొన్నాడు. అంతేగాని ఒక్క చిన్న మూలగయినా పైకి వెలువడనీయలేదు.

# 10

తిరుమలరెడ్డి పంపించిన ముత్యాలు ఎన్నిసారులు ప్రయత్నించినా ఏకాంతంలో హేమసుందరి సందర్శనం సాధ్యపడ లేదు. అయితే ఒకనాటి దీపదీపాలవేళ శృంగార మంజరి భవంతిలో ఎవ్వరులేని సమయం కనిపెట్టి హేమసుందరి దగ్గిరికి వెళ్ళింది. మొట్టమొదట లోకాభిరామాయణం మొదలుపెట్టి చల్లచల్లగా తన వ్యవహారం బయటపెట్టింది. రత్నాంగుళీయకం చిటికెనవేలి కలంకరించబోయింది. కాని హేమసుందరి దాని కంగీకరించలేదు. "పోనీ ఒక్కసారి వేలికి పెట్టి చూడనీ! సరి పోతుందో లేదో చూస్తాను." అని మళ్లీ బలవంతం చేసింది. అక్క మాణిక్యవల్లికి తెలిస్తే ఇక తన ఆభోరు దక్కదని చెప్పి తప్పించుకుని కొంచెం దూరంగా జరిగింది హేమసుందరి. అయినా ముత్యాలు విడిచిపెట్టక ఆమె చెయ్యి దొరకబుచ్చుకొని "ఆ జాగ్రత్త నేను పడతానుగా! లోకుల కళ్లు గప్పి రెండో కంటివాడి కెవడికి తెలియకుండా నిన్నక్కడికి తీసుకు వెళ్ళే పూచీ నాది! అంతేగాని పదిమంది కళ్లెదట బాహాటంగా

మేనాలో కూర్చోబెట్టి తీసుకు వెడతా ననుకున్నావా ఏమిటి? నే నంతటి తెలివితక్కువదాన్ని కాదులే!" అని గట్టిగా భరవసా ఇచ్చింది. అయినా హేమసుందరి అంగీకరించలేదు. ఆపైన వద్దు వద్దంటున్నా లక్ష్యపెట్టక ముత్యాలు బలవంతంగా ఆ ఉంగరం హేమసుందరి చిటికెనవేలి కలంకరించింది. పైగా తిరుమలరెడ్డి మరికొన్ని రత్నాభరణాలు బహూకరించగలడని ఆశపెట్టి ప్రోత్సహించింది.

అంతలోనే ఆమె ఆ ఉంగరం తీసి తిరిగి ముత్యాలు చేతి కందీయబోయింది. "ఇది నీ వేలి కెంతో చక్కగా అమరింది! వద్దు! వద్దు! ఉండనీ!" అని బలవంతంచేసి, పిడికిలి అదిమిపట్టి ఒక్క అంగలో ఆమె అక్కడినించి వెళ్ళిపోయింది! అది తన దగ్గిర ఉంచుకోవడం హేమసుందరి కేమాత్రము రుచించలేదు! అయినా ఆమె మాట లక్ష్యపెట్టక ముత్యాలు తుర్రుమని వీధిలోకి వెళ్ళిపోయింది. "ఇక ఆ ఉంగరం ఏమిచెయ్యాలి! అని హేమసుందరి రవంత సేపాలోచించింది. నాంచారమ్మ ద్వారా అది తిరిగి ముత్యాలు దగ్గిరికి పంపించి వెయ్యాలని నిశ్చయించింది. కాని అంతలోనే ఒక చక్కని ఉపాయం స్ఫురించింది!

మరు క్షణంలోనే తల్లితో కలిసి గోపాలస్వామి దేవాలయానికి వెళ్ళిన మాణిక్యవల్లి తిరిగి వచ్చిందేమో అని ఆమె గదిలోకి వెళ్ళి చూసింది. అప్పటి కింకా ఆమె తిరిగి రాలేదు. అలాగే మరికొంతసేపు నిరీక్షించి కొంచెం గొంతెత్తి "నాంచారూ!" అని పిలిచింది. ఇంటిలో ఎక్కడో పనిచేసుకుంటున్న ఆ దాసి అది విని అక్కడికి వచ్చింది.

"పిలిచారా! అమ్మా!

"మా అమ్మా, అక్కయ్య ఇంకా తిరిగి రాలే దేమే!"

"వచ్చే వేళయిందమ్మా!"

"అవును గాని, ఆయన కెలాగుందో కనుక్కున్నావా?"

"కనుక్కున్నానమ్మా! కొంచెం లేచి అటు ఇటు తిరుగు తున్నారట!"

హేమసుందరి మరికొంత సేపటివరకు అలాగే ఆమె వైపు చూసి తన మనోవేదన వెళ్ళబోసుకొన్నది.

"నాంచారూ! ఆయన ఈ మధ్యన మన భవంతి వైపే రావడం మానుకున్నారేమే! నా మీదగాని దయతప్పలేదు గదా!"

"అదేమిటమ్మా! అలాగంటారు! ఇప్పుడిప్పుడే గదా, కొంచెం లేచి అటు ఇటు తిరుగుతున్నారు! అప్పుడే ఇటువైపు రాగలరా? అదీగాక ఆయన తండ్రిచాటు బిడ్డ! తిరుమలరెడ్డి గారు వచ్చినట్టు బరితెగించి రాగలరా?"

"ఎల్లాగయినా ఒక్కసారి ఆయనతో మాట్లాడాలని ఉందే!"

హేమసుందరి కంఠంలో గద్గదిక తొణికిసలాడింది. నేత్రాలంతా వేడివేడి కన్నీటి బిందువులు రెండు చిన్న మంచి ముత్యాలై తరళించాయి. ఆ ధోరణి గమనించి నాంచారమ్మ నెమ్మదిగా ఓదార్చింది:

"మీకింతటి బెంబే లెందుకమ్మా! మళ్ళీ శుక్రవారంనాడు మీ అమ్మగారు, అక్కయ్యగారు స్వామి దర్శనానికి వెడు తున్నారుగదా! ఇప్పటినించి ఆలోచిస్తే అప్పటి కేదయినా

ఉపాయం తోచకపోతుందా ? అన్నట్టు ఆవేళ స్వామి పవళింపు సేవ కాదూ ? అందుచేత—"

నాంచారమ్మ ఇంకా ఏమేమో చెప్పబోయింది. అంత లోని భవంతి వీధి గుమ్మంలో అడుగుల సవ్వడి వినబడింది. ఆమె ఉలికిపడి అటువైపు చూసింది. శృంగారమంజరి, మాణిక్య వల్లి అల్లంతదూరంలో కనిపించారు. వెనువెంటనే ఆమె అక్కడినించి వెళ్ళిపోయింది. అక్క లోపలికి వచ్చి తన గదిలో ప్రవేశించగానే హేమసుందరి నెమ్మదిగా ఆమె ననుసరిం చింది.

మాణిక్యవల్లి చెల్లెలి ముఖవైఖరి పరిశీలించి "ఇదే మిటే ఇలాగున్నా వీవేళ ?" అని విస్తుపోయి నిలుచున్నది. "ఏమిలేదు !" అని హేమ ఒక చిరునవ్వు చిందించి గదిలోపలికి వెళ్ళి తలుపు గొళ్లెం పెట్టింది. మాణిక్యవల్లి మరింతగా కంగారు పడి నెమ్మదిగా నిమ్మకి నీరెత్తినట్టు అడిగింది :

"ఏమిటి విశేషం హేమా ? తలుపు లెందుకు బిగిం చావు ?"

"ఈవేళ నామీద బాగా పెద్ద బెడదే విరుచుకుపడింది." ఉసూరుమని నిట్టూర్చింది హేమసుందరి.

"ఏమిటది ?" తీవ్రంగా బొమ ముడి విరిచింది మాణిక్య వల్లి.

"ఇదిగో ! నీకే తెలుస్తుందిలే ! చూడు" వేలినున్న ఉంగరం తీసి అక్క చేతిలో ఉంచింది. మాణిక్యవల్లి దాని రత్నాలకేసి బాగా పరిశీలనగా చూసి ఆశ్చర్యపడి అడి గింది.

"ఇది ఎక్కడినించి వచ్చింది ?"

"తిరుమలరెడ్డి ముత్యాలు ద్వారా పంపించారు."

అది విని మరింతగా ఆశ్చర్యపడి ఎంతో సంతోషించింది మాణిక్యవల్లి.

"ఓహో ! అలాగా ! ఆయన నా బహుమానం మాటే మరిచిపోయా రనుకున్నాను ! తిరిగి ఇంకొకసారి జ్ఞాపకం చెయ్యా లనుకున్నాను గాని కొంచెం బెట్టుసరి చెయ్యాలని మాట్లాడ కూరుకున్నాను : అయితే ఏదో పెద్ద బెడద విరుచుకు పడిందంటా వేమిటి ?"

ఆ ఉంగరం తన వేలికి పెట్టుకోన్నది మాణిక్యవల్లి. అంతలోనే హేమసుందరి అసలు రహస్యం బయటపెట్టింది :

"ఇది నీకోసం కాదక్కా !"

"మరి ఎవరికోసం ? నీకోసమా ?"

"అవును నాకోసమే పంపించారు."

ఆ సమాధానం వినీ వినగానే మాణిక్యవల్లి నిశ్చల శిలా ప్రతిలా నిర్ఘాంతపడింది ! అంతలోనే హేమసుందరి ముత్యాలు చెప్పిన మాటలన్నీ పూస గ్రుచ్చినట్టు అక్క చెవిలో ఏకరువు పెట్టింది. అంతే ! ఇక మాణిక్యవల్లి ముఖంమీద కత్తి వాటు వేసినా నెత్తురుచుక్క లేదు. మరి కొంత సేపటివరకు ఆమె అలాగే నిలబడి ఉసూరుమని నిట్టూర్చి బాగా దిగాలుపడి పక్కనే ఉన్న పందిరి పట్టి మంచంమీద కూలబడింది. "అయ్యో! నమ్మించి నమ్మించి చిట్టచివరి కెంత ద్రోహం తలపెట్టారే !" అని సన్నని వెక్కిళ్ళు బుడి దీర్ఘాలు ప్రారంభించింది. హేమసుందరి

ఆమె సరసనే కూర్చుని ఎంతో ఆత్మీయతతో బ్రతిమాలు కొన్నది:

"నమ్మ! నమ్మకపో. ఎంత ఒట్టు పెడితే అంత ఒట్టు! ఇందులో నేను ఏ పాపము ఎరగనక్కా!" "అవును తల్లీ! నిజమే! నిన్నుకాదు! నే నన్నది! ఆయన తలపెట్టిన ద్రోహం మాటే ఆలోచిస్తున్నాను."

మరి కొంత సేపటివరకు అక్కా చెల్లెల్లిద్దరు ఆ వ్యవహారాన్ని గురించి అనేక విధాల మథనపడ్డారు. రెడ్డి సంగతి తెలుసుకుని హేమసుందరి అంతగా ఆందోళన పడలేదు. కాని మాణిక్యవల్లి కది అంతా ఒక పెద్ద పాడు పీడకలలా కన బడింది. ఈ సంఘటనతో రెడ్డి ఆంతర్యం ఆమె కామూలా గ్రంగా అవగత మయింది. లోలోపల ఎడతెగని గుంజాటన ప్రారంభమయింది.

పైపైకి ఏదో అభినయిస్తున్నాడన్నమాటే గాని రెడ్డి మనస్సు పూర్తిగా హేమసుందరి వైపు తిరిగింది! ఇక సందేహం లేదు. మరి కొన్నాళ్లు గడిచిన తరవాత ఆయన ఇక తనమాటే తలపెట్టక పోవచ్చును! చెల్లెలి కీనాడు రంగనాయకుని మీద వల్లమాలిన మమకారమే ఏర్పడి ఉండవచ్చును. కాని అతిగా డింకా తండ్రిచాటు బిడ్డ. కనక ఏదయినా గట్టి అవాంతరం వస్తే హేమసుందరి మాటే తలపెట్టక మాట్లాడ కూరుకో వచ్చును. ఆమె ఆపైన ఎంతకాలమని అతనికోసం కనిపెట్టుకుని కూర్చుంటుంది? కనక ఈ వేళ కాకపోతే రేపయినా హేమ సుందరి మనస్సు మారవచ్చును. అది కనిపెట్టి రెడ్డి క్రమ క్రమంగా చెల్లెలిని లోబరుచుకోవచ్చును. అప్పుడు తన గతి

ఏం కావాలి? అయితే హేమసుందరీ రంగనాయకు లిద్దరు ఏకీభవించి ఒక తాటిమీద నిలబడ గలిగితే తన ప్రస్తుత ప్రమాదం తప్పిపోవచ్చును. కాని లోకంలో వ్యవహారాన్ని సరిగా తా ననుకొన్నట్టే జరగగలవన్న నమ్మక మేమిటి?

ఏది ఏమయినా హేమసుందరి తమఇంట కంటబడినంత కాలము రెడ్డి ఇంకొకరి మాటే తలపెట్టడు! దీని కేమిటి దారి? చెల్లెలిని చల్లచల్లగా ఇంకొకచోటి కెక్కడికయినా సాగనంపి వేస్తే? అయితే అది రంగనాయకుని అనురాగంమీద ఆధారపడిన విషయం! అతగాడు గాని గట్టిగా తలుచుకుంటే హేమసుందరి నింకొకచోటి కెక్కడికయినా వెంటబెట్టుకొని పోగలడు! కాని రంగనాయకు డంతటి దుస్సాహసాని కొడిగట్టగలడా? కలలో మాట! లేనిపోని పేరాసతో ఉబలాట పడడమే గాని అది ఎన్నటికి జరగనేరదు! ఒకవేళ తెగించి దాని కతడు సిద్ధపడినా చెల్లెలిక ముందు వెనుక లాలోచించక అతని వెంటబడి పోగలదా? అదీ సందేహామే! కాని ఇప్పటి ధోరణిని పట్టి చూస్తే రంగనాయకునికోసం కళ్ళు మూసుకుని కావేరి సుడిగుండంలో దూకడానికయినా వెనుదీయనట్టే కనిపిస్తున్నది! కాని రంగనాయకు డిటీవల గోపురంమీదికి వస్తున్నట్టే కనబడడం లేదే! అత డెందుచేత రావడంలేదో! ఇంటిదగ్గిర ఏదయినా పెద్ద గొడవ జరిగిందేమో! అందుచేత అతడిక హేమసుందరిమాటే తలపెట్టడం మానుకొన్నాడేమో! ఆ విధంగా ప్రాణాపాయాని కయినా వెనుదీయక అర్ధరాత్రివేళ చెల్లెలికోసం వచ్చిన వ్యక్తి ఆమె నంతలోనే మరిచిపోగలడా? మాణిక్యవల్లి మనస్సులో ఆలోచన లావిధంగా మెరుపుల్లా సాగిపోయాయి.

అంతలోనే హేమసుందరి కొత్త కొత్త ఉపాయం స్ఫురించింది.

"అవునుగాని, అక్కా — ఈ ఉంగరం సంగతి అమ్మతో చెబితే."

మాణిక్యవల్లి ఉసూరుమని నిట్టూర్చింది. "అయ్యో! వెర్రిదానా! అంతమాత్రంచేత అమ్మ రెడ్డి కడ్డుపడగలదనుకొన్నావా? మొట్టమొదట చూచీ చూడనట్టు మాట్లాడకూరుకుంటుంది. ఆపైన ఒడినిండా పైకం గుమ్మరిస్తే మరి ఆయన్ని మించిన మహారాజు ఇంకెవడు దొరకడనుకుని ఎగిరి గంతేస్తుంది! రెడ్డి ఆడిన ఆటలన్నింటికి పక్కతాళం వేస్తుంది. చిట్టచివరికి జరిగేదింతే!"

ఆ సమాధానంతో హేమసుందరి దిగాలుపడి చెక్కిలిపై చేయి చేర్చి దీర్ఘాలోచనలో పడింది. అంతేగాని మరి మాణిక్యవల్లితో మాట్లాడలేదు! ఆ నైరాశ్య ధోరణి గమనించి అక్క ఒక్క నిట్టూర్పు విడిచిపెట్టింది:

పోనీలే! హేమా! దీనికింత మధన ఎందుకు? ఏది ఎలాగ జరగవలసివుంటే అలాగే జరుగుతుంది! మనమేమి చెయ్యగలం! ఇంతకి ఆయనకి నీమీద అంతటి వల్లమాలిన వ్యామోహం కలిగినప్పుడు ఎన్నెన్ని విధాల బాధపడినా ప్రయోజనం లేదు! అంతే! ఆ ఉంగరం నీ వేలినే ఉండనీ!"

మాణిక్యవల్లి తిరిగి ఆ ఉంగరం హేమసుందరి కందీయబోయింది. కాని ఆమె దూరదూరంగా వెళ్ళి ధుమధుమలాడింది: చాల్చాల్లే! నే నిది వేలికి పెట్టుకుని తగుదునమ్మా అని రెడ్డి కంట పడతా ననుకున్నావా? ఏది ఏమైనా సరే, అది

ఎన్నటికీ జరగదు! నువ్వుగాని బలవంతంగా నా వేలికి పెట్టా వంటే, దాని వజ్రపుపొడి నోటిలో వేసుకొని ప్రాణం విడిచి నేలమీద కూలిపోతాను! తెలిసిందా! దానితో నాకీ శని పీడ అంతా విరగడై పోతుంది! అంతే!

మాణిక్యవల్లి సరీగా అటువంటి సమాధానం కోసమే ఎదురుచూసింది. చెల్లెలి నెంతో అప్యాయంగా కౌగలించుకుని చెవిలో ఊదింది:

"శుభమల్లే ఎందు కలాంటి మాట లంటావు! నీ కిష్టం లేకపోతే నేను మాత్రం బలవంతం చేస్తానా? సరేగాని ఆ రంగ నాయకుడి సంగతి ఏమయినా తెలిసిందా?"

"ఏమి తెలియదే దక్కా!"

ఒకసారి ఎక్కడయినా అతి రహస్యంగా కలుసుకుని ఈ గొడవలన్నీ ఆయన చెవిని వేస్తే?"

"నేను అదే ఆలోచిస్తున్నాను. కాని ఎలాగ?" అమ్మకి గాని తెలిస్తే ఇక నన్ను బతకనిస్తుందా?"

మాణిక్యవల్లి మరికొంత సేపాలోచించి చల్ల చల్లగా నోదార్చింది:

"నీ కేమి భయం లేదు! నే నున్నానుగా! ఒకసారి నాంచారమ్మతో చెబితే సరి! ఇక రెండో కంటివాడి కెవడికి తెలియకుండా జాగ్రత్తగా ఈ కబురందిస్తుంది. ఆ పైన నీ అదృష్టం పండి, ఆయన ఇష్టపడితే, ఇద్దరు కలిసి మాట్లాడు కోవడానికిక దారే దొరకదా?"

ఆ ప్రసంగం విన్న తరవాత హేమసుందరి హృదయంలో అకస్మాత్తుగా ఒక ఆశాజ్యోతి ఆవిర్భవించి తళుక్కుమని మెరి సింది!

# 11

రంగనాయకుని ఆరోగ్యం క్రమక్రమంగా కుదుట బడింది. అతని ఒంటిమీది గాయాలన్నీ పూర్తిగా మాని పోయాయి. లక్ష్మిదేవమ్మ కుమారుని కనేక విధాల పరిచర్య చేసింది. అంతేగాని వెంకటనాయకు డిక కొడుకు గొడవే పట్టించుకోలేదు. అప్పుడప్పుడు పెద్దకుమారుల నడిగి కొంచెం చూచాయగా అతని సంగతి తెలుసుకొన్నాడు. ఎప్పుడు గది లోకి వెళ్ళి పలకరించలేదు. అన్న లిద్దరూ మాత్రం అతని నెంతో ఆప్యాయంగా ఆదరించారు. కాని దగ్గిర కొంచెం సేపుండడానికయినా వారికేమాత్రము తీరిక చిక్కలేదు ! ఇద్ద రికి పొద్దస్తమానము పొలం పనితోనే సరిపోయేది. భోజనాల వేళ మాత్రమే ఇంటికి తిరిగి వచ్చేవారు. అందుచేత కొంచెం లేచి అటు ఇటు తిరిగేదాకా రంగనాయకుని కేవిధంగాను కాలక్షేపం కాలేదు. వెంకటనాయకుడు పొలం వెళ్ళిన అదును కని పెట్టి, గోపాలయ్య ఒకటి రెండు సారులు చుట్టపు చూపుగా వచ్చి పలకరించి వెళ్ళిపోయాడు. అంతేగాని అట్టేసేపు కూర్చుని మాట్లాడలేదు.

నాలుగయిదు రోజులు గడిచిన తరువాత తండ్రి ధోరణి కొంతవరకయినా మారవచ్చునని రంగనాయకు డాశించాడు. కాని రవంతయినా మార్పు కనపడలేదు ! ఆపైన లక్ష్మిదేవమ్మ రెండు మూడుసార్లు చెప్పిచూసింది. అయినా ప్రయోజనం కలగ లేదు ! రంగనాయకుని కా పరిస్థితిలో ఏమి చెయ్యడానికి పాలు పోలేదు. క్రమక్రమంగా జీవితంమీదే విపరీతమైన విరక్తి కలి

గింది. తన దురదృష్టాల కన్నిటికి తిరుమలరెడ్డి ఒక్కడే ప్రధాన కారణమని నిశ్చయించుకొన్నాడు. అతడు చేయించిన దుష్కృత్యానికి ఎప్పటికయినా తగిన శాస్తిచేసి తీరాలని సంకల్పించుకొన్నాడు.

ఇటీవల అతనికి హేమసుందరిని గురించిన వర్తమానాలేవి తెలియలేదు, మరి భరించలేక ఒకనాటి సాయంకాలం స్వామి దర్శనంకోసం వెడుతున్నానని తల్లితో చెప్పి గోపాల దేవాలయంవైపు సాగిపోయాడు. తీర్థ ప్రసాదాలు తీసుకున్న తరవాత "ఒకసారి గోపురంమీదికి పోదామా" అన్న సంకల్పం కలిగింది. అయితే, తీరా గోపురంమీదికి వెళ్ళిన తరవాత హేమసుందరి కనబడకపోతే! మున్ముందుగా నాంచారమ్మ ద్వారా కబురు పంపించనప్పుడు ఆమె తప్పక మేడమీదికి వచ్చి నిలబడగలదన్న నమ్మకమేమిటి? ఇక ధనుర్బాణాలతో రాకపోవడంవల్ల ధ్వజస్తంభం గంటల గణగణల సంకేతానికిప్పుడవకాశమే లేదు! ఇక ఏమి చెయ్యాలి! అలాగ ఆలోచిస్తూ రంగనాయకుడు రెండు మూడు గడియలసేపు స్వామి పుష్కరిణి ఒడ్డున కూర్చున్నాడు.

అప్పటికి కొంచెం చీకటిపడింది. దేవాలయ గోపురాల దీపాల కాంతులు పైడిపూల తోరణాల వలె పుష్కరిణి తేట నీటిలో ప్రతిఫలించాయి. రంగనాయకుడు ఉసూరుమని నిట్టూర్చి తిరిగి త్వరగా ఇంటికి వెళ్ళిపోవాలని అనుకొన్నాడు. కొంచెం ఆలస్యమయితే మళ్లీ ఇంటిదగ్గర పెద్ద రభస బయలు దేరవచ్చును! లేచి తొందరగా నాలుగయిదు అడుగులు వేశాడు. మళ్ళీ వెనక్కి తిరిగి "పోనీ, ఒకసారి గోపురం మీదికి

వెళ్ళి చూస్తే; తలవని తలంపుగా హేమసుందరి కనబడు తుందేమో!" అనుకున్నాడు. కాని అంతలోనే కనుచూపు మేరలో నాంచారమ్మ కనిపించింది. తటాలున దగ్గిరికి వెళ్ళి పలకరించాడు. ఆమె ఎంతో ఆశ్చర్యపడి మీకోసమే వెతుకు తున్నాను బాబూ! ఇపుడిప్పుడే మీరు ఇంటిదగ్గిర బయలుదేరి ఇటువైపు వచ్చారని తెలిసింది" అన్నది.

"ఏమిటి విశేషాలు నాంచారమ్మా! ఇందాకటి నించి నిన్ను గురించే ఆలోచిస్తున్నాను. ఇంతలోనే నువ్వు కనిపించావు! ఈవేళ నేను నక్కని తొక్కి వచ్చినట్టున్నానే!" అన్నాడు రంగనాయకుడు. ఆమె మొట్టమొదట అతని ఆరోగ్యం సంగతి అడిగింది. తరవాత చల్లచల్లగా రెడ్డి ఉంగరం వ్యవహారం బయటపెట్టింది.

"ఆఁ ఆఁ నిజమేనా?" అన్నాడు రంగనాయకుడు నిశ్చల శిలా ప్రతిమలా నిర్ఘాంతపడి.

"నిజం కాకపోతే ఇంతదూరం పని కట్టుకొని వచ్చి మీకిది చెబుతానా?"

రంగనాయకుడది విని లోలోపల భగ్గుమని ప్రజ్వలించాడు! కాని బాగా తమాయించుకొని హేమసుందరి సంగతి అడిగాడు, ఆమె దిగాలుపడి ఉసూరుమన్నది:

"ఏం చెప్పను! బాబూ! ఆ అమ్మ ఆనాటి కానాటికి చిక్కి శల్యమయిపోతూంది. ఆపైన పులిమీద పుట్రలాగ ఈ ఉంగరం బెడద ఒకటి వచ్చిపడింది. ఒక్కసారి ఎక్కడయినా అతి రహస్యంగా కలుసుకుని మీతో మాట్లాడాలని వెంపర లాడుతూంది."

"నేను అదే అనుకుంటున్నాను. కాని ఎలాగ సాధ్యపడు తుంది ?"

"రేపు దీపదీపాల వేళ హేమ మా ఇంటికి వస్తుంది. ఇంటిదగ్గర ఏదో సాకు చెప్పి తిన్నగా మీ రక్కడికి రావచ్చును. ఏం మీ కిది వీలుపడుతుందా ?"

రంగనాయకుడు రవంత సేపాలోచించాడు :

"నా మాటకేంగాని, ఆమె మీ ఇంటికి బయలుదేరు తున్నదని శృంగారమంజరిగాని, మాణిక్యవల్లిగాని పసికడితే కొంప మునిగిపోదూ ?"

"దీనికి మీరేమి భయపడకండి! రేపు శుక్రవారం కాదూ! అమ్మవారి పూజకోసం వాళ్ళిద్దరు రేపు సాయంత్రం ఇక్కడికి వస్తున్నారు. ఆపైన పవళింపుసేవ పూర్తి అయ్యే వరకు మరి తిరిగిరారు గదా ! మీ కిద్దరికి ఇంతకంటె మంచి అవకాశం దొరకదు ! కనకనే పొద్దుటినుంచి మీకోసం కాలు కాలిన పిల్లిలా తిరుగుతున్నాను."

"వెదకబోయిన తీగ కాళ్ళ కడ్డుపడినట్టుందే ! సరే అలాగే వస్తాను !" అన్నాడు రంగనాయకుడు చెక్కిళ్ళపై వెల్లి విరిసిన సంతోష పారవశ్యంతో. అతని దగ్గిర సెలవు తీసుకొని నాంచారమ్మ శృంగారమంజరి భవంతివైపు వెళ్ళిపోయింది.

ఉంగరం సంగతి విన్నప్పటినించి తిరుమలరెడ్డి దురాలోచన రంగనాయకునికి అమూలాగ్రంగా అవగతమయింది. ఇక అతడెలాటి దుస్సాహసానికయినా వెనుదీయడని బాగా భయపడ్డాడు. అందుచేత ఏమాత్రం ఆలస్యంచేసినా వ్యవహారం చెయ్యిదాటి పోగలదనీ, వెనువెంటనే ప్రతీకారం చేసితీరాలని

నిశ్చయించుకొన్నాడు. అదే సమయంలో అతని తలపోత హేమసుందరివైపు తిరిగింది. ఆ తన్మయతతో మరి కొంతసేపటి వరకు రంగనాయకుని కిక బాహ్య ప్రపంచ విషయమే జ్ఞప్తికి రాలేదు! దేవాలయంలో అంతట మారుమోగిన మంత్ర ధ్వనులతో మేళవించిన గంటల గణగణలతోనే అప్పటి కొక జాముఠాత్రి గడిచినదన్న విషయం స్ఫురించింది! ఉలిక్కిపడి లేచి లోలోపల ఎంతో కంగారుపడుతూ తొందర తొందరగా ఇంటికి చేరుకొన్నాడు.

సరీగా అతడనుకొన్నట్టే జరిగింది! లోపల అడుగుపెట్టే సరికి తల్లిదండ్రు లిద్దరు తనకోసమే తగాదాపడుతున్నారు! రంగనాయకుడు ఇంతసేపటివరకు ఇంటి కెందుకు రాలేదని తండ్రి గుగ్గిలం చల్లిన అగ్గిలా మండిపడుతున్నాడు! ఆ దురాగ్రహావేశం చల్లార్చవలెనని తల్లి శాయశక్తులా ప్రయత్నిస్తున్నది. అయినా తండ్రి అనుక్షణము రెచ్చిపోతున్నాడు. అదే సమయంలో కుమారుడు ఇంటిలో అడుగుపెట్టిన విషయం లక్ష్మీదేవమ్మ కనిపెట్టింది. ఎంతగా ప్రాణం విసిగినా బాగా ఓరిమి వహించి కొంచెం ప్రశాంత స్వరంతో బ్రతిమాలుకొన్నది:

"ఇదిగో! ఎందు కలాగ గొంతు చించుకుంటారు! ఇంతలోనే వాడింటికి రానేవచ్చాడు! గుమ్మంలో అడుగుపెట్టే సరికి ఇలాగ కాళ్ళకింద నిప్పులుపోస్తే ఎలాగ? ఈ మధ్యనే కదా కాస్త వాడటు తిరుగుతున్నాడు? ఇలాగ దులిపివేస్తే బొత్తిగా బెంబేలుపడి ఇక ఇంటిముఖమే పట్టడం మానివేస్తే?

"పోతే పోనీ! ఇలాంటి అప్రయోజకుడు ఎక్కడి కయినా పోతే అంతటితో నా శని విరగడయిపోతుంది! అమ్మయ్యా! అనుకుని నలుగురిలోను తల ఎత్తుకుని తిరుగు తాను! మొట్ట మొదటినించి నీ మూలానే వా డిలాగ పాడయి పోయాడు! మరి మాటిమాటికి వెనక వేసుకువచ్చావంటే ఇక వాడికి పట్టపగ్గా లుంటాయా ?"

తప్పంతా తనమీాద నెట్టివేసేసరికి లక్ష్మీదేవమ్మ మరిం తగా రెచ్చిపోయింది! ఆపైన ఆ దంపతు లిద్దరికి మధ్య పెద్ద గొడవ చెల రేగింది! అయితే రంగనాయకుని అన్న లిద్దరు కలగ జేసుకోవడంతో ఆ కలహం తాత్కాలికంగా కొంతవరకు ఉపశమించింది. లక్ష్మీదేవమ్మ అక్కడనించి కదిలి చాటు మాటుగా వంట ఇంటిలో రంగనాయకుని కింత అన్నం వడ్డిం చింది. భోజన సమయంలో తొణికిసలాడుతున్న గద్గదికతో బ్రతిమాలుకొన్నది:

"నాయనా! పొద్ద స్తమానము అయినవాళ్ళతోను, కాని వాళ్ళతోను కలిసి తిరక్కపోతే, పొలంలోకి వెళ్ళి కా స్త పని, పాట చూసుకోరాదూ? పెంద్రాళ్ళే ఇంటికి వ స్తే నిన్ను ఎవ రేమంటారు? ఊరువాడ కలిసి ఏకమై అనేక విధాల ఆడి పోసుకుంటున్నా రే! ఎందుకు చెప్పు మన కింత రొష్టు?... కొంచెం నా మాట విను బాబూ!"

రంగనాయకుడు తల్లిమాటల కేవిధంగా ప్రతి సమా ధానం చెప్పలేదు! అంటీ అంటనట్టు రెండు మెతుకులు నోట పెట్టుకుని, ఆదరాబాదరాగా భోజనం ముగించుకొని పాన్పు మీాద మేనువాల్చి పవ్వళించి కళ్ళుమూసుకుని నిద్రపోవాలని

అనుకొన్నాడు. కాని ఎంతగా ప్రయత్నించినా కంటి కొక్క-కునుకయినా పట్టలేదు! కిటికీలోనించి నలువైపుల వ్యాపించిన విశాలాకాశం సాక్షాత్కరించింది! అప్పటి కింకా వెన్నెల పొడ కట్టలేదు! సన్నసన్నగా కీచురాళ్ళ ధ్వని వినిపించింది. ఆకాశంలో కృత్తిక అంగడిలో వేలాడగట్టిన ముత్యాల హారంలా తళతళలాడింది! దానివైపు చూడగానే రంగనాయకునికి హేమసుందరి మెడలో తరళిస్తున్న రవ్వలహారం జ్ఞప్తికి వచ్చింది. వెనువెంటనే విశాల నేత్రయుగళి నెమ్మది అద్దంలో నిశ్చలమై నిలిచింది! అంతే! ఆపైన ఎంతసేపటికి కనుదోయి ముకుళించలేదు! తెల్లతెల్లవారే వేళమాత్రం అతని కొక చిన్న కోడి కునుకుపట్టింది.

ఆ మరునాడు రంగనాయకుడు అనుక్షణము ఎడతెగని హేమసుందరి తలపోతలతో తన్మయుడయినాడు. పొద్దున్నే పెద్దకుమారు లిద్దరితోను కలిసి వెంకటనాయకుడు పొలంవైపు వెళ్ళిపోవడంవల్ల ఇక ఇంటిదగ్గర లక్ష్మీదేవమ్మ, రంగ నాయకుడు మాత్రమే మిగిలారు! ఆ అదును కనిపెట్టి ఆమె అతని కనేక విధాల హితవు వుపదేశించింది. పొలంలోకి వెళ్ళి అన్న లిద్దరితోను కలిసి పనిపాటలలో శ్రద్ధ జేసుకోవలసినదని అదే పనిగా చెవిలో ఇల్లు కట్టుకుని పోరింది. అయినా రంగనాయకుడు ఉలక లేదు, పలకలేదు! తలవంచుకొని ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. క్రమక్రమంగా ఆమె కంఠస్వరంతోపాటు పరుష ధోరణి బాగా హెచ్చింది. రంగనాయకు డిక భరించలేక ప్రాణం విసిగి "ఒంటిమీద తగిలిన దెబ్బల నెప్పి ఇంకా తగ్గ

లేదు! అక్కడికి వెడితే మాత్రం నేనేమి పనిచెయ్యగలను!" అని పెడముఖం పెట్టుకుని కూర్చున్నాడు.

లక్ష్మీదేవమ్మ మరి మాట్లాడలేదు. గిరుక్కున వెనక్కి తిరిగి పెరటిలోకి వెళ్ళి కొంచెం గొంతెత్తి అదేపనిగా రుస రుస లారంభించింది.

"ఇంతకీ నేనేమి చెయ్యను! ఎవరి కర్మ ఎలాగ రాసి పెట్టి ఉందో ఎవరు చెప్పగలరు! ఆయన ధోరణి చూస్తే, కస్సు బుస్సుమని కారాలు, మిరియాలు నూరుతున్నారు! దుస్సహవాసాలుచేసి పాడయిపోతున్నాడని మండిపడుతున్నారు. పోనీ అనుకుంటే వీడంతకన్నా బిర్ర బిగుసుకుని పోతున్నాడు! మనిషికి కాస్త ఇంగితజ్ఞానం లేకపోయాక ఎన్ని విధాల తల మొత్తుకుంటే మాత్రం ఏమిటి లాభం! పాతికేళ్ళు పైబడ్డ తరవాత ఇప్పటికయినా కాస్త మంచి, చెడ్డ తెలియకపోతే ఎలాగ? కొంచెం వెనక. ముందు ఆలోచించుకో నక్కర్లేదూ? ఇక ఎప్పటికి వస్తుంది బుద్ధి!"

తల్లి కూడా ఆ విధంగా తనమీద విరుచుకుపడ్డ తరువాత రంగనాయకుడు ఓక ఒక్క క్షణమయినా ఆ ఇంటిలో ఉండలేక అల్లల్లాడి పోయాడు. ఇక ముస్ముందు ఏది ఏమయినా సరే, అని గుండె రాయి చేసుకొన్నాడు. తొందరతొందరగా మధ్యాహ్నం భోజనం ముగించుకొని కొంచెంసేపు విశ్రమించి గోపాలస్వామి దేవాలయం గోపురంపై అంతస్తు మీదికి వెళ్ళి కూర్చున్నాడు. అప్పటి కాతనికి రవంత మనశ్శాంతి లభించింది. ఒకవేళ తలవని తలంపుగా హేమసుందరి సందర్శనం తటస్థపడగలదేమో అని మరి కొంతసేపు నిశ్చల దృష్టితో పరిశీ

లించాడు. కాని ఆమె కనబడలేదు! అయినా అతడు తన నిరీక్షణ విరమించలేదు!

అరగడియ గడిచిన తరువాత అతనికి నాంచారమ్మ ఇంటికి వెళ్ళవలసిన సమయం సమీపించినదన్న విషయం జ్ఞప్తికి వచ్చింది. ఉలిక్కిపడి లేచి ఊరవతల కొబ్బరి, పోకల తోటలలో చూచాయగా కనిపిస్తున్న ఆమె కుటీరంవైపు సాగిపోయాడు. ఒకేఒక అంగలో అక్కడికి వెళ్ళి వాలిపోవాలని అనుక్షణము అతని మనస్సెంతయినా తహతహలాడింది! కాని తన సంగతి ఎవరయినా కనిపెడుతున్నారేమో అన్న అనుమానం అడుగడుగునా వెంటాడించి పీడించింది. అందుచేత అనుకొన్నంత తొందరగా అతని నడక సాగలేదు.

నాంచారమ్మ కుటీరం ప్రాంగణంలో అడుగు పెట్టినంతలోనే ఆమె అతని కెదురుగా వచ్చి ఎంతో అప్యాయంగా పలకరించింది. అంతలోనే రంగనాయకుడడిగాడు :

"హేమసుందరి ఏది ? ఎక్కడ ఉంది ?"

"ఎందుచేతనో గాని ఇంతవరకు రానే లేదు. ఆమె కోసమే పడిగాపులుపడి కూర్చున్నాను. ఎందుచేత ఇంత ఆలస్యం అయిందో !"

ఆ సమాధానం విన్న పిమ్మట రంగనాయకుని కిక ఊపిరే ఆడలేదు. ఏదో పెద్ద అవాంతరంవల్లనే ఆమె అక్కడికి రాకపోయి ఉండవచ్చునని అనుమానించి బాగా దిగాలుపడ్డాడు. అంతలోనే నాంచారమ్మ పెదవి మీద చిరునవ్వు తరలించింది :

"ఉత్తది! ఊరికే అన్నాను! కంగారు పడకండి! హేమ

సుందరి వచ్చింది. అదిగో ఆ గదిలో తలుపు మూల నిలబడింది. మొట్టమొదట రాలేదని చెప్పమని పట్టుపట్టింది. అందుచేతే చిన్న అబద్ధం చెప్పాను! అంతే!"

రంగనాయకుడు అది కూడా ఇంకొక పరిహాసమేమో అనుకుని క్షణకాలం తటపటాయించాడు. అయితే మరు నిమేషంలోనే ఒక్క అంగలో ఆ గదిలో ప్రవేశించాడు. కాని హేమసుందరి అతని కెక్కడ కనబడలేదు. నలువైపుల పరిశీలించాడు. ఉసూరుమని ఒక వేడి నిట్టూర్పు విడిచిపెట్టాడు. అంతలోనే మంచంకింద దాక్కున్న ఆమె మెరుపులా ఇవతలికి వచ్చి అతని కట్టెదుట నిలబడింది! రంగనాయకు డొక క్షణకాలం తన కన్నులే నమ్మలేక, నిర్ఘాంతపడి ఆ సుందరిని తన బిగి కౌగలింతలో బంధించాడు. హేమ ఉక్కిరి బిక్కిరై "అదిగో! నాంచారమ్మ వస్తున్నది! అదిగో! అదిగో!" అని చూపుడు వేలెత్తి నిర్దేశించింది. రంగనాయకుడు తన గాఢాశ్లేషం సడలించి కొంచెం దూరంలో నిలుచున్నాడు. కాని నాంచారమ్మ అటువైపే రాలేదు. హేమసుందరి కలకల నవ్వు మాత్రమే ఆ గదిలో అంతట ప్రతిధ్వనించింది!

రంగనాయకు డంతలోనే తిరిగి హేమసుందరిని గాఢాలింగనంతో బంధించి వెడద కనుదోయి ముద్దుపెట్టుకొన్నాడు.

"హేమా! ఇక మనం ఒకక్షణమయినా నిచుళాపురంలో ఉండలేము! ఎక్కడికయినా వెళ్ళిపోదామా?"

హేమసుందరి ఉసూరుమని నిట్టూర్చింది:

"ఎక్కడికి వెళ్ళినా మా అమ్మ, రెడ్డి మనల నిద్దరిని సుఖంగా బ్రతకనిస్తారా ?"

"నీకా భయం అక్కరలేదు ! నేనున్నానుగా ?"

"అయితే ఇంతమంది కన్నుగప్పి ఇక్కడనించి వెళ్ళడ మెలాగ ?"

"నీ కెందు కా గొడవ ! నేను చూసుకుంటానుగా ! రెడ్డి నీకోసం వెంపరలాడుతున్నాడని కనిపెట్టింది కనుక మాణిక్య వల్లి మన కేదో విధంగా సాయంచేసి తీరుతుంది. లేకపోతే అధమపక్షం చూచీ చూడనట్టయినా మాట్లాడ కూరు కుంటుంది."

హేమసుందరి రవంత సేపాలోచించింది :

"ఆ మాట నిజమేగాని ఇంతకి ఎక్కడికి వెళ్ళాలో ఆలోచించారా ?"

"అదే ఆలోచిస్తున్నాను. నాలుగైదు రోజులలోనే నిర్ణ యించి నాంచారమ్మ ద్వారా కబురు పంపిస్తాను. ఇక ఏ క్షణంలో నయినా సరే ఇక్కడినించి వెళ్ళిపోవడానికి సిద్ధంగా ఉండాలి ! తెలిసిందా ?"

"ఏమో ! నా కిదంతా తలుచుకుంటే చాలా భయంగా ఉంది ! నేను రాను !"

రంగనాయకు డా ప్రత్యుత్తరం విని ఎంతో ఆశ్చర్య పడ్డాడు :

"ఇదేమిటి ఇలాగ మాట్లాడుతున్నావు ! ఎందుకు నీకింత భయం !"

"ఎక్కడి కయినా వెళ్ళిన తరవాత మరి మన బ్రతుకు తెరువు మాటేమిటి ?"

రంగనాయకుడు నిర్లక్ష్యంగా ఒక చిరునవ్వు చిందించాడు :

"అయ్యో ! వెర్రిదానా ! ఇదా నీ భయం ! నే నీ సంగతి ఆలోచించలే దనుకొన్నావా ? నీ కే విధమయిన లోటు రానివ్వనులే !"

"నా మాట కాదు ఆలోచిస్తూంట ! మీ మాట !"

"నా మాట కేం లే ! నువ్వు సరసన ఉంటే నా క దే పది వేలు ! ఇక ఎక్కడా లోటన్న మాటే అనిపించదు !"

అంతలోనే ఆ పక్క గదిలో నిలబడిన నాంచారమ్మ నెమ్మదిగా "హేమా ! మీ అమ్మ, అక్క తిరిగి వచ్చేవేళ యింది ! మరి ఆలస్యం చేస్తే మాటదక్కదు !" అని హెచ్చరించి, అక్కడికి వచ్చింది. హేమ ఉలిక్కిపడి "అప్పుడే కొంచెం చీకటి పడ్డట్టుంది. మరి నేను వెళ్ళాలి. మళ్ళీ ఎప్పటికో మీ దర్శనం !" అని నిట్టూర్చి కంట నీరు పెట్టు కొన్నది. రంగనాయకు డామె కన్నీరు తుడిచి, చిక్కని ముద్దు ముద్రతో వీడ్కొని "త్వరలోనే" అని ధైర్యం చెప్పి సత్వర గమనంతో తన ఇంటివైపు సాగిపోయాడు.

హేమసుందరి నాంచారమ్మ అతి త్వరితంగా నడక సాగించి అనతికాలంలోనే శృంగారమంజరి భవంతి చేరుకొన్నారు.

# 12

ఆ తరవాత నిచుళాపురంలో నాలుగయిదు రోజులు, ఎలాంటి విచిత్ర విశేషాలు లేకుండా నిమ్మకి నీరెత్తినట్టు సాగి పోయాయి. ఆపైన ఒకనాటి అర్థరాత్రివేళ, తిరుమలరెడ్డి భవంతిలో హఠాత్తుగా ఒక పెద్ద గందరగోళం బయలుదేరింది! చాలాసేపటివరకు రెడ్డికేమైనది, రవంతయినా అవగాహన కాలేదు. మొట్టమొదట అతనికి కొంచెం మెళకువ వచ్చింది. అంతలోనే నడినెత్తిమీద పిడుగువంటి ఒక పెద్ద అఘాతం తగి లింది! దానితో స్పృహ తప్పి శయ్యమీదినించి జారి, చాప చుట్టగా నేలమీద కూలబడిపోయాడు! కొంచెం తెలివి వచ్చిన మరి కొంతసేపటి కతని చెవులలో ఏదో కోలాహలం గింగురు మని మారుమ్రోగింది.

బాగా తెలివివచ్చిన తరవాత ఇరుగు పొరుగు తొందర తొందరగా అతని భవంతిలో ప్రవేశించారు. భార్య సరసనే కూర్చుని తలమీద తగిలిన గాయానికి కట్టు కట్టింది. నలుగు రయిదుగురు సాయంపట్టి తిరిగి అతనిని పాన్పుమీద పడుకో బెట్టారు. ఆ సమయంలో కుడి మోకాలు కొంచెం అటు ఇటు కదలినంతలోనే రెడ్డి విపరీతమయిన యమయాతనతో గొంతెత్తి ఆక్రోశించాడు! ఇరుగు పొరుగు వారప్పటికి ఆ మోకాలు కీలూడినదని గ్రహించుకొన్నారు. వెంటనే శల్యవైద్యుడు కుమ్మరి గురవయ్యకి కబురుపెట్టి కట్లు కట్టిం చారు. కొంచెం తెల్లవారేవరకు ఇరుగు పొరుగులలో తగు

మనుష్యులు కొందరు రెడ్డిభార్య నోదారుస్తూ అనేక విధాల సాయపడ్డారు. మరి కొందరు చుట్టుమూగి ఎన్నడో చాలాకాలం క్రితం జరిగిన అటువంటి దుస్సంఘటనలు కొన్ని ప్రస్తావించి ఎంతో విడ్డూరంగా తమలో తాము గుసగుసలాడుకొన్నారు. మరి కొంత సేపటికి క్రమక్రమంగా అందరు తమ తమ ఇళ్ళకి వెళ్ళిపోయారు.

బాగా తెల్లవారిన తరవాత రెడ్డి మనస్సు కొంచెం కుదుటపడింది. భార్య ముఖతః క్రమక్రమంగా గతరాత్రి జరిగిన దుస్సంఘటన అంతా అతని కవగత మయింది.

అర్ధరాత్రి దాటిన తరవాత దొంగ ఎవడో భవంతిలో ప్రవేశించాడు. బాగా అదమరచి నిద్రిస్తున్న సింహాచలంమీద విరుచుకుపడి ఒళ్ళు హూనంచేసి కాళ్ళు, చేతులు విరిచికట్టి నోటిలో గుడ్డలు కుక్కి, రెడ్డి నిద్రిస్తున్న గదిలో జొరబడ్డాడు. మొట్టమొదట స్పృహతప్పి పోయేటంత గట్టిగా కొట్టి, మోకాలు కీలు తొలిగించి నోట గుడ్డలు కుక్కి ఒకమూల పడవేశాడు! కొన్ని నగలు, రత్నాల హారాలు, అయిదారువేల బంగారు వెండి శంఖుచక్ర నాణకాలు చేజిక్కించుకొని ఇరుగు పొరుగుల కళ్ళు గప్పి చల్ల చల్లగా జారుకొన్నాడు.

రెడ్డి భార్య ఆ పక్కనే ఇంకొక గదిలో నిద్రిస్తున్నది. భర్త నడినెత్తిమీద పడిన దారుణాఘాతం సవ్వడి విని, ఉలిక్కిపడి లేచి నలువైపుల పరిశీలించింది. ఆమె కేమి అంతు చిక్కలేదు! ఒకే ఒక్క అంగలో భర్తగదిలో ప్రవేశించింది. పరుపు మీద ఆయన కనబడలేదు. పందిరి పట్టెమంచం కోడు దగ్గిర పడిఉన్నాడు. శిరస్సు మీద తగిలిన గాయంలోనుండి రక్తం

బొట బొట ప్రవహిస్తున్నది. విపరీతమయిన భయోద్వేగంతో ఆమె నోట మాటే వెలువడలేదు. చీర చెరగు చించి గాయానికి కట్టుకట్టి, గొంతెత్తి సింహాచలాన్ని పిలిచింది! కాని ఎక్కడ వాడి జాడే వినబడలేదు. ఆ నిస్సహాయ స్థితి, భర్త హఠాత్తుగా విరుచుకుపడిన ఘోరాపద తలుచుకొని ఆమె గొంతెత్తి గోలుగోలున విలపించింది. ఆ దీనాక్రోశం విని ఇరుగు పొరుగు అచ్చటికి చేరుకొన్నారు. సింహాచలం కట్లు విప్పి, ఆమె నోదార్చి శాయశక్తులా తోడ్పడ్డారు.

తనవంటి గొప్ప వ్యక్తి భవంతిలో అంతటి ఘోరకృత్యం జరగగలదని తిరుమలరెడ్డి కలలోనయినా ఊహించి ఉండలేదు. కొంచెం తేరుకున్నాక సింహాచలాన్ని పిలిచి మాటిమాటికి అనేక విధాల ప్రశ్నించాడు. ప్రయోజనం కలగలేదు. ఆదమరచి నిద్రిస్తున్న సమయంలో హఠాత్తుగా దుర్మార్గు డెవడో మీద విరుచుకుపడి చావగొట్టి నోట గుడ్డలు కుక్కిన సంగతి మాత్రమే తనకి తెలుసుననీ, అంతకంటె తానేమీ ఎరగననీ చెప్పి వాడు కంట నీరు పెట్టుకొన్నాడు. రెడ్డి మరి లాభంలేదని నిశ్చయించి ఇరుగు పొరుగుల ద్వారా తలవరికి కబురు పంపించాడు. అతడు వచ్చి వ్యవహారం అంతా విని చల్ల చల్లని మాటలతో రెడ్డి నోదార్చి ఎలాగో అలాగ త్వరలోనే ఆ పాపిని పసికట్టి రూపు మాపి వేయగల నన్నాడు. తన కది ఒక ఘనకార్యమే కాదు పొమ్మన్నాడు. ఇక ఒక క్షణమయినా ఆలస్యం పనికి రాదని చెప్పి సెలవు తీసుకొని తిన్నగా దండనాయకుని భవంతివైపు సాగిపోయాడు!

రెడ్డి మోకాలి కీల్లు బాధ క్రమక్రమంగా ఎక్కు-

వయింది. ఎన్నివిధాల చికిత్స చేసినా అది రవంతయినా తగ్గ లేదు. అపార ధనాపహరణం కన్న, దానికి సంబంధించిన దుర్భ రావమానమే అతని నెక్కువగా వేధించింది. ఎవడో దొంగ తనవంటి మహా ధనవంతుని లోగిలిలో జొరబడి, క్షణంలో తప్పించుకుని పారిపోయాడు! మోకాలి కీలు తొలిగించి అవ మానించాడు. తలవరి, దండనాయకుడు కలిసి ఈవేళ కాకపోతే రేపయినా వాడి అంతు కనుక్కొని, కాళ్లు చేతులు విరిచి కట్టించి కారాగారంలో పడవేసి ఉరి తీయించవచ్చును! కాని అంతమాత్రం చేత తన పరాభవ యాతన ఉపశమించగలదా? అసలంతటి గుండెలు తీసిన బంటు ఎవడు? వాడు వట్టి ధనాశ తోనే తన భవనంలో జొరబడ్డాడా? లేక ఆవిధంగా తన పగ తీర్చుకొన్నాడా? ఒకవేళ రంగనాయకుడే ఆ విధంగా తన కసి తీర్చుకోలేదు కదా! అతనికి తనమీాద అంతటి పట్టరాని అక్కసు కలగడాని కెక్కడ ఆస్కారం లేదే? సింహాచలం దేవాలయంలో అతని ఒళ్ళు హూనం చేసినట్టు మాత్రమే చెప్పాడే! అంతేనేగాని ఇంకొక సంగతే ఎత్తుకోలేదే! తాను పనికట్టుకొని కొట్టించిన సంగతి రంగనాయకునికి రవంతయినా తెలిసిఉండదే! కనక అతనికీ దొంగతనంతో సంబంధం ఏమి ఉంటుంది? అయితే ఇంతటి ఘోరకృత్యం తలపెట్టిన దుస్సా హసి ఎవడు? రెడ్డి ఆలోచనలావిధంగా శరపరంపరలా సాగి పోయాయి. కాని ఎన్నెన్ని విధాల తల బద్దలు కొట్టుకున్నా అసలు సమస్య తెగలేదు.

అప్పటికి జాము పొద్దెక్కింది. అంతలోనే ముత్యాలు గదిలో అడుగుపెట్టి నాంచారమ్మ వచ్చిందని చెప్పింది. వెంటనే

లోపలికి తీసుకురావలసిందని ఆజ్ఞాపించి, రెడ్డి ఏకాగ్ర దృష్టితో ఆమె రాకకోసం నిరీక్షించాడు. నాంచారమ్మ కళ్ళెదట నిలబడ గానే అతని భార్య రుసరుస లాడుతూ లేచి పక్కగదిలోకి వెళ్ళి పోయింది! నాంచారమ్మ రెడ్డి పరిస్థితి గమనించి నిలువునా నిర్ఘాంతపడి "ఇంతటి ఘోరం జరిగినట్టు తెలియలేదు బాబూ! దొంగ సంగతి మా కిప్పు డిప్పుడే తెలిసింది. నన్నొకసారి త్వరగా వెళ్ళి చూసి రమ్మని పంపించారు. అయ్యో! ఎంతపని జరిగిం దీవేళ! అయితే అక్కడ జరిగిన మోసం మీ కింకా తెలియనే లేదా!" అన్నది.

"ఏమిటది? ఏమి జరిగింది?" రెడ్డి ఎంతో ఆత్రంగా అడి గాడు.

"హేమసుందరి, రంగనాయకుడు కలిసి హఠాత్తుగా ఎక్కడికో పారిపోయారు!"

"ఆఁ ఆఁ ఎప్పుడు?"

"నిన్న రాత్రి తెల్లవారుజామున."

"అయితే ఇక్కడ దొంగతనం జరిగిన తరవాతే వాళ్ళి ద్దరు కలిసి పారిపోయారన్నమాట! ఎంతపని జరిగింది! తప్ప కుండా ఆ దొంగ రంగనాయకుడే! సందేహం లేదు. అయితే నాంచారమ్మ! మీ అందరి కళ్ళు కప్పి వాళ్లెలాగ పారి పోయారు?"

"ఇందులో కళ్లు గప్పడాని కేముంది బాబూ! ఇద్దరు కలిసి ఏమేమి పన్నాగాలు పన్నుకున్నారో మరి! మన కేం తెలు స్తుంది? నిన్న తెల్లవారుజామున మా ఇంటి కెదురుగా బోయీల కోలాహలం వినిపించింది. కొత్త పెళ్ళి కుమార్తె ఎవరో అత్త

వలు బాగా అర్థంచేసుకోగలిగాను. మానవుడికీ, జీవితానికీ అనుక్షణం జరిగే పోరాటంలో ఎలా మసలుకోవాలో నాకు పంతులమ్మ నేర్పింది. బజారు వ్యభిచారిణిగా పరిగణింప బడే 'విలాసిని', తమ శ్రమశక్తి ఫలితంగా లభ్యమైన డబ్బు కాటను మార్కెట్టుకు ధారాదత్తం చేసే విజారు వ్యాపారస్థుడు మార్వాడీకొట్టు గుమస్తా, అతని భార్య... వీరందర్నించీకూడా నేను నేర్చుకుంది ఎంతో ఎక్కువే!

ఏమిటి వారినిలా పొగుడుతారు! వారిలో మీరు కాంచిన విశేషమేముంది? అని ప్రశ్నిస్తున్నారా?

అందుకు నా జవాబిదిగో! మీరే ఆత్మ పరీక్ష చేసుకోండి. వారిలో లోపాలున్నాయి. వారిలోనూ మానసిక బలహీనతలున్నాయ్. కానీ... అవి మీలో మాదిరి ముఖమల్ తొడుగులు ధరించలేదు. అలగాజనం, నీచులు అని మీచే పిలువబడే గోముఖ వ్యాఘ్రాలు ఒక్కరూ లేరు. తేనె పూసిన కత్తులసలే కాదు. వారు నిజమైన మానవులు. చీము, నెత్తురులతో, వైతరణీ నదిని సృష్టించి ఆవలిగట్టున వారిని మీరుంచారు గదూ? ఆ వైతరణిస్థానే పాలసంద్రం పొంగడం మీ కళ్ళతోనే చూస్తూ వుంటారు మరి కొన్ని రోజుల్లో!

మనవాళ్ళెవరో తిన్నగా తెలిస్తే గదా మన రహస్యం దాగ డానికి! చిన్నప్పటినించి హేమసుందరిని పెంచి పెద్దదానిని చేశావుగదా! కొంచెం ముందుగా చూచాయగా నయినా నీతో ఈ మాట చెప్పలేదా ?"

"లేదు బాబూ! చెబితే రెక్కలు కట్టుకుని వచ్చి మీ చెవిని వెయ్యనా! నాదాకా ఎందుకు? అక్కతో కూడా ఆ అమ్మ ఈ మాట ఎన్నడు చెప్పలేదట! నెత్తి, నోరు బాదు కుని ఆమె పొద్దుటినుంచి ఒకటే గోల! కూతుళ్ళిద్దరు ఏకమై తన ఇల్లు గుల్ల చేస్తున్నారని ఆ పెద్దావిడ ఒకటే ఘోష! ఏం చెప్పను? ఆ ఇంట్లో అడుగు పెట్టడమే యమయాతనలా తయారయింది బాబూ!"

"సరేలే గాని నగలు, నాణ్యాలు ఏమయినా పోయాయా ?"

"పోకేం ? ఆ అమ్మ చేయించిన నగలన్నీ హేమసుందరి ఒంటిమీదే ఉన్నాయి. ఆపైన ఆమె రత్నాలమాల, మిరియాల పేరు కూడా హేమ మెడలోనే ఉన్నాయట! అందుకనే ఆవిడ నెత్తి, నోరు బాదుకుని వలవలా ఏడుస్తూంది! పోనీ ఈ వేళ రాకపోతే రేపయినా మీ రొక్కసారి అక్కడికి వచ్చి—"

"రావాలనే ఉంది నాంచారమ్మా! కాని రాత్రి జరిగిన గందరగోళంలో కుడి మోకాలు కీలు తొలిగిపోయింది; అధమం పదిపదిహేను రోజుల దాకా మంచం దిగడానికే వల్లపడదంటు న్నాడు వైద్యుడు. లేకపోతే నే నీపాటికి రెక్కలు కట్టుకుని వెంటాడించి వాడి అంతు కనుక్కోనూ ?"

"అయ్యో! పాపం. ఎంత పని జరిగింది! ఇంకెవరికి దెబ్బలు తగలలేదుగదా!"

"తగలకేం! సింహాచలానికే గట్టి దెబ్బలే తగిలాయి! మొండి ఘటం కనక వాడవి లక్ష్యపెట్టకుండా తిరుగుతున్నాడు. ఇంకొకళ్ళయితే ఈపాటికి మంచంపట్టవలసిందే!"

"అయ్యో! పాపం! అలాగా!" అని నాంచారమ్మ అతని దగ్గర సెలవు తీసుకుని తిన్నగా శృంగారమంజరి భవంతికి బయలుదేరింది. ఆమె వెళ్ళిన తరువాత రెడ్డి కొంచెం గొంతెత్తి "ఒరేయ్! సింహాచలం!" అని పిలిచాడు. వెంటనే వాడక్కడికి వచ్చి "పిలిచారా! బాబూ!" అన్నాడు. హేమసుందరీ రంగనాయకుల సంగతి చెప్పి, రెడ్డి వాడి ముఖవైఖరి నిశితంగా పరిశీలించాడు:

"ఎలాగ తెలిసిందో గాని నేను కొట్టించిన సంగతి కనిపెట్టి గట్టిగా పగ తీర్చుకుని హేమసుందరితో కలిసి పారిపోయాడురా వాడు!"

"ఎవడు బాబూ! వాడు?"

"ఇంకా ఎవడని అడుగుతావేమిటి? ఆ రంగనాయకుడే!...అయితే ఈ మాట ఎలాగ తెలిసిందిరా వాడికి?"

"ఏమో బాబూ! నాకేమి అంతుపట్టడంలేదు!"

"సరేగాని నువ్విప్పుడు ఒకసారి తలవరి దగ్గిర ఈ గొడవ సంగతి చెప్పిరా! నిలుచున్న పాటుగా జమా జట్టీలలాంటి రౌతులు నాలుగు మూలల గాలిస్తే వాడెక్కడో అక్కడ దొరక్కపోడు!"

సింహాచలం క్షణకాలం ఆలోచించి అడిగాడు:

"వాళ్ళు ఎటువైపు వెళ్ళారో తెలిసిందా ? బాబూ !"

"సరిసరి ! తెలిస్తే నాలుగు మూలల గాలించడ మెందుకు ? ఏది ఏమయినా సరే, నేనిక ఆ రంగన్నగాడి అంతు చూడనిదే మరి నిద్రపోదలుచుకోలేదు. త్వరగా వెళ్ళిరా ! నువ్వు కూడా కొంచెం ఆరా తియ్యి !"

"అలాగే బాబూ ! తమ కింత తలవంపు జరిగిన తర వాత కుక్కిన పేనులా మాట్లాడ కూరుకుంటా ననుకొన్నారా ! ఆ తలవరిబాబు రాతుల నెవ్వరిని పంపించకపోయినా సరే ! ఎక్కడ తలదాచుకున్నా ఎలాగో అలా వెంటాడించి వాడి రక్తం కళ్ళజూస్తాను."

"ఎందుకు పంపించడు ! స్వయంగా నేను అడిగానని చెప్పు. వీలయితే వెంటనే ఆయన నిక్కడికి తీసుకురా ! మరి ఆలస్యం చెయ్యకు ! బయలుదేరు ! ఇంకా నిలబడ్డావేం !"

సింహాచలం ఒక్క అంగలో వీథిలో పడ్డాడు ! అతగా డికి బాగా గట్టి దెబ్బలే తగిలాయనీ, అందుచేత ఎలాగయినా రంగన్న అంతు కనుక్కొని తీరతాడనీ నిశ్చయించుకుని రెడ్డి ఎంతో సంతోషించాడు.

నాంచారమ్మ తిరిగి వెళ్ళి రెడ్డి భవంతిలో జరిగిన సంఘ టన అంతా శృంగారమంజరికి పూసగుచ్చినట్టు చెప్పింది. అసలే ఆమె హేమసుందరి పారిపోయినందు కెంతో ఆరాటపడు తున్నది ! ఆపైన తలవని తలంపుగా ఇంకొక పెద్ద బెడద విరు చుకు పడింది. ఆమె చిన్నకుమార్తె మీద ఎన్నో ఆశలు పెట్టు కొన్నది. క్షణంలో అవి అన్ని అడుగంటిపోయాయి ! పైగా రెడ్డి మోకాలు కీలూడింది ! అది ఎన్నటికి నయ మవుతుందో !

కొంచెం వయస్సు మళ్ళిన తరువాత కాలు వంగినదంటే, తిరిగి కోలుకోవడానికి కెంతకాలం పట్టగలదో ఎవరు చెప్పగలరు !

మాణిక్యవల్లి ఇన్నాళ్ళనించి హేమసుందరి ఎక్కడి కయినా వెళ్ళిపోతే తనమార్గం నిష్కంటకం కాగలదని ఉవ్విళ్ళూరింది. ఆమె రంగనాయకునితో కలిసి పారిపోవడాని కెంతో సాయం చేసింది. కాని తలవని తలంపుగా రెడ్డిమీద విరుచుకు పడిన ఘోరాపద తలచుకుని తలుచుకుని కుమిలి కుమిలి దుఃఖించింది. తా నొకటితలిస్తే దైవం వేరొకటి తలపెట్ట గలడన్న సామెత ఆమె యెడల అక్షరాల యథార్థమయింది ! అంతే కాదు. తన గోడు పైకి వెల్లడించడాని కయినా అవకాశంలేక గుడ్లనీరు కుక్కుకుని కృశించింది. ఆ భవంతిలో ఒక్క నాంచారమ్మ మాత్రమే లోలోపల హేమసుందరి తప్పించుకుని పారిపోయినందు కెంతో సంతోషించింది. దానికి వేరే కారణ మేమీ లేదు ! హేమసుందరి ఆమె ఎన్నడు ఊహించలేనంత మొత్తం ముట్టజెప్పింది !

రెడ్డిపోరు భరించలేక తలవరి రంగనాయకునికోసం నిచు ళాపురం పరిసరాన్ని చాలా జాగ్రత్తగా గాలించవలసిందని కొంతమంది రౌతుల కాజ్ఞాపించాడు.

అలాగలాగ అయిదారు రోజులు గడిచిపోయాయి. అయినా ఎక్కడ రవంతయినా రంగనాయకుని జాడ పొడకట్ట లేదు ! ఎన్నెన్ని ప్రక్రియలు చేసినా రెడ్డి మోకాలు కీలు తిన్న బడలేదు. లేకపోతే అతడే స్వయంగా రంగనాయకుని అన్వేషణ కోసం రౌతుల నెంతమందినో ఉరికించి ఉండేవాడే !

అలాగ మరి కొంతకాలం గడిచిన తరువాత రెడ్డి మన

స్సులో రంగనాయకుని యెడల ప్రజ్వలించిన విద్వేషాగ్ని జ్వాల రవంత చల్లారక పోలేదు! అయితే ఆశక్త దుర్జనత్వం ఒక్కటే దానికి కారణం! కాని సింహాచలం క్రోధావేశం మాత్రం కొంచెమయినా శాంతించలేదు. స్వయంగా తానే నడుం కట్టుకొని ఎప్పటికయినా సరే, రంగన్న జాడ పసికట్టి పగతీర్చుకొని తీరాలని వాడదేపనిగా భీష్మించుకుని కూర్చున్నాడు. ఆ తీవ్ర ధోరణి గమనించి రెడ్డి లోలోపల మిక్కిలి ఉప్పొంగి శాయశక్తులా ప్రోత్సహించాడు. సొమ్మెంత ఖర్చయినా సరే, మరి వెనక ముందు ఆలోచించ నక్కరలేదని గట్టిగా భరవసా యిచ్చాడు. దోసిళ్ళతో బంగారు, వెండి శంఖ చక్రాలు గుమ్మరించాడు. దానితో సింహాచలం వీరావేశం మరింతగా విజృంభించింది!

# 13

మరునాడు తెల్ల తెల్లవారేసరికి హేమసుందరీ రంగనాయకు లెక్కిన మేనా శ్రీరంగం సమీపించింది. మరికొంత సేపటికి కదికావేరి తీరంలో ఆగింది. రంగనాయకుడు బోయీలనుకొన్న దానికంటె కొంచెం ఎక్కువ మొత్తమే ముట్టచెప్పి, కృతజ్ఞతతో వెల్లివిరిసిన వారి గౌరవాదరాలు చూరగొన్నాడు. తాము శ్రీరంగం చేరుకొన్న సంగతి ఇంకెవ్వరికి తెలియనీయవద్దని హెచ్చరించి వారిని వీడ్కొన్నాడు. వాస్తవాని కతడు తమ యథార్థ నామధేయాలే వారెవ్వరికి తెలియనీయలేదు.

ఆ బోయీల నివాస గ్రామం నిచుళా పురానికి అయిదారు క్రోసుల దూరంలో ఉన్న వెంకటేశ్వరపురం. రంగనాయకుడు డెంతగా యథార్థం కప్పిపుచ్చినా వా రిద్దరు అతి రహస్యంగా ఎక్కడికో పారిపోతున్నా రని బోయీ లనుమానించారు. అయితే వా రుభయులు ఎంతో సన్నిహితులయి ఉండవచ్చునని ఊహించుకొన్నారు. ఇనుమిక్కిలిగా ప్రతిఫలం ముట్టజెప్పిన తర వాత బోయీ లెవరు మరి వారి రహస్య విషయమే తలపెట్ట లేదు! ఎంతో భయభక్తులతో నమస్కరించి సెలవు తీసుకుని తిరిగి వెంకటేశ్వరపురంవైపు వెళ్ళిపోయారు.

హేమసుందరీ రంగనాయకులు ప్రత్యేకంగా కుదుర్చు కొన్న చిన్న పడవలో వేరొక మారుమూల రేవులో కావేరీ నది దాటి శ్రీరంగ నగరంలో ప్రవేశించి ఒక పక్షం రోజుల పాటొక సత్రంలో తలదాచుకొన్నారు. ఆ తర్వాత నగర మధ్యంలో ఒక చిన్న భవంతి బాడుగకు తీసుకొని దానిలో ప్రవేశించారు. దోసిళ్ళ కొద్ది సొమ్ము గుమ్మరించడంతో క్రమ క్రమంగా అది వారి స్వగృహమే అయింది! రంగనాయకుడు చాలా పసితనంలో తల్లిదండ్రులతో కలిసి శ్రీరంగక్షేత్రం సందర్శించాడు. అంతే గాని అటుపిమ్మట అతడెన్నడు ఆ పుణ్య క్షేత్రమే చూడలేదు. అల్లంత దూరంలో ఆకాశంలో బాల భాస్కరుని కిరణాలలో తళతళ లాడుతున్న శ్రీ రంగనాథుని దేవాలయాల శిఖరాల కాంచన కలశాలవైపు చూడగానే అతని శరీరం సంతోష పారవశ్యంతో పులకించింది. ఆ నగ రంలో ఏడు ప్రాకారాలలోను ఎటువైపు చూచినా ఏపుగా పెరిగిన పూలతోటలే! తాంబూలవల్లిక లల్లిబిల్లిగా అల్లుకొన్న

పోకలతో, నారికేళాలతో, వేర్వేరు ఫల వృక్షాలతో నిండిన ఉద్యానవనాలే! చుట్టూరా ఒక చిన్న తోటయినా లేని భవంతి ఏది అతనికా నగర మధ్యంలో ఎక్కడ కానరాలేదు. పట్టణం శివార్లలో మాత్రమే అక్కడక్కడ కొన్ని పూరిళ్ళు కనిపించాయి.

నాలుగవ ప్రాకారాని కానుకొన్న రాజవీథి కెడమ వైపున ఉన్న గున్నమావిడి తోటలో నిర్మించిన నూతన గృహంలో అడుగుపెట్టిన తరువాత రంగనాయకుని కెంతో సంతృప్తి కలిగింది. వీథి గుమ్మంలో నిలబడగానే అతని కనతి దూరంలో శ్రీరంగేశుని దేవాలయ శిఖరంపై గల స్వర్ణకలశం వికసించబోతున్న బంగారు తామర విరివలె తరళించింది. లోపలికి వెళ్ళగానే హేమసుందరి విశాల విలోచనయుగళం చిరునవ్వుల తళతళలతో పలకరించింది!

స్వామి నా మొర ఆలకించి ఉండకపోతే హేమతో కలిసి ఏ అవాంతరము లేకుండా నేనిక్కడికి రాగలనా? త్వరలోనే ఇంతటి చక్కని నివాస గృహం సాధించుకోగలనా? వట్టి పత్రాలే గాని ఊరు పేరు తెలియని నావంటి పరదేశికి ఇంత చక్కని ఇల్లెక్కడ దొరుకుతుంది? తిరుమలరెడ్డి, తలవరి, దండనాయకుడు ఏకీభవించి పగ సాధించాలని ఎంతగా ప్రయత్నించినా సరే! ఇక నా తలపూవయినా వాడదు! శ్రీరంగేశుని క్రీగంటిచూపు పడిన తరవాత ఎటువంటి రాజాధిరాజు లయినా సరే, నన్నేమి చెయ్యలేరు!

రంగనాయకుని తలపోత లీ విధంగా విజృంభించించాయి. ఇంతకు మునుపెన్నడు స్వామి యెడల అతని కంతటి భక్తి,

ప్రపత్తి కలగలేదు! అంతేకాదు! శ్రీరంగనాథుని మాటే అత డెన్నడు తలపెట్టలేదు! పొద్దస్తమానము సాము గరిడీలే అతని ఆరాధ్య దైవతాలు! అయితే అకస్మాత్తుగా రంగనాథుని యెడల అతని కంతటి భక్తి కలగడాని కింకొక గట్టి కారణం లేకపోలేదు. హేమసుందరితో కలిసి రెండు మూడు రోజులలోనే శ్రీరంగం పారిపోయి తీరాలని మొట్టమొదట రంగనాయకు డాలోచించుకొన్నాడు. నిచుళాపురంలో మరి ఒక క్షణమయినా కాలక్షేపం చెయ్యడాని కతని కేమాత్రము మనస్కరించలేదు! కాని ఎటు చూచినా అడుగడుగునా ఆటంకాలే! చేతిలో చిల్లి గవ్వయినా లేదు! పోనీ అనుకుంటే ఆదుకొని సాయపడే వా రెవ్వరు కనబడలేదు! తండ్రికి జడిసి గోపాలయ్య ఇటీవల తమ ఇంటివైపే రావడం మానుకొన్నాడు. ఆ నిస్సహాయ స్థితిలో రంగనాథ స్వామిని మనసారా సంస్మరించుకొని తన కోరిక నిర్విఘ్నంగా నెరవేరిన పక్షంలో పైడి కనుదోయి, బంగారు తిలకము కానుకగా సమర్పించుకోగలనని అత డావేశ గద్గదస్వరంతో మొక్కుకున్నాడు.

శ్రీరంగంలో నూతన గృహంలో ప్రవేశించిన తరవాత అయిదారు రోజులలో తన సుఖ వసతి కనువయిన సౌకర్యా లొకటొకటే జాగ్రత్తగా అమర్చుకొన్నాడు. తిరుమలరెడ్డి భవంతిలో చేజిక్కించుకొన్న ధనరాశితో అధమపక్షం ఒక సంవత్సరం వరకయినా ఏవిధమయిన చీకుచింత లేకుండా హాయిగా కాలుమీద కాలు వేసుకుని కాలక్షేపం చెయ్యవచ్చునని అనుకొన్నాడు. అయితే ఒక్క ఆందోళన మాత్రం అప్పుడప్పు డతనిని వెంటాడించడం మానలేదు! మోకాలు కీలూడిన రెడ్డి

తన్నెలాగయినా వెతికించి పగ తీర్చుకోక మానడు! అకస్మాత్తుగా ఎప్పుడే అపద మీద విరుచుకు పడగలదో ఎవరు చెప్పగలరు? కనక తన అనుపాను లెవ్వరికి తెలియకుండా బాగా గుట్టుగా కాలక్షేపం చెయ్యాలని నిశ్చయించుకొన్నాడు. అందు చేత తమ ఇద్దరికి సంబంధించిన యథార్థ విషయా లేవి ఇరుగు పొరుగువారికి తెలియనీయ లేదు. అంతేకాదు. ధనుర్దాసని తన కింకొక మారుపేరు పెట్టుకొన్నాడు. విలువిద్యలో అలవడిన నైపుణివల్ల అది తన కన్ని విధాల బాగా సరిపోయినదని సంతృప్తి పడ్డాడు. గిరిజాలు బాగా పొట్టిగా మలుచుకొన్నాడు. చిన్న బవిరి గడ్డం పెంచుకొన్నాడు! హేమసుందరికి హేమాంబ అని ఇంకొక కొత్త పేరు అలంకరించాడు. నిచుళాపురంనించి శ్రీరంగానికి వచ్చిపోయే తీర్థ ప్రజవల్ల తన వాస్తవ స్థితి ఎప్పటి కయిన బయటపడక పోదని మొట్టమొదట కొంచెం భయపడ్డాడు. కాని కొంతకాలంపాటయినా గుట్టుగా కాలక్షేపం చెయ్యవచ్చునని సమాధాన పడ్డాడు. తన దగ్గిర పుష్కలంగా సొమ్మువున్నా వేష భాషలలో పటాటోపం తగ్గించి కేవలం సామాన్య సంసారిలా నటించాడు. అంతేకాదు. ఏడాది గడిచిన తరువాత, తన జీవితయాత్ర కవసరమయిన సొమ్ముకోసం ఇప్పటి నుంచి బాగా జాగ్రత్తపడాలని నిర్ణయించుకొన్నాడు. దానికోసం స్వామి దేవాలయంలో తన చేతనయిన వృత్తి ఏదయినా చేపట్టక తప్పదని నిశ్చయించుకొన్నాడు.

శ్రీరంగంలో తెల్లవారు జాము మొదలుకొని ఇంచుమించుగా అర్ధరాత్రి వరకు స్వామి కనేక విధాలయిన మహో

త్సవాలు, కైంకర్యాలు జరుగుతూ ఉంటాయి. మల్లవిద్యా విశారదు లనేకులు ఉత్సవాలలో, ఊరేగింపులలో తమ తమ చాతుర్యాలతో శ్రీరంగేశుని సేవించు కొంటున్నారు. దేవాలయ ధర్మకర్త కొద్దిగానో గొప్పగానో ముట్టజెప్పిన ప్రతి ఫలితాలతో తమ తమ కుటుంబాలు పోషించుకొంటున్నారు. పిల్లలతో, పాపలతో కలకల లాడుతున్నారు! తన కా విధమయిన సేవావకాశమే లభిస్తే మరి అంతకన్నా కోరుకోవలసిన దేది లేదని రంగనాయకు డువ్విళ్లూరిపోయాడు.! ఆనాడే అపరాహ్ణ వేళ దేవాలయ ధర్మకర్త నొకమారు సందర్శించాలని నిర్ణయించుకొన్నాడు. హేమసుందరి కూడా ఆ ఆలోచన మంచిదే అని అంగీకరించి ప్రోత్సహించింది. అయితే అట్టే ఆలస్యం కాకుండా త్వరగా తిరిగి రావలని కోరింది. సరేఅని రంగనాయకుడు ధర్మకర్త భవంతివైపు సాగిపోయాడు. కాని ఆనా డతని దర్శనం లభించలేదు.

అలాగలాగ నాలుగయిదు రోజులు గడచిపోయాయి. ఆమరునాడు ఎంతసేపటికి రంగనాయకుడు తిరిగిరాలేదు. హేమసుందరి అతనికోసం నిరీక్షిస్తూ వీథి గుమ్మంలో నిలుచున్నది. దరిదరిగా ఒక జాము రాత్రి గడిచింది. అల్లంత దూరంలో స్వామి ఊరేగింపులో మంగళ తుర్యాల కోలాహలం మిన్నందు కొంటున్నది. దేవాలయ ప్రకారాలమీద, గోపురాలమీద అమర్చిన కర్పూర దీపికలు వరసగా వాలిన వెలుగు పిట్టలు రెక్కలు రెపరెప లాడిస్తున్నట్టు తరళించాయి! చెట్లకొమ్మల్లో ఉండి ఉండి ఋషి పక్షులు కీచు కీచుమన్న సవ్వడి చెలరేగింది. శ్రీరంగం చేరిన తరువాత వారం పదిరోజుల వరకు హేమ

సుందరి అంతకుమును పెన్నడు కనివిని ఎరగ నంతటి అపూర్వ సౌఖ్యం చవి చూచింది. కాని రంగనాయకుడు ఎక్కడి కయినా వెళ్ళినప్పుడు మాత్రం తిరిగి వచ్చేదాకా దుర్భరమయిన ఒంటరి తనంతో అలమటించింది. క్రమక్రమంగా నగర వాసు లందరు తమతమ పనులు ముగించుకొని ఇళ్ళకు చేరుకుంటున్నారు. కాని రంగనాయకుడు ఎంతసేపటికి ఇంటికి తిరిగి రాలేదు.

హేమసుందరికి ప్రాణం విసిగింది. ఇక వేచి ఉండడంవల్ల ప్రయోజనం లేదని నిశ్చయించి వీధి తలుపులు బిగించి లోపలికి వెళ్లిపోవాలని అనుకొన్నది. ఉసూరుమని నిట్టూర్చి ఇంకొక్కసారి వీధి మళుపు పరిశీలించింది. కనుచూపు మేరలో రంగనాయకుని ఆకారం గోచరించింది. వెనువెంటనే ఆమె రుసరుస లాడుతూ పడక గదిలోకి వెళ్ళి తల కట్టుకుని పడుకొన్నది. సావడిలో హేమ కనబడకపోయేసరికి రంగనాయకుడు కొంచెం కంగారుపడి పడక గదిలో ప్రవేశించాడు. ఆమె ధోరణి పసికట్టి అనుకొన్నంత త్వరగా ధర్మకర్త దర్శనం కాలేదనీ, కనకనే తన రాక ఆలస్య మయిందనీ చెప్పి మన్నించవలసినదని బ్రతిమాలుకొన్నాడు. మరి కొంతసేపటికి హేమసుందరి దుప్పటీ ముసుగు కొంచెం తొలగించి కొంచెంతనం మేళవించిన కోపంతో అతని వైపు చూసి రుసరుస లాడింది:

"ఏమో! మీమాట లెవరు నమ్మగలరు? నిజంగా ధర్మకర్త దర్శనానికే ఇంత ఆలస్యం అయిందా? ఒకవేళ స్వామి ఊరేగింపులో వేశ్యామణుల నృత్యాలేమయినా తిలకిస్తున్నారేమోనని అనుకొన్నాను. అవునా? కాదా? నిజం చెప్పండి!"

హేమసుందరి కంఠస్వరంలో గద్గదిక తొణికిసలాడింది. రంగనాయకుడు కలకల నవ్వి తటాలున ఆమె ప్రక్కన జేర్చుకొని మునివేళ్ళతో ముంగురులు సవరించి "నిజమే హేమా! ధర్మకర్త దర్శనంకోసమే ఇంత ఆలస్యం అయింది. ఎంతసేపు పడిగాపులు పడి కూర్చున్నా వీలు చిక్కలేదు. సరే గాని నీవంటి చక్కని చుక్క లభించినప్పుడు నా కింకొరివైపు కన్నెత్తి చూడవలసినంత అవసరం ఏమి వచ్చింది ?" అన్నాడు.

హేమసుందరి తటాలున అతని గాఢాశ్లేష బంధనంలో నుండి తప్పించుకొన్నది :

"చాల్లెండి! మీ మాయమాటలు! వేశ్యల వెంట కాళ్ళా వేళ్ళా పడి తిరుగుతున్నవా రందరు అందగత్తె లయిన భార్యలు లేనివారేనా ఏమిటి ?"

రంగనాయకుడు, ఆమె ప్రశ్న కేవిధంగాను సమాధానం చెప్పక చిన్న చిరునవ్వు చిలకరించి "సరే గాని ఈవేళ నీకొక వింత కానుకలు చూపిస్తున్నాను. ఇవిగో!" అన్నాడు. అదేమి టన్నట్టు హేమసుందరి బొమముడి విరిచింది. రంగనాయకుడు దీపకాంతలో తళతళ లాడుతున్న ఆమె విశాల నేత్రాలొక క్షణకాలం పరిశీలించి అంగీలో భద్రపరచిన రెండు బంగారు విశాల విలోచనాలు, పొడుగాటి పైడి తిలకము పైకెత్తి పట్టుకొన్నాడు :

"ఇవేమిటీ వింతనగలు! ఇవి ఎందుకు చేయించారు.? ఎవరికోసం పురమాయించారు ?"

హేమసుందరి ఎంతో ఆశ్చర్యపడింది.

"మనమిద్దరము ఇక్కడికి క్షేమంగా చేరుకుంటే సరిగా నీ కళ్ళంతేసి పైడి కనుదోయి, నీ శ్రీచూర్ణ తిలకంవంటి బంగారు బొట్టు స్వామి కర్పిస్తానని మొక్కుకొన్నాను. కొంచెం మంచిరోజు చూసి ఆయన కివి సమర్పించాలి."

హేమసుందరి మరి తన కన్నులే నమ్మలేకపోయింది:

"ఉత్తది! నాతో వేళాకోళం ఆడుతున్నారు!"

"నిజమే హేమా!"

ఆమె పక్కుమని నవ్వింది:

"అయితే మీవంటి సరసుల కోరికలు నెరవేర్చడంకన్న స్వామి కిక వేరే పనిపాట లేమి లేవా ఏమిటి? ఆహా! ఏమి చిత్రమయిన మనుష్యులు!"

రంగనాయకుడు ముక్కుమీద వేలుంచి "తప్పు! తప్పు! అలా గనకూడదు! లెంపలు వేసుకో! ఆయన దయవల్లనే గదా నీవు లభించావు!"

రంగనాయకుడు హేమసుందరిని మృదువుగా కౌగలించుకొని బంగారు బొట్టు నుదుటి కద్ది, పైడి కనుదోయి విశాల నేత్రాల నలంకరించాడు.

హేమసుందరి మరింతగా విస్తుపోయింది:

"ఇదేమిటి వెర్రి! మీ కేమయినా మతిగాని పోయిందా?"

"నీ కంటబడిన తరవాత పోకేం జేస్తుంది! స్వామి నేత్రాల కివి సరిగా సరిపోయేది లేనిది జాగ్రత్తగా చూస్తున్నాను. భయంలేదులే! సరిపోతాయి!"

"ఎందుచేత!"

"ఆయన విశాల నేత్రాలు సరిగా నీ కళ్ళంతే ఉన్నాయి."

"చాల్లెండి! మీ వేళాకోళాలు! నా కళ్ళమీద అమ ర్చినవి తీసుకపోయి స్వామికి సమర్పిస్తారా? ఇంతకంటె ఇక వేరే గొప్ప అపచారం ఏమి ఉంది! విన్నవాళ్ళెవళ్ళయినా విరగబడి నవ్వుతారని అయినా ఆలోచించకపోతే ఎలాగ?"

"వేళాకోళ మేమిటి? మా తాత ముత్తాతలు స్వామి కెన్నెన్ని చిత్ర విచిత్రమయిన నగలు సమర్పించలేదు! వాటి కివేం తీసిపోతాయి! జాగ్రత్తగా చూడకపోతే కొలత లెలాగ తెలుస్తాయి!"

"అయితే మొట్టమొదట నా కళ్ళ కొలతలతోనే ఇవి చేయించారన్నమాట!"

"అవును!"

"మరి కొలత లెప్పుడు తీసుకున్నారు!"

"నాలు గయిదు రోజుల క్రితం! నువ్వు నిద్రపోతున్న ప్పుడు!"

"ఔరా! మీ రెంతకయినా తగినవారే!"

అప్పటికి కాని హేమసుందరి కది వేళాకోళం కాదని బోధపడలేదు! శ్రీరంగస్వామి యెడల ఆమె ఎన్నడు వల్లమాలిన భక్తి ప్రపత్తులతో తల మునకలయిపోలేదు! అయితే లోలో పల తగు మాత్రం భక్తి లేక పోలేదు. అందుచేత అనూచాన మయిన మొక్కుబడుల సంప్రదాయం ప్రకారం తన కన్నుల కలంకరించినవి తీసుకుపోయి స్వామికి సమర్పిస్తే గొప్ప అప రాధం కాగలదేమో అని భయపడింది. కాని అంతకన్న మరి

గత్యంతర మేమిలేదని చెప్పి రంగనాయకుడు ఆమె కొంకింత ఓదార్పు కలిగించాడు. దీపం వెలుగులో కాంచన నేత్రాభర ణాలతో తళతళ లాడుతున్న ఆమె సుదీర్ఘ నేత్రాలపై ఏకాగ్ర దృష్టి నిలిపి చిరునవ్వు చిలకరించాడు. హేమసుందరి కొంచెం చిరాకుపడి నెమ్మదిగా అవి తీసి తన సరసన ఉంచుకొని ప్రశ్నిం చింది.

"సరేగాని, ఇంతకీ మీరు వెళ్ళిన పని ఏమైనట్టు?"

స్వామికి అనుగ్రహం కలిగిన తరువాత కాకేంజేస్తుంది? ఈ వేళో రేపో అయితీరుతుంది! మొట్టమొదట నావిద్య పరీ క్షించి, ఆ తరువాత స్వామి సేవ మాట ఆలోచిస్తామన్నారు!"

"ఇంతకీ ఏమాత్రం ముట్టజెబుతారో!"

"ఎంతయితేనేం! ఏదోవిధంగా మన కిద్దరికి కాలక్షేపం కాకపోతుందా?"

"మళ్ళీ ఎప్పుడు వెడుతున్నారు?"

"నాలుగయిదు రోజులు గడిచిన తరువాత రమ్మన్నారు. సరే దీనికేంగాని హేమా! పది పదిహేను రోజులలోగానే మన వివాహానికి కావలసిన ఏర్పాట్లన్ని చేయిస్తున్నాను!"

హేమసుందరి అదిరిపడి నిశ్చల నేత్రాలతో నిశితంగా అతని ముఖవైఖరి పరిశీలించింది:

"మనకా! వివాహమా! అయ్యో! నిశ్చయంగా మీకు మతిపోయింది. మరి సందేహం లేదు!"

"అదేమిటి అలా గంటున్నావు! ఇందులో తప్పేమిటి?"

"తప్పా! తప్పున్నరా! వేశ్యనెవరయినా వివాహం చేసు కుంటారా?"

“ మ రేం భయంలేదు!” అన్నాడెంతో ధీమాగా రంగనాయకుడు.

“ఒకవేళ తగుదునమ్మా అని మీరు సిద్ధ పడినా పురోహితు లంగీకరిస్తారా?”

అంగీకరించ కేం జేస్తారు! వారితో నువ్వు వేశ్యవని చెప్పవలసినంత ఆగత్యం ఏమి వచ్చింది? మనది పంటరెడ్డి వంశమని, మేనత్త మేనమామ బిడ్డలమనీ చెబుదాము. నాఅన్న ఆత్మీయులెవరు లేరని చెప్పి వారినే కన్యధార పోయ్యమని అడుగుదాము. ఆపైన పుష్కలంగా సొమ్ము గుమ్మరిస్తే స్వామి సన్నిధిని క్షణంలో వివాహం జరిగిపోతుంది.”

అయినా హేమసుందరి అంగీకరించలేదు: “ఇప్పుడు దీనికింత తొందరేమి వచ్చింది! అయిదారు నెలలు గడిచిన తరువాత ఆలోచించుకుందాములెండి !”

“తొందర లేకపోవడ మేమిటి? వివాహ మయిందని తెలిసిన తరువాత తిరుమలరెడ్డి మరి నీమాటే తల పెట్టడు! ఆపైన నాకీ లేని పోని అపనింద పీడ అంతా విరగడయిపోతుంది.”

“మీకేమయినా వెర్రా! మగనాలి న యి న ం త మాత్రాన ఆ దుష్టుడు దూరంగా తొలగిపోతాడా?”

ఆ ప్రశ్న కెటువంటి సమాధానము రంగనాయకునికి స్ఫురించలేదు. దానితో చిరాకు బాగా తలకెక్కింది.

“ఇదిగో చూడు ! ఎందుకు నీ కింత గుంజాటన ! పురోహితుల నెవరి నడిగినా ఇట్టే కన్యధార పోయ్యడాని కంగీకరి

స్తారు. వివాహకాండ అంతా కలిసి రెండు, మూడు గడియల కంటె ఎక్కువ పట్టదు ! మరి నీ కెందుకీ పట్టుదల !"

హేమసుందరి రవంత సేపాలోచించింది. ఆమె కిక ఉన్న మాట చెప్పక తప్పలేదు.

"కన్యాధార పొయ్యడానికి అసలు నేను కన్యకనే కాదు ! మరి ఆ మాట తలపెట్టకండి !"

ఆ సమాధానం వినీ వినగానే రంగనాయకుని గుండెలో ఒక పెద్ద రాయి పడింది ! మరికొంత సేపటికి అతనిని అనూహ్యమయిన ఒక పెద్ద అనుమానం పీడకలలా పట్టుకుని వేధించింది. ఆ యాతన భరించలేక కొంచెం తీవ్ర దృష్టితో ప్రశ్నించాడు :

"ఇదేమిటి హేమా ! ఇలాగ మాట్లాడుతున్నావు ! నీ కింతకు మునుపు ఎప్పుడయినా ఎవరితో నయినా... ?"

రంగనాయకు డిక ఆ ప్రశ్న పూర్తి చెయ్యలేక నిలువునా స్తంభించాడు.

హేమసుందరి అవునని గాని కాదని గాని సమాధానం చెప్పలేదు. తల వంచుకొని చెక్కిళ్ళ మీద దిగజారిన రెండు వేడివేడి కన్నీటి బిందువులు రెండు చీర చెరగుతో తుడుచుకొని ఉసూరుమని నిట్టూర్చింది. రంగనాయకుని ముఖం మీద కత్తి వాటు వేసిన నెత్తురుచుక్క లేదు ! నెమ్మదిగా ఆమె చెయ్యి పట్టుకుని అస్పష్ట స్వరంతో తిరిగి అదేవిధంగా ప్రశ్నించాడు.

ఆపైన హేమసుందరి ముఖం కొంచెం పైకెత్తి కొంచెం తటపటాయిస్తూ సమాధానం చెప్పింది :

"ఉన్నది ఉన్నట్టు నిజం చెబితే మీ కెంతో కోపం వస్తుంది. ఆపైన నన్ను తిరిగి నిచుళాపురం వెళ్ళిపొమ్మంటా రేమో అని భయపడుతున్నాను. కాని మీతో అబద్ధం చెప్పడం నా కిష్టం లేదు..."

"చెప్పు భయం లేదులే !"

"నిజంగా నేనా ? మాట తప్పరు గదా ! చేతిలో చెయ్యి వేసి చెప్పండి !"

"అలాగే ! మాట తప్పను !" అని చేతిలో చెయ్యివేసి ఒట్టు పెట్టుకొన్నాడు రంగనాయకుడు.

ఇంచుమించుగా రెండు మూడేళ్ళనాటి మాట. ఒకనాటి అర్థరాత్రివేళ తల్లి బలవంతంమీద తలవని తలంపుగా హేమసుందరి కొక అపరిచిత వ్యక్తితో సంబంధం కలిగింది. అతగాడొక చిన్న సామంత ప్రభువు. ఐశ్వర్యవంతుడు. ఆ సరసుడానాటి రాత్రి హేమసుందరికోసం శృంగారమంజరి ఒడిలో దోసిళ్ళతో ధనం గుమ్మరించాడు. ఆనాటినించి ఆ వేశ్యమాత తన చిన్న కుమార్తె నా మహారాజు ఒద్దికలో ఉంచాలని నిశ్చయించుకొన్నది. కాని ఆ మహైశ్వర్యశాలి మరి తిరిగి రాలేదు. అదే విషయం హేమసుందరి కొంచెం వ్యంగ్య ధోరణితో సంగ్రహంగా అతనితో చెప్పింది. అది విసీ వినగానే రంగనాయకుని హృదయంలో వెయ్యి ఎర్ర తేళ్ళు ఒకే క్షణంలో గట్టిగా కుట్టినంత విపరీత యాతన ప్రారంభించింది ! అంతలోనే

అతి కష్టంమీద అత డావేదన లోపలే నిగ్రహించు కొన్నాడు :

"అయితే ఆయన పేరేవరు?"

"ఏమో నాకు తెలియదు! ఆ రూపురేఖలు చూసిన తరవాత మరి అడగాలని కూడా అనుకోలేదు."

"పోనీ ఆయన గాని మళ్లీ ఎప్పుడయినా తిరిగి వచ్చాడా?"

"రాలేదు."

"నిజమేనా!"

"నిజమే!"

అయినా రంగనాయకుని కేమాత్రము నమ్మిక కలగ లేదు. మరి భరించలేక పెంపెక్కిన అక్కస్సుతో కస్సు మన్నాడు :

"ఏమో! నీ మాట నిజమని నమ్మడ మెలాగ? ఎంత కయినా తగిన దానివే నువ్వు! ఇక నీతో నేనొక క్షణం కూడా కలిసి ఉండలేను! వెంటనే తిరిగి నిచుళాపురం వెళ్ళిపో!"

ఆమాట చెవిని పడగానే హేమసుందరి తోక తొక్కిన కోడెత్రాచులా కస్సుమని రుసరుసలాడుతూ, లేచి నిలు చున్నది :

"అలాగే వెళ్ళిపోతాను! నే నేమయినా దిక్కు మొక్కు లేని దీనురాలి ననుకొన్నారా? మీవంటి నీతి, నిజాయితీ లేని మనుషుల దగ్గర పడిఉండడం కన్న, నిచుళాపురంలో ముష్టె త్తుకు బతికినా మేలే!"

మరు క్షణంలోనే ఆమె చరచరా నడిచి వీధి గుమ్మం

దాకా వెళ్ళిపోయింది ! గోడ కానుకుని నిలబడి, చీర చెరగుతో ముఖం కప్పుకుని కుమిలి కుమిలి దుఃఖించింది. ఆ దీనాక్రందన ధ్వని క్రమక్రమంగా రంగనాయకుని హృదయంలో ప్రతిధ్వనించింది. కొంచెం జాలిపడి దగ్గరికి వెళ్ళి లోపలికి రావలసిందని బ్రతిమాలుకొన్నాడు. ఆమె మాట్లాడలేదు. మరింతగా కుమిలి కుమిలి వలపించింది. అతడామెను తన సందిట ఇరికించుకుని ఎంతో బలవంతంమీద తిరిగి లోపలికి తీసుకువెళ్ళి బ్రతిమాలుకొన్నాడు :

"హేమా ! ఒళ్లు తెలియని ఆవేశంలో నోటికి వచ్చినట్టు మాట్లాడి నీ మనస్సెంతో నొప్పించాను. నావల్ల పెద్ద పొరపాటే జరిగింది. మన్నించవా ?"

అయినా ఆమె తన పట్టు విడిచిపెట్టలేదు ! రుసరుసలాడుతూ పెడముఖం పెట్టుకుని నిలుచున్నది. రంగనాయకుడిక గత్యంతరంలేక ఆమె పాదాలమీద వాలిపోయాడు. వెంటనే హేమ కొంచెం దూరంగా తొలగి నిలుచున్నది :

"మీాకింత కోపం వస్తుందని నేను మొట్టమొదటే అనుకొన్నాను. అయినా అబద్ధం చెప్పడాని కిష్టంలేక ఉన్నది ఉన్నట్టు పూసగుచ్చినట్టు ఏకరువు పెట్టాను. అయినా నామాట మీాద మీకు నమ్మకం కలగలేదు. ఇప్పుడిక ఏమనుకుంటే మాత్రం ఏమి లాభం ? మధ్యపెట్టె అసలు సంగతి దాచిఉంచవలసింది."

రంగనాయకు డది విని నిశ్చల దృష్టితో హేమ ముఖవైఖరి పరిశీలించి తిరిగి బ్రతిమాలు కొన్నాడు :

"హేమా ! నిజమే చెప్పావు ! ఇందుచేతనే నీ మీాద

నా కింతటి గౌరవం కలిగింది. కనకనే కాళ్లా వేళ్లా పడి ప్రాధేయ పడుతున్నాను. అయినా నీకు నామీద దయ కలగలేదు. మరి నేనేమి చెయ్యను !"

ఆపైన హేమసుందరి ముఖ కవళిక రవంత మారింది. కొంత ప్రసన్నత గోచరించింది. అది కనిపెట్టి రంగనాయకు డందుకొన్నాడు :

"హేమా ! కోపం వచ్చిన తరవాత నీ ముఖాని కెంతో అందం వచ్చింది సుమా ! ఇంతకుమును పెన్నడు నా కింతటి సొగసు కనబడలేదు. అద్దం తేనా ! ఒకసారి చూసుకుందువు గాని !"

ఆ మాటమీద హేమ అతని చెంపమీద నెమ్మదిగా అంటించింది :

"చాల్లెండి మీ ఇచ్చకాలు ! ఎంతటికయినా తగిన వారే మీరు !"

ఆమె తన పెదవిమీద మొలకెత్తబోతున్న చిరునవ్వు అతి కష్టంమీద అణగించి వేసుకొన్నది. రంగనాయకు డది పసి కట్టి "ఎందు కలాగ వచ్చే వచ్చే నవ్వు ఆపివేసుకుంటావు ! ఒక్కసారి నవ్వకూడదా ! చూడాలని ఉంది." అని హేమ సుందరిని గాఢాలింగనంతో బంధించి చిరునవ్వుతో తరళి స్తున్న చెక్కిలి ముద్దుపెట్టుకొన్నాడు.

# 14

అంత గొడవ అయిన తరవాత కూడా రంగనాయకుడు తన వివాహ సంకల్పం విరమించుకో లేదు ఇంకొకసారి హేమసుందరితో ఆ సంగతి ప్రస్తావించాడు. ఆమె కొంత సేపటి వరకు విసీ విననట్టు మాట్లాడ కూరుకుని "మూడు ముళ్ళు వేసి మంగళసూత్రం కట్టగానే అది మనువయిపోతుందా ఏమిటి ? నిజమయిన మమకారమే ఉంటే మంగళసూత్రా లెందుకు ?...అయినా మీ ఇష్టం ! నా అభ్యంతరం ఏమి లేదు ! పీట మీద కూర్చొబెట్టి పెళ్ళి చేయిస్తానంటే చేదా ఏమిటి ?" అన్నది. అంతేకాని వివాహం కోసం అంతగా ఉబలాటపడ లేదు. ఆపైన రంగనాయకుడు కూడా అంతగా బలవంత పెట్టలేదు. "సరే, ఇంతలో మునిగిపోయిం దేమిటి ? మాఘ ఫాల్గుణ మాసాలలో ఎప్పుడో ఒకప్పుడు ఏర్పాటు చేసుకోవచ్చును." అని సమాధాన పడ్డాడు.

రంగనాథస్వామి కొలువులో సేవ మాటకూడా అలాగే మరి కొంతకాలం దాకా జరిగింది. అయిదారు సారులు కాళ్ళకు బలపాలు కట్టుకొని తిరిగిన తరువాత దేవాలయ ధర్మకర్త మల్లవిద్యలో, సాము గరడీలలో అతనిని కూలంకషంగా పరీక్షించి ప్రస్తుతానికి స్వామి సేవ కవకాశా లేవి లేవన్నాడు. కాని అక్కర కలిగి నప్పుడు తప్పక కబురు పంపించగలనని భరవసా యిచ్చాడు.

రంగనాయకునికి ఆపైన మరి ఏమి చెయ్యడానికి పాలు పోలేదు. అత డిన్నాళ్ళనుండి శ్రీరంగంలో కొంచెం చాటు

మాటుగానే సంచరిస్తున్నాడు. శ్రీరంగానికి, నిచుళాపురానికి మధ్యన పది పన్నెండు క్రోసుల కంటె ఎక్కువ దూరం లేదు. అయితే శ్రీరంగం పాండ్య రాజ్యంలో చేరిన పుణ్యక్షేత్రం. నిచుళాపురం కాంచీపురాధిపతులు పరిపాలిస్తున్నారు. ఆ రెండు రాజ్యాలకు కావేరినది ఒక సహజమయిన సరిహద్దు కనకనే రంగనాయకుడు శ్రీరంగంలో స్థిరవసతి ఏర్పాటు చేసుకొన్నాడు. అందుచేత ఎంతగా ప్రయత్నించినా రెడ్డి తన విషయమే తలపెట్టలేడని ఎంతో సంతృప్తిపడ్డాడు. కాని, అతగాడొకవేళ శ్రీరంగంలో తన ఉనికి కనిపెట్టిన పక్షంలో ఏదో విధంగా గట్టి ప్రతీకారం తలపెట్టవచ్చును! కనకనే ఇరుగు పొరుగుల కెవరికీ తన యథార్థ విషయాలేవి తెలియకుండా మిక్కిలి మెళకువతో వ్యవహరించాడు. స్వామి ముడుపు చెల్లించడానికి కూడా అనుకున్నంత దగ్గిరగా మంచి శుభ ముహూర్తమేది కుదరలేదు. సరే మరి కొంతకాలం గడిచిన తరవాత ఆ సంగతి ఆలోచించుకోవచ్చునని అనుకొన్నాడు.

అయితే పొద్దస్తమానము ఇంటిదగ్గిర పడిఉండడానికి అతడు అలవాటు పడిఉండలేదు! అయినా ఒకటి, రెండు మాసాలపాటు అలాగే ఓరిమి వహించి ఎంతో గుట్టుగా కాలక్షేపం చేశాడు. ఆపైన మరి భయంలేదని నిశ్చయించి శ్రీరంగేశుని ఉత్సవాలలో ఊరేగింపులలో బాహాటంగా పాల్గొన్నాడు. క్రమక్రమంగా ఉబుసుపోకకోసం ఉత్సవాలలో మల్ల విద్యా చాకచక్యంతో ప్రజానీకం ప్రశంస లందుకొంటున్న కొంతమంది జెట్టీలతో పరిచయం కలిగించుకొన్నాడు. ఆనాటి కానాటికా పరిచయం క్రమక్రమంగా కొంచెం స్నేహంగా పరిణ

మించింది. అప్పటినించి రంగనాయకునికి మనస్సులో ఆ నగ రంలో కాలక్షేపం కావడం కష్టమన్న ఆలోచన పూర్తిగా తొలగిపోయింది. మిత్రులతో కలిసి అతడు తిరిగి మల్ల క్రీడా వ్యాసంగము, ధనుర్విద్యాగోష్ఠి ప్రారంభించాడు.

రంగనాయకుని స్నేహితుల ధోరణు లనేక విధాలు. వారిలో కొందరికి మల్లవిద్యమీదే కాని, ప్రపంచంలో మరి దేనిమీద దృష్టిలేదు. వారి అత్యాసక్తి అంతటిది! మరి కొందరు కుటుంబ పోషణకోసమే ఆ విద్య అభ్యసించారు. ఏదో విధంగా జీవితం కొనసాగించుకోవడమే వారి ప్రధాన లక్ష్యం. రంగనాయకునికి కొంచెం సన్నిహిత మిత్రు డొకడు బంగారు పిచ్చుక. అతని పేరు శ్రీశైలం. మనిషి కొంచెం మంచివాడే. కాని చిన్నతనంనించి కొన్ని దుర్వ్యసనా లలవడ్డాయి. వాటిలో మొదటిది వార కాంతాగోష్ఠి. రెండవది మద్యపానాభిరుచి. శ్రీశైలం వట్టి ఉబుసుపోకకోసమే సాము గరిడీ లభ్యసిం చాడు. అందుచేత ఆ విద్యలో అతనికి అంతంతగా మాత్రమే ప్రవేశం కలిగింది. అయితే "అందెవేసిన చెయ్యి" అన్న గొప్ప ప్రతిష్ఠ గడించుకోవాలన్న గట్టి పట్టుదల కలిగింది. వారిద్దరి మైత్రి అభివృద్ధి పొందడానికి అదీ ఒక ప్రధాన కారణమే.

ఆ కొత్త చెలిమివల్ల శ్రీశైలానికి మల్లవిద్యలో అంతగా పాటవం లభించలేదు. కాని రంగనాయకునికి మాత్రం క్రమక్రమంగా మద్యసేవ, నెరజాణ లయిన వారాంగనల నృత్యాభినయాలపై అనురక్తి అలవడ్డాయి. శ్రీరంగంలో కాంతామణి లాస్యంలో, నృత్యంలో పేరు మిగిలిన నర్తకి. శ్రీశైలంతో కలిసి రంగనాయకుడు నాలుగయిదుమార్లు

ఆ సుందరి అభినయ చాతురి లోతు లవగాహన చేసుకొన్నాడు. అంతేకాదు. ఒకనాటి రాత్రివేళ నృత్య సమయంలో పైడి మువ్వలు పొదిగిన అందెల జత కూడా బహూకరించాడు. ఇరుగు పొరుగుల ద్వారా ఆ వార్త హేమసుందరి చెవిని పడింది. అయినా ఆమె వినీ విననట్టు మాట్లాడకూరుకొన్నది. అంతేగాని, ఇదేమని నిలవరించ లేదు.

ఆపైన అర్ధరాత్రి దాటినదాకా ఒక్కనాడు అత డింటికి చేరుకోలేదు! ఆనాటి కానాటికి హేమసుందరి ఓరిమి క్షీణించింది. మరి సహించలేక ఒకనాటిరాత్రి అణగించి వేసుకున్న అక్కస్సుతో డగ్గుత్తికతో నిలవరించింది:

"రోజు రోజు అపరాత్రి వేళదాకా ఆ ధర్మకర్త భవంతి ముందు పడిగాపులు పడి కూర్చోవడంతో, మీ కాళ్ళరిగి పోతున్నాయిలా ఉంది! ఇక ఇంతటితో ఈ ప్రయత్నం కట్టిపెట్టి మరోపని ఏదయినా చూచుకోరాదా?"

ఆ ప్రశ్న అతని హృదయంలో అప్పుడే పదును పెట్టిన బల్లెం మొనలా పొడుచుకుంది! విసుగుదలతో మేళమించిన చిరాకుతో పెడముఖం పెట్టుకొని కూర్చున్నాడు:

"నే నీ మధ్యన ఆ ధర్మకర్త భవంతివైపే వెళ్ళ లేదు."

"మరి రోజు రోజు అపరాత్రివేళ దాకా ఏమి చేస్తున్నట్టు?"

"ఏదో కాలక్షేపంకోసం అప్పు డప్పుడు కాంతామణి భామ కలాపానికి వెడుతున్నాను! అంతే! ఏం వెడితే తప్పా!"

"తప్పని ఎవరన్నారు! దగ్గిర దాచిపెట్టుకొన్న నగలు, నాణ్యాలు అయిపోయిన తరవాత, మనం ఇద్దరం చిప్పచేత్తో పుచ్చుకుని శ్రీరంగం వీథుల్లో అడుక్కుని తినాలేమో అని భయ పడుతున్నాను! అంతే!"

దానితో రంగనాయకుడు కస్సుమన్నాడు:

"ఆ యాతన పడవలసినవాణ్ణి నేనొక్కణ్ణేగాని మధ్యన నీకేం?"

ఆ ఎత్తి పొడుపుతో హేమసుందరి ముఖం కెంపుల రాశిలా ఎర్రబడింది. చెక్కిళ్ళపై కన్నీరు దిగజారింది. మరి భరించలేక చీర చెరగుతో ముఖం కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. అప్పటికిగాని రంగనాయకునికి తానన్నమాట కున్న పదునెంతటిదో బోధపడలేదు. క్షణంలో తన తప్పిదం గ్రహించు కొని నాలిక కరుచుకుని మన్నించవలిసినదని కాళ్ళా వేళ్ళాపడి బ్రతిమాలుకొన్నాడు. హేమసుందరి ఆ ప్రార్థన వినీ విననట్టు మాట్లాడ కూడుకొన్నది. ఇంచుమించుగా ఒక అరగడియ సేపు ప్రాధేయపడిన పిమ్మట ఆమె మనోవేదన రవంత ఉపశమిం చింది. ముఖంలో కొంచెం ప్రసన్నత గోచరించింది. ఆనాటి నించి రంగనాయకు డెప్పుడు ఇంటికి చేరుకోవడానికి కంతగా ఆలస్యం చెయ్యలేదు. కాని, కాంతామణి నృత్యోత్సవాలమీద అతని అభినివేశ మేమాత్రము సడలలేదు. అవి తటస్థపడినప్పుడు మాత్రం అనుకున్న దానికంటె ఎక్కువ ఆలస్యంకాక తప్పలేదు! క్రమక్రమంగా హేమసుందరి నది ఒక పీడని మనశ్శల్యంలా పట్టుకుని వేధించింది. అయినా ఆమె అతని నెన్నడు పల్లెత్తు మాటయినా అనలేదు.

అలాగ మరి కొన్ని రోజులు గడిచిన తరవాత రంగ నాయకుడు ఒకనాటి సాయంకాలం కాలక్షేపం కాక రంగనాథ దేవాలయానికి పోయి స్వామిని సందర్శించి తీర్థ ప్రసాదాలు తీసుకొని, పుష్కరిణి ఒడ్డున కూర్చున్నాడు. ఆ సమయంలో అతనికి తన మొక్కుబడి సంగతి జ్ఞాపకం వచ్చింది. శ్రీరంగం చేరుకోగానే మొక్కు చెల్లించుకోవాలని అనుకున్నాను. కాని. ఎన్నాళ్ళకి మంచిరోజే కుదరలేదు ! స్వామికి నామీద దయ తప్పిందేమో ! ఇంకొకసారి వెళ్ళి శుభముహూర్తం సంగతి అడ గాలి. ఏదో ఒక మోస్తరు ముహూర్తమయినా సరే, కుదర్చ మని తొందర చెయ్యాలి !" అని చిన్న నిట్టూర్పు విడిచి పెట్టాడు. అంతలోనే తలవని తలంపుగా అతని కల్లంతదూరంలో గోపాలయ్య కనిపించాడు. రంగనాయకుడు తన కన్నులే నమ్మ లేక కనబడిన వ్యక్తి గోపాలయ్య అవునో కాదో అని క్షణం కాలం తటపటాయించాడు.

"నిజమే ! గోపాలయ్యే !" అనుకొని సమీపించి అతనిని గాఢాలింగనంతో బంధించాడు. కుశల ప్రశ్నాదికం జరిగిన తరవాత గోపాలయ్య నిచుళాపురం విశేషాలొక టొకటే తన నెచ్చెలి కెరిగించాడు. మొత్తంమీద మిత్రుని ముఖతః కొన్ని విని, ఆపైన రంగనాయకు డూహించుకొని గ్రహించిన వృత్తాం తాలివి.

హేమసుందరితో కలిసి, రంగనాయకు డెక్కడికో వెళ్ళి పోయాడన్న దారుణవార్త చెవిని పడగానే వెంకట నాయ కుడు ఒక్కసారిగా గుగ్గిలం చల్లిన అగ్గిలా భగ్గుమని మండి పడ్డాడు. ఆపైన మరి తన దగ్గిర కుమారుని ప్రస్తావనే ఎత్తనీయ

లేదు ! అంతటితో తన శని విరగడయిపోయిందని మాట్లాడ కూరుకొన్నాడు. అతనిమాట కెదురాడలేక అన్న లిద్దరు కొన్ని రోజులపాటు లోలోపలే మథనపడ్డారు. కాని, క్రమక్రమంగా పొలాల పనుల గొడవలలో పడి ఆ మాటే తలపెట్టడం మానుకొన్నారు.

తల్లిమాత్రం కొడుకు కెక్కడికి వెళ్ళిపోయాడో ఏమయి పోయాడో అని పరిపరి విధాల ఆరాటపడింది. వెతికించి తిరిగి ఇంటికి తీసుకురావలసిందని మాటి మాటికి భర్త చెవిలో ఇల్లు కట్టుకుని పోరింది కాని, ఏవంతయినా ప్రయోజనం కలగలేదు ! పైగా ఆ మాట తలపెట్టగానే వెంకటనాయకుడు తొక్క తొక్కిన కోడెతాచులా కస్సుమన్నాడు. మరి గత్యంతరం లేక లక్ష్మి దేవమ్మ గుక్కనీరు కుక్కుకుని తన పూర్వజన్మ ఘోరపాతిత్య మేదో ఆ విధంగా పరిణమించినదని కొంతవరకు సమాధాన పడింది. కాని, కొడుకుకోసం బెంగ పెట్టుకుని నానాటికి చిక్కి శల్యమయింది.

హేమసుందరి నిచుళాపురంనించి వెళ్ళిపోయినందుకు మాణిక్యవల్లి మొట్టమొదట ఎంతయినా సంతోషించింది. స్వయంగా తానే మిక్కిలి విలువయిన తల్లినగలు కొన్ని చెల్లెలి చేతి కందించింది. అర్ధరాత్రి వేళ అందరు ఆదమరచి నిద్ర పోతున్న వేళ చల్ల చల్లగా సాగనంపి తనమార్గం నిష్కంటకం కాగలదని ఎంతో సంతోషించింది. తెల్లవారిన తరవాత తన కేమి తెలియనట్లు, అందరితో బాటే లబోదిబో మని గోలపెట్టి గొంతెత్తి ఆక్రోశించింది.

శృంగారమంజరి తన ఆమూల్యాభరణాలు పోయినందు కెంతో దుఃఖించింది. ఆ మరునాడు ఆమె అన్నపానాలే ముట్ట లేదు. ఎలాగో అలాగ గుండె రాయి చేసుకొని తలవరి దగ్గరికి వెళ్లి తన నగలతో బాటు, కుమార్తె నెలాగయినా ఇంటికి రప్పించ వలసిందని ప్రాధేయపడింది. నాంచారమ్మ ద్వారా తిరుమలరెడ్డికి ఆ సంగతి తెలియజేసి, శాయశక్తుల సాయపడ వలసిందని వేడుకొన్నది. తన మోకాలు కీలు కొంచెం నయ మయిన తరవాత రంగనాయకుడెక్కడ తల దాచుకొన్నా హతమార్చి వేయ గలనని, హేమసుందరిని తప్పక నిచుళా పురానికి తీసుకురాగలనని చెప్పి, రెడ్డి ఆ దాసి ముఖతః శృంగా రమంజరి నోదార్చాడు.

కాని అతని మోకాలెంతకాలానికి తిన్నబడలేదు. మొట్ట మొదట అది కొంచెం దారిని పడుతున్నట్టే కనిపించింది. క్రమక్రమంగా బాగా ఆధ్వాన్నమయింది! శల్య వైద్యులిక తాము చెయ్యగలిగినదేమి లేదని చెప్పి ఒక నమస్కారం పెట్టి తప్పుకొన్నారు. ఆనాటినించి రెడ్డి లోలోపల పేరుకొన్న అక్క సుతో అట్టుడికినట్టుడికిపోయాడు. ఎలాగో అలాగ అతి కష్టం మీాద మేనాలో కూర్చుని దండనాయకుని సందర్శించి హేమ సుందరీ రంగనాయకుల నెలాగయినా గాలించి పట్టుకుని, నిచుళా పురానికి తీసుకొనివచ్చి తగిన శాస్తి చేయించవలసినదని అదే పనిగా మొరపెట్టుకొన్నాడు. అతడు రెడ్డి దీనస్థితి కెంతో జాలి వడి తన యావచ్ఛక్తి వినియోగించి, తప్పక ప్రయత్నించగల నని మాట ఇచ్చాడు. అయితే రాజభటుల కెవ్వరికి కాంచీ రాజ్యంలో ఎక్కడ హేమసుందరీ రంగనాయకుల జాడ కనబడ లేదు! వారిద్దరు పాండ్య రాజ్యంలోనో, లేక వేరొక దూర

దేశంలోనో తలదాచుకొని ఉండవచ్చునని అనుమానించారు. అయితే ఆ రాజభటుల కెవ్వరికి పరరాజ్యాలలో ప్రవేశించే అధికారం లేదు. అందుచేత వారి అన్వేషణ ప్రయత్నం యావత్తు అంతటితో పరిసమాప్తమయింది.

తలవని తలంపుగా తిరుమలరెడ్డిమీద విరుచుకు పడిన ఘోరాపద తలుచుకొని, మాణిక్యవల్లి కుమిలి, కుమిలి దుఃఖించింది. అది గమనించి శృంగారమంజరి ఆమె గదిలోకి వెళ్ళి, "ఎందుకమ్మా! నీకీ లేనిపోని మథన! గట్టిగా తలుచుకుంటే నీకిన్ని విధాల తగిన సరసుడే దొరకకపోతాడా ఏమిటే! అదీగాక, నీవేమయినా మగనాలివా ఏమే! అయ్యో! వెర్రిదానా! ఎందుకే నీకింత చింత!" అని ఓదార్చి బుజ్జగించింది. ఆ మరునాటినించి అటువంటి అపూర్వ భాగ్యశాలి అన్వేషణలో పడింది. మరి కొన్నాళ్ళు గడిచిన తరవాత సిరిసంపదలలోనే కాక, ఈవిలో కూడా తిరుమలరెడ్డినే తలదన్నగలిగిన బేహారి ఒకడు కాంచీపురంనుంచి తనంతట తానే స్వయంగా శృంగారమంజరి భవంతికి విజయం చేశాడు. అతని రాకతో వెదకబోయిన తీగ అకస్మాత్తుగా కాళ్ళ కడ్డపడినట్టే ఆ వేశ్యాజనని ఆనందించింది. "మన రెడ్డికన్న ఈయనే గొప్ప ఐశ్వర్యవంతుడు. పైగా ఆయనకన్న బాగా వయస్సు ముమ్మరంలో ఉన్నాడు. ఆపైన నీవిపాటికి ఎవరినో ఒకరిని ఆశ్రయించి అంటిపెట్టుకుని ఉండక తప్పదు! అందచందాల కేమిటి లే! కొరుక్కుని తింటామా! ఆ రెడ్డిమాత్రం నవ మన్మథుడా ఏమిటే, నీ వెర్రిగాని!" అని శృంగారమంజరి కుమార్తె చెవిలో మాటిమాటికి ఘోష పెట్టింది. మాణిక్యవల్లి మరి కాదనలేక ఆ బేహారితో

కొంతకాలందాకా కొంచెం చాటుగానే గ్రంథం నడిపించింది. క్రమక్రమంగా ఆ సంకోచం కూడా పూర్తిగా తొలగి పోయింది :

ఆ సంగతులన్నీ విని రవంత సేపాలోచించిన తరవాత రంగనాయకుడు తల్లి పరిస్థితిని తెలుచుకుని కొంచెం విచారించాడు. కాని, తానిక చేయగలిగిన దేది లేదని సమాధానపడి ఉసూరుమని విశ్వసించాడు.

"గోపాలయ్యా ! నాకిదంతా తెలుచుకుంటే ఏదో పీడ కలలా ఉంది ! కాని, ఏమి చెయ్యను ! ఏది ఎలాగ జరగవలసి ఉంటే అలాగ జరిగిపోతుంది. సరేలే గాని, ఆ రెడ్డికిమాత్రం మంచి శాస్తి జరిగింది ! మరి తనంతటి ఐశ్వర్యవంతుడు లేడని మహా మిడిసిపడిపోయాడులే !"

కాని, గోపాలయ్య కతని సంతృప్తి అంతగా రుచించక తిరిగి గట్టిగా హెచ్చరించాడు :

"రంగా ! ఇల్లలకగానే పండుగ అయిపోయిందని మురిసి పోతున్నావు ! కాని చిట్టచివరి కెలాగో అలాగ రెడ్డి పగ తీర్చు కోకమానడు ! ఇప్పటి కతగాడు కోర లూడ బెరికిన ముసలి తాచులా పడిఉన్నాడు ! కాని ఎప్పటి కే పన్నాగం పన్నగలడో ఎవరు చెప్పగలరు ! జాగ్రత్త."

రంగనాయకు డది విని లీలగా చిరునవ్వు చిందించాడు !

"అంతగా ముంచుకువస్తే, అప్పటి మాట చూచుకుందాంలే ! ఏదో ఆ స్వామి దయవల్ల నీ చలవవల్ల ఇప్పటి కిలాగ బయటపడ్డాను గదా !"

అయినా గోపాలయ్య తన ధోరణి విరమించలేదు. మళ్లీ తిరిగి చూపుడు వేలెత్తి గట్టిగా హెచ్చరించాడు:

"ఇంకొక్కమాట। హేమసుందరి నీమీద వల్లమాలిన మమకారంతో తల మునకలయిపోతున్నదని మురిసిపోతున్నావు! కాని, నీ దగ్గర సొమ్ము కాస్తా అయిపోగానే, తన దారి తాను చూసుకుని ఇంకొకరి నెవరినయినా చేపట్టి తీరుతుంది! ఈవేళ కాకపోతే రేపటికయినా నే నన్నట్టు జరిగితీరుతుంది। కొంచెం ఒళ్ళు దగ్గిర పెట్టుకుని మసులుకో!"

ఆ బెదరింపుతో రంగనాయకుని కెంతో కోపంవచ్చింది. అయినా అత డది అతి కష్టంమీద లోలోపలే నిగ్రహించుకొని పెడముఖం పెట్టుకొన్నాడు:

"గోపాలయ్యా! హేమసుందరి మనసు వంటిదో నీకు తెలియదు! ఇక ఈ గొడవ నా దగ్గిర తలపెట్టవద్దు! అంతే! అనవసరంగా ఎందుకు నీకీ కంఠశోష!"

ఆ ప్రత్యుత్తరంతో గోపాలయ్య మరింతగా రెచ్చిపోయాడు:

"ఇదిగో। నేనిక ఈ సంగతి నీతో ప్రస్తావించనులే! కాని ఒక్కమాట! వారకాంతల వలలో పడిన అమాయకు లందరు మొట్టమొదట అచ్చంగా నీలాగే భ్రమపడ్డారు। చిట్ట చివరకి తిరుమలరెడ్డి గతి ఏమయిందో చూశావుగా! ఇప్పటి కయినా మించిపోయిం దేమీ లేదు! కొంచెం తెలివి తెచ్చుకుని జాగ్రత్త పడు!"

రంగనాయకు డిక స్నేహితునితో వాదం కొనసాగించ దలుచుకోలేదు! ఉసూరుమని విశ్వసించి, తన తుది నిర్ణయం విస్పష్టంగా వెల్లడించాడు:

"గోపాలయ్యా! మొట్టమొదట నే నిక్కడికి రావడాని కిష్టపడకపోయినా, చూచిచూడనట్టు మాట్లాడ కూరుకున్నావు! ఇక ఇప్పుడిది మంచిపని కాదంటే మాత్రం లాభ మేమిటి? ఇంత వరకు వచ్చిన తరవాత మళ్ళీ ఏ ముఖం పెట్టుకుని నిచుళాపురం రాగలను! అయిన దేదో అయిపోయింది! ఏది ఏమయినాస రే, మరి వెనకంజ వెయ్యదలుచుకోలేదు! అన్నిటికి తెగించే ఇక్కడికి వచ్చాను! తిరిగివెళ్ళి నా సంగతి మా వాళ్ళతో చెప్పినాస రే, మరి నే నక్కడికి రాదలుచుకోలేదు! వెయ్యి చెప్పు! లక్ష చెప్పు! దీని కిక తిరుగులేదు! అంతే!"

ఆ తరవాత గోపాలయ్య ఆ మాటే తలపెట్టలేదు! అంటి అంటనట్టు రంగనాయకుని కుటుంబ పరిస్థితు లడిగి తెలుసుకుని, తిరిగి తాను దిగిన సత్రానికి ప్రయాణ మయినాడు. ఇంటికివచ్చి తనతోబాటు భోజనంచేసి వెళ్ళవలసినదని రంగనాయకుడు అతని ననేక విధాల బ్రతిమాలుకొన్నాడు. గోపాలయ్య కొంచెం సేపాలోచించి ఎంతో మెళుకువతో తప్పించుకొన్నాడు:

"రంగా! మీ ఇంటికివస్తే ఒకటి రాకపోతే ఒకటేనా! ఈసారికి నన్ను వెళ్ళనీ! రెండు, మూడు వారాలలోనే తిరిగి ఇక్కడికి వస్తానులే! అప్పుడు తిన్నగావచ్చి, మీ ఇంటిలోనే దిగుతాను! సరిగదా! స్వామి నొకసారి సందర్శించుకోవాలని పంకపెట్టి నిజంగా నీకోసమే నే నిక్కడికి వచ్చాను. తలవని తలంపుగా నువ్విక్కడే తటస్థపడ్డావు! లేకపోతే రేపు ఉదయమే లేచి నీకోసం శ్రీరంగం అంతా గాలించి ఉందును! ఇప్పు డిప్పుడే దర్శనం ముగించుకొని ప్రసాదం తీసుకొన్నాను. మరి ఆకలిలేదు. అదీగాక, రేపు మధ్యాహ్నానికి తిరిగి నిచుళాపురం వెళ్ళితీరాలి! ఇక నన్ను పోనీ!"

తనతో కలిసి భోజనం చెయ్యడానికి గోపాలయ్య కేమాత్రం ఇష్టంలేదని రంగనాయకు డూహించుకొన్నాడు! అందుచేత మరి బలవంతపెట్టలేదు. అంటే అంటనట్టు మరికొంత సేపు తమ కుటుంబ వ్యవహారాలమీద ప్రసంగం కొనసాగించిన తరవాత స్నేహితు లిద్దరు ఒకరి కొకరిని వీడ్కొన్నారు.

# 15

గోపాలయ్య వెళ్ళిపోయిన తరవాత రంగనాయకుడు మరికొంత సేపటివరకు నిశ్చల శిలాప్రతిమలా నిలబడి ఉసూరు మని ఒక వేడి నిట్టూర్పు విడిచిపెట్టాడు. క్షణకాలం విపరీత మయిన వేదనతో అతని హృదయం స్తంభించింది. ఇక ప్రపంచంలో తా నొక్కడే ఏకాకిగా నిలబడ్డట్టు స్ఫురించింది. అతనికి గోపాలయ్యకన్న ఆత్మీయ మిత్రు డెవ్వడు లేడు! అటువంటి వాడే ఈ నాడు తన సరసన కూర్చుని భోజనం చెయ్యడానికే సంకోచించాడు! ఇక తండ్రి తన మాట తలపెట్టగానే భగ్గుమని మండిపడుతున్నాడు. చిన్ననాటినించి కడగొట్టు కుమారు డని ఎంతో ఆప్యాయంగా పెంచిన కన్నతల్లి కూడా ఆయన మాట కెదురాడలేక మాట్లాడ కూరుకొన్నది. మరి అన్న లిద్దరు తన గోడే తలపెట్టకపోవడంలో ఆశ్చర్యం ఏమి ఉన్నది? హేమ సుందరి కూడా ఎప్పటి కయినా తన దారిని తను తరలి గలదని గోపాలయ్య గట్టిగా హెచ్చరించాడు. కాని రంగనాయకుని కంతటి అపనమ్మకం కలగలేదు. అయినా చిన్న అనుమాన మేదో లోలోపల కొంచెం పీడించక పోలేదు! కన్న తల్లి

దం(డులే దులిపివేసుకొన్న తరువాత ఎక్కడినించో వచ్చిన హేమసుందరి కలకాలం తానే దైవమని నమ్ముకుని అంటిపెట్టుకుని ఉండగలదా ? ఏమో ఎవరు చెప్పగలరు ?

అన్నిటికన్న గోపాలయ్య తిరస్కృతి అతని కెంతో వేదన కలిగించింది. ఆ వ్యథతో అతని కిక కాళ్ళాడలేదు. మొట్ట మొదట తిన్నగా ఇంటికే వెళ్ళిపోవాలని నిశ్చయించుకొన్నాడు. కాని అంతగా పొద్దుపోయినట్టు కనబడలేదు. కాలక్షేపం కోసం కొంతసేపు కావేరి తీరంలో విశ్రమించా లనుకొన్నాడు. అప్రయత్నంగా అతని పాదా లటువైపు సాగిపోయాయి. అల్లంత దూరంలో కావేరి చల్లని పిల్ల తెమ్మెరలతో అలల సవ్వడితో కన్న తల్లిలా ఆహ్వానించింది. కుడివైపున కొంత దూరంలో శ్రీరంగేశుని ఉత్సవమూర్తి మేళతాళాల కోలాహలంలో క్రమ క్రమంగా ముమ్ముందుకు సాగిపోయింది. రంగనాయకుడు చేతు లెత్తి స్వామికి నమస్కరించి ఇసుకతిన్నె మీదికి పోయి కూర్చున్నాడు. ఏవేవో ఆలోచన లల్లి బిల్లిగా అల్లుకుని అతని మనస్సు బాగా కలగించివేశాయి. అలాగ ఎంతసేపు గడిచిందో అతనికే తెలియదు.

క్రమ క్రమంగా బాగా చీకటిపడింది. ఉత్సవ కోలాహలం పూర్తిగా మందగించింది. నీరవ నదీ ప్రవాహంలో నక్షత్రాల కాంతి మాత్రమే స్పష్టాస్పష్టంగా గోచరించింది. అక్కడక్కడ కెరటాలలో నుండి తెల్ల తెల్లని చిరు మీనులు కొన్ని పై పై కెగిరిపడ్డాయి. సన్నని కీచురాళ్ళ మోత జీవిత సంగీతాని నంతటికి మంద్రాతి మంద్రమయిన మధుర శ్రుతిలా వినిపించింది. కొంచెం దూరంలో రెల్లుగుబురులలో జలపక్షుల

కలకలారావం కర్ణ పేయంగా వినిపించింది. ఆకాశంలో మబ్బుల మాటున దాగిన నెలవంక వెలుగు గాలిలో కదలాడుతున్న రెల్లు పూలు కొక విధమయిన వింత సోయగం కలిగించింది. అప్పటికి ఆశ్వయుజమాసం ప్రవేశించి రెండు మూడు రోజులే అయింది. అందుచేత చిరు చలికి సంకోచించిన శ్రీరంగ నగర వాసు లెంతోమంది కావేరీ తీరానికి రాలేదు. వచ్చినవా రొక రొకరే తిరిగి వెళ్ళిపోయారు. ఆ పైన ఆ పరిసరంలో ఎక్కడ మానవ సంచారమే గోచరించలేదు! అంతలోనే అనతి దూరంలో నీటిగట్టు కవతల ఉన్న మర్రిచెట్టుమీద కొక్కెర కూత వినిపించింది.

రంగనాయకుడు ఉలికిపడి లేచి నిలుచున్నాడు. అప్పటికి గాని అతనికి బాగా చీకటి పడిన దన్న సంగతి స్ఫురించలేదు! తిరిగి ఇంటికి వెళ్ళిపోవాలని నిశ్చయించి తొందర తొందరగా రెండు మూడడుగులు వేశాడు. అంతే! నెత్తిమీద పిడుగు వంటి పెద్ద దెబ్బ పడింది. ఆ దారుణాఘాతంతో అతని తల రెండు చెక్కలయి విడిపోవలసిందే! విపరీత వేదనతో విలవిల లాడి వెనక్కి తిరిగి చూశాడు! పోత విగ్రహం వంటి ఒక వ్యక్తి తిరిగి తన చేతనున్న బాణాకర్ర పైకెత్తాడు. మరుక్షణం లోనే దాని దెబ్బతో అతని శిరస్సు తుత్తునియలై పోవలసిందే! కాని మొండి ధైర్యంతో కళ్ళు మూసుకుని, ప్రత్యర్థి మీదికి లంఘించాడు. రెండు మూడు క్షణాలపాటు వా రిద్దరికి మధ్య పెద్ద పెనుగులాట చెలరేగింది. చిట్టచివరికి రంగనాయకునిదే పై చెయ్యి అయింది. మిక్కిలి చాకచక్యంతో మీది కురికి ప్రత్యర్థిచేత నున్న బాణాకర్ర చేజిక్కించుకొన్నాడు. ఉత్తర క్షణంలోనే ఆ వ్యక్తి బాగా భయపడి కాలికొద్ది పరుగు

ప్రారంభించాడు. అయినా రంగనాయకు డతనిని విడిచిపెట్ట లేదు. డేగలాగ వెంటబడి తన యావచ్ఛక్తి వినియోగించి నడి నెత్తిమీద గట్టిగా కొట్టి హుంకరించాడు.

ఆ తీవ్రాఘాతంతో మరి అడుగు వెయ్యలేక వాడక్కడే చాప చుట్టలా కూలబడిపోయాడు! అంతలోనే రంగనాయ కునికి తగిలిన గాయంలోనించి పైకుబికిన రక్తం చెక్కిళ్ళపై జాలువారింది. పైనున్న ఉత్తరీయం చించి అతడా గాయానికి గట్టిగా కట్టు బిగించాడు. పడిపోయిన వ్యక్తి దగ్గరికి వెళ్ళి ముఖ కవళిక జాగ్రత్తగా పరిశీలించాడు. మొట్టమొదట మసక చీకటిలో స్పష్టంగా గుర్తు తెలియలేదు. మళ్ళీ ముఖంమీద ముఖంపెట్టి పరకాయించాడు. వాడెవడో అపరిచిత వ్యక్తి కాడు! సింహాచలం! అతగాడికి తగిలినది బాగా గట్టిదెబ్బ! దానిలోనించి రక్తం ధారకట్టి ప్రవహించింది. అప్పటికిగాని రంగనాయకునికి తాను కొట్టిన దెబ్బ ఎంతటి దారుణమైనదో బోధపడలేదు. సింహాచలంమీద వల్లమాలిన జాలితో తల మునకలై గాయానికి కట్టు కట్టాలని ప్రయత్నించాడు. కాని ఎక్కడ జీవమున్న జాడే కనపడలేదు. శరీరం అటు ఇటు కదిపి చూశాడు. సన్నని మూలుగయినా వినబడలేదు. మరికొంత సేపటి వరకు మునివేళ్ళతో ఊపిరి పరిశీలించాడు. ఇక సందేహం లేదు. సింహాచలం ప్రాణం పోయింది. ఒకటి రెండు నిమిషాల వరకు రంగనాయకుని కేమి చెయ్యడానికి పాలు పోలేదు. తిరిగి తిన్నగా తన దారిని తాను ఇంటికి వెళ్ళిపోవాలని అనుకొన్నాడు. కాని కాళ్లాడలేదు. అంతలోనే అతని కది క్షేమ కరమయిన పద్ధతి కాదని స్ఫురించింది. మరునా డుదయమే

రాజభటు లా దారుణం కనిపెట్టి అడుగుజాడలతో తన సంగతి పసికట్టి అనుమానపడవచ్చును.

క్షణకాలం తీవ్రంగా ఆలోచించి సింహాచలం కాళ్ళు రెండు దొరక పుచ్చుకుని కావేరీ ప్రవాహ మధ్యం లోని కీడ్చుకు పోయాడు. అతని మృతకళేబరం మరికొంతదూరం కొట్టుకు పోయే వరకు అలాగే నిలబడి కావేరిలో స్నానంచేసి, తడిబట్టలు పిండుకుని తిన్నగా తన ఇంటివైపు సాగిపోయాడు. విపరీతమైన ఆందోళనవల్ల, శిరోవేదన వల్ల, బడలికవల్ల ఎంతగా ప్రయత్నించినా తొందరగా అడుగుపడలేదు. అలాగే కాళ్ళీడ్చుకుంటూ అతి కష్టంమీద అర్ధరాత్రి కింటికి చేరుకొన్నాడు.

హేమసుందరి అతనికోసం నిరీక్షిస్తూ అంతవరకు వీధి గుమ్మంలోనే నిలుచున్నది. నెమ్మదిగా కాళ్ళీడ్చుకుంటూ ఇంటిలో అడుగు పెట్టగానే రక్తసిక్తమయిన తలకట్టు పరిశీలించి "అయ్యో! ఇదేమిటీ గాయం!" అని నిలువునా నిర్ఘాంత పడి లోపలికి తీసుకుపోయి శయ్యమీద విశ్రమింపజేసి పరిచర్య ప్రారంభించింది. ఆదరాబాదరాగా బిగించిన తలకట్టు విప్పి కుంకుమ అద్ది వేరొక కొత్త కట్టు కట్టింది. విపరీతమయిన నిస్త్రాణవల్ల రంగనాయకునికి కొంచెం మగత నిద్ర పట్టింది. రెండు మూడు నిమిషాలలో తిరిగి కొంచెం మెళకువ రాగానే జరిగిన సంగతి అంతా సంగ్రహంగా ఆమెతో చెప్పి కళ్ళు మూసుకుని ఉసూరుమని విశ్వసించాడు. హేమసుందరి చెక్కిళ్ళపై దిగజారుతున్న కన్నీరు తుడుచుకుని "ఇంతకి మనం అదృష్టవంతులమే! వాడా దెబ్బ కత్తితో కొట్టలేదు!... అయితే మనం ఇక్కడ ఉన్న సంగతి వాడెలాగ కనిపెట్టాడో!"

అన్నది. రంగనాయకుడు ఆమె కేవిధంగాను ప్రతి సమాధానం చెప్పలేదు. కాని అదే సంగతి ఆలోచించాడు. పగబట్టిన తిరుమల రెడ్డి స్వయంగా సింహాచలాన్ని ఇక్కడికి పంపించి ఉండవచ్చును. లేక లోలోపల పేరున్న అక్కసుతో వాడే తన కసి తీర్చుకుని తీరాలని ప్రయత్నించి ఉండవచ్చును. శ్రీరంగం వచ్చి తనకోసం నలువైపుల గాలించి ఉండవచ్చును. కంట పడగానే వెంటాడి సమీపంలో ఎవ్వరు లేరన్న సంగతి కని పెట్టి, దుడ్డుకర్రతో చావమోది ఉండవచ్చును. ఆ సమయంలో సింహాచలం దగ్గర చిన్న బాకు గాని, కత్తి గాని లేవేమో! ఉంటే తా నీపాటికి పరలోకం చేరుకుని ఉండవలసిందే! దైవానుగ్రహంపల్లనే తా నా ఘోరాపద తప్పించుకుని బయట పడ్డాడు. ఒకవేళ రెడ్డి ప్రోత్సాహమే సింహాచలంచేత ఇంతటి సాహసాని కి డిగట్టించిందేమో! ఆనాడే ఆ విషసర్పాన్ని హతమార్చివేసి ఉండవలసింది. ఒకవేళ అతగాడు పంపిస్తే మాత్రం! వీ డిక్కడికి వచ్చి ఇంతటి దారుణాని తల పెట్టాలా ? రెడ్డి కేం! మోకాలు కీ లూడినా సుఖంగానే కాలక్షేపం చేస్తున్నాడు! పాపం సింహాచలమే చిట్టచివరి కీ విధంగా ప్రాణాలు పోగొట్టుకుని కావేరిపా లయినాడు. అయ్యో! ఎంత పని చేశా నీవేళ!" రంగనాయకుని ఆలోచనా పరంపర లావిధంగా సాగిపోయాయి.

మరికొంతసేపటి కతనికి బాగా జ్వరం తగిలింది. తెల్లవారేవరకు మరి కన్ను తెరవలేదు. తెల్లవారు జామున చెరుపు మరుపు మాట లారంభించాయి. "పోనీయకు! పోనీయకు! పట్టుకో! పట్టుకో! పారిపోతున్నాడు!" అన్న ధోరణితో కలవరింత ప్రారంభించింది. మరికొంతసేపటికి అది కొంచెం

తగ్గింది. కాని ఆ పైన మాటిమాటికి అతని నోట "కాంతామణీ! ఇదిగో! నీ బహుమతీ! నామాట వినవా!" అన్న అనునయ ప్రసంగం ప్రారంభమయింది. ఇంచుమించుగా భళ్ళుమని తెల్లవారేవరకు హేమసుందరి చెవిదోయిలో అదే ధోరణి ప్రతిధ్వనించింది. ఆ మరునాడు కూడా ఆ పరిస్థితి మారలేదు!

అది గమనించి హేమసుందరి చాలా భయపడింది. ఇరుగుపొరుగువారి తోడ్పాటుతో శ్రీరంగంలో పేరెన్నికగన్న ఒక వైద్య శిఖామణిని ఇంటికి పిలిపించింది. మిక్కిలి జాగరూకతతో చికిత్స చేయించింది. పొద్దస్తమానము రంగనాయకుని పాన్పు పక్కనే కనిపెట్టుకుని ఉండి శాయశక్తులా పరిచర్య చేసింది. క్రమక్రమంగా ఏడెనిమిది రోజులలో అతని జ్వరం తగ్గింది. నడినెత్తిమీద తగిలిన గాయం బాగా నయమయింది. కాని కొంచెం నిస్త్రాణ మాత్రం మిగిలింది. క్రమక్రమంగా అది కూడా చాలావరకు తగ్గిపోయింది. ఆ తరవాత ఒకనాటి రాత్రి హేమసుందరి కర్పూరం తాంబూలం రంగనాయకుని చేతి కందించింది. అయినా అతడది అందుకోలేదు. పరధ్యానంగా ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"ఇదేమిటి ఇలాగున్నా రీవేళ?"

హేమసుందరి ఎంతో ఆత్రంగా ప్రశ్నించింది. అయినా అతడు బదులు పలకలేదు! హేమసుందరి అతని శిరస్సెంతో ఆప్యాయంగా కౌగలించుకొని కళ్ళల్లో కళ్ళు పెట్టి ఎంతో ఆత్రతతో బ్రతిమాలుకొన్నది:

"ఎందుకో గాని బెంగపెట్టుకున్నట్టున్నారు! ఎందు కింతటి ఆరాటం? ఆమాత్రం నాతో చెప్పకూడదా?"

రంగనాయకు డెంతో ఆశ్చర్యపడ్డాడు.

"బెంగ పెట్టుకోవడ మేమిటి? ఏమీ లేదే! పాపం ఆ సింహాచలం కుటుంబానికి ఎంత ఆపద వచ్చిందా అని ఆలోచిస్తున్నాను అంతే!"

"పోనీలెండి! నాతో చెప్పడం మానివేస్తున్నారా? మీ రెందు కింతగా పరధ్యానంగా ఉన్నారో నాకు తెలియదను కొన్నారా?"

రంగనాయకుడు డలాగే ఆశ్చర్యపడి ఆమె విశాల నేత్రాలపై నవలోకించాడు.

హేమసుందరి అతని నుదుటిమీద జీరాడుతున్న గిరజాల ముంగురులు మునివేళ్ళతో సరిచేసి తిరిగి గద్గదభరిత స్వరంతో అనునయించింది:

"ఇదిగో! ఇ లాగ చూడండి! ఎందు కలాగ దాచి వేస్తారు. పాపం! ఆ కాంతామణికోసం బెంగపెట్టుకున్నారులా ఉంది! అవునా! కొంచెం నాతో చెప్పకూడదా! చెబితే నేనే మన్నా బాధపడి వల్లకా దంటానని అనుకొంటున్నారా? నేనేమి అనుకోను!"

"పులిమీద పుట్రలాగా ఎప్పుడు లేనిది ఇప్పు డీ కాంతామణి కొత్త గొడవ ఎందుకు వచ్చిపడింది?" అన్నాడు రంగనాయకుడు నిశ్చల శిలాప్రతిమలా నిర్ఘాంతపడి.

"కొత్త గొడవేమి కాదు! ఈ మధ్యన జ్వరం వచ్చినప్పుడు పొద్దస్తమానము ఆ వగలాడి పేరే కలవరించారు!"

రంగనాయకులు ఉదది విని మరింతగా విస్తుపోయాడు !

"ఇదేమిటి ? నా కేమి గుర్తులేదే! నిజంగా నే నామె పేరెత్తి కలవరించానా ?"

"ఒకసారి, రెండుసార్లు కాదు. అస్తమానము అదే ఘోష ! ఇదిగో ! కొంచెం నామాట నమ్మండి ! స్వామి దయ వల్ల ఈనాటివరకు మన కేవిధమయిన లోటు రాలేదు ! అంతే కాదు. నా ఒంటి మీద నగలన్ని అయిపోయినా సరే, మీ కెలాంటి మనస్తాపం కలిగినా నే నది భరించలేను. త్రికరణ శుద్ధిగా చెబుతున్నాను. కాస్త కనికరించి ఈ చనువు చెల్లించండి ! ఇదిగో ఈ ముత్యాలహారం తీసుకువెళ్ళి పది రోజులపాటు ఆమెతో సుఖంగా కాలక్షేపం చేసిరండి. మీ కెందు కింతటి తపన. నేనేమి అనుకోను. నా మాట నమ్మండి. పాపం ! ఆమె కోసం దిగులుపడి నానాటికి చిక్కి శల్యమయిపోతున్నారు !"

కేవలం ఎత్తిపొడవడానికే హేమసుందరి ఆ ప్రసంగం ప్రారంభించినదని మొట్టమొదట రంగనాయకులు ఉనుకొన్నాడు. వీనుదోయివరకు విస్తరించిన ఆమె విశాల విలోచనాల లోతు లవగాహన చేసుకొన్న పిమ్మట అతని సంశయం పూర్తిగా పటాపంచ లయినది. శిరస్సు కొంచెం వంచుకొని హేమ రెండు చేతులు పట్టుకొన్నాడు :

"హేమా ! ఒళ్ళు తెలియని పరిస్థితిలో ఏదో కలవరించి ఉంటాను. అంత మాత్రానికె ఇంతగా మనస్సు కష్టపెట్టుకోవాలా ?"

"అదిగో! అదేమాట! అందుకోసమే నేనిన్ని విధాల బ్రతిమాలుకొంటున్నాను. నా మన స్సేమి కష్టపడలేదు. మీామీాద ఒట్టు పెట్టుకుని చెబుతున్నాను. నామాట నమ్మండి. ఒక్కసారి కాంతామణి భవంతికి వెళ్ళిరండి. ఇంకా నా మాట మీాద నమ్మకం కలగకపోతే నేనేమి చెయ్యను? ఎంత ఒట్టు పెడితే అంత ఒట్టు. సరిగదా!"

అప్పటికి రంగనాయకునికి ఆమె చిత్తశుద్ధి విస్పష్టంగా బోధపడింది. అతని శిరస్సింకా కిందికి వంగిపోయింది. కొంచెం డగ్గుత్తికతో ప్రాధేయ పడ్డాడు:

"హేమా! నిజంగా నావల్ల వల్లమాలిన ఘోరబాటే జరిగిపోయింది. ఈ క్షణం మొదలుకొని నేనిక ఆమె భవంతి గుమ్మం తొక్కను. అంతే కాదు! మరి ఆమె మాటే తల పెట్టను. నీవంటి పైడి పెన్నిధి నట్టింట పొరాడుతున్నా, తిన్నగా గ్రహించుకోలేక కాకి బంగారంకోసం కలవరించాను. అయినదేదో అయిపోయింది. ఇక నేనామె గోడే తలపెట్టను సరిగదా! నన్ను మన్నించు!"

హేమసుందరి చెక్కిళ్ళపై కవోష్ణ భాష్పా లేకధారగా ప్రవహించాయి. తలవంచుకుని ఉసూరుమని నిట్టూర్చి చీర చెరగులతో కన్నీరు తుడుచుకున్నది. రంగనాయకు డనేక విధాల బ్రతిమాలుకొన్న పిమ్మట ఆమె యరుణాధరంపై లేత చిరునవ్వులవోకగా తరళించింది.

# 16

పరిపూర్ణారోగ్యం కలిగిన తరవాత నాలుగయిదు రోజులపాటు రంగనాయకుడు ఇంటిపట్టునే ఉండిపోయాడు. అప్పుడప్పుడతనికి సింహాచలం దారుణ మృతి జ్ఞప్తికి వచ్చింది. పశ్చాత్తాపంతో మాటిమాటికి మనస్సనేక విధాల మథన పడింది. తిరుమలశెట్టి దురాలోచనవల్లనయితేనేమి, సాహసించి శ్రీరంగం చేరుకొని చేజేతుల చేసిన దుశ్చర్యవల్లనయితేనేమి, ఆ దురదృష్టవంతుని కెంతటి ఘోరాపద సంభవించింది! పాపం! సింహాచలం కుటుంబాని కిక దిక్కెవ్వరు? వాడిక్కడికి వచ్చి చనిపోయిన సంగతి కూడా ఇంతవరకు ఇంటిలో ఎవ్వరికి తెలిసి ఉండదు. తలవని తలంపుగా ఆనాడెంతటి ఘోర పాతిత్యానికి ఒడిగట్టుకొన్నాను! నా బ్రతుకంతా చిట్టచివరి కిలా వట్టి అధ్వాన్నంగా మారిపోయిందేమిటి? మాటిమాటికి అతని హృదయంలో మథన ఆ విధంగా చెలరేగింది. తన ఆత్మరక్షణ కంతకన్న వేరే గత్యంతరం లేదని కూడా రంగనాయకు డనుకోక పోలేదు. అదీగాక సింహాచలాన్ని చంపివెయ్యాలని కూడా అతడు మొట్టమొదట సంకల్పించ లేదు. ఒళ్ళెరగని క్రోధావేశంతో కొట్టిన దారుణాఘాతంతో వాడక్కడే చాపచుట్టగా కూలబడి చనిపోయాడు. ఆ విధంగా గట్టిగా కొట్టి ఉండగపోతే సింహాచలం మృతకళేబరానికి బదులుగా తుత్తునియలయిన తన శవమే ఆనాడు కావేరీ ప్రవాహంలో పడి కొట్టుకొని పోయేది! స్వామి కృపవల్లనే తన కంతటి ఘోరాపద తప్పిపోయినదని రంగనాయకునికొక గట్టి నమ్మిక కలిగింది.

బాగా ముమ్మరంగా జ్వరం కాసినప్పుడు, ఆ తరవాత అనుక్షణము అడుగడుగునా ఆందోళన పడి, హేమసుందరి చేసిన పరిచర్య అతని నెంతో కదిలించివేసింది. ఆపైన కాంతా మణి భవంతికి వెళ్ళి హాయిగా సుఖించవలసినదని ఆమె మాటి మాటికి బలవంతంపెట్టిన ధోరణి తలచుకోగానే అతని నేత్రాం తాలలో చిన్న చిన్న కన్నీటి బిందువులు లొకటి రెండు పొట మరించాయి. శృంగారమంజరి బలవంతంవల్ల ఎన్నడో ఒకనాటి అర్ధరాత్రి వేళ, ఎవరో ఒక అపరిచిత వ్యక్తితో అకస్మాత్తుగా హేమసుందరికి సంబంధం కలిగినదని విన్నంతలోనే ఒళ్ళెరగని అక్కస్సుతో అత డామెపై విరుచుకుపడ్డాడు! తిన్నగా తిరిగి నిచుళాపురం వెళ్ళిపోవలసినదని హుంకరించాడు. కాని కాంతా మణిపై తన కెంతో మక్కువ కలిగినదని తెలిసినా హేమ ఏమాత్రము అసూయ పడలేదు. పైగా ఆమె భవంతికి పోయి సుఖించవలసిందని ప్రోత్సహించింది. మెడలో ముత్యాలహారం తీసి చేతి కందీయబోయింది. ఆ సంఘటన తలచుకోగానే రంగ నాయకుని హృదయం హేమసుందరి యెడల వెల్లివిరిసిన కృతజ్ఞ తతో ప్రగాఢమైన ప్రేముడితో తొణికిసలాడింది. కన్నతల్లి కూడా అంతటి అప్యాయతతో ఆదరించలేదు! హేమవంటివా రెవరయినా ఈ లోకంలో ఉంటారా? ఆ గాఢానురాగమయి అడుగుజాడలో నిలబడడాని కయినా తన కావంతయినా అర్హత లేదని రంగనాయకు డనుకొన్నాడు! శ్రీరంగేశుని అవ్యాజ కరుణవల్లనే తన కటువంటి సాధ్వీమణి, సుందరీతిలకము లభించినదని లోలోపల ఎంతయినా ఉప్పొంగిపోయాడు. మరి ఆలసించక శీఘ్రమే తాను సంకల్పించుకొన్న మొక్కుబడి చెల్లించుకోవాలని నిశ్చయించుకొన్నాడు.

ఆనాటి సాయంకాలమే పురోహితుని ఇంటికి వెళ్ళి స్వామికి కానుకలు చెల్లించడానికి అప్పటికే చాలా ఆలస్య మయినదనీ, త్వరలోనే ఏదో ఒక విధమయిన శుభముహూర్తం ఏర్పాటు చేయించవలసినదనీ చెప్పి తొందరపెట్టి బ్రతిమాలు కొన్నాడు. ఆయన మీన మేషాలు లెక్కపెట్టి త్వరలో అంతటి చక్కని ముహూర్తం ఏది కుదరడంలేదని కొంచెం సేపు తటపటాయించాడు. కాని రంగనాయకుని బలవంతంమీద ఎల్లుండి కార్తిక పౌర్ణమి కనక ఆనాటి ఉదయం రెండుజాముల పొద్దెక్కిన తరవాత మొక్కుకొన్న కానుక లర్పించవచ్చునని నిశ్చయించాడు. కార్తీక పూర్ణిమనాడు తెల్లవారుజాము మొదలుకొని అర్థరాత్రివరకు శ్రీరంగేశుని అనేక మహోత్స వాలు జరుగుతాయి. కనక తనకదే తగిన తరుణమని రంగ నాయకు డెంతో సంతృప్తిపడ్డాడు. పురోహితుని కొక బంగారు చక్రం సమర్పించి ముడుపు చెల్లించిన తరవాత తిరిగి ఇం క మారు దర్శనం చేసుకోగలనని విన్నవించి రంగనాయకు డక్క డికి నించి బయలుదేరాడు. ఇంటికి వస్తూనే ఆ సంగతి హేమ సుందరికి చెప్పి స్వామి దర్శనానికి కావలసిన సంభారాల సేక రణలో పడ్డాడు.

కార్తీక పూర్ణమినాటి ఉదయం కొంచెం పొద్దెక్కిన తరువాత హేమసుందరి రంగనాయకుడు శ్రీరంగేశుని దేవా లయానికి ప్రయాణమయునారు. క్షణంలో అతని హృదయం అడుగడుగునా ముమ్మొందుకు చెంగలించి అపూర్వోత్సాహంతో ఉప్పొంగింది. ఆనాడు రంగనాయకుని తీరు హేమసుందరికే కొంచెం ఆశ్చర్యం కలిగించింది. సరిగంచు కంచి ఉత్తరీయం

వల్లె వాటుగా వేసుకొన్నాడు, కుడి ముంజేతికి సింహతలాటంతో మెరుస్తున్న పైడి కడియం కొంచెం బిగువుగా అలంకరించుకొన్నాడు. శ్రీరంగంలో మల్లయుద్ధం ప్రవీణులు కొందరు అతని విద్యానైపుణి పరిశీలించి మెచ్చుకొని బహూకరించిన వీర కంకణ మది! పట్టరాని గర్వంతో మేళవించిన అతని దృష్టి మాటిమాటికి దానిమీద ప్రసరించింది! దండలకు రెండింటికి మంకెనపూల మాలికలు చుట్టుకొన్నాడు. పొడుగాటి పైడి తిలకము, సువర్ణ విలోచన యుగళి ఒక బంగారు పళ్ళెరంలో ఉంచి అప్పుడప్పుడే వికసించిన మందారాలు, దేవకాంచనాలు, కుంకుమాక్షతలు తదితర పూజా ద్రవ్యాలు, ఆ కానుకల కిరువైపుల అమర్చుకొన్నాడు. ఎండ పొడ తగిలి పుష్పాలేమాత్రము వాడిపోకుండా, పండు మొగలి రేకులతో లేత లేత తాటి మొవ్వల ఆకులతో శ్రీచందనం చేవకామతో తయారు చేయించిన పెద్ద గొడుగు ఎడమ చేతితో ఎత్తి పట్టుకొన్నాడు. దాని లోపల లక్కపూతతో రెక్కలల్లి లాడిసున్నట్లు రూపొందించిన గురుడాళ్వారు చిత్రంవైపు చూడగానే అతని కెంతో ఉత్సాహం కలిగింది. పైపైన శంఖ చక్రాల పైడి పూత చిత్రములు లేత లేత ఎండ పొడలలో తళతళ మెరిశాయి. గొడుగు అంచులలో కుచ్చులతో బాటు అమర్చిన కంచు చిరుమువ్వల సవ్వడి హేమసుందరి కాలి అందెల ఘలం ఘలలతో మేళవించింది.

ఆమె ఆనాడు మధురనించి వచ్చిన లేత లేత చిలకపచ్చ పట్టుచీర కట్టుకొని, లేత ఊదారంగు సరిగంచు రవిక తొడుక్కొన్నది. మెడలో ముప్పేట ముత్యాల హారాలు మూడలంకరించుకొని నుదుటికి కొంచెం పై భాగంలో రావి రేక, చంద్ర

వంక ఒక దాని వెనుక ఇంకొకటి అమర్చుకొన్నది. రవ్వల మువ్వలతో తళతళ లాడుతున్న మొలనూలు నెన్నడుము చుట్టు అలంకారికగా బిగించుకొన్నది. సుదీర్ఘమయిన శ్రీ చూర్ణ తిలకాని కాధారంగా, కస్తూరి కస్తూరి కద్దిన కుంకుమ రేఖ చిన్నారి చంద్రుని ఆకారంతో రూపొందించుకొన్నది. రంగ నాయకుని అడుగులో అడుగు వేస్తూ అలసాలస గమనంతో ముందుకు సాగిపోయింది. కార్తీకమాస బాల సూర్యోదయ కాంతిలో రాజవీథిలో భవనాల ద్వారాలలో వేలాడుతున్న పండు మొగలి రేకుల తోరణాలతో శ్రీరంగ నగరం ఆనాడొక క్రొంగ్రొత్త వింత కాంతితో తలమునక లవుతున్నదని రంగనాయకుడెంతో ఆశ్చర్యపడ్డాడు!

అప్పుడే పౌరు లనేకులు పిల్లలతో, పాపలతో వేర్వేరు కానుకలతో శ్రీరంగనాథుని సందర్శనం కోసం తొందర తొందరగా పురోగమిస్తున్నారు. క్రమక్రమంగా హేమసుందరీ రంగనాయకు లిద్దరు మొదటి ప్రాకారం ముఖద్వారం సమీపించారు. శ్రీరంగ దేవాగారం చుట్టు పరివేష్టించిన ప్రాకారాల కేడింటికి ప్రాక్పశ్చిమ దక్షిణోత్తర దిశలలో ప్రకించి నాలుగేసి సమున్నత గోపురా లున్నాయి. శ్రీరంగ దేవాలయం ప్రాకార గోపురా లన్నిటికన్న మిక్కిలి సమున్నతమై పైపై సాగిపోయి రనంత ఓరగా ఒరిగినట్లు స్ఫురించింది. దేవాలయ శిఖరంమీద, గోపురాల శిఖరాల మీద అమర్చిన బంగారు కలశాల బారు అరుణారుణమైన ప్రాతఃకాల భాస్కర కాంతిలో వేయి రేకుల పైడి తామరపూల పంక్తి వలె తరలించింది. గోపురాలమీద దేవళంమీద అమర్చిన గూళ్ళలో పావురాల పల్లటీల సవ్వడి రెక్కల తటతట ధ్వనులతో, కుసకుసలతో

మేళవించి, సూటిమాటిగా హేమసుందరీ రంగనాయకుల వీనుల జంటలో ప్రతిధ్వనించింది. గాలిలో కదలాడుతున్న ధ్వజ స్తంభం చిరుగంటల కలరవం గగనాంతరాళంలో అదృశ్య మయిన అచ్చరల వీణాతంత్రీస్వనంవలె అతిలోక మనోహరమై మారు మ్రోగింది !

వారిద్దరు క్రమక్రమంలో గోపుర ద్వారా లొక టొకటే దాటి దేవాలయం సమీపించగానే శ్రీరంగేశుని కొమ్ము చేనుగు తొండం పైకెత్తి మెడలో వేలాడగట్టిన పెద్ద పెద్ద గంటల గణగణ ధ్వనులతో అల్లనల్లన సమీపించింది. అది తల వనితలంపుగా ఎదురయిన ఒక గొప్ప శుభ శకునమని రంగ నాయకుడు డెంతో ఆనందించాడు. కొండ అరటిపళ్ళ గెల ఒకటి కొని దాని కందించి హేమసుందరితో బాటు మరికొంచెం ముమ్ముందుకు సాగిపోయాడు. భక్తులు కొంత మంది అప్పుడే ఫల పుష్పాలతో వేర్వేరు మొక్కుబడులతో గర్భాలయంలో ప్రవేశిస్తున్నారు. అందరికన్న మొట్టమొదట తానే కానుక లర్పించవలెనని రంగనాయకు డెంతయినా ఉవ్విళ్ళూరిపోయాడు. కాని అనుకున్నంత తొందరగా అతని కోరిక నెరవేరలేదు. అయితే పురోహితు డేర్పరచిన శుభముహూర్తం మాత్రం మించిపోలేదు.

క్రమక్రమంగా గర్భగుడిలో నలువైపుల అర్చకుల మంత్ర పఠన ధ్వనితో బాటు ఘంటారవం గంభీరమై ప్రతిధ్వనించింది. రంగనాయకుడు, హేమసుందరి ద్వారం ముమ్ముందు నిలబడి స్వర్ణ తిలకము, పైడి కనుదోయి బంగారు పళ్ళెరంతో బాటు అర్చకుని కందించారు. అత డా వింత కానుకల వైపు చూచి

రవంతసే పాశ్చర్యపడ్డాడు. ఎప్పుడో సకృత్తుగా గాని ఇంతకు మునుపు భక్తు లెవ్వరు అటువంటి వింత మొక్కుబడి సమర్పించలేదు. అతని ఎరుకలో చాలాకాలం కిందట సంగీత విద్వాంసు డొకడు స్వామి కొక స్వర్ణమురళి సమర్పించాడు. అంతే!

అర్చకుడు మరి కొంతసేపు వారి వైపెంతో విడ్డూరంగా చూసి గోత్ర నామధేయాల లడిగాడు. రంగనాయకుని కిక ఆ సమయంలో ఆమె తన ధర్మపత్ని అని చెప్పక తప్పలేదు. హేమాంబా ధనుర్దాసులన్న కొత్త పేరులతోనే తండ్రి గోత్రంతోనే తమ ఉభయుల పక్షాన స్వామికి యథావిధిగా సహస్రనామ పూజ చేయించాడు. అర్చన జరుగుతున్నంతసేపు వారిద్దరి నవీన నామధేయాలు శ్రీరంగేశుని సమక్షంలో గర్భాలయంలో అంతట ఒకే క్రమంలో తిరిగి తిరిగి ప్రతిధ్వనించాయి. వాస్తవాని కా క్షణంలోనే ఒక సరికొత్త పద్ధతిలో స్వామి సాన్నిధ్యంలో తమ ఇద్దరి వివాహ మహోత్సవము సాంగోపాంగంగా పరిసమాప్తమయినదని రంగనాయకు డెంతో సంతోషించాడు. మరి వేరే ఇంకొక ఏర్పాటు మాటే తలపెట్ట నక్కరలేదని సంతృప్తిపడ్డాడు.

అర్చన అంతా ముగిసిన తరవాత పూజారి పైడి కను దోయి, బంగారు తిలకము పైకెత్తి పట్టుకొని మిక్కిలి మెళకువతో స్వామి నెన్నుదుటి కలంకరించాడు. అగరు ధూప మాలికలలో, కర్పూర నీరాజన కాంతుల తళతళలో వినూతనాలంకారాలతో జాజ్జ్వల్యమానమైన శ్రీరంగశాయి నెన్నుదుటి వైపు చూచి హేమసుందరీ రంగనాయకు లానందావేశాలతో

పులకించారు. హేమ వెడద కనుదోయి కొలతలతో రూపొందించిన కాంచన విలోచనాలు రెండూ స్వామి ఫాలతలికి ఎంతో చక్కగా అమరినవని రంగనాయకుడు. లోలోపల మిక్కిలి ఉప్పొంగి క్షణకాలంపాటు ఆమె విశాల నేత్రాల లోతులు పరిశీలించాడు. హేమ అతని అభిప్రాయం కనిపెట్టి స్వామి సాన్నిధ్యంలో అటువంటి ఎంత ఆలోచన కూడదన్నట్లు ముక్కుమీద వేలుంచి క్రీగంటి చురుకు చూపుతో నివారించి మొలకెత్తిన చిరునవ్వుతో శిరస్సు వంచుకొన్నది.

పూజ, మొక్కుబడి చెల్లింపు మొదలయినవన్నీ ముగిసిన తరవాత తీర్థప్రసాదా లందుకొని తిరిగి వా రిద్దరు తమ భవంతికి ప్రయాణ మయినారు. దేవాలయం ముఖద్వారంలో ప్రవేశించే ముందు రంగనాయకుడు పాదరక్షల జత, గొడుగు ఒక పువ్వుల అంగడి బేహారి దగ్గర దాచుకొన్నాడు. తిరిగి అవి తీసుకొని హేమసుందరికి ఎంతో అప్యాయంగా స్వామి నిర్మాల్యాలు కొన్ని బహూకరించాడు. అవి ఆమె మిక్కిలి భక్తితో కళ్ళ కద్దుకొని సిగలో తురుముకొన్నది.

అప్పుడే రెండు జాముల పొద్దెక్కింది. ఆకాశంలో కొబ్బరి చెట్ల కవటాకులు, పోకల ముదురు గెలలు, ఇళ్ళ పెరళ్ళలో బాదంచెట్ల పండుటాకులు కార్తీకమాసం మధ్యాహ్న సూర్యకాంతిలో గాలిలో కదలాడి వింత వెలుగులతో తరళించాయి. శ్రీమంతుల భవంతుల ప్రాంగణాలలో నెమళ్ళు సురపొన్నల నీడలలో విశ్రమించాయి. హేమసుందరితో బాటు రాజవీధిలో కొంత దూరం సాగిపోయిన తరవాత రంగనాయకునికి మధ్యాహ్నం మండు టెండలో కొంచెం చురుకుపా లెక్కువయిన

దని స్ఫురించింది. నడక ఆపి హేమ ముఖాని కెదురుగా గొడుగెత్తి పట్టుకొన్నాడు. కాని అంతలోనే ఆమె ఎంతో సిగ్గుపడి తటాలున తప్పించుకొన్నది:

"కాస్త ఎండ తగిలితేనే అలిసిపోయేటంతటి సుకుమారిని కాదు లెండి! నాకోసం ప్రత్యేకంగా గొడుగెత్తి పట్టుకో నక్కరలేదు। మీ వెనకాల నడుస్తూంటే నామీద కొంచెం నీడ పడుతూంది. ఇది చాలదా ఏమిటి?"

అయినా రంగనాయకుడు తన ధోరణి విడిచిపెట్టలేదు. గొడుగు కొంచెం ఓరగా వంచి తిరిగి ఆమె విశాల నేత్రాల కెదురుగా ఎత్తిపట్టుకొన్నాడు.

"చలికాలం ఎండయితే మాత్రం! ఎంత చిట చిటలాడుతూందో చూడు! చెక్కిళ్ళు, కళ్ళు ఎలాగ వాచిపోయాయో! రా! కొంచెం నీడలోకి రా!"

కాని హేమ అతని మాట లక్ష్యపెట్టలేదు:

"ఇదేమిటీ వెర్రి! నడివీథిలో ఎవరయినా చూస్తే ఏమనుకుంటారో అన్న ఆలోచన కూడా లేకపోతే ఎలాగ?"

ఆమె తిరిగి కొంచెం దూరంగా తప్పుకొన్నది.

"అనుకుంటే అనుకోనీ, నాకేం!"

రంగనాయకుడు అలాగే గొడుగెత్తి పట్టుకొని కొంటె నవ్వుతో కవ్వించి ఆమె భుజంమీద చెయ్యివేసి నెమ్మదిగా దగ్గిరికి తీసుకోబోయాడు. హేమ అతని దుందుడుకు ధోరణి గమనించి ఇక బెట్టుసరి చేస్తే నలుగురిలోను నవ్వులపాలయి

పోవడమే తప్ప మరి లాభంలేదని గ్రహించి గొడుగు నీడలో నిలిచి కొంచెం రుసరుస లాడింది :

"ఎప్పుడు ఇంతే ! మనిషికి ఎంత తోస్తే అంత ! నలుగురిలోను కొంచెమయినా మన్నన, మర్యాద గమనించకపోతే ఎలాగ ?"

చిన్న చిరునవ్వు చిందించి రంగనాయకు డది వినీ విన నట్టు మాట్టాడ కూరుకొన్నాడు. అంతేగాని మరి ప్రతి సమాధానం చెప్పలేదు. అలాగే ఆమె చెక్కిలిమీద, శ్రీగంటిమీద చూపు నిలిపి అల్లనల్లన నడక సాగించాడు.

అంతకుమును పెన్నడు హేమసుందరి శ్రీరంగనగరం రాజవీధి సందర్శించలేదు. అసలామె కంతగా ఇల్లు కదలి వెళ్ళే అలవాటే లేదు ! ఎప్పుడయినా తెల్లవారుజామునే లేచి ఇరుగు పొరు గమ్మలతో కలసి కావేరీ స్నానానికి వెళ్ళేది. వారెవ రయినా ఇంటికి వస్తే ఎంతో అప్యాయంగా మర్యాదచేసి ఆదరించేది. తిరిగి వారి ఇళ్ళకు వెళ్ళి లోకాభిరామాయణంతో కాలక్షేపం చేసేది. అంతేనేగాని శ్రీరంగం నలువైపుల సందర్శించడాని కయినా ఆమె ఎప్పుడు ఉబలాటపడలేదు. అందుచేత నే డామె బాటలో ఇరువైపుల గల సమున్నత సౌధాలవైపెంతో ఆశ్చర్యంగా చూసింది. క్రమక్రమంగా ఆ ధోరణిలో మైమరిచి పౌరు లనేకులు తమ ఇద్దరివైపు మాటిమాటికి విడ్డూరంగా చూస్తున్నారన్న విషయమే గమనించలేదు. ఇక రంగనాయకునికి చాలాకాలంనించి ఇతరుల అభిప్రాయాల యెడల విపరీతమయిన ఏవగింపు, నిర్లక్ష్యధోరణి అలవడ్డాయి. కనక ఆ విషయమే అతని ఆలోచనలో ప్రవేశించలేదు !

పదిమంది మధ్యలో నిలబడినప్పుడు హేమ ఎంతో అంద గత్తె అన్నమాట ఇట్టే స్ఫురించి తీరుతుంది. ఆపైన ఆనా డామె చిలకపచ్చ పట్టు చీరతో, లేత ఊదా రంగు రవికెతో నెమ్మేని పసిడి మిస మిస వన్నెతో అపూర్వ సౌందర్యంతో తరళించింది. పైగా శీతకాలం మధ్యాహ్న కాంతి ఆమె శరీర శోభ మరింతగా ఇనుమడింప జేసింది. చెక్కిళ్ళపై ప్రతిఫలి స్తున్న పద్మరాగాలతో పొదిగిన కర్ణాభరణాలతో, కాటుక రేకతో వీనుల వరకు విస్తరించిన కనుదోయితో, మెడలో ముత్యాలహారాల తళతళలతో, కాలి అందెల ఘులంఘులతో సవిలాస మందర గమనంతో సాగిపోతున్న హేమసుందరి చక్క దనం రాజవీధిలో అడుగపెట్టిన పౌరు లందరి చూపులు పట్టి నిలిపి ఆకర్షించింది. ఇక భవంతుల ప్రాంగణాలలో గుమిగూడిన జవ్వనులు కొందరు నవయౌవనంతో మిసలాడుతున్న రంగ నాయకుని కను ముక్కు తీరెంతో మెచ్చుకొన్నారు. కాని చెక్కిళ్ళు నొక్కుకుని వారిద్దరి యెడల తమ లోలోపల చెల రేగిన అసూయ వెల్లడించుకొన్నారు.

"భార్య ఎంతటి అంతగత్తె అయినా పట్టపగటివేళ నడివీధిలో పక్కనే గొడుగు పట్టుకొని నిలబడి అడుగులకు మడుగు లొత్తుతూ అగ్గగ్గ లాడిపోతారా ఎవరయినా! ఇదేమి విడ్డూరమమ్మా! ఎక్కడ చూడలేదు! పోనీ అతగాడికి సిగ్గు, శరము లేకపోతే ఆ వగలాడి కయినా ఉండక్కరలేదూ? తగుదునమ్మా అని భుజము భుజము రాసుకుంటూ నడిచి పోతుందా? అతగాడి కేమయినా మతిపోయిందా? ఆ ఒయ్యారి ముఖంకేసి అదే పనిగా అలాగ చూస్తా డేమిటి? ఇక నడివీధిలో జనంవైపే చూడ డేమిటి?"

క్రమక్రమంగా రాజవీధిలో గుసగుస లెక్కువయి నాయి. జనం చెట్లనీడలలో గుంపులు గుంపులుగా గుమిగూడి అదే పనిగా వారిద్దరి వింత వైఖరి పరిశీలించడం ప్రారంభిం చారు. అప్పటికి హేమసుందరికి తమ పరిస్థితి అంతా బోధ పడింది. మరి భరించలేక రంగనాయకుని వైపు కొంచెం కసి తంగా చూసి చెవిలో ఊదింది:

"అవిగో చూడండి! లోకులందరు గుంపులుగా జేరి మనకేసి చూసి విరగబడి నవ్వుకొంటున్నారు. మీకేమి సంకోచం లేకపోతే నాకయినా ఉండవద్దా! చాలు చాలు లెండి! మీ అభావ చేష్టలు! ఇదుగో నేనిక మీ సరసన నిల బడ దలచుకోలేను. దయచేసి కొంచెం తొందరగా నడక సాగిం చండి. నేను మీ వెనకాలే నడిచి వస్తాను లెండి!"

అయినా రంగనాయకుడామె మాట పాటించలేదు. అంతేకాదు! అతడా జనంవైపే చూడలేదు! ఆమె విశాల నేత్రాలమీద, వల్లమాలిన సిగ్గుతో ఎర్రబడిన చెక్కిళ్ళమీద అతని దృష్టి నిశ్చలమై నిలిచింది. పాదా లప్రయత్నంగా ముమ్మందుకు సాగిపోయాయి. లోకుల ధోరణి గమనించిన హేమసుందరి మరి ఓరిమి సహించలేక వెనుకంజవేసి పక్కకి తప్పుకోవాలని ప్రయత్నించింది. కాని రంగనాయకుడామె ప్రయత్నం కొనసాగనీయలేదు. ముంగురులమీదగాని, ముఖం మీదగాని కటాక్షాలమీదగాని చెక్కిళ్ళమీదగాని చెదురు వాటుగా నయినా సూర్యకిరణ లేశమయినా సోకనీయలేదు! హేమసుందరి గత్యంతరం లేక సిగ్గుతో చిమిడిపోయి, తల వంచుకొని మరింత తొందరగా నడక సాగించింది. ఆమె అందెల

సవ్వడి మంద్ర మంద్రగా రాజవీధిలో నలువైపుల ప్రతిధ్వనించింది. అక్కడక్కడ నిలబడిన పౌరులు కొంద రదేపనిగా విపరీతమయిన విడ్డూరంతో వారి వైపు చూచి గుసగుసలాడుకొన్నారు.

మరికొంతసేపటికి హేమసుందరీ రంగనాయకు లిద్దరికి అల్లంత దూరంలో అయిదారుగురు యతీశ్వరు లెదురయినారు. వారందరు బాట పక్కన ఒక మామిడిచెట్టు నీడలో నిలుచున్నారు.

ఆ కాషాయాంబరధారుల వెనకభాగంలో పది పదిహేనుగురు అనుచరు లెంతో అణకువతో శిరస్సులు వంచుకొని ప్రగాఢ భక్తితో గొంతులెత్తి మధుర స్వరాలతో ద్రవిడ వేద పాశురాలు పఠిస్తున్నారు. కొంచెం సమీపించిన తరవాత గాని రంగనాయకుడు వారివైపే చూడలేదు. ఆ యతీశ్వరుల పాశుర పారాయణఘోష హేమసుందరి ముఖం మీద నిలచిన అతని చూపు రవంత మరలించింది. వారందరి మధ్య సమున్నత మూర్తి యతీశ్వరు డొకడు నిశ్చల విశాల నేత్రాలతో రంగనాయకుని ముఖవైఖరి పరిశీలిస్తున్నాడు! ఆయన పెదవులపై పారిజాత పుష్పం వంటి లేత చిరునవ్వు తరళించింది. రంగనాయకుని కిక అడుగు పడలేదు! రెండు మూడు నిముషాల పాటు అలాగే నిలబడిపోయాడు.

ఆ సమున్నతమూర్తి ఆజానుబాహువు! పండు తమలపాకు వంటి శరీరచ్ఛాయ! కొంచెం కొనదేరిన సమున్నత నాసిక, బలిష్ఠమయిన శరీర దార్ఢ్యాన్ని బట్టి పరిశీలిస్తే అయిదు పదుల వయస్సున్నట్టు స్ఫురించింది. కాని ముఖంలో మాత్రం

అంతకన్న అత్యధికమయిన వయః పరిణామే గోచరించింది. నిర్మల పద్మపత్రాలవంటి ఆ యతీశ్వరుని వెడద కనుదోయి వైపు చూడగానే రంగనాయకుని హృదయంలో హేమసుందరి సుదీర్ఘ నేత్రయుగళి తళుక్కుమని మెరిసింది! అత డంతకుమును పెన్నడు ఆమె కళ్ళకన్న సువిశాలమయిన విలోచనా లెక్కడ చూచి ఉండలేదు. ఆ నేత్రాల తుదలలో చిన్న చిన్న సన్నని రేఖలు కొన్ని అల్లి బిల్లిగా అల్లుకొని విచిత్రమయిన సౌంద ర్యంతో తరళించాయి. "మహారాజెవరో సన్యసించి శ్రీరంగే శాయిని సేవించుకొంటున్నారు కాబోలును. లేకపోతే ఆ కళ్ళలో అంతటి ఠీవి, రాజసము ఎలాగ వస్తాయి!" అన్న ఆలోచన అప్రయత్నంగా అతని మనస్సులో మొలకెత్తింది. ఒంటిమీద కప్పుకొన్న కాషాయ వస్త్రంతో కలిసిపోయిన ఆ యతీశ్వరుని శరీరచ్ఛాయ మధ్యాహ్న సూర్యకాంతిలో మరిం తగా మెరిసింది! శ్రీ రంగేశుని పాద ముద్రికలవంటి ఊర్ధ్వ పుండ్రాలు రెండు తెలి తెలి కాంతులతో వెన్నుదురుటి పైభాగం పర్యంతము విస్తరించాయి. మధ్య ప్రదేశంలో సన్నని శ్రీ చూర్ణతిలకం క్రమక్రమంగా కొనదేరి పాలతలి అతి క్రమించింది.

క్షణకాలంపాటు ఆ సుదీర్ఘమూర్తి గభీంరదృష్టి, రంగ నాయకుని చూపు ఒండొంటితో మేళవించాయి. అంతలోనే ఆయన అనుచరులతోబాటు తిరిగి దేవళంవైపు తన ప్రస్థానం ప్రారంభించాడు. మరికొన్ని నిమేషాలలోనే వారి నిద్దరిని సమీ పించాడు. హేమ అది గమనించి బాగా సంకోచించి విపరీత మయిన సిగ్గుతో కుంచించుకుపోయి అటు ఇటు ఒదిగింది. కాని రంగనాయకు డంతగా లక్ష్యపెట్టలేదు. చూచీ చూడనట్టు

ఉపేక్షించాడు. తిరిగి నెమ్మది నెమ్మదిగా నడక సాగించాడు. అంతలోనే ఆ సమున్నమూర్తి అంతేవాసులతోబాటు వారి కెదురు పడ్డాడు. ఆపైన హేమ మరి రంగనాయకుని సరసన నిలబడలేదు. కొంచెం వెనకపడి తల వంచుకొని అతని ననుస రించింది. కాని రంగనాయకు డంగీకరించలేదు.

"ఎండ చుర్రుమనడం లేదూ! ఎందు కలాగ కంగారు పడతావు! భయం లేదులే! గొడుగు నీడలోకి రా!"

బాట మధ్య నిలబడి కనుసన్నతో పిలిచాడు. అయినా హేమసుందరి గొడుగునీడ కిందికి రాలేదు. రంగనాయకుడే కొంచెం వెనక్కి వెళ్ళి ఆమె ముఖాని కెదురుగా గొడుగెత్తి పట్టుకుని చిరుకోపంతో ఎరుపెక్కిన ఆమె కటాక్షాల సోయగం తదేక దృష్టితో పరిశీలించాడు. దానిమీద హేమసుందరి మరింతగా కోపగించి ధుమధుమలాడింది.

"చాలు చాల్లెండి! మీ కొంటె వేషాలు! ఊరు, వాడ మనల్ని ఇద్దర్ని గురించి ఎంతో విడ్డూరంగా చెప్పుకుంటున్నారు! స్వాములవారున్నారని కూడా గమనించకపోతే ఎలాగ?"

"హేమా! మనమేమన్నా పరాయివాళ్ళమా! వాళ్ళంతగా ఆడిపోసుకోవడానికి! ఈవేళ స్వామి సమక్షంలో మన కిద్దరికి వివాహం జరిగిపోయింది! అర్చకులు మన ఇద్దరి పేరుల తోను సలక్షణంగా పూజా పునస్కారాలు జరిపించేశారు. ఇక మన మిద్దరము భార్యాభర్తలమే గాని పరాయివాళ్ళం కాదు. అనవసరంగా నీకీ లేనిపోని సంకోచ మెందుకు?

"ఎంత భార్యాభర్తలమైతే మాత్రం! కొంచెం ప్రపంచానికీ వెరవద్దూ!"

"అయ్యో వెర్రిదానా! నిజానికి బాగా భయపడవలసి నప్పుడు నీ వెక్కడ చెక్కు చెదరలేదు! ఊరికే ఉత్త పుణ్యానికి ఇప్పు డెందుకీ ఆరాటం? చూశావా? ఎండ పోడ పడి నీ చెక్కిళ్ళులాగ వాడిపోయాయో!"

అయినా హేమసుందరి అతని ప్రార్థన కంగీకరించలేదు. అంతలోనే యతీశ్వరు లందరు వారి నిద్దరిని అతిక్రమించి ముస్ముం దుకు సాగిపోయారు. ఆ సుదీర్ఘమూర్తి సునిశితవీక్ష తిరిగి రంగ నాయకుని నేత్రాలలో గాఢంగా నాటుకొన్నది. అయినా అత డింతగా లక్ష్యపెట్టలేదు. కాని ఎందుచేతనో ఒక్కసారి వెనక్కి తిరిగి చూడాలనిపించింది. తన దృష్టి అటువైపు మళ్ళించాడు. ఆ సుదీర్ఘవ్యక్తి అదేవిధంగా వెనుదిరిగి నిశ్చలదృష్టితో రంగ నాయకుని వింత ధోరణి పరిశీలిస్తున్నాడు! అంతటి సూక్ష్మ పరిశీలన కేమి కారణమో రంగనాయకుని కవగాహన కాలేదు. అయినా అత డంతగా ఆందోళన పడలేదు. లోకులు కాకులు! ఎవరికి తోచినట్టు వా రనుకొంటారు. ఇవన్ని పట్టించుకుంటే ఎలాగ!" అని తనలో తాను సమాధాన పడ్డాడు. అయినా ఆ యతీశ్వరు డెవరో కొంచెం కనుక్కోవాలని అనిపించింది. తన కనతిదూరంలో రాజవీధిలో పడి సాగిపోతున్న ఒక వృద్ధుని వైపు తిరిగి కొంచెం సమీపించి ఆయన సంగతి ప్రశ్నించాడు. అత డదివిని రవంతసేపు నిర్ఘాంత పడ్డాడు.

"మీ రెవరోగాని ఈ ఊరికి బాగా క్రొత్తవారులా ఉన్నారే! వారినే ఎరగరా! అదిగో! ఆ మధ్యన ఉన్నవారు శ్రీమద్రామానుజ యతీంద్రులు! మిగిలినవా రందరు వారి అంతేవాసులు!"

"ఓహో! అలాగా" అని రంగనాయకుడు తిరిగి హేమ సుందరి దగ్గిరికి వెళ్ళిపోయాడు. అత డింతకమును పెన్నడు రామానుజయతి పేరే వినలేదు. అందుచేత ఆ వృద్ధుని మాటల వల్ల ఆయన సంగతి ఆవంతయినా బోధపడలేదు. "ఎవర్తో సన్యాసి కాబోలు! అయితే మాత్రం నాకేం?" అని కొంచెం వెటకారంగా నవ్వుకొని, లోలోపల సమాధానపడి హేమతో కలిసి త్వరగా నడక సాగించి తన భవంతిలో ప్రవేశించాడు.

# 17

రంగనాయకు డింటికి వస్తూనే పరమాన్నంతో, పిండి వంటలతో భోజనం ముగించుకుని, పాన్పుపై మేనువాల్చి హాయిగా నిద్రించాడు. అలాగ ఎంతసేపు గడిచిందో అతనికే తెలియదు! పక్కగదిలో హేమసుందరి మంద్ర మధుర గానమే అతని కొకించుక మెళకువ కలిగించింది. తంజావూరి వీణతో తన కలకంఠం మేళవించి, ఆమె కళ్యాణిరాగంలో గీతాలాపన కొనసాగించింది.

"కావేటిరంగా!...
కలనైన కనరావుగా!
కలికి ఎవ్వతె నిన్ను
కనులార గాంచెనో?"...
కౌగిలింతలసోలి
కనుమూసి నిదురించెనో!...
కావేటిరంగా! కలనైన కనరావుగా!

ఆ సంగీతం క్రమక్రమంగా రంగనాయకునికి రవంత మైకం కలిగించింది. ఇంటి ఆవరణలో, పూలతోటలో అతని కష్టపడి దట ముద్ద బంతిపూలు, బొగడలు, చేమంతులు వేర్వేరు రంగుల చంద్రకాంతాలు, మందారాలు బారులు తీర్చి నిలిచి ఆ గాన మాధుర్యంతో మైమరిచి తలలూగిస్తున్నట్టు గోచరించాయి! అప్పటికి మధ్యాహ్నం మూడోయామం కొంత వరకు గడిచిపోయింది. మందారపూవులమీద వాలిన రంగు రంగుల పిట్టలు రేకులమీద నిలిచి, తీయని తీయని తేనె బిందువు లాస్వాదిస్తున్నాయి. ద్వారబంధంమీద ఆహారం కోసం పొంచి ఉన్న బల్లి నీరెండ పొడపడి బంగారుపూత పూసినట్టు తళతళ లాడింది.

ఎన్నాళ్ళక్రితమో తలపెట్టిన మొక్కుబడి ఆనాటికయినా చెల్లించుకో గలిగినందుకు రంగనాయకుని కెంతో సంతృప్తి కలిగింది. శ్రీరంగశాయిని సందర్శించిన క్షణంలో అతని శరీరం జలదరించింది! ఆయన కృపా కటాక్షంవల్లనే తన కంతటి అను రాగవతి, గాయనీమణి, నర్తకి లభించినదని అతడెంతయినా ఆనందించాడు. "లేకపోతే అడుగడుగునా కష్టాల పరంపర లెన్నో దాటి ఇలాగ ఒడ్డున పడగలనా! ఇదంతా ఆ స్వామి చలవే! మరి సందేహంలేదు!" అని సంతృప్తి పడ్డాడు.

అంతలోనే హేమసుందరి ఆనందభైరవి రాగంలో ఇంకొక సరికొత్త గీతాలాపన ప్రారంభించింది. క్రమక్రమంగా ఆ రాగాలాపనలో పరిసర వస్తువు లొకటొకటే కరిగి సురిగి పోతున్నట్టు రంగనాయకునికి స్ఫురించింది! వీణాస్వరాల జడి వాన జల్లులా నలువైపుల అలము కొంటున్నట్టొక విధమయిన

విచిత్రానుభూతి కలిగింది! సామాన్యంగా హేమసుందరి వల్లకీ వాద్యం ప్రారంభించగానే ఆమె కెదురుగా కూర్చుని తాళం వేస్తూ, ఆనందించడం అతని కొక పరిపాటి. ఇప్పు డలాగ వెళ్ళి హేమదగ్గిర కూర్చోవాలని అనుకున్నాడు. కాని, సంగీత పారవశ్యంతో రవంత సొమరిచి, అరమూత కన్నుగవతో ఆ విషయమే విస్మరించాడు.

అంతలోనే సంగీతధ్వని క్రమక్రమంగా మందగించి ఆగింది. అయినా రాగభావనతో తల మునకలయిన అతనికింకా ఆ గానం కొనసాగుతున్నట్టే స్ఫురించింది. అదే సమయంలో హేమసుందరి కాలి అందెల ఘలఘలలతో తటాలున అక్కడికి వచ్చింది.

"ఇదిగో! మిమ్మల్నే! ఇదేమి టిలాగ ఏదో పరధ్యానంగా ఆలోచిస్తున్నట్టున్నారు?"

"అబ్బే! ఏమీ లేదు. సరేగాని, ఎందుకంత హఠాత్తుగా సంగీతం నిలిపివేశావు!"

రంగనాయకుడు కొంచెం విసుగుదలతో అడిగాడు.

"పెద్ద పుట్టిమునకే వచ్చి పడింది. ఐదారుజట్టీలతో తిరుమలరెడ్డి మన గుమ్మం ముందు నిలుచున్నారు!"

"నిజమేనా!" అని రంగనాయకుడు తటాలున లేచి, ఆ సమీపంలో గోడమూలనున్న బాణాకర్ర చేజిక్కించుకొని ఒక్క అంగలో వీధిగుమ్మంలోకి వెళ్ళి "ఎక్కడ? ఎక్కడ?" అని ఎంతో ఆత్రంగా ప్రశ్నించాడు. హేమ "అదిగో! అక్కడ!

అని వీధివైపు చూపించింది. కాని, అతని కా పరిసరంలో ఎక్కడ మనిషిజాడే కనబడలేదు !

"ఎక్కడ ? ఎవరులేరే!"

అన్నాడు రంగనాయకు డెంతో ఆశ్చర్యపడి.

"ఇదిగో! ఇటు! ఈ వైపున !"

అన్నది హేమసుందరి చూపుడు వేలితో నిర్దేశించి.

రంగనాయకుడు గిరుక్కున అటు తిరిగాడు. ఆ ప్రాంతంలో కూడా ఎక్కడ తిరుమలరెడ్డి జాడే గోచరించలేదు! వీధిమూల నలుగు రయిదుగురు పసిపిల్ల లెవరో చిన్నారి మేకపిల్లలతో ఆడు కుంటున్నారు. అంతే !

"ఎక్కడ ? ఎవ్వరు కనబడడంలేదే!"

దానికి సమాధానంగా హేమ కలకల నవ్వు మాత్రమే ప్రతిధ్వనించింది! రంగనాయకుని కప్పటికి పరిస్థితి అంతా పూర్తిగా బోధపడింది.

ఆమె ఇంకా విరగబడి నవ్వుతూనే ఉంది !

"అమ్మ దొంగా! ఎంత విచిత్రమయిన గొల్ల కలాపం కట్టావు ?"

అత డామె చెయ్యి కొరకు బుచ్చుకొని చెక్కిలిమీద నెమ్మదిగా అంటించబోయాడు. కాని, హేమ పట్టు తప్పించు కొని, అతని కందక, దూర దూరంగా పారిపోయింది! అయినా రంగనాయకు డామెను వెంటాడించడం మానలేదు! పెద్ద పెద్ద స్తంభాల మాటున అటు, ఇటు తిరిగి హేమ మాటి మాటికి, అతని కందకుండా తప్పించుకొన్నది. చిట్టచివరి కతికష్టంమీద దొరికిపోయింది.

"అనువులే గాని, హఠాత్తుగా అంత చక్కని సంగీతం ఆపివేసి ఎందు కిలాగ గొల్లకలాపం మొదలు పెట్టావు!"

హేమ చిరుకోపంతో రుసరుస లాడింది :

"నా సంగీతంమీద అంతటి అభిమానమే ఉంటే, కొంచెం దగ్గిరికివచ్చి కూర్చోకూడదా ఏమిటి? పొద్దస్తమానమూ పరధ్యానమేనా ?"

"సరి ! సరి ! ఇందుకా ఈ నాటకం అంతాను !"

రంగనాయకుడు నిలువునా నిర్ఘాంతపడ్డాడు.

"పాపం! అనవసరంగా కంగారు పెట్టినట్టున్నాను! నిజంగానే రెడ్డి వచ్చారని హడిలిపోయి కాళ్లు చేతులు విరగ దొక్కుకున్నారులా ఉంది."

"ఏమో ! ఇంతకాలం జరిగిన తరవాత కాలు కీలు తిన్న బడిందేమో అనుకున్నాను !"

"మీ చెయ్యి పడిం తరువాత ఇంకెక్కడ తిన్న బడడం!...పోనీ, అతగాడు రాకపోతే మీ నాయనగారు రాకూడదా ?"

"ఆ—ఆయన మరి రారు !"

"ఎందుచేత ?"

"మొట్టమొదటినించి ఆయన ధోరణే అంత! ఇంకా కడుపు తీపి భరించలేక మా అమ్మ ఎప్పటికయినా వస్తే రావచ్చును."

అలాగలాగ ఆ సంభాషణ క్రమక్రమంగా వారి సంసారం గొడవలమీదికి తిరిగింది. అంతలోనే హేమ అకస్మాత్తుగా మాట తప్పించి అడిగింది :

"అన్నట్టు ఆ ధర్మకర్త దగ్గిరికి మరి వెళ్ళదలుచుకో లేదా ?"

"తనే కబురు పంపిస్తా నన్నారు గదా అని మాట్లాడ కూరుకున్నాను."

"మరి ఇన్నాళ్ళు గడిచినా అతి గతి లేకపోయాక ఒక సారి మళ్ళీ వెళ్ళి కనబడకపోతే ఎలాగ ? అయినగాని మన మాటే మరిచిపోయారేమో !"

"అవునుసుమా ! నిజమే ! ఒకసారి వెళ్ళి కనబడి వస్తాను !"

ఉత్తరీయం బుజంమీద వేసుకొని బయలుదేరబోయాడు రంగనాయకుడు. అంతలోనే హేమ అతని కడ్డుపడింది :

"ఇక ఇప్పుడు వెళ్ళవద్దు ! బాగా పొద్దుపోయింది."

"పోతే మాత్రం ? ఇంతలోనే పుట్టి మునిగిపోయే రాచ కార్యం ఏమి ఉంది ! భయంలేదులే ! త్వరగానే తిరిగివచ్చి వేస్తానులే ! ఇప్పుడే కదా వెళ్ళమన్నావు !"

"ఏమో బాబూ ! బిక్కు బిక్కుమంటూ ఈ ఇంట్లో నే నొక్కత్తిని పడి ఉండలేను. పోనీ రేపు కొంచెం పెంద్రాళే బయలుదేరి వెళుదురుగానిలెండి !"

రంగనాయకు డిక గత్యంతరంలేక నెమ్మదిగా బ్రతిమాలు కొన్నాడు :

"తీరా బయలుదేరానుగా! వెళ్ళనీ! సాయంకాలమే ఆయన ఇంటిదగ్గర దొరుకుతారు. సూర్యాస్తమయం కాకుం డానే తిరిగి వచ్చివేస్తాను. సరిగదా!"

హేమ ఎట్టకేల కంగీకరించింది. రంగనాయకుడు కని పించినంతవరకు వీధిగుమ్మంలో నిలబడి ఉసూరుమని నిట్టూర్చి తిరిగి లోపలికి వెళ్ళిపోయింది. అత డలాగలాగ రెండు మూడు వీధులు దాటి శ్రీరంగ దేవాలయం ధర్మకర్త భవంతి సమీ పించాడు. అంతలోనే అతనిని శ్రీశైలం పలకరించాడు :

"ధనుర్దాసుగారికి మామీద దయతప్పినట్టుందే! కని పించినా పలకరించడమే మానివేశారు."

నిజానికి రంగనాయకు డతనిని చూడలేదు. సత్వర గమ నంతో ధర్మకర్త భవంతివైపు సాగిపోతున్నాడు.

"కొంచెం తొందర పనిమీద ధర్మకర్తగారింటికి వెడు తున్నాను. అందుచేత ఆ హడావిడిలో మిమ్మల్ని చూడలేదు. మన్నించండి. అంతా కుశలమేనా!"

"మీ దయవల్ల అందరికి క్షేమమే. ధర్మకర్తగా రిప్పు డిప్పుడే దేవాలయంవైపు వెళ్ళిపోయారు. మీ రిప్పుడు వెళ్ళినా దొరకరు! మరి లాభంలేదు."

"మళ్ళీ ఎప్పటికి తిరిగి వస్తారో!"

రంగనాయకుడు కొంచెం నిరుత్సాహపడి అడిగాడు.

"ఇహ ఇప్పుడు బయలుదేరితే రాత్రి భోజనాల వేళదాకా తిరిగి రారన్నమాటే!"

ఉసూరుమని ఒక నిట్టూర్పు విడిచిపెట్టాడు రంగనాయకుడు. అంతలోనే శ్రీశైలం మళ్ళీ అందుకొన్నాడు :

"పోనీ, ఇంతలోనే మించిపోయిం దేమిటి ? రేపు వెళ్ళ వచ్చును. రండి శాస్త్ర కావేరి వీధికి వెళ్ళి వద్దాము. మన వాళ్ళంతా ఈపాటి కక్కడికి జేరుకుంటారు."

రంగనాయకుడు కొంచెం తటపటాయించాడు. కాని శ్రీశైలం బలవంతంమీద మరి కాదనలేక తిన్నగా కావేరి వీధికి బయలుదేరాడు. ఎండ చల్లబడగానే మల్లులు చాలామంది ఆ వీధి కొసనున్న మద్య శాల జేరుకొంటారు. శ్రీరంగం వచ్చి నప్పటినించి ఇప్పపూల మద్యంమీద రంగనాయకునికి ఇను మిక్కిలిగా మక్కువ కలిగింది. శ్రీశైలం స్నేహంతో క్రమ క్రమంగా ఆ మక్కువ మరింత ఎక్కువై ఇనుమడించింది.

ఇద్దరు మద్యశాలలో ప్రవేశించారు. నలుగు రయిదుగురు మల్లులు బాగా తప్ప తాగి తూలుతున్నారు. మరికొంద రదే పనిగా మద్యపానంతో మైమరిచి రంగనాయకుని రాకే గుర్తించ లేదు. వారిలో ఒక తప్ప తాగిన వ్యక్తి అతనికేసి బాగా వెట కారంగా చూసి కొంటెగా కన్నుగీటాడు :

"ఏమిటి బాబూ ! ఈ మధ్యన బొత్తిగా దరిసెనాల్లేవు ! ధనుర్దాసుగారు ఇంతలోనే హరిదాసు లయిపోయినట్టున్నారే !"

రంగనాయకు డా అధిక్షేపణ అంతగా పట్టించుకోలేదు. కళ్ళు మూసుకుని గడగడ రెండు మూడు పాత్రల మద్యం సేవించాడు. దానితో అతనికి రవంత మైకం కమ్మింది. శరీరం గాలిలో తేలిపోతున్నట్టనిపించింది.

అంతలోనే బాగా మైకం కమ్మిన ఇంకొక వ్యక్తి అర మూత కన్నుగవతో అతనికేసి హేళనగా చూసి అందుకొన్నాడు :

"అంత చక్కని చుక్క దొరికిన తరవాత ఇంక ఈ చుక్కెందుకురా ! నా రంగా !"

ఆ చమత్కారంతో ఆ చుట్టూరా ఉన్న మల్లు లందరు గొల్లుమని నవ్వారు. చప్పట్లు కొట్టారు. ఆ ఆవేశంలో ఇంకొక వ్యక్తి అటు ఇటు తూలిపోతూ రంగనాయకుని దగ్గిరగా వచ్చి కళ్లు రెండు ఎగరవేస్తూ అడిగాడు :

"ఎక్కడినించి కొట్టుకు వచ్చావయ్యా ! మహా చక్కని మైనా గోరువంకని సంపాయించావే!"

"మైనా గోరువంక కేమిట్రా వెర్రిమొహమా ! పంచ రంగుల రామచిలుకలా గుంటేను !" అన్నా డింకొకడు కళ్ళు తేలవేసి కలకల నవ్వి !

రంగనాయకునికా అసభ్య ప్రలాపాలతో క్రోధావేశం కళ్ళ కెక్కింది. మరి సహించలేక సగం సగం తాగిన మద్య పాత్ర చేతికొద్దీ ఆ వ్యక్తిమీదికి విసిరివేశాడు ! అదిగాని అత గాడికి తగిలి ఉంటే కణత చెక్క ఊడిపడి ఉండవలసిందే ! కాని ఆ దెబ్బ దూసుకుపోయింది. అంతలోనే ఆ వ్యక్తిని వెనక వేసుకువచ్చి ఒకరిద్దరు మల్లులు రంగనాయకునితో తలపడ బోయారు. అతడా ప్రతిఘటనతో మరింత రెచ్చిపోయి లేడిలా ప్రత్యర్థుల మీదికి లంఘించాడు. శ్రీశైలంతో బాటు మరి

కొందరు మధ్యవర్తులు కలగజేసుకోవడంతో ఆ తగాదా అంతటితో చల్లారింది. లేకపోతే పానశాలలో మద్యంతో బాటూ వేళ రక్తం ప్రవహించి ఉండవలసిందే !

అతికష్టంమీద శ్రీశైలం అతనిని సందిట ఇరికించుకొని వీధిలోకి తీసుకువచ్చి కాళ్ళా వేళ్ళా పడి బతిమాలి బతిమాలి జరిగినదంతా మరిచిపోయి తిన్నగా ఇంటికి తిరిగి వెళ్ళిపోవలసినదని ప్రాధేయ పడ్డాడు. మరికొంతదూరం వెంటబెట్టుకొని వెళ్ళి ఇంటికి సాగనంపాడు. రంగనాయకు డిక మారు మాటాడక తిన్నగా తన భవంతివైపు తరలిపోయాడు. ఆనాటి దుస్సంఘటనతో అతని మనస్సనేక విధాల వికలమయింది. మొట్టమొదట ధర్మకర్త నొకమారు చూడాలని బయలుదేరాడు. మార్గమధ్యంలోనే తలపెట్టిన పనికొక అడ్డంకి ఏర్పడినదని తెలిసింది. ఆపైన శ్రీశైలం బాగా బలవంతంచేసి అతనిని మద్యశాలవైపు తీసుకుపోయాడు. తలవని తలంపుగా తప్ప తాగిన మల్లులవల్ల ఆనాడొక పెద్ద గొడవ బయలుదేరింది. మధ్యలో కలగజేసుకొని శ్రీశైలంతోబాటు మరికొందరు మధ్యవర్తులు అడ్డుకుని ఉండకపోతే ఆనాడు అతని తొందరపాటు శ్రీరంగంలో నలువైపుల మారుమ్రోగి ఉండేదే ! "తలవని తలంపుగా ఎంత పని జరిగిం దీవేళ !" అని రంగనాయకు డెంతో నొచ్చుకొన్నాడు.

అత డింటికి జేరుకునేసరికి బాగా చీకటిపడింది. అప్పుడే పాడి దూడలతో పాలికాపులు కొంద రిళ్ళకు చేరుకొంటున్నారు. వీధులలో ఆటలాడుకొంటున్న పిల్లల్ని తల్లు లెలుగు లెత్తి పిలుస్తున్నారు. సంపన్నుల ఇళ్ళ పెరళ్ళలో పాత్రలలో పాలధారల

ప్రతిధ్వని మంద్ర మంద్రంగా నలువైపుల వ్యాపిస్తున్నది. సంజ చీకట్లలో వేర్వేరు రంగుల ముద్దబంతిపూలు, మందారాలు మిణుగురుల వింత వెలుగులతో అల్లనల్లన తల లూగిస్తున్నాయి. గుడ్డి వెన్నెలలో వెలుగునీడ లొండొంటితో పేశవిస్తున్నాయి.

రంగనాయకుడు డానాటి దుస్సంఘటనతో బాగా ఆందోళన పడి తొందర తొందరగా వీధి గుమ్మందాటి ఇంటిలోపల ప్రవేశించాడు. అంతలోనే హేమసుందరి అతని కెదురుగా వచ్చి ఎంతో ఆత్రంగా అడిగింది :

"మీకోసం ఎవరో వచ్చి వీధి అరుగుమీద కూర్చున్నారు! చూడనే లేదా ? ఏమిటి పరధ్యానం ! మాట్లాడ రేం ?"

రంగనాయకుని ఆలోచనా ప్రవాహానికి కకస్మాత్తుగా అంతరాయం కలిగింది :

"ఆ ! ఆ ! నాకోసం ఎవరో వచ్చారా ? ఎవరు వారు ? నేను చూడలేదే ! తలవంచుకొని తొందర తొందరగా లోపలికి వచ్చివేశాను."

రంగనాయకుడు కొంచెం కంగారుపడి తటాలున వెనక్కి తిరిగి చూశాడు. వీధి అరుగుమీద ఎవరో కూర్చున్నారు ! ఆయన పక్కనే ఉంచిన సెమ్మాలో మంచినూనె దీపం మల్లె మొగ్గలా వెలుగుతున్నది. దాని కాంతిలో సన్నని తుంగచాప మీద లేత లక్కతో రూపొందించిన దేవతల చిత్రాలు దృశ్యా దృశ్యంగా ప్రకాశిస్తున్నాయి. దీపం వెలుగులో తుంగచాప మీద కూర్చున్న వ్యక్తి కుదిమట్టంగా కొంచెం పొట్టిగా ఉన్నట్టు కనిపించాడు. ముఖవైఖరిని బట్టి బ్రాహ్మణ బ్రహ్మచారి అయి

ఉండవచ్చునని స్ఫురించింది. రంగనాయకు డెంతో వినయంతో ఆయన సరసన కూర్చుని సగౌరవ దృష్టితో నెమ్మదిగా అడిగాడు:

"ఎవరు బాబూ! తమరు? ఎంతోసేపటినించి నాకోసం వేచి ఉన్నట్టున్నారు!"

"అబ్బే! అట్టేసేపు కాలేదు! బాబూ! నన్ను దాశరథి అంటారు. మీరు వీధిలోకి వెళ్ళారు. నేను వచ్చాను ఇంతా చేసి రెండు మూడు గడియలకంటె ఎక్కువ కాలేదు!"

రంగనాయకునికా సమాధానంవల్ల ఆ నూతన పురుషు డెవడో తిన్నగా బోధపడలేదు. కొంచెం జిజ్ఞాసార్థకంగా బొమ ముడి విరిచి మళ్ళీ అడిగాడు:

"మన దేవూరు బాబూ!"

"మాది ఈ గ్రామమే! శ్రీమద్రామానుజుల మఠంలో ఉండి వారిని సేవించుకొంటున్నాను. వారు మిమ్మల్ని ఒకమారు చూడాలని చాలా చాలా కుతూహలపడుతున్నారు! అందుకోసమే నే నిక్కడికి వచ్చాను."

రంగనాయకునికా ప్రత్యుత్తరంతో గొంతులో పచ్చి వెలక్కాయ చిక్కుపడ్డట్టయింది. రామానుజుని పేరు అత డంతకు మునుపు ఒకటి రెండు మారులు మాత్రమే విన్నాడు. అంతేగాని ఆ యతీశ్వరుని గూర్చి అతని కేమి తెలియదు. అటువంటి వ్యక్తి తన్నొకమారు చూడాలని కుతూహల పడ డానికి గల కారణమేమో అతని కసలే అవగాహన కాలేదు. అందుచేత బాగా తటపటాయిస్తూ మళ్ళీ అడిగాడు.

"ఇంతకి పనేమిటి బాబూ!"

దాశరథి క్షణకాలం రంగనాయకుని ముఖవైఖరి ఏకాగ్ర దృష్టితో పరిశీలించాడు:

"వారా సంగతి నాతో చెబుతారా బాబూ? అయినా నా మట్టుకి నాకు చెప్పదగ్గ పని ఏమి ఉన్నట్టు కనబడదు! మిమ్మల్ని ఒక్కసారి చూడాలని అనుకొంటున్నాను. అంతే!"

అయినా రంగనాయకుడు ప్రతి సమాధానం చెప్పలేదు. దాశరథి చిరునవ్వు చిలకరించాడు:

"బాబూ! ఈ గ్రామంలో మహామహు లెందరో వారి దర్శనం కోసం పడిగాపులుపడి కూర్చుంటున్నారు. అటువంటి యతీంద్రులు ఒక్కసారి చూడాలని కుతూహలపడుతున్నప్పుడు మీ రెందు కింతగా సంకోచిస్తున్నారో నాకు బోధపడటం లేదు..."

రంగనాయకుని కిక గత్యంతరం గోచరించలేదు. ఏదో విధంగా తప్పించుకోవాలని యాథాలాభంగా అన్నాడు:

"ఎంతమాట! అలాగే బాబూ! దాని కేమిటి? కొంచెం తీరిక చూసుకుని ఒకవారంలోగా ఎప్పుడో ఒకప్పుడు వారి దర్శనం చేసుకుంటాను!"

అతిథి ఆ మాటవిని నిలువునా నిర్ఘాంతపడినట్టు రంగనాయకు డూహించుకొన్నాడు. అంతలోనే దాశరథి చిరునవ్వు చిలకరించాడు.

"వీలయితే వారు యిప్పుడే వెంట బెట్టుకుని రమ్మన్నారు! ఎప్పుడో వస్తానంటే ఎలాగ చెప్పండి?"

వారికి నాతో అంత తొందర పని ఏమి వచ్చింది చెప్మా ...అయినా నాకెప్పుడు బొత్తిగా తీరక లేదు. అదీగాక అప్పుడే బాగా చీకటి పడింది కూడాను ... పోనీ రేపు వస్తాను దానికేం?"

దాశరథి క్షణకాలం మౌనం వహించాడు. తిరిగి అతని ముఖవైఖరిలో రవంత ఆలోచనా రేఖ తాండవించింది:

"అయితే రేపు కొంచెం చల్లబడగానే మళ్ళీ మీదర్శనం చేసుకుంటాను. ఈ వేళ బాగా ఆలస్యంగా వచ్చినట్టున్నాను. రేపు కొంచెం బాగా ముందుగానే వస్తాను."

అమ్మమ్మ! మీకంత శ్రమ ఎందుకు? నాకోసం తమ వంటివారు మళ్ళీ రావాలా? నేనే వస్తానుగా!"

"ఎంతమాట! మీరు రారని కాదు! నేనే వచ్చి మిమ్మల్ని వెంటబెట్టుకుని వారి సన్నిధికి తోడుకొని పోవాలని అనుకుంటున్నాను! ఆయన స్వయంగా కలుగ చేసుకొని ఈ పని అప్పచెప్పినప్పుడు నావిధి నేను నెర వేర్చుకోవాలి కదా!"

రంగనాయకు డిక ఆమాట కడ్డు చెప్పలేదు:

"సరే! అలాగే రావచ్చును! దానికేమి! మీవంటి వారు మా ఇంటికి విజయం చేస్తానంటే కాదంటానా! ఎంత మాట! కాని అనవసరంగా శ్రమ ఎందుకని. అంతే!"

దాశరథికా ప్రత్యుత్తరంతో కొంచెం సంతృప్తి కలి

నేను రేపు రెండు జాముల ప్రొద్దు తిరిగి తిరగగానే ఇక్కడకు వస్తాను. దయఉంచి ఎక్కడికి వెళ్ళకండి! సెలవా మరి ... బాబూ : ఒక్కమాట. శ్రీమద్రామానుజులు మహానుభావులు! ఆయన స్వయంగా చూడాలని అనుకుంటున్నారంటే మీ రెంతో అదృష్టవంతులన్నమాట! నామాట నమ్మండి! సెలవా మరి! కొంచెం నాకోసం కనిపెట్టుకుని ఉండండి! మరచిపోకండి!"

"చిత్తం అలాగే!" అని రంగనాయకు డెంతో మర్యాదగా ఆవరణ ద్వారందాకా వెళ్ళి దాశరధిని పిలుచుకున్నాడు. బాగా దిగాలుపడి ఉసూరుమని నిట్టూర్చి లోపలకి వెళ్ళాడు. హేమసుందరి అంతవరకు వీధి కిటికీ పక్కన నిలబడి ఎంతో ఆత్రంగా వారిదరి సంభాషణ ఆలకిస్తూనే ఉన్నది! రంగనాయకుడు లోపల అడుగు పెట్టగానే దగ్గరికి వెళ్ళి నెమ్మదిగా అడిగింది.:

"ఎవరండీ ఆయన! ఎందుకు వచ్చినట్టు?"

"ఆ వేళ మన కెదురుపడలేదూ రామానుజయతీశ్వరులు! ఆయన నన్నొకసారి చూడాలని అన్నారట. అందు కోసమని వెంటబెట్టుకొని పోవాలని వచ్చారు!"

"ఎందుచేత చెప్మా!"

"ఏమో మరి! నాకిదేమి అంతుపట్టడంలేదు!" హేమసుందరి మరి కొంతసే పలాగే ఆలోచించింది.

"అయితే ఈనాటితో మన పని అయిందన్నమాటే!"

"ఎందుచేత! ఎందు కలాగ అంటున్నావు?"

రంగనాయకులు ఉంతో కంగారుపడి అడిగాడు.

"ఈవేళ ముడుపు చెల్లించి తిరిగి వస్తూంటే, ఆ యతీశ్వరులు మన ఇద్దరికేసి ఎంతో విడ్డూరంగా చూశారు. నేను అప్పుడే అనుకున్నాను కొంప మునుగుతుందని! మీరు నా మాట కొంచెమయినా లక్ష్యపెట్టారా? ఆయన మిమ్మల్ని దగ్గిరికి పిలిపించి చల్ల చల్లగా చీవాట్లు పెట్టి మళ్ళీ నిచుళాపురం పంపించివేస్తారు! ఇక జరిగే దింతే! మరి సందేహంలేదు!"

"చాలు చాలులే! ఇల్లలకగానే పండుగ అయిపోతుందా ఏమిటి? చీవాట్లు పెట్టగానే నీమాన నిన్ను విడిచిపెట్టి నామాన నేను వెళ్ళిపోతా నన్నుకొన్నావా? నా కంఠంలో ఊపిరి ఉన్నంతవరకు అది ఎన్నటికి జరగదు, అంతే!"

"నిజంగా మువ్మాటికి ఈ మాటమీద నిలబడతారా? నన్ను చంపుకుని తిన్నట్టేనా?"

"ఆఁ అంతే! దీని కిక తిరుగులేదు!"

"సరేగాని ఇంతకి ఆ ధర్మకర్త ఏమన్నారు?"

"అస లాయన దర్శనమే కాలేదు! నేను వారి భవంతికి వెళ్ళకమునుపే దేవాలయానికి వెళ్ళిపోయారని తెలిసింది"

"మరి ఇంతసేపటిదాకా ఏమి చేస్తున్నట్టు?

"ఆ శ్రీశైలం లేడూ? అతనితో కలిసి కావేరి వీథికి వెళ్ళాను!"

"అల్లాగ చెప్పండి! నోరు తెరిచేసరికి పరిమళం గుబాళించగానే నేను ముందే అనుకొన్నాను. మీరు ధర్మకర్త భవంతికి వెళ్ళలేదని!"

"అక్కడికే వెళ్ళాను హేమా! దారిలో శ్రీశైలం కనబడి ధర్మకర్త ఇంటిదగ్గర లేరన్నాడు. కావేరీ వీధికి రమ్మని బలవంతం పెట్టాడు. మరి కాదనలేక..."

"ఆ దుష్టుడు ధర్మకర్త లేరని అబద్ధం చెప్పి మిమ్మల్ని మభ్యపెట్టి ఉంటాడు. లేకపోతే మీరే ఈ కట్టుకథ కల్పించారేమో! ఎంతకయినా తగినవారే మీరు!"

"నిజమే హేమా! నాకంత అబద్ధం చెప్పవలసినంత అవసరం ఏమి వచ్చింది! భార్తిగా నామాట నమ్మలేకపోతే ఎలాగ?"

రంగనాయకుడు కొంచెం చిరాకుతో విసుక్కున్నాడు.

"ప్రాసీలెండి! మీరే అంత సంసార బాధ్యత తెలియకపోతే మధ్యన నా కెందుకీ రొష్టు! అప్పుడే అపరాత్రి కావస్తోంది! భోజనానికి లేవండి!"

భోజనాలవేళ కనక, ఆ విషయం చిలికి చిలికి గాలివాన కాలేదని రంగనాయకుడు లోలోపల కొంచెం సంతృప్తి పడ్డాడు.

# 18

ఆషాఢనాటి ఉదయం శ్రీరంగంలో నలుమూలల నల్ల నల్లని మబ్బు లలుముకొన్నాయి. పెనుగాలి వీచి ఇళ్ళ కిటికీల తలుపులు టపటప కొట్టుకున్నాయి. వీధులలో పెద్ద గాలి దుమారం చెలరేగింది. పండుటాకు లువ్వెత్తుగా పైపై కెగిరి ఇళ్ళ కప్పులమీద తూలిపడ్డాయి. క్రమక్రమంగా పెద్ద జడివాన ప్రారంభించింది. ఇంచుమించుగా రెండుజాముల పొద్దు తిరిగే దాకా దాని హోరు తగ్గలేదు. ఆ తరవాత క్రమక్రమంగా ఆ జడివాన కొంచెం తగ్గుముఖం పట్టింది. కాని మధ్య మధ్యన జల్లులుపడడం మాత్రం మానలేదు. చూరులోనించి చుక్కలొకటే జారిపడి నేలమీద చిన్నచిన్న గుంట లేర్పడ్డాయి. రంగనాయకుని ఇంటి పెరటిలో పూలమొక్కల బారులు వానలో బాగా తడిసి తలలు వంచుకొన్నట్టు కనిపించాయి. వీధిలో వర్షధార లేకమై చిన్న చిన్న కాలవలై నలువైపుల గలగల. ధ్వనులతో ప్రవహించాయి. ఇంటికప్పుమీద పడు తున్న వాన చినుకుల సవ్వడి మంద్ర మంద్రంగా రంగనాయ కుని హృదయంలో మారుమోగింది.

మధ్యాహ్నం నిద్రలేచిన తరువాత రంగనాయకుడింకొక సారి ధర్మకర్తకోసం బయలుదేరాలని అనుకొన్నాడు. తలవని తలంపుగా ఎడతెగని ముసురు పట్టుకుని మరి విడిచిపెట్టక అదే పనిగా పీడిస్తున్నట్టు కనిపించింది. రంగనాయకుని మనస్సానాడు బొత్తిగా నసిగా లేదు. దాని కనేక కారణా లేర్పడ్డాయి. అతని దగ్గిర కుదువ చేసుకొన్న సొమ్మంతా అయిపోవచ్చింది. ఇంక రెండు మూడు నెలలదాకా కూడా బండి నడవడం కష్టమే!

రంగనాయకుని కెన్నడు సొమ్ము విలవ తెలియలేదు. రేపేమయి పోయినా సరే, ఉన్నంతవరకు ఆవేళ హాయిగా కాలక్షేపం చెయ్యడమే అతని కలవాటు. బాగా జాగ్రత్తగా పొదుపుచేస్తే గాని రెండు మూడు నెలల వరకయినా ఏ లోటు లేకుండా కాల క్షేపం కావడం కష్టమే.

అందుచేతనే ధర్మకర్త ప్రత్యుత్తరం కోసం అతి డెంతో ఆత్రంగా నిరీక్షించాడు. కాని ఎన్నిసారులు వెళ్ళినా రేపు రా, మాపు రా, అన్నమాటే గాని ఇంకొక ధోరణి వినబడలేదు. ప్రాణం విసిగినా తిరిగి ఇంకొసారి వెళ్లాడు. కాని అవసరం వచ్చి నప్పుడు తానే కబురు పంపిస్తా నన్నాడు. మరి పని కట్టుకుని రా నక్కరలే దన్నాడు. ఆ నిర్లక్ష్య ధోరణి తలచుకోగానే వల్ల మాలిన అక్కసుతో రంగనాయకుని చెక్కిళ్ళు రెండు జేవురిం చాయి. "ఈ అధికార దుర్మదాంధులంతా ఇంతే! కొంచెం పెత్తనం చేతికి రాగానే కళ్ళు నెత్తిమీదికి వెళ్ళిపోతాయి కాబోలును! ఛీ! ఛీ! ఇటువంటి దురహంకారుల ముఖాలు చూస్తే పంచ మహా పాతకాలు చుట్టుకుంటాయి! ఏది ఏమ యినా సరే ఇక ధర్మకర్త ముఖం చూడకూడదు!" అని చీద రించుకొన్నాడు. కాని అంతలోనే అతని హృదయాంతరాళం "ఈ బక్క కోపంవల్ల ప్రయోజన మేమిటి? ఏదోవిధంగా వెళ్ళి పని సానుకూలం పరుచుకుని రావాలి గాని! ఇక ముమ్ముందు హేమతో బాటు అన్న వస్త్రాలకు కూడా అలమటించవలసిన దురవస్థ ఏర్పడి తీరుతుంది సుమా! జాగ్రత్త." అని హెచ్చ రించింది. ఉసూరుమని ఒక వేడి నిట్టూర్పు విడిచిపెట్టాడు రంగ నాయకుడు. "సరే! ముసురువల్ల ఈవేళ వీలులేకపోయింది గదా! రేపో ఎల్లుండో మళ్ళీ ఒకసారి వెళ్ళి చూస్తాను.

లేదంటే అనవలసిన మాటలు నాలుగు ఆయన ముఖంమీదే గట్టిగా దులిపివేస్తాను" అని మళ్ళీ కొంచెం సమాధానపడ్డాడు.

అంతలోనే అతని కింకొక ఆలోచన తట్టింది. రంగనాయకునికి శ్రీరంగంలో గల మల్లు లందరిలోను గట్టి దిట్ట అన్న గొప్ప ప్రఖ్యాతి లభించింది. అందుచేత ఆ నగర వీధులలో తన మల్ల విద్యానైపుణి వెల్లడించి పౌరుల ప్రశంసలతో బాటు కొంత ధనం సంపాదించుకోవచ్చునని అత డనుకొన్నాడు. ఆ పద్ధతి అనుసరిస్తే ఎంతకాలమయినా ఏవిధమయిన చీకు, చింత లేకుండా హాయిగా కాలక్షేపం చెయ్యవచ్చును. శ్రీరంగంలో ఆపూటయినా గడవని మల్లులు ఒకరిద్దరావిధంగా తమ కుటుంబాలు పోషించుకొంటున్నారు. కాని అతని కది సరిపడలేదు. ఆ పద్ధతివల్ల వచ్చే రాబడి చాలా తక్కువ. అదీగాక నడివీధులలో ఉత్తరీయం పరిచి సాము గరడీ లారంభించడానికి అతనికి ఆభిజాత్యం కూడా అడ్డు వచ్చింది. నిచుళాపురంలో ఎంతో మర్యాదగా కాలక్షేపం చేస్తున్న వెంకటనాయకుని కడుపున పుట్టిన తా నంతటి దైన్యాని కొడబడగలడా ? అంతకన్న శ్రీరంగేశుని నామస్మరణతో యాయవార మయినా మేలే అనిపించింది.

ఆ తరవాత సంపన్నులయిన భూస్వాము లెవ్వరి దగ్గిరయినా పాలికాపుగా కుదురుకుని, తన కుటుంబం పోషించుకోవాలని రంగనాయకుని కింకొక సంకల్పం కలిగింది. నిజాని కది చాలా మంచి ఆలోచనే ! కాని అతనికి శ్రీరంగంలో సంపన్న భూస్వాముల పేరు లయినా తెలియవు. అక్కడ అడుగుపెట్టినప్పటినుండి ఏ డెనమండుగురు మల్లులతో తప్ప, ఇక మిగిలిన

ఇరుగు పొరుగు లెవ్వరితోను అతని కంతగా దగ్గర పరిచయం కలగలేదు. ఒక్క హేమసుందరికే ఇరుగు పొరుగమ్మలతో కొంత సన్నిహిత పరిచయం కలిగింది. చిన్నప్పటినించి రంగ నాయకునికి నలుగురితోను కలిసి కట్టుగా తిరిగే ధోరణి అలవడ లేదు ! ఇక శ్రీరంగం చేరుకొన్న తరవాత ఇరుగు పొరుగు గృహస్థు లతనితో అంటీ అంటనట్టు మాట్లాడి తమ దారిని తాము వెళ్ళిపోయేవారు. అది గమనించి రంగనాయకు డింతకన్న ఎక్కువ ముభావం అలవాటు చేసుకొన్నాడు. అందుచేత అతని కీ కష్టసమయంలో ఆదుకోగల ఆత్మీయ మిత్రు లెవ్వరు కనబడ లేదు. మల్లులలో కొందరు సంపన్ను లున్నారు గాని, ఏదయినా గట్టి అవసరం వస్తే వా రెవరు అంతగా పట్టించుకోరు. మరి గత్యంతర మేమిటి ? క్రమక్రమంగా హేమసుందరికి, తనకు అన్నవస్త్రాలకే మొహం వాచిపోవలసినంత దురవస్థ తప్పనట్టే కనిపించింది.

అది అలాగ ఉండగా ఇప్పుడు పులిమీద పుట్రలాగ రామానుజ యతీశ్వరుని బెడద ఒకటి వచ్చిపడింది. దీనికి గల కారణమేమో రంగనాయకుని కెంతగా తలబద్దలు కొట్టుకొన్నా బోధపడలేదు. బహుశః హేమసుందరి ఊహ నిజమే అయి ఉండవచ్చునని అనుమానించాడు. అందుచేత దాశరథి వచ్చే వేళ కెలాగయినా ఇంటిదగ్గర ఉండకుండా ముఖం తప్పించి వెయ్యాలని నిశ్చయించుకొన్నాడు. అప్పటికి వాన తుంపర చాలావరకు తగ్గింది. ఉత్తరీయం ఒళ్ళంతా కప్పుకుని వీధిలోకి బయలుదేరాడు. హేమసుందరి వీధిగుమ్మం దాకా అతని వెంట పడి "ఎక్కడికి ?" అన్నట్టు చూసింది.

"అబ్బే ఎక్కడికి లేదు! ఏమి తోచడం లేదు! అలాగ అలాగ తిరిగి వస్తాను. అయినగాని వస్తే కొంచెం తొందర పని మీద ఎక్కడికో వెళ్ళారని చెప్పు! బాగా చీకటి పడిన తర వాతగాని తిరిగి రారని చెప్పు."

"నిజంగా బాగా చీకటి పడిందాకా తిరిగి రారా ?"

ఎంతో ఆత్రంగా అడిగింది హేమసుందరి బొమముడి విరిచి.

రంగనాయకుడు తేలిగ్గా చిరునవ్వు చిందించాడు.

"రానన్నానా ? రారని చెప్పమన్నాను గాని !"

"పాపం ఉంటానని మాట ఇచ్చి ఇలాగ మభ్యపెట్టడం భావ్యమేనా ! బాగుంటుందా ?"

"ఆ ! బాగుండకేం చేస్తుంది ! అప్పుడే దాశరథి వచ్చే వేళయింది. ఇంతా చేసి వీధి మలుపులో ఎదురు పడతారో ఏమో ! మరి నేను వెళ్ళాలి !"

ఒకేఒక అంగలో వీధిలో పడ్డాడు రంగనాయకుడు. అనేక విధాలయిన ఆందోళనలతో సతమతమయిన అతని పాదా లప్రయత్నంగా కావేరీ వీధిలో మద్యశాల వైపు సాగి పోయాయి. గడియ దాటక పూర్వమే అడ్డా పానశాలలో ప్రవేశించాడు. వర్షం కొద్దిగా కురవడం మూలాన ఆ వేళ మల్లి లెవ్వరు అక్కడికి రాలేదు. మద్యశాల అంతా నిర్జీవంగా ఉన్నట్టు కనబడింది. లోపల ఉన్న జనం అంతా కలిసి నలుగురు, ఐదుగురి కన్న ఎక్కువ మంది లేరు. వారయినా వేరువేరుగా తలోక మూల కూర్చొని నెమ్మది నెమ్మదిగా మధుర మద్యా

లాస్వాదిస్తున్నారు. అయినా అతని కింకో ఉత్సాహం కలిగింది. రవంత మైమరుపు కలిగేవరకు తీయతీయని మైరేయం సేవించాడు. అప్పటికాతని మనస్సు బాగా తేలిక పడింది. లోలోపలి ఆందోళనలన్నీ పూర్తిగా తుడిచిపెట్టుకు పోయినట్టనిపించింది. శరీరం నఖశిఖ పర్యంతము దూది పింజలా గాలిలో తేలిపోతున్న ట్టొక విధమయిన ఆనందానుభూతి కలిగింది. ఆకాశంలో నెమ్మది నెమ్మదిగా తేలిపోతున్న నల్ల నల్లని మబ్బుల బారులకేసి, అప్పుడప్పుడు జల్లు జల్లులుగా పడుతున్న తుంపరలకేసి చూస్తూ కూర్చున్నాడు రంగనాయకుడు. అలాగ ఎంతసేపు గడిచిందో అతనికే తెలియదు.

అప్పటికి సూర్యాస్తమయం కావచ్చింది. "ఈపాటికి నాకోసం నిరీక్షించి నిరీక్షించి తిరిగి వెళ్ళిపోయి ఉంటారు దాశరథి. ఇక నెమ్మదిగా తిరిగి వెళ్ళిపోవచ్చును. అమ్మయ్య! ఈ వేళకీ బెడద తప్పిపోయింది గదా! ఇక రేపటి మాట అప్పుడాలోచించుకోవచ్చును." అని సంతృప్తి పడ్డాడు రంగనాయకుడు. ద్వారం దగ్గిర ఆవలిస్తూ కూర్చున్న ఆసామీకి పైకం చెల్లించి మళ్ళీ వీధిలో అడుగు పెట్టాడు.

వాన తుంపర బాగా తగ్గింది. మబ్బుల బారు లొకటొకటే విడిపోయి దూరదూరంగా తేలిపోయాయి. అస్తమించబోతున్న సూర్యుని కాంతి కావేరి వీధిలో ప్రవహిస్తున్న చిన్న చిన్న వాన కాలవలలో ప్రతిఫలిస్తున్నది. పసిపిల్లలు కొందరు ఆకు దొన్నెలవంటి పడవలు నీటి ప్రవాహాలలో విడిచిపెట్టి వాటి వెంటబడి పోతున్నారు. ఇళ్ళకు మళ్ళిపోతున్న పాడి దూడల అంభారవాలు మాటిమాటికి వీధి మొగలో మారు

మోగుతున్నాయి. లేగదూడలు చిన్న చిన్న అడుగులతో ఎగిరెగిరిపడి పలుపులు తెంచుకోవాలని ప్రయత్నిస్తున్నాయి. వాటి మెడలలో మువ్వ లప్పుడప్పుడు మంద్ర మంద్రంగా ప్రతిధ్వనిస్తున్నాయి.

రంగనాయకు డెంతో ఉల్లాసంతో తన భవంతి ఆవరణ ద్వారం తెరుచుకొని లోపల అడుగుపెట్టాడు. అంతే! మరు క్షణంలోనే నిలువునా నిర్ఘాంత పట్టాడు! వీధి అరుగుమీద తుంగచాపమీద కూర్చున్న దాశరథి చిన్నారి చిరునవ్వుతో "వచ్చారా! మీకోసమే ఎదురు చూస్తున్నాను." అన్నాడు. రంగనాయకుని కిక కాళ్ళాడలేదు. అయినా అతి కష్టంమీద తన ఆందోళన నిగ్రహించుకొన్నాడు. ఎంతో వినయంగా దాశరథిని సమీపించి నమస్కరించి దోసిలికట్టి నిలుచున్నాడు.

"తలవని తలంపుగా తొందరపని ఒకటి వచ్చి పడింది. అందుచేత బయలుదేరి వెళ్ళక తప్పలేదు. అదిగాక ఇంత తొందరగా తిరిగివస్తా ననుకోలేదు. పాపం! నాకోసం చాలా సేపటినించి కనిపెట్టుకుని కూర్చున్నారులా ఉన్నది."

"దానికేం బాబూ! నాకు వేరే పని ఏమి లేదు! మీకోసమే ఎదురు చూస్తున్నాను. రామానుజుల దర్శనానికిదే తగిన సమయం. రండీ వెడదాము."

రంగనాయకుని కిక ఏమనడానికి పాలుపోలేదు.

"ఒహో! అలాగా! బాగా పొద్దుపోయింది. ఇక ఈవేళ వారి దర్శనం వీలుపడదేమో అనుకున్నాను. అయితే, సరే, మీవెంట వస్తున్నాను. పదండి."

ఆ సమయంలో తప్పించుకోవడానికి కిక వేరే ఉపాయా లేవీ స్ఫురించక రంగనాయకుడు అలాగే వస్తానని మాట ఇచ్చాడు. కాని లోలోపల గుబగుబ లాడుతూనే ఉంది. అయినా గుండె రాయి చేసుకున్నాడు. "ఈవేళ కాకపోతే రేపటికయినా ఆయన దర్శనం తప్పదు! ఇలాగ ఎన్నాళ్ళని తప్పించుకుని తిరగగలను! ఏది ఏమయినా సరే! హేమ సుందరిని విడిచిపెట్టేది లేదని భీష్మించుకుని కూర్చుంటే నన్నేమి చెయ్యగలరు! ఆ! ఇంతకంటె బాగా పెద్ద పెద్ద బెడదలే తప్పించుకుని బయటపడ్డాను. నా కిది ఒక లెక్కా!" అనుకుని కొండంత ధైర్యం తెచ్చుకొన్నాడు. లోపలికి వెళ్ళి "ఆట్టే సేపు ఆలస్యం కానివ్వనులే! ఇప్పుడే తిరిగివస్తాను." అని హేమ సుందరితో చెప్పి దాశరథి వెంట బయలుదేరాడు. మరి కొంత సేపటికి వా రిద్దరు రామానుజయతి నివసిస్తున్న శ్రీవైష్ణవ మఠం సమీపించారు.

అది శ్రీరంగ దేవాలయం మూడవ ప్రాకారానికి నాలు గవ ప్రాకారానికి మధ్య సువిశాలమయిన మామిడితోపులో నిర్మించిన సమున్నత భవనం. రంగనాయకు డిన్నాళ్ళనించి ఆ మఠంవైపెన్నడు పోలేదు. దానిమీద చిన్న చిన్న దేవా గార గోపురాలవలె నిర్మించిన శిఖరాలపై అమర్చిన పసుపు పచ్చని గరుడాళ్వారు పతాక, శంకచక్ర గదా ఖడ్గాల కేతనాలు గాలిలో అల్లనల్లన కదలాడుతున్నాయి. సంజె చీకటిలో ఆ శిఖరాలమీద అమర్చిన స్వర్ణ కలశాలు స్పష్టా స్పష్టంగా తరళించాయి.

ఆ మఠంవైపు చూడగానే రంగనాయకుని కేదో ఒక వింత లోకంలో అడుగుపెట్టిన ట్లనిపించింది. దాని ప్రాంగణంలో

బారులు బారులుగా నాటిన సురపొన్నలు, బొగడలు, దేవకాంచనాలు, పారిజాతాలు, మందారాలు, వేర్వేరు విచిత్ర వర్ణాల పూలతీగలు అప్పుడప్పుడే వికసించిన పుష్పాల సువాసనలతో రంగనాయకుని కెంతో ఆహ్లాదం కలిగించాయి. "ఎంత సొగసయిన పూదోట!" అని అత డెంతో ఆశ్చర్యపడ్డాడు. శ్రీరంగనాథుని పాద ముద్రికల వంటి ఊర్ధ్వపుండ్రాలతో, తులసీ మాలలతో రామానుజుని శిష్యులు కొందరు ఎలుగెత్తి ద్రావిడ వేదపాశురాలు పఠిస్తున్నారు. మరి కొందరు మఠం వెనక భాగంలో ఉన్న దిగుడు బావిదగ్గర చేరి సంధ్యావందనా లారంభించారు. ఇంకా కొందరు పెద్ద పెద్ద దీపపు సెమ్మెల చుట్టు చేరి ఏకాగ్రవీక్షణాలతో, తాళపత్ర గ్రంథాలు, భూర్జపత్ర పుస్తకాలు పరిశీలిస్తున్నారు. నలుగు రయిదుగురు బ్రహ్మచారులు రంగనాయకుని కేసి పరిశీలనగా చూసి తమలో తాము గుసగుస లారంభించారు.

అంతలోనే దాశరథి అతనిని మఠం ముందు చావడిలో ఒక చిత్రాసనంమీద కూర్చోబెట్టి "లోపల ఎవరో దర్శనం చేసుకుంటున్నట్టున్నారు. కొంచెంసేపు ఇక్కడ కూర్చోండి! నేను మళ్ళీ ఇప్పుడే వచ్చి తీసుకు వెడతాను. ఎంతోసేపు పట్టదు." అని చెప్పి మఠం లోపలికి వెళ్ళిపోయాడు.

రంగనాయకుని కల్లంత దూరంలో రామానుజుని ముఖం విస్పష్టంగా గోచరించింది. ఆర్ద్ర ప్రసన్నమయిన మందహాసంతో ఆయన ఎవరితోనో ప్రసంగిస్తున్నాడు. ఒక పండు ముసలి ముత్తయిదువ వినబడీ వినబడని కంఠస్వరంతో తన గోడేదో వెళ్ళబోసుకొంటున్నది. మధ్య మధ్య కంట నీరు పెట్టు

కుంటున్నది. ఒక పసివాడు-ఆమె మనుమడు కాబోలు-ఒడిలో కూర్చున్నాడు. నిశ్చల దృష్టితో రామానుజుని మెడలోని తులసీ మాలలు పరిశీలిస్తున్నాడు. ఉండి ఉండి ఆయన ఆ వృద్ధాంగన నేదో అడిగి చల్లని పలుకులతో ఓదారుస్తు న్నాడు. ఆమె చీర చెరగుతో కనుగొలుకు లద్దుకొంటున్నది. మధ్య మధ్య రామానుజయతి విశాల నేత్ర యుగళి పైకెత్తి పరధ్యానంగా దేనివైపో అవలోకిస్తున్నట్టున్నాడు. దీపపు సెమ్మెపై కంచుప్రమిదలలో చిరుదీపికల కాంతిలో ఆ యతీ శ్వరుని ముఖం జాజ్వల్యమానంగా ప్రకాశిస్తున్నది. "మధ్య మధ్యన కళ్ళు రెండు పైకెత్తి దేనినైపు చూస్తున్నా రాయన!" అని రంగనాయకు డెంతో విస్తుపోయాడు.

అంతలోనే ఆ ముత్తయిదువ ఒడిలో కూర్చున్న పసివా డకస్మాత్తుగా లేచి నిలబడి రామానుజుని కెంతో దగ్గరగా వెళ్ళి "తాతా! ఇదిగో! నా బొమ్మ! ఈవేళ పొద్దున్న కొనుక్కు న్నాను!" అని తన చిట్టి పిడికిలితో అదిమి పట్టుకొన్న చిన్నారి చందనపు బొమ్మ చూపించాడు! అంతే ఆ యతీశ్వరు డంత టితో తన ధర్మ ప్రసంగం విరమించి ఎంతో ఆప్యాయంగా ఆ పసివాణ్ణి ఎత్తుకుని ముద్దు పెట్టుకుని ఆ బొమ్మ ఎంతో జాగ్ర త్తగా పరిశీలించి "చాలా చక్కని బొమ్మే కొనుక్కున్నావే!" అని అభినందించి తిరిగి నుదుట ముద్దు పెట్టుకొన్నాడు. ఆపైన వారిద్దరి మధ్య అయిదారు నిమిషాల వరకు చిత్ర విచిత్ర మయిన సంభాషణ సాగింది. రంగనాయకునికా సంఘటన మరింత ఆశ్చర్యం కలిగించింది." ఎవరో ఇద్దరు చిన్నపిల్లల లాగ అమాయికంగా నవ్వుకుంటూ ఎంత అప్యాయంగా మాట్లాడు కొంటున్నారో!" అని మరింతగా ఆశ్చర్యపడ్డాడు. అంతలోనే

ఆ వృద్ధాంగన రామానుజునికి సాష్టాంగ నమస్కారం సమర్పించి ఎంతో భక్తితో ప్రసాదం స్వీకరించి పసివాణ్ణి ఎత్తుకుని తిరిగి బయలుదేరబోయింది. కాని ఆ పిల్లవాడు రామానుజుని విడిచిపెట్టి వెళ్ళిపోవడాని కేమాత్రము ఇష్టపడలేదు. విలవిలలాడి ఆమె పట్టు విడిపించుకోబోయాడు. ఆ ముత్తయిదువ "మళ్ళీ రేపు వద్దాం లే నాయనా!" అని నెమ్మదిగా నెమ్మదిగా బుజ్జగించి ఇవతలికి వచ్చివేసింది.

అంతలోనే దాశరథి రామానుజుడు కూర్చున్న గదికింకొక వైపున్న ద్వారం దాటి రంగనాయకుడు దర్శనంకోసం నిరీక్షిస్తున్న సంగతి నివేదించబోయాడు. కాని అకస్మాత్తుగా ద్వారబంధం దగ్గరే నిలబడిపోయాడు! అదే సమయంలో ఒక ఉడత చిన్నారి తోక పైకెత్తి చెంగు చెంగున రామానుజుని భుజంమీది కెగిరి ఏదో సంగతి చెప్పబోతున్నట్టు తన చిన్ని పెదవు లల్లల్లాడించింది. మరు క్షణంలోనే ఒకే ఒక్క చెంగలింపుతో కుడిచేతిమీది కురికింది. రామానుజయతి దాని నెంతో ఆత్మీయతతో పెదవుల కద్దుకొన్నాడు. పక్కనే జాగ్రత్తచేసిన దానిమ్మగింజలు కొన్ని ముందుంచి "నీసంగతి మరచిపోతానా! ఎంతమాట! అయితే ఈవేళ కొత్తవా రెవరో వచ్చినట్టున్నారు! మరి!" అన్నాడు. ఉడత గింజ లొకటొకటే కొరికి తిరిగి చంగుమని రామానుజుని భుజంమీది కురికింది! ఇంకొక్క రెండు మూడు చెంగిలింపులతో చరచరా ద్వారం దాటి ఆ సమీపంలో ఉన్న గున్నమామిడి చిటారు కొమ్మమీదికి వెళ్ళిపోయింది! రామానుజుడు లోలోపల నుండి విశాలనేత్రాంతాలలో వెల్లివిరిసిన వాత్సల్యంతో క్షేమంగా చెట్టు కొమ్మమీదికి వెళ్ళేవరకు దానివై పవలోకిస్తూనే ఉన్నాడు.

(13)

# 19

అలాగ నాలుగయిదు నిమిషాల కాలం గడిచింది. దాశరథి సవినయంగా రామానుజుని సమీపించి రంగనాయకుని రాక నివేదించి చిత్రాసనంమీద కూర్చున్న అతనిని లోపలికి తోడుకువెళ్ళి సెలవు తీసుకుని తిరిగి వేరొక చోటికి పోయి తన విధి నిర్వహణలో నిమగ్ను డయినాడు. లోపల అడుగుపెట్టగానే రంగనాయకు డత్యంత భయభక్తులతో రామానుజునికి సాష్టాంగ నమస్కృతి సమర్పించాడు. అంతలోనే ఆ యతి తటాలున లేచి నిలబడి అతనిని లేవనెత్తి క్షణకాలం నిశ్చల నేత్రాలతో ముఖవైఖరి పరిశీలించి ఎంతో ఆప్యాయంగా తన సరసన కూర్చోబెట్టుకొన్నాడు:

"వచ్చావా! నాయనా! ఇన్నాళ్ళనించి నీకోసమే ఎదురుచూస్తున్నాను!"

ఆపైన అదేవిధంగా విస్ఫారిత విశాలనేత్రాలతో రంగనాయకుని నేత్రవైఖరి పరిశీలించడం ప్రారంభించాడు. రామానుజయతి అంతటి అపూర్వాత్మీయతతో తన్నాదరించగలరని అత డొకించు కయినా ఊహించి ఉండలేదు. అదీగాక ఆ పలకరింపు అతని కెంతో విడ్డూరంగా వినిపించింది. "ఇన్నాళ్ళనించి నాకోసమే ఎదురు చూస్తున్నామని అన్నారేమిటి? నిన్ననే కదా నేను మొట్టమొదట ఈయన కంటబడినది.? మరి ఇన్నాళ్ళనించి ఎలాగ ఎదురుచూస్తున్నారు? నా పుట్టుపూర్వోత్తరా లీయన కింతకు పూర్వమే తెలుసునా? ఇంతకీ నాకోసం ఎదురు చూడ వలసినంత రాచకార్యం ఏమి వచ్చింది? ఇదేమిటి చెప్మా! ఈ

విచిత్రం! క్షణకాలం రంగనాయకుని ఆలోచనల పరంపర ఆవిధంగా కొనసాగింది. సన్నని దీప ప్రమిదల కాంతిలో రామానుజుని ముఖం ప్రఫుల్ల నయనాలతో జాజ్జ్వల్యమానంగా వెలిగిపోతున్నది. ఆ వెడద కనుదోయి వైపు చూడగానే రంగనాయకునికి హేమసుందరి ఆకర్ణాంత నేత్రయుగళి జ్ఞప్తికి వచ్చింది. "తిరిగి తొందరగా ఇంటికి వెళ్ళిపోవాలి. ఈయన ఎంత సేపటికీ మరి మాటాడ రేమిటి? ఎందు కలాగ అదేపనిగా నావైపు చూస్తున్నారు!" కొంచెం కంగారుపడ్డాడు రంగనాయకుడు! అంతలోనే రామానుజుని పెదవులపై తరళ దరహాసం వికసించింది. ఆయనే ముమ్మొందుగా తిరిగి పలకరించగలరని రంగనాయకు డనుకొన్నాడు. కాని అలాగలాగ అయిదారు లిప్తల కాలం గడిచినా రామానుజుని పెదవులు విడివడలేదు. రంగనాయకుని కా మౌనంతో ఎంతో ఇరుకున పడ్డట్టయింది. మరి భరించలేక అతడే మొట్టమొదట ప్రసంగం ప్రారంభించాడు:

"తమ రొకసారి రమ్మన్నారని దాశరథి అన్నారు. వారే స్వయంగా నన్ను వెంటబెట్టుకొని ఇక్కడికి తీసుకువచ్చారు."

"అవును నాయనా! నేనే పిలిపించాను. నీవు శ్రీరంగనాథ స్వామికి సమర్పించిన పైడి కనుదోయి, బంగారు తిలకము పరిశీలించిన పిమ్మట ఒకసారి చూడాలని అనిపించింది. ఆ కన్నుల జంట స్వామి ముఖంమీద ఇంద్రధనుస్సుల జంటలా జాజ్జ్వల్యమానంగా వెలిగిపోతున్నది! ఇన్నాళ్ళనించి ముత్యాల హారాలు, మాణిక్య కుండలాలు, రతనాల బాహుపురులు మొక్కుకొన్న భక్తు లున్నారుగాని ఇటువంటి వింత మొక్కుబడి చెల్లించినవా రెవ్వరు కనబడలేదు. ఇందుచేతనే నిన్నిక్కడికి పిలిపించాను."

ఆ సమాధానం వినగానే రంగనాయకునికి ముచ్చెమటలు పోశాయి! తన విడ్డూరపు మొక్కుబడి చెల్లింపువల్ల శ్రీరంగే శుని యెడల ఏదో గొప్ప అపచారమే జరిగి ఉండవచ్చునని బాగా భయపడ్డాడు:

"స్వామీ! నావల్ల వల్లమాలిన అపరాధమే జరిగి పోయింది. ఏదో తెలియక చేశాను. మన్నించండి!"

రామానుజ యతి రవంత బొమముడి విరిచి ప్రఫుల్ల దరహాసంతో నెమ్మదిగా ప్రశ్నించాడు:

"ఇదేమిటి నాయనా! ఇలాగంటున్నావు! ఇందులో స్వామి యెడల అపరాధ మేమయినా జరిగిందా?"

రంగనాయకుని కిక ఏమనడానికి పాలుపోలేదు. కొంచెం సే పాలోచించి హేమసుందరి తన వేలువిడిచిన మేనమామ కుమార్తె అయినట్లు తల్లిదండ్రుు లిష్టపడకపోవడంవల్ల అతి రహస్యంగా ఆమెతో కలిసి శ్రీరంగం వచ్చివేసినట్లు ఒక చిన్న కట్టు కథ కల్పించాడు. తన కోరిక నెరవేరిన పక్షంలో అంతకు మునుపే హేమసుందరి వెదడ కనుదోయి కొలతలతో స్వామి కొక సువర్ణ నేత్రయుగళి, పైడి తిలకము సమర్పించవలెనని మొక్కుకొన్నట్లు చాలా సంగ్రహంగా బయటపెట్టాడు. దోసిలి కట్టి తెలియక చేసిన తప్పిదం మన్నించవలసినదని తిరిగి ప్రాధేయ పడ్డాడు.

కాని రామానుజుని ముఖంలో రవంతయినా ఆశ్చర్య చ్ఛాయ పొడకట్టలేదు. కేవలం తటస్థ దృష్టితో అలతి నగవుతో తిరిగి ప్రసంగించాడు:

"దీనిలో అపచార మేమి లేదే! ఎవరి కోరికల ప్రకారం వారు తమ మొక్కుబడులు చెల్లించుకొంటారు. దాని కేమి!"

ఆ ప్రతి సమాధానంతో రంగనాయకునికి ప్రాణం లేచి వచ్చినట్టయింది. మొట్టమొదట ఆయన తన దుశ్చర్య గర్హించి గట్టిగా మందలించగలడని ఎంతో భయపడ్డాడు. హేమసుందరితో సాంగత్యాని కంతటితో స్వస్తి చెప్పి తిన్నగా తిరిగి తల్లిదండ్రుల దగ్గిరికి వెళ్ళిపోవలసినదని ఆజ్ఞాపించగలరని ఆందోళనపడ్డాడు. ఆ మాట పాటించని పక్షంలో తన వ్యవహారం శ్రీరంగ దండ నాయకుని వరకు వెళ్ళిపోవచ్చునని లోలోపల అనుమానించాడు. కాని అటువంటి దేది జరుగలేదు. పైగా తన మొక్కుబడులతో స్వామి ముఖం దేదీప్యమానంగా వెలిగిపోతున్నదని ప్రశంసించారు. ఆ ప్రసన్నధోరణి గమనించి రంగనాయకుడు పట్టరాని సంతోషంతో తలమునకలయినాడు.

అంతలోనే రామానుజ యతి అత్యంతాత్మీయ దృష్టితో ప్రశ్నించాడు :

"సరేగాని నాయనా! అంతటి పెద్ద పెడికళ్ళ జంట మొక్కుకొన్నావు గదా! ఆ అమ్మాయి నేత్రాలంత విశాల మైనవా ?"

రామానుజుని వంటి యతీశ్వరుని ముఖతః వెలువడిన ఆ ప్రశ్న విని రంగనాయకు డెంతో ఆశ్చర్యపడ్డాడు. అసలా విధమయిన జిజ్ఞాస కలగడానికి గల కారణమేమో అతని కవగాహన కాలేదు. కొంచెంసేపు వల్లమాలిన బిడియంతో కుంచించుకుపోయి తలవంచుకొని కూర్చున్నాడు. ఎట్టకేల కేదో విధంగా ధైర్యం తెచ్చుకొని నెమ్మదిగా నసిగాడు :

"స్వామీ! తమవంటి పెద్దల దగ్గిర నేనేమని విన్నవించుకోగలను! ఎంతోమంది అందగత్తెలవైపు చూశాను. అంతటి చక్కటి పెద్ద కన్నుల జంట నా కెక్కడ కనబడలేదు. తమవంటి పూజ్యుల దగ్గిర ఉన్నమాట అన్నందుకు మన్నించండి. మొట్టమొదట చూసినపుడు రాత్రింబవళ్ళదే పనిగా అవి నన్ను వెంటాడించాయి. అయితే అడుగడుగునా నా కన్ని విఘ్నాలే ఎదురుపడ్డాయి. కనకనే హేమసుందరి నా ఇంట అడుగు పెడితే ఆమె కన్నుల కొంతతో స్వామి కొక మొక్కుబడి చెల్లించుకోవాలని నిశ్చయించుకొన్నాను. మా నిచులాపురంలోనే కాదు, శ్రీరంగంలో కూడా నా కెక్కడ అటువంటి సొగసయిన కన్నుల జంట కనబడలేదు!"

ప్రగాఢ సంకోచంతో మరి రంగనాయకుని నోటమాటే వెలువడలేదు.

రామానుజయతి విపరీతమయిన ఆశ్చర్యంతో తలమునకలయినాడు. వీనుదోయి వరకు వ్యాపించిన వెడద కన్ను లెంతో పెద్దవి చేసి "ఓహో! అలాగా! అంతటి పెద్ద కళ్ళజంట ఇంకెక్కడ కనబడనేలేదా! నిజమేనా?" అని తిరిగి రెట్టించి అలవోకగా నవ్వి ఎంతో ఆప్యాయంగా అతని చూపుల లోతులు పరిశీలించాడు.

రంగనాయకుడు మిక్కిగి బిడియంతో శిరస్సు కొంచెం వంచుకొన్నాడు:

"నే నన్నమాట నిజమే, స్వామీ! ఒక్క మీ నేత్రాలు తప్ప నా కింకెక్కడ అంతటి పెద్ద కనుదోయి కనబడలేదు.

రామానుజయంతి ఆ సమాధానం వినీ వినగానే ఒక్క మారుగా కలకల నవ్వి నిమేషకాలం రంగనాయకుని ముఖ వైఖరి నిశ్చల దృష్టితో పరీక్షించి వాత్సల్యపూర్ణ వీక్షతో ప్రశ్నించాడు :

"సరేలే ! నా మాట కేంగాని, ఇంతకు మునుపు నీవు ఎన్నడు కని విని ఎరగనంతటి పెద్దపెద్ద కన్ను లున్నాయి సుమీ! కావాలనుకుంటే అవి నీ కొకసారి చూపించగలను. ఏమం టావు !"

ఆ ప్రశ్నలో ఆర్ద్రాదరంతో బాటు కొంచెం కొంటె తనంతో మేళవించిన చిలిపితనం స్పష్టా స్పష్టంగా స్ఫురించింది. అది విని రంగానాయకుడు నిలువునా నిర్ఘాంత పడ్డాడు. "ఇదే మిటీ యతీశ్వరు లిలాగ మాట్లాడుతున్నారు ! ఇటువంటి పెద్ద లిలాగ ప్రసంగించవచ్చునా ?" అనుకొన్నాడు. నిజానికా ప్రశ్నలో గల అంతరార్థం అతని కేమి అంతుపట్టలేను. అంతటి సొగసయిన కన్నులున్న ఆ అతిలోక సౌందర్యమూర్తి ఎవ్వరో అతని కసలే బోధపడలేదు. ఆ అందాలరాశి ఎవ్వరో అన్న జిజ్ఞాస లోలోపల మొలకెత్తింది. ఆ మనోజ్ఞమూర్తినీ గూర్చి ప్రశ్నించాలన్న గట్టి సంకల్పం కూడా కలిగింది. మాట నోటి దాకా వచ్చింది. అంతలోనే రంగనాయకు డెంతో సంకోచించి "పెద్దల సాన్నిధ్యంలో అటువంటి మోటు ప్రస్తావన బొత్తిగా మర్యాద కాదు !" అని తమాయించుకొన్నాడు. ఉట్టిపడుతున్న అడకువతో విషయమై తన లోపలి దృఢ నిశ్చయం వెల్లడించాడు.

"స్వామీ! శ్రీరంగేశుని దయవల్ల హేమసుందరి నా ఇంట అడుగు పెట్టినప్పుడు అదే పదివే లనుకొన్నాను. ఈ జన్మ కిక కోరుకోవలసిన దేది లేదని అనిపించింది. ఎంతటి అతిలోకసుందరి అయినా సరే, మరినే నింకొకరి వైపే కన్నెత్తి చూడదలుచుకోలేదు. ఆ శ్రీరంగశాయి దయవల్ల పది కాలాలపాటూ మె చల్లగా ఉంటే, మరి నా కంతకన్న కావలసిన దేది లేదు! అయితే ఒక్క మనవి!—"

"ఏమిటది?" అన్నట్టు రామానుజుని నుదుటి మీద ఒక చిన్న బొమముడి విరిగింది. పెదవులపై చిరునవ్వులవోకగా తరళించింది. రంగనాయకుడు దేవాలయంలో ఊరేగింపు ఉత్సవాలలో స్వామి సేవకోసం తాను చేసిన ప్రయత్నం సంగతి ప్రస్తావించాడు. చిన్ననాటినించి సాము గరిడీలలో తన నిరంతరం సాధన సంగతి వెల్లడించి ఊరేగింపులలో రంగనాథుని సమక్షంలో మల్ల విద్యా నైపుణితో పౌర ప్రముఖుల మన్నన లందుకోగలనని విన్నవించాడు. అంతకుమును పెన్నిమారులు సందర్శించినా దేవాలయ ధర్మకర్త నోట "రేపురా! మాపురా!" అన్న మాటలే తప్ప వేరొక చల్లని పలుకే వినబడలేదని చెప్పి ఉసూరుమని ఒక వేడి నిట్టూర్పు విడిచిపెట్టారు. ఆయనతో చెప్పి దేవాలయంలో తన కేదయినా చిన్న ఉపాధి ఏర్పాటు చేయించ వలసినదని వేడుకొన్నాడు. వీలుపడితే ఒకసారి తన మల్లబంధ పాండిత్యం పరీక్షించవలసినదని ప్రార్థించారు.

రామానుజు డది విని రవంత ఆశ్చర్యపడి ఉపతాయి, తోరహ తమ మొదలయిన క్లిష్ట మల్ల బంధాల సంప్రదాయాలలో సామాన్యుల కెవరికి తెలియని కొన్ని మెళకువ లడిగి

రంగనాయకుని సమాధానాలు విని సంతోషించి ఎంతో అప్యాయంగా అభినందించాడు. మరి కొంతసేపటివరకు వారి ప్రసంగం మల్ల విద్యమీదే కొనసాగింది. రామానుజుని కాయా విషయాలలో గల నిశిత పాండిత్యము అభినివేశము గమనించి తిరిగి రంగనాయకుడింకొక మారు విపరీతాశ్చర్యంతో తల మునక లయినాడు! ఏకాగ్రదృష్టితో రామానుజుని బలిష్ట భుజ యుగళి పరిశీలించడం ప్రారంభించాడు. ఆ యతీశ్వరు డాతని ఆ ప్రగాఢాశ్చర్య ధోరణి గమనించి తిరిగి ప్రశ్నించాడు:

"ఏమిటి నాయనా! అంత ఏకాగ్ర వైఖరితో పరిశీలిస్తున్నావు!"

రంగనాయకుడు కొంచెం తటపటాయిస్తూ నసిగాడు:

"ఏమిలేదు స్వామీ! చిన్నతనంలో మీరు సాము గరిడీలలో బాగా చెయ్యి తిరిగినవారయి ఉండనలెనని అనుకుంటున్నాను..."

దానికి ప్రతి సమాధానంగా రామానుజుని ముఖతః రంగనాయకుని కొక క్షణకాలంవరకు సన్నని కలకల నవ్వు మాత్రమే వినిపించింది:

అబ్బే! నాదంతా కేవలం శ్రుత పాండిత్యమే! బాగా పిన్నతనంలో మెళకువ లేవో కొన్ని విన్నాను. అంతే!"

తిరిగి రామానుజుని ముఖతః రవంత హాస ధ్వని వినిపించింది. రంగనాయకునికా ప్రత్యుత్తరం మరింత ఉత్సాహంతో కలిగింది.

"మీరీ విద్యలో ఆరితేరిన గట్టి దిట్టలయి ఉండవచ్చు నని మొట్టమొదట నడివీథిలో కనిపించినప్పుడే అనుకొన్నాను. లేకపోతే సామాన్యు లెవరికి తెలియని లోతు లెలాగ తెలుస్తాయి. ఎప్పుడయినా ఇంకొకసారి వచ్చి మీవద్ద మెళకువలు కొన్ని నేర్చుకోవాలని ఉవ్విళ్ళూరుతున్నాను. వీలు పడితే నాకు తెలిసిన మెలిక పట్లు కొన్ని మీ ఎదట చూపించాలని కోరిక ! గట్టిగా పరీక్షించిన పిమ్మట మీవంటి విద్వాంసులు మెచ్చినదే విద్య !"

అంతలోనే రామానుజుని పెదవులపై రవంత ఆశ్చర్యంతో మేళవించిన దరహాసం తరళించింది :

"అబ్బే ! నా కిందులో తెలిసినది చాలా తక్కువ ! అంతా వినికిడి! గట్టిగా తలుచుకున్నావంటే ఈ విద్యలోనేకాదు! మరే విద్యలో నయినా నన్నిట్టే మించిపోగలవు !...సరే దీని కేమిగాని ఆ ధర్మకర్త నింకొకసారి చూసిరా ! అక్కర మన దయినప్పుడు మాటిమాటికి వెళ్ళి దర్శనం చేసుకోవాలి ! తప్పదు ! స్వామి కృపవల్ల నీ కోరిక నెరవేరగలదేమో ! ఎవరు చెప్పగలరు ? ఏ వ్యవహారంలో నయినా నావంటివా రంతా కేవలం నిమిత్తమాత్రులే ! అయినా నీ వడిగిన మాట మరిచిపోనులే !"

ఆ విధంగా గట్టిగా ధైర్యం చెప్పిన తరవాత తన కోరిక తప్పక నెరవేరగలదని రంగనాయకు డెంతో సంతోషించాడు. సవినయంగా సాష్టాంగ నమస్కారం సమర్పించాడు. సెలవు తీసుకుని తిరిగి వెళ్ళిపోవాలని అనుకొన్నాడు. కాని రామానుజు డతనిని అంతటితో విడిచిపెట్టలేదు. ప్రసాదం తీసుకొని రావల

సినదని ద్వారాని కవతల అనతి దూరంలో ఆజ్ఞకోసం నిరీక్షి స్తున్న దాశరథి కాజ్ఞాపించాడు. అత డంతవరకు కొనసాగిన వారి ప్రసంగాల ధోరణి విని నిశ్చల శిలాప్రతిమలా నిర్ఘాంత పడ్డాడు. ఆచార్యునికి సాము గరిడీలలో అంతటి నిశిత పాండితి ఉన్నదన్న సంగతి అత డింతకు మునుపెన్నడు విని ఉండలేదు. అదీగాక ఆయన ఎంతటి ఆత్మీయులతో ప్రసంగించినా ఎన్నడు తన నిరంతర గంభీరముద్ర రవంతయినా సడలించలేదు. అటు వంటి మౌనమూర్తి ఈనా డొక కొత్త మల్లునితో చిరకాల మిత్రునితో సంభాషించిన ట్లెంతో ఉల్లాసంగా ప్రసంగిస్తు న్నారు! ఇదేమిటీ విచిత్రం! అని తిరిగి ఎంతో ఆశ్చర్యపడ్డాడు. ఎన్నెన్ని విధాలా ఆలోచించినా అంతటి అపూర్వాత్మీయ దృష్టి కేమి హేతువో అతని కేమాత్రము బోధపడలేదు. సరే, ముమ్ముం దదే తెలియగలదని సమాధానపడి వెనువెంటనే వేర్వేరు తీయని భక్ష్యాలతో నిండించిన పళ్ళెరంతో ఆచార్యు డున్న గదిలో ప్రవేశించాడు. రంగనాయకుడు ఒకటి రెండు తినుబండారాలు మాత్రమే ఆరగించి మరి అక్కర లేదని చెప్పి తప్పించుకోవాలని అనుకొన్నాడు. కాని రామానుజుని అను నయంవల్ల చాలావరకవి స్వీకరించక తప్పలేదు. ఆ అపూర్వా దరణ దాశరథికే ఎంతో ఆశ్చర్యం కలిగించింది. రంగనాయకు నికా ఆర్ద్ర వాత్సల్యం గమనించగానే కన్నతల్లి ఆప్యాయత జ్ఞప్తికి వచ్చింది. అయితే హేమతో కలిసి శ్రీరంగంలో అడుగుపెట్టిన తరవాత ఆమె తన విషయమే ఉపేక్షించిన సంగతి తలుచుకొని ఉసూరుమని విశ్వసించాడు. ఆ యతీశ్వ రుని అర్ద్ర వాత్సల్యం తలుచుకోగానే అతని నేత్రాంతాలతో చిన్న చిన్న కన్నీటి బిందువు లొకటి రెండు పొటమరించాయి.

నెమ్మదిగా ఫలహారం ముగించి అతి కష్టంమీద నిగ్రహించు కొన్న డగ్గుత్తికతో తిరిగి సెలవు తీసుకొన్నాడు. రామానుజ యతి ఎంతో ఆత్మీయతతో అతని భుజంమీద చెయ్యివేసి ద్వారంవరకు సాగనంపి "చూడు! నాయనా! తీరికగా ఉన్నప్పు డెప్పుడయినా ఇక్కడికి వస్తూ ఉండు!" అన్నాడు.

రంగనాయకు డదివిని వల్లమాలిన సంకోచంతో తల వంచుకొన్నాడు. తొణికిసలాడుతున్న గద్గదికతో విన్నవించాడు. "స్వామీ! నావంటి మోటు మనిషి ఇక్కడ అడుగు పెట్టడానికి కూడా అర్హతలేదు. అయినా తమ ఆజ్ఞ అతిక్రమించడం భావ్యంకాదని వచ్చాను. మరి ఇంతకంటె తమవంటి వారికి నేనేమని విన్నవించుకోగలను!"

ఆ పైన ఎంతగా ప్రయత్నించినా అతని నోటమాట వెలువడలేదు. ప్రగాఢ గద్గదికతో కంఠం స్తంభించింది. అంత లోనే మంద్ర మధుర స్వరంతో రామానుజుని ప్రతి సమాధానం వీనుదోయిలో ప్రతిధ్వనించింది!

"ఎందుకు నాయనా! నీ కింతటి సంకోచం! స్వయంగా నేనేగదా రమ్మన్నాను. అదీగాక నా దగ్గర మెళకువలు కొన్ని నేర్చుకోవాలని అన్నావు! అప్పుడే మరిచిపోయావా! నేను కూడా నీ విద్యలో తెంతటిదో పరిశీలించాలని కుతూహల పడు తున్నాను. నీ పిడికిలిపట్టు ఎంత గట్టిదో ఒకసారి పరీక్షించాలని అనుకుంటున్నాను. అయితే అంత తొందర లేదులే! ఎప్పు డయినా ఒకసారి తీరిక చేసుకొనిరా!"

ఆ ప్రత్యుత్తరంలో రంగనాయకుని లోలోపలి సంకోచం చాలావరకు తొలిగిపోయింది. శిరస్సు కొంచెం పైకెత్తి తిరిగి ప్రగాఢ భక్తితో రామానుజుని పాదాలమీద వాలి నమస్కరించి సెలవు తీసుకొన్నాడు.

# 20

ఇంటికి బయలుదేరిన తరువాత రంగనాయకుని కానాటి సంఘటన అంతా ఒక విచిత్ర స్వప్నంలా భాసించింది. తనవంటి మొరటుమీంద రామానుజ యతీశ్వరుని వంటి పుణ్యమూర్తి ఆర్ద్ర వాత్సల్యదృష్టి ప్రసరించడానికేమి కారణమో ఎంతగా ఆలోచించినా అతనికి రవంతయినా తెలియ లేదు! రంగనాయకుని కిన్నాళ్ళనుండి శ్రీరంగంలో "నా" అనుకోదగ్గ ఆత్మీయు లెవ్వరు కనబడలేదు! ఇంతకాలం గడిచినా అతనితో అప్యాయంగా ప్రసంగించినవా రొక్కరు కనబడ లేదు. ఇరుగు పొరుగువా రందరు అతనిని చూచీ చూడనట్లు పేక్షించారు. ఎవరయినా కొంచెం పలకరించినా అంటీ అంట నట్లు మాట్లాడి తమ దారిని తాము తరలిపోయారు! మొట్ట మొదట రామానుజుని సందర్శనానికి రంగనాయకు డెంతో సంకోచించాడు. ఆయన హేమసుందరి వ్యవహారం అంతటితో కట్టిపెట్టి తిరిగి నిచుళాపురం వెళ్ళిపోవలసినదని ఆజ్ఞాపించగల రేమో అని చాలా భయపడ్డాడు. కాని మఠంలో ఉన్నంత సేపు ఆ ప్రస్తావనే రాదు. పైగా తాను సమర్పించిన పైడి

కన్నులు జంట, బంగారు తిలకము స్వామి ముఖంమీద జాజ్వల్య మానంగా వెలిగిపోతున్నాయని ప్రశంసించారు.

గుమ్మంలో అడుగు పెట్టగానే హేమసుందరి ఏమి జరిగిందని ఎంతో ఆత్రంగా అడిగింది. ఆనాటి వ్యవహారం అంతా పూసగుచ్చినట్టు ఏకరువు పెట్టాడు రంగనాయకుడు. హేమసుందరి మొట్టమొదట తాను విన్నది నిజమేనా, వట్టి వేళాకోళం కాదుకదా, అని అనుమానించింది. అదే సందేహం పైకి వెల్లడించింది. కాని ఆతని ప్రతి సమాధానం విన్న తరవాత మరి నమ్మక తప్పలేదు. అందుచేత లోలోపల ఎంతో సంతోషించింది. అటువంటి మహనీయుని ప్రాపకం దొరికినప్పుడు తమ కేదయినా ఉపాధి ఏర్పడకపోదని ధైర్యం చెప్పి ధర్మకర్తనింకొకమారు తప్పక సందర్శించవలసినదని ప్రోత్సహించింది.

నాలుగయిదు రోజులు గడిచిన తరువాత రంగనాయకుడొకనాటి అపరాహ్ణవేళ రామానుజుని సందర్శనం కోసం బయలుదేరాడు. పడకగదిలో ఒకమూల నిలబెట్టిన బాణాకర్ర చేతబట్టి వీధి గుమ్మంలో అడుగు పెట్టాడు. హేమసుందరి కతని ధోరణి బొత్తిగా బోధపడలేదు. ద్వారాని కానుకుని నిలబడి విస్ఫారిత విశాల నేత్రాలలో తెరలిస్తున్న దరహాసితంతో విపరీతాశ్చర్యంతో తలమునకలయి అడిగింది:

"ఇదేమిటి ? బాణాకర్రతో బయలుదేరుతున్నారు ? ఎక్కడికి ? ఎవరిమీదయినా పగబట్టారా !"

"అబ్బే ! అందుకోసం కాదులే ! మఠానికి !"

"అయితే మధ్యన ఈ బాణా ఎందుకు ?"

"ఆయన నా విద్య పరీక్షిస్తా మన్నారని చెప్పానుగా! అప్పుడే మరిచిపోయావా?"

"పరీక్ష చేశాక ఆ ధర్మకర్తతో గాని చెబుతారా?"

"ఏమో మరి! ఆయన నాతో ఆ మాట అనలేదు. కాని ఒకవేళ చెప్పాలని అనుకుంటున్నారేమో!"

హేమసుందరి మరి ప్రశ్నించలేదు. సరే అన్నట్టు మాట్లాడకూరుకొన్నది. తిరిగి రంగనాయకుడు బయలుదేరిన తరవాత త్వరగా ఇంటికి రావలసినదనీ, ఆలస్యం చెయ్యవద్దనీ ప్రతిమాలుకొన్నది. రామానుజుని సందర్శించిన మరునాడే రంగనాయకుడు ఇంకొకమారు శ్రీవైష్ణవ మఠానికి పోవాలని ఉబలాట పడ్డాడు. కాని అంత త్వరగా అక్కడికి వెళ్ళడం బాగుండదేమో అని మళ్ళీ సంకోచించాడు. అదేగాక దేవాలయ ధర్మకర్త నింకొకమారు సందర్శించవలసినదన్న రామానుజుని ఆదేశం కూడా పాటించవలసిన అక్కర కలిగింది. ఆ వ్యవహారం ముగిసినంతవరకు రెండు మూడు రోజులపాటు మఠానికి పోవలెనన్న తహతహ అతి కష్టంమీద నిగ్రహించుకొన్నాడు.

రంగనాయకుడు మఠంలో ప్రవేశించేసరికి మూడు జాముల పొద్దు తిరిగింది. అతనిచేత నున్న పొడుగాటి బాణాకర్ర చూచి బ్రహ్మచారులు, సన్యాసులు కొంద రెంతో ఆశ్చర్యపడి కొంచెం దూరంగా తొలిగిపోయారు! అతనికి వారి చురుకు చూపుల లోతుల అంతరార్థం బోధపడకపోలేదు. అయినా ఓరిమి వహించి అలాగే గోడ కానుకుని నిలుచున్నాడు. అంతలోనే ఒక వృద్ధ యతి చిత్రాలను తెచ్చి వీధి అరుగుమీద పరిచి కూర్చోవలసినదని వేడుకొన్నాడు.

"అక్కరలేదు బాబూ! ఇలాగ నిలబడితేనే ఎంతో సుఖంగా ఉంది!" అన్నాడు రంగనాయకు డెంతో అడకువతో చిరునవ్వు చిందించి.

"రామానుజు లీవేళ శ్రీ భాష్యం వ్యాఖ్యానిస్తున్నారు. మరి ఈ వేళ వారి దర్శనం సాధ్యపడదేమో! అయినా కొంచెం సేపుండి వారికి విన్నవిస్తాను. అంతవరకు మీ రిక్కడ విశ్రమించండి" అన్నాడా వృద్ధయతి.

"అయ్యో! పుట్టెడాశతో వచ్చానే!" అనుకుని ఉసూరుమని విశ్వసించాడు రంగనాయకుడు. అతని కెదురుగా మఠావరణంలో మామిళ్ళ కొమ్మలకు వేలాడగట్టిన కాషాయ వస్త్రాలు చిరుగాలిలో అటు ఇటు కదలాడుతున్నాయి. అప్పుడప్పుడు లేత ఎండ పొడ పడి అవి తళతళ మెరుస్తున్నాయి. పారిజాతాలు బొగడపూలు ఉండి ఉండి ఒక టొకటే నేల మీద రాలుతున్నాయి. నీలి నీడలలో వేళ్వేరు తీరుల మంచి ముత్యాలలా వెలుగుతున్నాయి. వేరొక వైపున మిగల మగ్గిన నారింజ పండ్లమీద వాలిన చిలకలు రెండు రెక్క లల్లలాడించి కీచుకీచుమని అరుస్తున్నాయి. బాదంచెట్టు కొమ్మమీద ఎర్రగా పండిన ఆకుల వెనక పసుపు పచ్చని తొండలు రెండు తలలు పైకెత్తి ఆహారం కోసం ఎంతో ఆత్రంగా పరిశీలిస్తున్నాయి. అతని కట్టెదట ఏపుగా పెరిగిన కొబ్బరి తోపులో ఏతం సవ్వడి మంద్రమంద్రంగా వినిపిస్తున్నది. ఆ తోట మధ్య రవంత ఏటవాలుగా తిరిగిన ఒక పోకచుట్టు అల్లిబిల్లిగా అల్లుకొన్న తాంబూల వల్లికల చిగురుటాకులమీద చీమల బారులు లేత ఎండలో తమ ఎడతెగని ప్రయాణాలు కొనసాగిస్తున్నాయి.

ఆపైన రంగనాయకుని దృష్టి రామానుజు డున్న గది వైపు తరలింది. ఎంతగా ప్రయత్నించినా ఆ యతీశ్వరుని చెక్కిలి మాత్రమే గోచరించింది. అంతలోనే వృద్ధయతి లోపలికి వెళ్ళి సవినయంగా అతని రాక నివేదించాడు. మరుక్షణం లోనే రామానుజుని ముఖం తరళ దరహాసంతో వికసించింది.

"అలాగా ? ఎంతసేపయింది వచ్చి ?"

"చాలాసేపయింది. మీ భాష్య ప్రవచనానికి అడ్డంకి ఏర్పడగలదేమోనని..."

"దీనికి అంతరాయ మేమిటి ? వెంటనే లోపలికి తోడుకొని రాలేకపోయినారా ! అయ్యో పాపం ! ఎంతసేపటినించి వేచి ఉన్నాడో !"

ఆ వృద్ధ యతి కా సమాధానంతో రవంత పశ్చాత్తాపం కలిగింది. తొందర తొందరగా ఇవతలికి వచ్చి రంగనాయకుని కా వార్త వెల్లడించాడు. ఆచార్యుని ముఖంలో ఆత్రత గుర్తించి దాశరధి, యజ్ఞమూర్తి మొదలైన అంతేవాసు లంతటితో తమ శ్రీ భాష్యాధ్యయనానికి స్వస్తి చెప్పి సవినయంగా నమస్కరించి పీడ్కొన్నారు. రంగనాయకుని వంటి వా డక్కడికి వచ్చినట్టు వినీ వినగానే ఆచార్యుడు విశిష్టాద్వైత వేదాంతపరమయిన శ్రీ భాష్య వ్యాఖ్యానం తటాలున మధ్యలోనే ముగించినందుకు వా రందరికి లోలోపల కొంచెం కించ బయలుదేరింది. యజ్ఞమూర్తి కది మరింత మథన కలిగించింది. అయినా వా రెవ్వరు అది అణువంతయినా పైకి వ్యక్తం కానీయ లేదు.

రంగనాయకుని కప్పటికే బాగా వేళ మించిపోయినదని అనిపించింది. అందుచేత లోపలికి వెళ్ళిన పిమ్మట రామానుజుని అనుమతితో అతిత్వరితంగా తన మల్ల విద్యా పాండితీ వైభవం వ్యక్తీకరించవలెనని సంకల్పించుకొన్నాడు. కాని అతని అభిలాష అనుకొన్నంత త్వరితంగా నెరవేరలేదు. కుశల ప్రశ్నతో ప్రసంగం ప్రారంభించి అత్యంతాత్మీయతతో రామానుజయతి అతని సంసార పరిస్థితుల విశేషా లడిగి తెలుసుకొన్నాడు. మరి కొంతకాలంవరకు తన సంసార యాత్ర సుఖంగా కొనసాగించ డానికి ఏవిధమయిన లోటు రాదని రంగనాయకు డన్నాడు. కాని రామానుజయతి కా ప్రత్యుత్తరం ఏవంతయినా సంతృప్తి కలిగించలేదు. అతడు యదార్థస్థితి వెల్లడించలేదని గ్రహించు కొన్నాడు. కొంచెంసే పాలోచించి ప్రశాంత స్వరంతో ప్రశ్నించాడు :

"అయితే నాయనా! ఆ ధర్మకర్త వ్యవహారం ఏమయింది ?"

"మొన్న వారి దర్శనం చేసుకొన్నాను. ఒకవారంలోగా ఏదో ఒకమాట నిశ్చయించి చెబుతా మన్నారు!"

"ఓహో! అలాగా! అయితే అది శుభశకునమే!"

"అయినా తమ రొకసారి వారితో..."

రంగనాయకు డస్పష్టంగా తన లోలోపలి కోరిక వ్యక్తీకరించాడు.

"అక్కరలేదు! ఆయన అనుకూలంగా ఉన్నారన్న మాటే! ఏదో ఒక చిన్న ఉపాధి దొరకకపోదులే! తప్పక తిరిగి ఇంకొకసారి వెళ్ళి చూసి రా! సరే దీనికేమిగాని

సాములో, గరిడీలో (శ్రీ)రంగంలో అంతటా పెద్ద పేరు సంపాదించినట్టున్నావే! నిన్ననే నేనీ విషయం విన్నాను. నీ మెళకువ లెటువంటివో కొంచెం పరిశీలించాలని అనుకుంటున్నాను. ఇప్పుడు వీలుపడుతుందా ?"

ఆ ప్రశ్న వినగానే రంగనాయకుడు పట్టరాని మహోత్సాహంతో ఉప్పొంగిపోయాడు: తన సాము సంగతి మున్ముందుగా తానే ప్రస్తావించవలెనని ఉబలాట పడ్డాడు. కాని ఆచార్యుడే మొట్టమొదట ఆ విషయం ప్రశ్నించగానే పెల్లుబికిన ఉల్లాసావేశంతో అతని శరీరం గగుర్పొడిచింది: ఒక్క అంగలో వీధిలో గోడ మూల ఆనించిన బాణాకర్ర చేజిక్కించుకొని రామానుజుడున్న గది కుడివైపున గున్నమామిళ్ళ మధ్య విశాలావరణంలో నిలబడ్డాడు. అత్యంత వినయంతో నేలమీద వాలి సాష్టాంగ నమస్కృతి సమర్పించి కుడి ఎడమ చేతులతో అవలీలగా బాణా అంది పుచ్చుకుని నిరంతరం శరవేగంతో సాము కొనసాగించాడు !

బాణా క్రమక్రమంగా వాయువేగంతో గిర గిర తిరిగిన ధ్వని ఆ పరిసరంలో అంతటా రివ్వుమని మారు మ్రోగింది! ఆ సవ్వడి విని మామిళ్ళ మీద గూళ్ళలో ఉన్న పిట్టలన్ని వైపుల చెదరిపోయాయి! ఆ కల కలం విన్న దాశరథి, యజ్ఞమూర్తి, అనంతసూరి మొదలయిన రామానుజుని శిష్యులనేకులక్కడికి వచ్చి నిశ్చల నేత్రాలతో రంగనాయకుని విద్యానైపుణి పరిశీలించారు. మరికొంత సేపటికి విపరీత వేగంతో భ్రాణా తిరిగిన ధ్వని సన్నని ఈలలా వినిపించింది. రామానుజమౌళి ఆ ప్రచండ వేగం గమనించి ఎంతో ఆశ్చర్యపడి తటా

లున లేచి ఒకటి రెండడుగులువేసి ద్వారం సమీపంలో నిలు చున్నాడు. దాశరథీ అంతలోనే మిక్కిలి అడకువతో సమీపించి తన భుజం అవలంబనంగా సమర్పించాడు. రామానుజ యతి అతనిమీాద అలవోకగా ఆనుకొన్నాడు !

"నాయనా ! దాశరథీ ! నిశ్చలమై నిలిచిన అతని అర మోడ్పు కన్నుగవ పరిశీలిస్తున్నావా ! ఆహా ! ఎంతటి ఏకాగ్రత !"

ఆ పరమాద్భుత నైపుణి పరిశీలించిన పిమ్మట దాశరథి నోట మాటే వెలువడలేదు ! మరికొంత సేపటికి బాణా తిరిగిన తీరే కనబడలేదు ! క్రమక్రమంగా అది అదృశ్యమయిపోతు న్నట్టు పొడగట్టింది ! రంగనాయకుడు క్రమక్రమంగా బాగా అలిసిన విషయం గమనించి అంతటితో సాము విరమించవలసిన దని రామానుజయతి రవంత చేయెత్తి హెచ్చరించాడు. అల్ల నల్లన బాణా వేగం మందగించింది. మరికొంత సేపటివరకు మల్ల విద్యలో మరికొన్ని మెళకువలతో తన అద్భుత పాండితి వెల్లడించవలెనని రంగనాయకుడు సంకల్పించుకొన్నాడు. కాని రామానుజుడిక ఆవశ్యకత లేదన్నట్లొక చిరునవ్వుతో సూచించాడు.

తిరిగి వా రుభయులు గదిలో ప్రవేశించి ఒక రొకరి కెదురుగా సమాసీను లయినారు. రామానుజుని వంటి మల్ల విద్యావేత్త తన పరిశ్రమ బౌ బౌ నని మెచ్చుకొన్నతీరు పరికించి రంగనాయకుడు లోలోపల ఎంతయినా ఉప్పొంగి పోయాడు. రహస్యా లేవయినా తెలియజేయవలసినదని దోసిలి కట్టి ఎంతో అడకువతో వేడుకొన్నాడు. ఆ ప్రార్థన విన్న

పిమ్మట రామానుజుని ముఖతః మంద్రమధురమయిన కలకల హాసం వెలువడింది !

"నాయనా ! మల్లవిద్యలో నాకన్న నీవే ఎన్నో రహస్యా లెక్కువగా నేర్చుకొన్నావు. వాస్తవానికి నాకా విద్య లోతు లేవి తెలియనే తెలియవు ! ఇక్కడ ఉన్న మల్లు లందరిలోను ఇంతకుమునుపే గట్టిదిట్ట అన్న కీర్తి గడించుకొన్నావుగదా ! ఇదే విధంగా ఏకాగ్రనిష్ఠతో మరి కొంతకాలంపాటు సాధన కొనసాగిస్తే ఇక దక్షిణాపథంలో అంతటా గొప్ప ప్రతిష్ఠ గడించు కోగలవు ! సందేహం లేదు !"

"తమ అమోఘాశీర్వచనం !" అని రవంత శిరస్సు వంచు కొన్నాడు రంగనాయకుడు. తిరిగి వారిద్దరి ప్రసంగము వేర్వేరు చిత్ర విచిత్ర మల్లబంధాలమీదికి తిరిగింది. రామానుజ రంగ నాయకు లుభయులు చిరకాలానికి కలుసుకున్న మల్ల మిత్రుల వలె ఎంతో అప్యాయంగా ఎడతెగని సంభాషణ కొనసాగిం చారు. ద్వారంలో ఆజ్ఞకోసం నిరీక్షిస్తున్న దాశరధికే గాక మిగిలిన అంతేవాసుల కందరికి ఆ అన్యోన్యత ఎంతో అపూ ర్వంగా భాసించింది. రంగనాయకుని ఎడల రవంత అసూయ రేకెత్తించింది ! ద్రవిడదేశ విద్వాంసు లెవరయినా సందర్శ నార్థమై వచ్చినప్పుడు వారికి విశిష్టాద్వైత వేదాంత పరమార్థం వ్యాఖ్యానించడం రామానుజయతి కొక పరిపాటి. ఇక సాధా రణ పౌరు లెవ్వరికయినా శ్రీరంగేశుని యెడల ప్రగాఢ భక్తి ప్రపత్తు లుపదేశించడం శిష్యు లనేక పర్యాయాలు స్వయంగా పరిశీలించారు. కాని రంగనాయకునితో కొనసాగిన ప్రసంగాలలో సూచనప్రాయంగా నయినా అటువంటి ప్రస్తావనే వినబడలేదు !

"ఇదేమిటీ విడ్డూరం !" అని వారిలో వా రనేక విధాల గుసగుస లాడుకొన్నారు.

అలాగలాగ మరి కొంతసేపు సంభాషణ కొనసాగిన పిమ్మట రంగనాయకుడు ఇనుమడించిన భ క్తితో రామానుజు నికి సాష్టాంగ నమస్కారం సమర్పించి వీ డ్కొని తిన్నగా తన భవంతికి తరలిపోయాడు. హేమసుందరి అతని ముఖతః ఆనాడు జరిగిన విశేషాలన్నీ విని ఇక తప్పక తమ కేదో కొంత ఉపాధి ఏర్పడగలదన్న ధైర్యంతో ఎంతో ఆనందించింది.

ఆ మరునా డుదయమే లేచి రంగనాయకుడు ధర్మక ర్త భవంతికి వెళ్ళి దర్శనంకోసం నిమేష మొక యుగంగా నిరీక్షిం చాడు. ఎట్టకేల కాధర్మాధికారి బరువువయిన శరీరంతో ఇవత లికివచ్చి భవంతి వాకిట పెద్ద అరుగుమీాద మెత్తని దిండు మీాద ఆనుకునికూర్చుని హేలనగా రంగనాయకుని వైపు ఓర క్రీగంటి చూపుప్రసరింపజేసి నెమ్మదిగా తాంబూల సేవ ప్రారం భించాడు. రంగనాయకు డతని సన్నిధికి పోయి చేతులు కట్టుకుని నిలబడి మిక్కిలి అడకువతో తన గోడు వెళ్ళబోసుకున్నాడు. ధర్మక ర్త పోక చెక్క కటుక్కుమని కొరికి క్షణకాలం నఖశిఖ పర్యంతము రంగనాయకుని శరీర సౌష్ఠవం పరీక్షించాడు :

"ఉత్సవ సమయాలలో అవసరమయినప్పుడు అర్ధరాత్రి వేళ వరకు స్వామి కెదురుగా నిలిచి మల్ల విద్యా వినోదాలతో సేవించుకోవాలి ! ఏమంటావు !"

"చి త్తం అలాగే ! అవసరమయితే తెల్లవారుజాము వరకు కూడా సేవించుకోగలను ! అయితే ఆ కష్టం మాత్రం తమరు కొంచెం చి త్తగించాలి."

"ప్రస్తుతానికి మాసానికి మూడు వెండి చక్రాల కన్న వేతనం వీలుపడదు. ముందుముందు నీ శక్తి సామర్థ్యాలు పరిశీలించిన తరవాత అయిదారు చక్రాలవరకు ముట్టవచ్చును."

రంగనాయకుడు ఏడెనిమిది చక్రా లాశించాడు. అదే మాట ఉట్టిపడుతున్న వినయంతో వినబడీ వినబడనట్టు నసిగాడు. దేవాలయ ధర్మాధికారి తిరిగి తాంబూల సేవ కొనసాగించాడు :

"సరే, ఇంతగా ప్రాధేయపడుతున్నావు కనక అయిదు చక్రా లేర్పాటు చేయిస్తున్నాను. ఇక ముందు మరి ఇంతకంటె ఆశించవద్దు! ఒక ఏడాది గడిచిన తరవాత నీ అదృష్టం బాగుంటే శ్రీమంతు లర్పించిన దేవమాన్య మేదయినా తటస్థపడగలదేమో! ఎవరు చెప్పగలరు!"

రంగనాయకునికా ప్రతి సమాధానంతో బాగా సంతృప్తి కలిగింది. ధర్మాధికారిని సగౌరవంగా వీడ్కొని వెనువెంటనే రామానుజ మఠంవైపు సాగిపోయాడు. అప్పటికి రెండుజాముల పొద్దు తిరిగింది. ఆచార్యుని సందర్శనాని కది తగిన తరుణంకాదు. ఆ శుభవార్త విన్నవించాలన్న తహతహతో ఇంచుమించుగా ఒక గడియసేపు నిరీక్షించాడు. రామానుజయతిని సందర్శించగానే సవినయంగా నమస్కరించి ఆనాటి వృత్తాంతం సంగ్రహంగా నివేదించాడు.

"తమ దయవల్లనే ఇంత త్వరగా నాకిది లభించింది. ఇన్నాళ్ళనించి ఎన్నెన్నిసారులు తిరిగినా ఆయన నోట "రేపురా! మాపురా! అన్న సమాధానం తప్ప ఇంకొకమాటే వినబడ

లేదు. ఒకవేళ మీ రెన్నడయినా ఆయనతో ఈ విషయం ప్రస్తావించారేమో!..."

"లేదు! నాయనా! నేనామాటే తలపెట్టలేదు. నీ విక్కడికి వచ్చి నాతో ప్రసంగించి ప్రసాదం స్వీకరించిన సంగతి కర్ణాకర్ణిగా వినిఉండవచ్చును. నీమీది అపూర్వాదరణ కది ఒక చిన్న కారణమయి ఉండవచ్చును. ఇంతకీ ఆ శ్రీరంగశాయి కటాక్షం నీమీద ప్రసరించింది. దీనికంతటికి అదే ప్రధాన కారణం! అంతే, నేను కేవలం నిమిత్తమాత్రుడనే!

రంగనాయకు డిక మారు పలకలేదు! సర్వము స్వామి సంకల్పమే అని చెప్పి మౌన ముద్ర వహించడం ఆచార్యుని కొక పరిపాటి అని అత డంతకు మునుపే గ్రహించుకొన్నాడు. ఆకాలంలో వచ్చినందుకు మన్నించవలసినదని వేడుకొని సెలవు తీసుకుని తిన్నగా తన భవంతివైపు సాగిపోయాడు. ఇంటిలో అడుగుపెట్టగానే అతని ముఖవైఖరి గమనించి తలపెట్టిన పని చక్కగా నెరవేరినదని హేమసుందరి గ్రహించడాని కెంతోసేపు పట్టలేదు. అంతలోనే ఆనాటి శుభవార్త రంగనాయకు డామె కెరిగించాడు. ఆ సంతోషంతో తల మునకలై వా రుభయులు సరస సల్లాపాలతో మధ్యాహ్నం భోజనం ముగించుకొని విశ్రమించారు.

ఆనాటినుంచి రంగనాయకుని మనస్సు బాగా కుదుటపడింది. "ఇక రేపటిమాట ఏమో!" అన్న నిరంతర విపరీతాందోళన పూర్తిగా తొలిగిపోయింది. రంగనాయకుడా మరునాడే ధర్మకర్త నింకొకసారి సందర్శించి అనుమతి అందుకొని

శ్రీరంగేశుని సేవలో ప్రవేశించాడు. ఆనాటినుంచి ఉత్సవాలలో, ఊరేగింపులలో స్వామి సమక్షంలో నిలిచి అపూర్వ మల్లబంధాలలో చిత్ర విచిత్రమయిన సాము గరిడీల విన్యాసాలతో పౌరుల ప్రశంస లందుకొన్నాడు. క్రమక్రమంగా అతని చాకచక్యం మల్ల ప్రముఖులకే కాక శ్రీరంగ ప్రముఖు లందరికి అపూర్వాశ్చర్యం కలిగించింది.

ధర్మాధికారి ఇచ్చిన భృతితో రంగనాయకుని జీవిత యాత్ర అనుకున్నంత సుఖంగా కొనసాగలేదు. అప్పటి కతని దగ్గర నిలవఉన్న సొమ్మంతా అయిపోయింది. ఆపరిస్థితిలో వేరొక ధనార్జన మార్గమేది స్ఫురించలేదు. మరి కొన్నాళ్ళు గడిచిన తరవాత తీరిక సమయాలలో నగర వీథులలో తన మల్లవిద్యానైపుణితో కొంత సొమ్ము సంపాదించుకోవచ్చునన్న ఆలోచన లోలోపల మొలకెత్తింది. శ్రీరంగం చేరుకొన్న కొత్తలో అతనికా ఉపాయం స్ఫురించకపోలేదు. కాని విపరీతమయిన అభిజాత్యం పడగ పైకెత్తి బుసకొట్టింది. ఇటీవల కొన్నాళ్ళనుంచి ఉత్సవాలలో స్వామి కెదురుగా నిలిచి సాము గరిడీ లారంభించిన పిమ్మట ఆనాటి అభిజాత్యం క్రమక్రమంగా సడలిపోయింది. ఆ పైన హేమసుందరి కూడా దానిలో అంతటి తలవంపేమి లేదని ప్రోత్సహించింది. "పెద్ద పెద్ద విద్వాంసుల శాస్త్రిల పాండిత్యాలు పరిశీలించి మహారాజు అనేక విధాల గౌరవించడం లేదా ? అదే విధంగా నా విద్య పరీక్షించి మెచ్చుకొని శ్రీరంగంలో సంపన్ను లెవ్వరయినా కానుక లిచ్చి ఆదరించవచ్చును. దీనిలో అగౌరవమేమి ఉన్నది ?" అని తనలో తాను సమాధానపడ్డాడు.

ఆ మరునాటినుంచి తీరిక వేళలలో శ్రీరంగ వీథులలో తన విద్యా వినోదా లారంభించాడు. మొట్ట మొదట అది అతనికి కొంచెం ఎబ్బెట్టుగా ఉన్నట్టు స్ఫురించింది. కాని క్రమ క్రమంగా ఆ సంకోచం పూర్తిగా సడలిపోయింది. స్వామి సేవ ముగిసిన తరవాత కొంచెం తీరిక చిక్కినప్పుడు వీథులలో తన మల్ల విద్యా వినోదా లారంభించాడు. క్రమక్రమంగా ఆనాటి కానాటి కాతని కేదో కొంత రాబడి కనబడింది. ఒక్కొక్కప్పుడు తలవని తలంపుగా ధనికులు కొందరాతని నైపుణి గమనించి బంగారు అంగుళీయకాలుకూడా బహూకరించారు. మరి కొందరింకా ఆనందించి పైడి చక్రాలు, వెండి శంఖనానకాలు విసరివేశారు! ఆ విధంగా పోగుపడిన సొమ్ముతో అతని కేవిధమయిన లోపము, చీకు, చింత లేకుండా జీవితం చాలా సుఖంగా గడిచిపోయింది. ఒక్కొక్కప్పుడు తన దగ్గర మిగిలిన సొమ్ముతో హేమసుందరికి ముక్కెర, శంఖ చక్రాలవంటి కర్ణాభరణాలు మొదలయిన చిన్న చిన్న నగలు కొన్ని చేయించాడు. అప్పుడప్పుడు మరి కొంత సొమ్ము దాశరథి ద్వారా శ్రీవైష్ణవ మతానికి సమర్పించాడు.

ఆ పరిస్థితులలో రంగనాయకుడిక తనవంటి అదృష్టశాలి లేడనుకొని ఆనందంతో తల మునకలయినాడు. ఆ సంతోష సమయాలలో అతనికి పూర్వం నిచుళాపురంలో హేమసుందరి గాఢానురాగ గాథ జ్ఞప్తికి వచ్చింది. ఆ రోజులలో మొట్ట మొదట గోపాలస్వామి ఆలయంలో ఆమె నేత్రాభినయ చూచిన క్షణంలోనే అతని శరీరం జలదరించి గగుర్పొడిచింది! తన గుండెలోనే హేమ అందెల జంట ఘల్లు ఘల్లుమని ధ్వనించిన ట్టొక విచిత్రమయిన అనుభూతి కలిగింది! ఆమె ఆకర్ణాంత

విశాల నేత్రాలవైపు చూచిన పిమ్మట కనురెప్పల కదలికే అంతరించింది. నృత్యం ముగిసినంతవరకు మరి శరీర స్పృహే లేదు! ఆనాటినించి ఆమె వెడద కనుదోయి సందర్శించినా డిక అతనికంటి కొక్క కునుకయినా పట్టలేదు! అటువంటి అపూర్వ సౌందర్యవతి సాంగత్యంభాగ్యం లభించగలదని అత డెన్నడు కలలో నయినా ఊహించి ఉండలేదు! స్వామి అపార కృప వల్లనే తన కోరిక ఫలించినదని తిరిగి ఇంకోసారి నిశ్చయించుకొని రంగనాయకుడు ఉల్లాసావేశంతో ఉప్పొంగిపోయాడు!

ఆపైన రామానుజయతి ఆర్ద్ర వాత్సల్యం తలుచుకో గానే అతని కనుగొలుకులలో కవోష్ణ బాష్పావళి తరళించింది. మొట్టమొదట ఆ యతీశ్వరుని సందర్శించినప్పుడు రంగనాయకు డనేక విధాల మథనపడ్డాడు. సన్నసన్నగా చీవాట్లు పెట్టి మారు మాటాడక తిరిగి నిచుళాపురం వెళ్ళిపోవలసినదని ఆజ్ఞాపించగల రేమోనని ఎంతో ఆందోళన పడ్డాడు. కాని అటువంటి ప్రస్తా వనే రాలేదు. పైగా ఎంతో అప్యాయంగా తన మల్లవిద్య పరి శీలించి వేనోళ్ళ అభినందించారు. కన్న తల్లికన్న ఎంతో ఆత్మీయతతో, అభిమానంతో ఆదరించారు. ఎన్నెన్ని విధాల ఆలోచించినా ఆ యతీశ్వరుని అపూర్వాదరణ కేమి కారణమో అతని కవగాహన కాలేదు!

స్వామి సేవలో ఏమాత్రము తీరిక చిక్కకపోయినా, రంగనాయకు డొక్కనాడయినా రామానుజుని సందర్శన భాగ్యం పోగొట్టుకోలేదు. బాగా చీకటి పడినా సరే తిన్నగా మఠంవైపు సాగిపోయేవాడు. అయితే అందువల్ల తిరిగి ఇంటికి చేరుకోడాని కొకొక్కప్పుడు బాగా ఆలస్యమయింది. హేమ

సుందరికా ధోరణి ఎంతయినా మనోవ్యథ కలిగించింది. అయినా ఆమె మరికొన్నాళ్ళవరకు అదేమని ప్రశ్నించలేదు. కాని మరి భరించలేక క్రమక్రమంగా రుసరుస లారంభించింది. అందు వల్ల అతనికి కొంత మనః ఖేదం కలగకపోలేదు. కాని గత్యం తరం కనబడలేదు. మరి కొన్నాళ్ళ కామె ఏదోవిధంగా సమా ధాన పడగలదని రంగనాయకు డనుకొన్నాడు.

మఠంలోనికి రాకపోక లెక్కువయిన కొద్దీ రామాను జుని అంతేవాసులలో కూడా అతనిని గూర్చిన గుసగుస లిను మడించాయి. ఎవరో ఒకరిద్దరికి తప్ప మిగిలినవారి కెవ్వరికి తన మీద రవంతయినా సదభిప్రాయం కలగలేదని రంగనాయకుడు డూహించకపోలేదు! మఠంలో అడుగుపెట్టినప్పుడు వారి చురుకు చూపు లతని కెంతయినా ఆందోళన కలిగించాయి. కాని రంగ నాయకు డెక్కడ చెక్కుచెదరలేదు. "రామానుజుని వంటి పుణ్యమూర్తి నన్నెంతో ఆదరించి కళ్ళ కద్దుకొంటున్నప్పుడు ఇక ఇతరుల గోడు నాకేల!" అని బాగా ధైర్యపడి అతడిక ఆ విషయమే తలపెట్టలేదు!

# 21

ఆనాటి కానాటికి రంగనాయకుని యెడల ఆచార్యునికి మక్కువ ఎక్కువయిన కొద్దీ శిష్యులలో ఆశ్చర్యము, అలజడి ఇనుమడించాయి. అయినా ఆయన ఎదటపడి ఇదేమని ప్రశ్నించ గల సాహసం వారెవ్వరికి కలగలేదు. రామానుజయతి యెడల వారి భయభక్తు లట్టివి! ఒకవేళ సాహసించి నోరు విడిచి అడి

గినా గంభీర మౌనముద్రతో మేళవించిన దరహసిత మేగాని, వేరొక ప్రత్యుత్తర మేది వెలువడక పోవచ్చును! వారి కటు వంటి అనుభూతి అనేకమారులు కలిగింది. కనకనే మరి గత్యం తరం కానలేక తమలో తాము గుసగుస లారంభించారు. అయితే వారిలో కొంద రెలాగయినా రంగనాయకుని పుట్టు పూర్వోత్తరాల రహస్యా లాకళించుకోవాలని శాయశక్తులా ప్రయత్నించారు.

అప్పుడప్పుడు శ్రీరంగక్షేత్రం సందర్శించిన నిచుళాపుర వాసులవల్ల క్రమక్రమంగా వారిలో కొందరికి రంగనాయకునికి సంబంధించిన రహస్యాలు కొన్ని తెలిశాయి. కాని ఆ వార్త లలో అతిశయోక్తి బాగా మేళవించింది. జనానీకం నోళ్ళలో పడిన వృత్తాంతా లానాటి కానాటికి గోరంతలు కొండంత లుగా మారిపోవడం సర్వ సాధారణంగా జరిగే విషయమే! రంగనాయకుని విషయంలో కూడా సరిగా అలాగే జరిగింది. అతడొక పెద్ద బందిపోటుల దండులోనించి తప్పించుకొని వచ్చి శ్రీరంగంలో తలదాచుకొన్నా డన్నారు కొందరు. మరికొంద రంతటి తాగుబోతు, జూదరి, తుంటరి, పచ్చి నెత్తురుతాగే మహాపాపి వేరొకడు లేడని నోరారా దూషించారు. ఇంకా కొందరు హేమసుందరి అతని వేలు విడిచిన మేనమామ కుమార్తె కాదన్నారు. ఎంద రెందరో సంపన్నుల భవంతు లలో దీపా లార్పివేసిన గట్టి నెరజాణ అని నిందించి ఈసడిం చారు. శ్రీరంగంలో ఆ వేశ్యాంగన కిక పొద్దస్తమానము నట విట గాయకులతో ఎకసక్కాలే గాని మరి వేరే పనిపాట లేవి లేవని అసహ్యించుకొన్నారు. వారిలో మరికొందరు ప్రబుద్ధులు ధనుర్దాసు వచ్చుదనానికదే ప్రధాన కారణమన్నారు.

అవే అతిశయోక్తులు కొన్ని చిలవలతో పలవలతో మఠం బ్రహ్మచారుల ద్వారా రామానుజుని ప్రధాన శిష్యుల వరకు వెళ్ళిపోయాయి. కాని అంతమాత్రంచేత వా రెవ్వరు అవి ఆచార్యుని కెరిగించలేదు. అటువంటి ప్రసంగా లాయన కేమాత్రము రుచించవని వారి కంతకు మునుపే తెలిసి వచ్చింది. అందుచేత అంతేవాసు లెవ్వరు ఆచార్యుని ఎదటపడి ఆ విషయం ప్రస్తావించడానికే సాహసించలేదు. కాని ఏదో ప్రసంగ సందర్భంలో ఒక బ్రహ్మచారి ముఖతః ఆ రహస్యాలు కొన్ని ఆచార్యుని వరకు వెళ్ళినట్టు వారికి తెలిసింది. ఆ విష యమై ఆయన ఉపేక్షాదృష్టి వారి కెంతో ఆశ్చర్యం కలిగించింది! రామానుజయతి ఆ బ్రహ్మచారి ద్వారా ఆ విడ్డూరాలు కొన్ని విని బాగా పరధ్యానంగా ఏదో దీర్ఘాలోచన ప్రారంభించాడు. అంతే గాని మరి ప్రతి సమాధానం చెప్పలేదు. ఆ మౌనముద్ర గమనించి ఆ బ్రహ్మచారి మరి నోరు మెదప లేక, తల వంచుకొని వేరొక పనిమీద వెళ్ళిపోయాడు.

రామానుజుని ప్రధాన శిష్యులతో గోవిందయతి, కూరాగ్రహాధిపతి, యజ్ఞమూర్తి, దాశరధి, అనంతసూరి ప్రముఖులు. వారందరు తర్క- వ్యాకరణాది శాస్త్రాలలో, వేదాంత విద్యలో, చతుర్వేదాలలో పీను మిగిలిన విద్వాంసులు. వైదికకర్మ నిష్ఠా గరిష్ఠులు. మొట్టమొదటినించి రంగనాయకుని యెడల వారి కంతగా సదభిప్రాయం కలుగలేదు. అయితే అతనిపై ఆచార్యుని అపూర్వ వాత్సల్యదృష్టి గమనించి కొంత తటస్థ దృష్టితో తమ కేమి పట్టనట్టు మాట్లాడ కూరుకొన్నారు. అయితే ఇటీవల అతనిని గూర్చి విస్తరించిన వింత వార్తలు కొన్ని విని వారం

దరు ఆశ్చర్యావేశాలతో నిశ్చేష్టితు లయినారు! రంగనాయకు డెవడో సామాన్య కృషీవలుని కుమారుడు! తల్లిదండ్రుల నెదిరించి ఒక వెలయాలిని వెంటబెట్టుకుని వచ్చి శ్రీరంగంలో తల దాచుకొన్నాడు. అతగాడి కెంతసేపు సాము గరిడీలమీదే దృష్టి! వేరొక గొడవే లేదు. ఏకోశాన భక్తి ప్రపత్తులున్నట్టు కనబడడంలేదు. పైగా తాగుబోతు ఇంకా ఎన్నెన్ని దుష్కార్యాలాచరించాడో ఎవ్వరి కెరుక అవి అన్ని తలుచుకోగానే వారందరికి అతని యెడల విపరీతమయిన ఏహ్యాభావం కలిగింది! కాని ఆచార్యుని ఆర్ద్రాదరణ దృష్టివల్ల పైపైకి మాత్రం కొంత గౌరవభావం వ్యక్తీకరించక తప్పలేదు.

రామానుజ యతీశ్వరునితో బాగా పరిచయం కలిగిన తరవాత కూడా రంగనాయకుడు తన మద్యపాన ధోరణి విడిచిపెట్టలేదు. ఆ దురభ్యాసం పూర్తిగా విడిచిపెట్టాలని అత డనేక పర్యాయాలు గట్టిగా నిశ్చయించుకోకపోలేదు. కాని ఆ పట్టుదలవల్ల అది క్రమక్రమంగా బాగా బలపడుతున్న ట్టనిపించింది. అప్పటినించి మరి గత్యంతరంలేక ఇక అతడా సంకల్పమే విరమించుకొన్నాడు. ఆపైన నాలుగయిదుసారులు రవంతమైకంతో అటు ఇటు తూగుతూ రామానుజ మఠంలో ప్రవేశించాడు. యజ్ఞమూర్తి మొదలయినవారా ధోరణి పసికట్టినా ఆచార్యుని యెడల గౌరవంవల్ల అలక్ష్యంచేసి అది గమనించనట్టు నటించారు. రంగనాయకుని నడవడికగాని, శిష్యుల లోలోపల మొలకెత్తిన ఏవగింపుగాని రామానుజునికి తెలియకపోలేదు. అయినా ఆనాటి కానాటికి ఆచార్యుని కతని యెడల మక్కువ మరెంతగా

ఎక్కువయింది. అంతేగాని రవంతయినా క్షీణించలేదు! మరి కొన్నాళ్ళు గడిచిన పిమ్మట దానికొక గట్టి తార్కాణ కన బడింది.

సామాన్యంగా శ్రీరంగేశుని దేవాలయానికి పోయే సమయంలో దాశరథి భుజంమీద చేయి ఆనించి అల్లనల్లన సాగిపోవడం ఆ యతీశ్వరుని కొక పరిపాటి. ఇటీవల అప్పు డప్పుడు ఆ చేయి రంగనాయకుని భుజంమీదికి తిరిగింది. ఆనాటి కానాటి కది ఒక అలవాటుగా, పరిపాటిగా పరిణమించింది. ఆచార్యుని పరమాత్మీయ దృష్టి కది ఒక గొప్ప తార్కాణ మని శిష్యులందరు ఏకగ్రీవంగా నిశ్చయించుకొన్నారు. అప్పటి నుంచి లోలోపల రుచించినా, రుచించకపోయినా వారి కందరికి రంగనాయకుని మరింత ఎక్కువగా గౌరవించక తప్పలేదు. ఆపైన మరికొన్నాళ్లు గడిచిన పిమ్మట ఒక అత్యద్భుత సంఘ టన జరిగింది.

రామానుజు డొకనాటి ప్రాతఃకాలవేళ శిష్యులతోబాటు శ్రీరంగశాయి సందర్శనంకోసం ప్రయాణ మయినాడు. పరిపాటి ప్రకారం రంగనాయకు డెంతో అడకువతో ఆచార్యుని సన్ని ధిని నిలుచున్నాడు. రామానుజు డాతని భుజంమీద ఆనుకుని నెమ్మది నెమ్మదిగా తన దేవాలయ ప్రస్థాన కొనసాగిం చాడు.

మార్గశీర్ష మాస ప్రారంభంలోనే శ్రీరంగంలో కొంచెం హిమవర్షం ప్రారంభించింది. ఆనాటి కానాటి కది మరి కొంత ఎక్కువయింది. అందువల్ల వీథుల కిరువైపుల గృహస్థుల ఇళ్ళ పెరళ్ళలో గోడల కానుకుని అల్లుకొన్న గుమ్మడి తీగల పూలు

దరు ఆశ్చర్యావేశాలతో నిశ్చేష్టితు లయినారు ! రంగనాయకు డెవడో సామాన్య కృషీవలుని కుమారుడు ! తల్లిదండ్రుల నెదిరించి ఒక వెలయాలిని వెంటబెట్టుకుని వచ్చి శ్రీరంగంలో తల దాచుకొన్నాడు. అతగాడి కెంతసేపు సాము గరిడీలమీదే దృష్టి ! వేరొక గొడవే లేదు. ఏకోశాన భక్తి ప్రపత్తులున్నట్టు కనబడడంలేదు. పైగా తాగుబోతు ఇంకా ఎన్నెన్ని దుష్కార్యాలాచరించాడో ఎవ్వరి కెరుక అవి అన్ని తలుచుకోగానే వారందరికి అతని యెడల విపరీతమయిన ఏహ్యాభావం కలిగింది ! కాని ఆచార్యుని ఆర్ద్రాదరణ దృష్టివల్ల పైపైకి మాత్రం కొంత గౌరవభావం వ్యక్తీకరించక తప్పలేదు.

.. రామానుజ యతీశ్వరునితో బాగా పరిచయం కలిగిన తరవాత కూడా రంగనాయకుడు తన మద్యపాన ధోరణి విడిచి పెట్టలేదు. ఆ దురభ్యాసం పూర్తిగా విడిచిపెట్టాలని అత డనేక పర్యాయాలు గట్టిగా నిశ్చయించుకోకపోలేదు. కాని ఆ పట్టుదలవల్ల అది క్రమక్రమంగా బాగా బలపడుతున్న ట్టనిపించింది. అప్పటినించి మరి గత్యంతరంలేక ఇక అతడా సంకల్పమే విరమించుకొన్నాడు. ఆపైన నాలుగయిదుసారులు రవంత మైకంతో అటు ఇటు తూగుతూ రామానుజ మఠంలో ప్రవేశించాడు. యజ్ఞమూర్తి మొదలయినవారా ధోరణి పసికట్టినా ఆచార్యుని యెడల గౌరవంవల్ల అలక్ష్యంచేసి అది గమనించనట్టు నటించారు. రంగనాయకుని నడవడికగాని, శిష్యుల లోలోపల మొలకెత్తిన ఏవగింపుగాని రామానుజునికి తెలియకపోలేదు. అయినా ఆనాటి కానాటికి ఆచార్యుని కతని యెడల మక్కువ మరింతగా

ఎక్కువయింది. అంతేగాని రవంతయినా క్షీణించలేదు! మరి కొన్నాళ్ళు గడిచిన పిమ్మట దానికొక గట్టి తార్కాణ కన బడింది.

సామాన్యంగా శ్రీరంగేశుని దేవాలయానికి పోయే సమయంలో దాశరథి భుజంమీద చేయి ఆనించి అల్లనల్లన సాగిపోవడం ఆ యతీశ్వరుని కొక పరిపాటి. ఇటీవల అప్పు డప్పుడు ఆ చేయి రంగనాయకుని భుజంమీదికి తిరిగింది. ఆనాటి కానాటి కది ఒక అలవాటుగా, పరిపాటిగా పరిణమించింది. ఆచార్యుని పరమాత్మీయ దృష్టి కది ఒక గొప్ప తార్కాణ మని శిష్యులందరు ఏకగ్రీవంగా నిశ్చయించుకొన్నారు. అప్పటి నుంచి లోలోపల రుచించినా, రుచించకపోయినా వారి కందరికి రంగనాయకుని మరింత ఎక్కువగా గౌరవించక తప్పలేదు. ఆపైన మరికొన్నాళ్లు గడిచిన పిమ్మట ఒక అత్యద్భుత సంఘ టన జరిగింది.

రామానుజు డొకనాటి ప్రాతఃకాలవేళ శిష్యులతో బాటు శ్రీరంగశాయి సందర్శనంకోసం ప్రయాణ మయినాడు. పరిపాటి ప్రకారం రంగనాయకు డెంతో అడకువతో ఆచార్యుని సన్ని ధిని నిలుచున్నాడు. రామానుజు డాతని భుజంమీద ఆనుకుని నెమ్మది నెమ్మదిగా తన దేవాలయ ప్రస్థాన కొనసాగిం చాడు.

మార్గశీర్ష మాస ప్రారంభంలోనే శ్రీరంగంలో కొంచెం హిమవర్షం ప్రారంభించింది. ఆనాటి కానాటి కది మరి కొంత ఎక్కువయింది. అందువల్ల వీథుల కిరువైపుల గృహస్థుల ఇళ్ళ పెరళ్ళలో గోడల కానుకుని అల్లుకొన్న గుమ్మడి తీగల పూలు

మాత్రమే అక్కడక్కడ స్పష్టా స్పష్టంగా గోచరించాయి. ధనుర్మాసం నాలుగయిదు దివసాల క్రితమే ప్రారంభమయింది. వీధులలో ఎటువైపు చూచినా రంగురంగుల రంగవల్లికలే! ప్రతి ప్రాంగణంలోను బాలికలు గుమ్మడిపూలతో గొబ్బిళ్ళు పెట్టి వలయాకార పరిభ్రమణాలతో, నునుసిగ్గులతో కెంపుల రాసులయిన చెక్కిళ్ళతో సన్నని మధుర స్వరాలతో గొబ్బిపాటలారంభించారు. ప్రాతఃకాల సువర్ణ కాంతి వీధిలో ప్రతి భవంతి చూరులలోను వేలాడగ గట్టిన వరి వెన్నుల గుత్తులపై, మొగలిరేకుల తోరణాలపై వడి దృశ్యా దృశ్యంగా ప్రకాశించింది. ఆ మనోహరకాంతి వర్షంలో శ్రీరంగ నగరం తన తెలి మంచు దుప్పటిముసుగు కొంచెం తొలగించి, అల్లనల్లన మేలుకొంటున్నట్టు గోచరించింది. ఆకాశంలో పైడి కలశాలతో, శిఖరాలతో మాత్రమే ప్రత్యక్షమయిన శ్రీరంగనాధుని దేవాలయం, విచిత్రమయిన ఒక విశాల నౌక పైడి వెలుగుల మున్నీటిలో తేలుతున్నట్టు భాసించింది! స్వామి ప్రాతఃకాల సేవా మంగళ తూర్య ఘోషలో వీధులలో గంగిరెద్దుల ననుసరిస్తున్న చిన్న చిన్న సన్నాయిల శ్రావ్య శ్రుతి క్రమక్రమంగా అంతర్లీనమై అణగిపోతున్నట్టు స్ఫురించింది.

క్రమక్రమంగా వారందరు శ్రీరంగనాథ దేవాలయం సమీపించారు. పొద్దుటి లేత ఎండ పొడలో స్తంభాల ఆకారాలలో మలచిన అచ్చరల పెదవులపై చిరునవ్వు, వాస్తవ దరహాసం వలె తరళించింది. దేవళంపై గల సన్నిధ రాళ్వారుల మూర్తులా వెలుగులో అతి లోకమయిన ఆనంద తన్మయతలో ప్రజ్వలించాయి. పౌరులనేకులు అప్పుడే ఆలయంలో ప్రవేశించి

జయజయధ్వానాలతో శ్రీరంగశాయికి జేజే లర్పిస్తున్నారు. గర్భాలయంలో అర్చకులందరు ముక్తకంఠాలతో శ్రీ సూక్త పురుషసూక్తాల పారాయణా లారంభించారు. గంభీరఘంటా ఘోష మాటి మాటికి ఆలయంలో అంతట ఖంగు ఖంగుమని ప్రతిధ్వనించింది. అదే సమయంలో ఆచార్యుని అంతేవాసు లందరు ఏకీభవించిన గళ స్వరాలతో ద్రావిడ దివ్య ప్రబంధాల లుచ్చైస్స్వరాలతో పఠించారు. ఆ ప్రశాంత గంభీర ధ్వని విన గానే రంగనాయకుని శరీరం జలదరించింది! అప్రయత్నంగా కనుగొలకులనుండి ఆనంద భాష్పధార ప్రవహించింది. అంత లోనే ప్రధానార్చకుడు స్వామి కట్టెదట కర్పూర నీరాజనం సమర్పించాడు. అదే సమయంలో రామానుజ శిష్యుల ద్రావిడ వేదపారాయణ ఘోష పరమ గభీరమై, తిరిగి దేవాలయావర ణలో నలుమూలల మారు మ్రోగింది.

ఆ గాన తన్మయతో పులకించిన రంగనాయకుని ముఖతః అప్రయత్నంగా ద్రావిడ వేదపాశురం వెలువడింది. అత డిటీ వలనే మఠంలో ఒక అంతేవాసి బ్రహ్మచారి ముఖతః కొన్ని పాశురా లభ్యసించాడు. అతని గొంతులో అంతగా గాంభీర్యం లేదు. కాని మాధుర్యం భక్తిభావ బంధురమై మంద్రాతి మంద్రమై మారుమ్రోగింది. ఆచార్యు డాశ్చర్య విస్ఫారిత నేత్రాలతో అతని అరమోడ్పు కన్నుగవ పరిశీలించాడు. రంగ నాయకుడు తన పాశురగానం ముగించి ఆనందబాష్పాలతో తరళిస్తున్న ఆచార్యుని ప్రఫుల్ల విశాల నేత్రాలవైపు పవలోకిం చాడు. ఆ సమయంలో అంతకుమును పొకనాడు ఆయన అన్న మాట, తటాలున అతని హృదయాంతరాళంలో స్ఫురించింది.

అంజలి ఘటించి లోలోపల తొణికిసలాడుతున్న డగ్గుత్తికతో వేడుకొన్నాడు :

"స్వామీ ! తా మొకప్పుడు తమ నేత్రాలకన్న మిక్కిలి మనోజ్ఞములయిన సుదీర్ఘ విశాల విలోచనాల దర్శన భాగ్యం ప్రసాదించగలమని అన్నారు. కాని నా కప్పుడా వాగ్దానంలో గల అంతరార్థం బోధపడలేదు..."

ప్రగాఢ గద్గదికతో రంగనాయకుని మాట తడబడింది. రామానుజయతి నిశ్చల నేత్రాలతో అతని ముఖవైఖరి పరిశీలించి ఆర్ద్ర వాత్సల్యంతో భుజంపై రవంత ఆనుకొని అల్లనల్లన ప్రశ్నించాడు :

"అవును నాయనా ! నేనా వాగ్దానం మరిచిపోలేదు. అయితే నీ కిప్పు డటువంటి మహనీయ విలోచనా లొకమారు సాక్షాత్కరించుకోవలెనని ఉన్నదా ?"

రంగనాయకుడా ప్రశ్న విని ఆనందావేశంతో నిశ్చల శిలాప్రతిమవలె నిశ్చేష్టుడయి అంతకంటె మహాభాగ్య మేమి లేదన్నట్టు దోసిలికట్టి అతి వినీతుడై నిలుచున్నాడు.

మరు నిమేషంలోనే శ్రీరంగేశునివైపు తిరిగి ప్రగాఢ భక్తి ప్రపత్తులతో పరిపూర్ణాంజలి ఘటించిన రామానుజ యతీశ్వరుని ముఖతః వెలువడిన ద్రావిడ వేదపాశురాల పరంపర ప్రశాంత మధురమై ప్రతి ధ్వనించింది. ఆ మనోజ్ఞ పారాయణ విరావం వినగానే అంతేవాసులందరు భక్తి తన్మయులై దోసిళ్ళు లొగ్గి నిలుచున్నారు. వారి చెక్కిళ్ళమీద ఆనంద బాష్పావళి నిరంతరమై ప్రవహించింది. దేవాలయంలో రామా

నుజ యతీంద్రుని ద్రావిడ పాశురపఠనం మిక్కిలి అరుదు! శ్రీరంగంలో అది ఆలకించిన అదృష్టవంతు లెంతోమంది లేరు. అందుచేత అర్చకులెంతో భయభక్తులతో తిరిగి శ్రీ సూక్త పురుష సూక్తా లారంభించారు. కృష్ణాగరు ధూపమాలికలతో బాటు తిరిగి శ్రీరంగేశునికి సురభిళ కర్పూర నీరాజనం సమర్పించారు. ఆ వెలుగులో రంగనాయకు డర్పించిన సువర్ణ నేత్రాలతో సమలంకృత మయిన స్వామి ముఖం మరింతగా జాజ్వల్యమానమై ప్రకాశించింది. అదే సమయంలో రామానుజయతి చెక్కిళ్ళపై ప్రవహిస్తున్న కన్నీటి బిందువు లల్లన కొనగోటితో తుడుచుకొని రంగనాయకుని కనురెప్ప లొకించుక స్పృశించి శిరస్సుపై చేయిడుంచి అస్పష్ట స్వరం ఆశీర్వచనా లనుగ్రహించాడు. ప్రగాఢ వాత్సల్యంతో "నాయనా! అదిగో అటువైపు చూడు!" అని శ్రీరంగనాథుని నేత్రయుగళి నిర్దేశించాడు. అంతే! మరుక్షణంలోనే తళతళత్కాంతులతో రంగనాయకుని కట్టెదట వేయి మెరుపుల సమూహం క్షణకాలం నిశ్చలములయిన స్వరూపాలతో నిలిచిన ట్టొక విధమయిన అపూర్వానుభూతి కలిగింది. ఇంద్ర ధనుస్సులవంటి బొమముడులలో వేగు జుక్కలవంటి కనుపాపలతో అతిలోక విశాలమయిన రమణీయ విలోచన యుగళి గభీర కరుణార్ద్రమై తరలించింది! అంతలోనే అతని శరీరం దట్టంగా అలముకొన్న పులకలతో గజగజ వణికింది. ఆపైన ఏమి జరిగినదో రంగనాయకుని కేమాత్రము అవగాహన కాలేదు. క్షణకాలం విపరీత మూర్ఛావేశంతో నేలపై వాలిపోయాడు. అంతలోనే తెలివి తెచ్చు

కొని రామానుజుని పాదయుగళి ప్రగాఢ భక్తి తన్మయతతో కౌగలించుకొని ఆనందభాష్పధారలతో అభిషేకించాడు.

"స్వామీ ! ఈ మహాపాపిమీద తమకెంత దయ కలిగినది ! ఇంతటి జాలికి నా కర్హత ఏమి ఉన్నది ! ఆహా ! స్వామి దివ్యనేత్రాల సందర్శన భాగ్యం కటాక్షించారుగదా !... అయ్యో ! హేమసుందరి ఈ అదృష్టానికి నోచుకోలేదు గదా !"

రామానుజయతి ఎంతో అప్యాయతతో రంగనాయకుని లేవనెత్తి విశాల హృదయస్థలి కద్దుకొని గాఢంగా కౌగలించుకొన్నాడు. హేమసుందరిని గూర్చి రంగనాయకుడన్న పలుకు లాలకించగానే ఆ యతి కటాక్షాలపై కవోష్ణ బాష్పబిందువు లొకటి రెండు తరలించాయి. అంజలి బంధంతో బాటు కనుదోయి తిరిగి అప్రయత్నంగా శ్రీరంగేశునివైపు తరలినది. ద్రావిడ పాశురాలతో బాటు గీర్వాణ స్తోత్రా లొకటే ప్రశాంత ధీర స్వరంతో రామానుజుని హృదయాంతరాళంలోనుండి వెలువడి గర్భాలయంలో అంతట ప్రతిధ్వనించాయి. తిరిగి అర్చకు లర్పించిన కర్పూర నీరాజన కాంతులతో శ్రీరంగనాథుని వదనం దేదీప్యమానంగా ప్రజ్వలించింది.

కాని ఆ పరమాద్భుత సంఘటన పరమార్థం శిష్యు లెవ్వరికి బోధపడలేదు. వా రందరు వేరు వేరుగా ఆచార్యుని కల్లంత దూరంలో నిలుచున్నారు. అందువల్ల వారి కెవ్వరికి రామానుజ రంగనాయకుల మధ్య నడిచిన ప్రసంగా లేవి విస్పష్టంగా వినిపించలేదు. ఆ తరుణంలో ఆచార్యుడు శ్రీ వైష్ణవ భక్తి

ప్రపత్తులకు సంబంధించిన రహస్యాలేవో సంగ్రహంగా రంగ నాయకుని కుపదేశించి ఉండవచ్చునని అనుకొన్నారు. అందు చేతనే రంగనాయకుని కంతటి పారవశ్యం కలిగి వుండవచ్చు నని నిశ్చయించుకొన్నారు. అదీగాక కొంగ్రొత్తగా అతడానాడు ద్రావిడ పాశురాలు పఠించాడు. ఆపైన ఆచార్యుని దివ్య ప్రబంధ పారాయణం గర్భాలయంలో నలువైపుల మంద్ర మనోహరమై ప్రతిధ్వనించింది. అటువంటి పరిస్థితులలో ఎలాంటి నాస్తికుల కయినా ప్రగఢ భక్తి భావావేశంతో తన్మయత ఆవేశించవచ్చును. ఇంతకు పూర్వం మూఢభక్తు లనేకులు రామానుజుని సాన్నిధ్యంలో పట్టరాని భక్తి తాత్పర్యాలతో మూర్ఛిల్లిన సందర్భాలెన్నో వా రనేక పర్యాయాలు సంద ర్శించారు. అందుచేత రంగనాయకుని అపూర్వానుభూతి రహస్యం వా రెవ్వరికి రవంతయినా బోధపడలేదు. అయితే ఆచార్యుని అనుగ్రహదృష్టి మరింత ఆర్ద్రమై ఆ నా డతనిమీద ప్రసరించి ఉండవచ్చునని వా రనుకొన్నారు.

రంగనాయ నికి మరి కొంతసేపటివరకు హర్షావేశంతో శరీరం గాలిలో తేలిపోతున్నట్టు స్ఫురించింది. శిరస్సుమీద చిర కాల దుర్భర భారం తటాలున తొలగించివేసిన ట్టొక విచిత్ర మయిన అనుభూతి కలిగింది. అతని హృదయంలో అంతట నిశ్చల ప్రశాంతత అలముకొన్నది. శ్రీరంగేశుని మనోజ్ఞమూర్తి, అఖండ కర్పూర నీరాజనము, గర్భాలయము, అన్ని క్షణకాలం పాటు వింత కాంతిజ్వాలలలో విలీనమయిపోతున్నట్టు పొడ కట్టింది. కలగంటున్నానా ? మేలుకొన్నానా ? అని రంగనాయ కుడు రవంతసే పాశ్చర్యావేశంతో నిశ్చేష్టు డయినాడు ! కళ్ళు

నలుముఖాొని తిరిగి మిక్కిలి జాగరూకతతో నలువైపుల పరిశీలించాడు. రామానుజయతి, దాశరథి, యజ్ఞమూర్తి ఆదిగా గల అంతేవాసు లందరితోను గర్భాలయం తిరిగి సహజ స్వరూపంతో సాక్షాత్కరించింది.

దేవాల యార్చకులు వా రందరికి క్రమక్రమంగా తీర్థ ప్రసాదా లందించారు. రంగనాయకు డవి స్వీకరించిన పిమ్మట శిష్యులతోను, ఆచార్యునితోను కలిసి తిరిగి మఠంవైపు సాగి పోయాడు. మార్గమధ్యంలో ఆనాటి దివ్యానుభూతి స్మృతివల్ల అతని కడుగడుగునా నెమ్మేనిపై పులక లావిర్భవించాయి. మఠంలో ప్రవేశించిన పిమ్మట రంగనాయకుడు తిరిగి ఆచార్యుని పాద యుగళిపై వాలి నమస్కరించి సెలవు తీసుకుని తన భవంతికి తరలిపోయాడు.

ఇంటిలో అడుగు పెట్టగానే హేమసుందరి అతనివైఖరి గమనించి ఎంతో ఆశ్చర్యపడి అడిగింది.

"ఇదేమి టిలా గున్నా రీవేళ ?"

"ఎలాగున్నాను ?"

రంగనాయకుడు కొంచెం తెల్లబోయి బొమ ముడి విరిచి ప్రశ్నించాడు.

"ఇప్పుడే నిద్రపోయి లేచిన ట్లున్నారు !"

"అలాగా !"

రంగనాయకు డానాడు దేవళంలో సంఘటిల్లిన అత్యాద్భుత వృత్తాంతం యథాతథంగా హేమ కెరిగించాడు. మొట్ట మొదట అతని మాటమీద ఆమె కంతగా నమ్మిక కలగలేదు !

కాని అతని ముఖంలో గోచరించిన విచిత్ర గాంభీర్యముద్ర గమనించి పిమ్మట ఆమె కిక నమ్మక తప్పలేదు. అయితే ఆ సంఘటనలో గల పరమార్థం సమగ్రంగా ఆమె కవగతం కాలేదు. వాస్తవానికి రంగనాయకునికే అది సమగ్రంగా అవగాహన కాలేదు ! దివ్య విలోచనా లన్న పదానికి ఆమె స్వామి ప్రతిమా మూర్తి నేత్రా లని మాత్రమే అర్థం చేసుకొన్నది! అందుచేత ఆ వృత్తాంతాని కంతగా ఆశ్చర్యపడలేదు ! కాని ఆనాటి మధ్యాహ్న భోజనం ముగించి ప్రగాఢ నిద్రతో మైమరచిన రంగనాయకుని ప్రశాంత ముఖవైఖరి ఆమె కెంతో ఆశ్చర్యం కలిగించింది !

# 22

హేమసుందరికి ఆనాటినించి రంగనాయకుని నడవడికలో అంతకుమును పెన్నడుకని విని ఎరగనంతటి వింత మార్పు గోచరించింది. ఆనాటి కానాటి కతని మద్యపానాసక్తి బాగా మందగించింది. అందుచేత మల్ల మిత్రుల యెడల ఏర్పడిన ప్రగాఢ మైత్రీ సంబంధాలు కూడా క్రమక్రమంగా సడలిపోయాయి. అయితే ఇంటిదగ్గర ఉన్నంతసేపు ఎడతెగని పరధ్యానంతో ఏదో కలగంటున్నట్టు కనిపించాడు. దేనికోసమయినా పలకరిస్తే ఉలిక్కిపడి, అప్పుడే నిద్ర మేలుకొన్నట్టు అంటీ అంటనట్టు ప్రతి సమాధానా లివ్వడం ప్రారంభించాడు. కాని స్వామి ఉత్సవాలలో, ఊరేగింపులలో మల్ల విద్యా వినోదాల యెడల అతని ఆసక్తి, అభినివేశము మరింతగా విజృంభించాయి. అంతే

కాదు! కొంచెం తిరిక కలిగిన సాయం సమయాలలో శ్రీరంగ నగర వీధులలో పెద్ద పెద్ద జెట్టీలతో చేయి, చేయి కలిపి సాము గరిడీల పోటీ పరీక్షలలో పాల్గొన్నాడు. వయస్సులో వారందరికన్న అతడు బాగా చిన్నవాడే! అయినా ఎప్పుడో సకృత్తుగా గాని ఓటమి ఎదురు పడలేదు! మరికొన్నాళ్ళ కాతని ప్రచండ పాండిత్య ప్రతిష్ఠ పాండ్యరాజ్యంలో నలువైపుల కార్చిచ్చులా వ్యాపించింది. శ్రీరంగంలో రంగమధ్యంలో నిలబడుతున్నాడన్న వార్త వినగానే వేలకొలది పౌరులాతని చుట్టు జేరి చాతుర్యం పరిశీలించి ముక్తకంఠాలతో అభినందించారు. ఐశ్వర్యవంతులు కొందరు బంగారు అంగుళీయకాలు, ముంజేతి కడియాలు, ముత్యాలహారాలు మొదలయిన అమూల్య భూషణాలు కోకొల్లలుగా బహూకరించారు. ఆ విధమయిన సంపాదనలో అతడు చాలా భాగం శ్రీవైష్ణవ మతానికి సమర్పించాడు. మిగిలిన దానితో అతని మనుగడ ఏవిధమయిన కొదవ లేకుండా హాయిగా గడిచిపోయింది.

అయితే హేమసుందరి నొక మనోవ్యాధి రాత్రింబవళ్ళదే పనిగా పట్టుకుని పీడించింది. రంగనాయకుడు ఇతరత్ర తాను గడించిన ధనంలో చాలాభాగం శ్రీవైష్ణవ మతానికి సమర్పిస్తున్నాడు. అయినా హేమసుందరి దాని కేమాత్రము మధన పడలేదు. ఏదోవిధంగా తమ కే లోటు లేకుండా సుఖంగా గడిచిపోతున్నది గదా, అని సమాధాన పడింది. కాని రంగనాయకునిలో అంతకుమును పెన్నడు కని విని ఎరగని ఒక వింత వైఖరి ఏర్పడింది. పొద్దస్తమానము అతనికి మతంమీదే ధ్యాస! కొంచెం తీరిక చిక్కితే చాలు! రామానుజుని సందర్శనానికి

బయలుదేరి వెళ్ళిపోయేవాడు. క్రమక్రమంగా అత డర్ధరాత్రి దాకా ఇంటికి చేరుకోలేదు ! ఒక్కొక్కనాడు తంతకంటె కూడా ఎక్కువ ఆలస్య మయింది.

త్వరగా ఇంటికి చేరుకోవలసినదని హేమసుందరి అనేక పర్యాయాలు బ్రతిమాలుకొన్నది. అత డలాగే అని బయలు దేరేవాడు ! కాని పూర్వంకన్న బాగా ఆలస్యంగా వచ్చి వీధి తలుపు తట్టేవాడు ! ఆనాటి కానాటికి ఆమెకు మఠంమీద బాగా అక్కసు బయలుదేరింది. ఆ ధోరణి రంగనాయకుని కే మాత్రము సరిపడలేదు ! "నేను రామానుజుల సందర్శనానికి వెడుతున్నాను గాని ఇంకెక్కడికి వెళ్ళడం లేదు గదా ! ఇంత మాత్రానికే రుసరుస లారంభిస్తే ఎలాగ ?" అని లోలోపల విసుక్కున్నాడు. ఇన్నాళ్ళనించి ఇరుగు పొరుగు అతని ఎడల బాగా ముఖావంగా ఉన్నారు. అందుచేత హేమ కంటబడగానే అతనికి ప్రాణం లేచివచ్చినట్టనిపించింది. ఇక ఇప్పుడు హేమ కూడా రుసరుస లారంభించడంతో అతని కీ లోకంలో తా నొక్కడే ఏకాకి అయినట్టు స్ఫురించింది. ఆ విధమయిన గుండె బరువుతో రామానుజ యతిని సందర్శించగానే అతని ముఖం బాలభాస్కరుని వైపు తిరిగిన పొద్దు తిరుగుడు పువ్వులా వికసించి కలకల లాడింది ! ఆ యతీశ్వరుని వాగమృతధార వీనుదోయిలో ప్రవేశించగానే అతని శరీరం నిలువునా పులకరించింది. కంఠం ప్రగాఢ గద్గదికతో సంస్తంభించింది.

యథాప్రకారంగా రంగనాయకు డొకనాటి సాయంకాలం రామానుజ సందర్శనానికి బయలుదేరాడు. హేమసుందరి సురి ఓరిమి వహించలేక అతని దారి కడ్డు పడింది :

"ప్రతిదినము ఎప్పుడు తిరిగి వస్తారని మిమ్మల్ని అడగడము—అపరాత్రిదాకా ఇంటికి రాకపోవడము ఒక అలవాటయిపోయింది. అయినా మళ్ళీ అడుగుతున్నాను. తిరిగి ఎప్పటికింటికి జేరుకుంటారు ?"

లోలోపల అణగించి వేసుకున్న ఉడుకుబోతుదనంతో, దగ్గుత్తికతో హేమ కంఠస్వరం గజగజ వణికింది. అతనికి ఆ మంకుపట్టుదల కెక్కడ అర్థంకాని, కారణం కాని కనబడ లేదు. భరించలేని విసుగుదలతో, చిరాకుతో ముభావంగా అంటి అంటనట్టు ముక్తసరిగా సమాధానం చెప్పాడు :

"ఏమో చెప్పలేను !"

"అయితే నే నొకత్తిని ఈ దిక్కుమాలిన కొంపలో పడి ఉండలేను. ఇక మీ రక్కడికి వెళ్ళడానికి వీలులేదు !"

ఆమె ధుమధుమ లాడుతూ అతని దారి కడ్డంగా నిలుచున్నది. రంగనాయకుని కిక ప్రాణం విసిగిపోయింది. అయినా అతికష్టంమీద ఆ ధోరణిని గ్రహించుకొని కొంచెం నెమ్మదిగా బ్రతిమాలు కొన్నాడు :

"హేమా ! నేను రామానుజుల దర్శనంకోసం వెడుతున్నాను గాని ఇంకెక్కడికి వెళ్ళడంలేదు గదా ? ఇది కూడా ససేమిరా వల్లకాదంటే ఎలాగ ?"

అయినా ఆమె శాంతించలేదు. రుసరుస లాడుతూ గొంతు కొంచెం హెచ్చించింది :

"ఇంకెక్కడికయినా వెళ్ళినా బాగుండును! అలాగ కావేరీ వీధికి వెళ్ళి కాంతామణి నొకసారి పలకరించరాదూ! నా ప్రాణానికి అదే నయమని పిస్తూంది!"

ఆ ప్రత్యుత్తరం విని రంగనాయకుడు నిలువునా నిర్ఘాంత పడ్డాడు:

"ఇదేమిటి హేమా! ఈవేళ ఇలాగా మాట్లాడుతున్నావు!"

ఆమె మరి ప్రతి సమాధానం చెప్పలేదు. చీర చెరగుతో ముఖం కప్పుకుని సన్నగా జాలిగా విలపించింది.

ఆ గొంతు సవ్వడి వినగానే అతనికి కొంచెం జాలి కలిగింది. నెమ్మదిగా బుజంమీద చెయ్యివేసి తిరిగి బ్రతిమాలుకొన్నాడు:

"ఎందుకు హేమా! అనవసరంగా కంట నీరు పెట్టుకుంటావు! ఇందులో తప్పేమిటి చెప్పు! పోనీ నువ్వుకూడా నాతోబాటక్కటికి రాకూడదా?"

అలా గన్నాడే గాని తీరా వస్తానంటే ఆమె నక్కడికి వెంటబెట్టుకుని పోవచ్చునో, పోకూడదో అన్న సంశయం పట్టుకుని పీడించింది. అంతలోనే హేమ తటాలున కొంచెం దూరంగా తొలగి తిరిగి ధుమధుమలాడింది:

"సరి! సరి! అన్నీ బాగానే ఉన్నాయి! ఇక నే నొక్కత్తినే అక్కడికి రావడం తరువాయి!"

"ఏం వస్తే తప్పా! నేను వెళ్ళడంలేదా? ఆయన ఎంతటి దయార్ద్రహృదయులో నీకు తెలియదు!...ఒకసారి దర్శనం చేసుకుందువుగాని రా! వారివల్లనే కదా మనకీ మాత్రం ఉపాధి దొరికింది!"

అయినా ఆమె మరి ప్రతిసమాధానం చెప్పలేదు. అలాగే తలవంచుకొని నిలుచున్నది.

"ఏదో ఈ మధ్యన కాస్త సుఖంగా ఉన్నా నను కున్నాను. ఇంతలోనే ఈ బెడద ఒకటి వచ్చి పడింది! నా ప్రాణాల కీ సన్యాసు లొకళ్ళు దాపరించారు!"

ఆమె చెక్కిళ్ళమీద వేడివేడి కన్నీటి బిందువులు జలజల రాలాయి. ఆ దుస్సహ దైన్యస్థితి రంగనాయకుని గుండె కది లించి వేసింది. దగ్గరికి వెళ్ళి మృదువుగా కౌగలించుకొని నుదురు ముద్దు పెట్టుకుని బతిమాలుకొన్నాడు:

"హేమా! నేనీ మధ్యన నీ మనస్సెంతో కష్టపెట్టాను! ఏమి చెయ్యను. ఆయన కెదురుగా కూర్చుని ప్రసంగాలాల కిస్తూ ఉంటే మరి నా కింటిమాటే జ్ఞాపకం రావడంలేదు. త్వరగా తిరిగి వద్దామనే అనుకుంటాను. కాని రాలేక పోతు న్నాను. ఏమి చెయ్యను. ఇక ఈవేళనించి ఆలస్యం చెయ్య నులే!"

ఉసూరుమని ఒక వేడి నిట్టూర్పు విడిచిపెట్టాడు రంగ నాయకుడు. ఆవేళ మాత్రం దీప దీపాలవేళ కే ఇంటికి తిరిగి వచ్చాడు. కాని ఆ మరునాటి నించి తిరిగి వెనకటి కథే ప్రారంభ మయింది! అయినా హేమసుందరి రెండు మూడు రోజుల

దాకా ఓపిక పట్టింది. ఆపైన ప్రాణం విసిగి మఠానికి బయలు దేరుతున్న సమయంలో తటాలున ఎదురుగా వెళ్ళి అతని కడ్డు పడింది :

"మీ కేమో క్షణమయినా ఇంటిదగ్గర కాలు నిలవడం లేదు. పొద్దస్తమానము నే నిక్కడ ఒక్కత్తిని పడి ఉండలేక చచ్చిపోతున్నాను! ఎంతకాలమని నన్నిలాగ వేధించుకుని తింటారు! ఇక నేనీ యాతన భరించలేను."

రోషావేషంతో ఆమె కంఠస్వరం బాగా రెచ్చి పోయింది.

"అయితే నన్నేమి చెయ్యమంటావు ?"

మరి భరించలేక రంగనాయకుడు గట్టిగా గద్దించాడు.

"మీ రీవేళ సాయంత్రంనించి ఇక అక్కడికి వెళ్ళ డానికి వీలులేదు! ఒకవేళ అంతగా వెళ్ళాలని అనుకుంటే పట్టపగలే వెళ్ళండి!"

"చీకటిపడిన తరువాతే ఆయన కొంచెం తీరికగా ఉంటారు. మిగిలిన వేళలలో వారి కొక్క క్షణమయినా తీరు బడి ఉండదు."

"ఉండకపోతే అసలు వెళ్ళడమే మానివెయ్యండి! ప్రతి దినము అగ్గగ్గలాడిపోతూ ఆ మఠంలో పడిగాపులు పడి కూర్చో వలసినంత అగత్యం ఏమి వచ్చింది ?"

రంగనాయకుని కిక సహించలేనంత చిరాకు తలకెక్కింది. మరి ప్రతి సమాధానం చెప్పక, దురుసుగా హేమ నొక పక్కకి నెట్టి చరచరా వీధిలోకి వెళ్ళిపోయాడు! ఆ తోపుతో ఆమె

తటాలున నేలమీద కూలబడిపోవలసిందే! కాని పక్కనున్న ద్వార బంధంమీద ఆనుకోవడంవల్ల ఆ ప్రమాదం తప్పింది. ఆ తరవాత రెండు మూడు రోజులవరకు వారొకరొకరితో అంతగా మాట్లాడుకోలేదు. రంగనాయకు డేది అడిగినా హేమ మూతి, ముక్కు ముడుచుకుని ముభావంగా సమాధానం చెప్పింది. అయినా అతని ధోరణిలో మార్పేమి కనబడలేదు. రెండు మూడు రోజులపాటు ఆ వైఖరి గమనించి మరి ఓరిమి వహించలేక ఆ మరునాటి సాయంకాలం ఇనుమడించిన అక్కస్సుతో అతని దారి కడ్డుపడి కస్సుమని బుసకొట్టింది :

"ఆనాటికానాటికి మీ రింటిలో అడుగు పెట్టడమే గగన మయిపోతూంది! నా కిక్కడ కాలక్షేపం కాక బొత్తిగా మతి పోతూంది. ఎందు కిలాగ రాసి రంపాన పెట్టి వేధించుకు తింటారు! నేను మీకంత బరువై తే చెప్పండి! మళ్ళీ నిచుళా పురం వెళ్ళిపోతాను. పొద్దస్తమానము మన కిద్దరి మధ్య ఎందు కింత రభస ?"

విపరీత వేదనతో, పట్టరాని అక్కస్సుతో ఆమె చెక్కిళ్ళెర్రబడ్డాయి. నేత్రాంతాల నుండి వేడివేడి కన్నీరు బొట బొట ప్రవహించింది. ఆ పరుష ప్రతి సమాధానంతో రంగ నాయకుని హృదయం భగ్గుమని ప్రజ్వలించింది. ఒళ్ళెరగని దురాగ్రహావేశంతో కస్సుమని విరుచుకుపడ్డాడు :

"అంత యాతనగా ఉంటే వెంటనే వెళ్ళిపోవడమే మంచిది! లోలోపల ఇష్టంలేకపోయిన తరవాత ఊరికే పట్టుకుని వేళ్ళాడితే మాత్రం లాభం ఏమిటి? ఇక నువ్విక్కడ

ఒక్క క్షణమయినా ఉండనక్కరలేదు. ఇప్పుడే బయలుదేరి వెళ్ళిపో !"

దుస్సహమయిన దుర్నాగ్రహావేశంతో రంగనాయకుడు గజగజ వణికిపోయాడు ! హేమ నిమేషకాలం నిశ్చల విస్ఫారిత నేత్రాలతో అతని రూక్ష వైఖరి పరిశీలించింది ! లోలోపల నుండి పెల్లుబికిన వేడివేడి కన్నీటి బిందువులతో ఆమె చూపు లానలేదు :

"ఏది ఏమయినా సరే. ఇక మీా రక్కడకు వెళ్ళడం మానరన్న మాట ! అంతేనా ?..."

విపరీత గాద్గదికతో ఆమె కంఠం స్తంభించింది. మరి మాట్లాడలేక చీరచెరగుతో చెక్కిళ్ళపై కన్నీరు తుడుచు కొన్నది. రంగనాయకు డిక ప్రతి సమాధానం చెప్పలేదు. గిరుక్కున వెనక్కి తిరిగి ఒక్క అంగలో వీధిలోకి వెళ్ళి పోయాడు. ఆ దారుణ తిరస్కారం హేమ గుండెలో వాడి వాడి బల్లెంలా నాటుకొన్నది ! దుస్సహ దుఃఖభారంతో నేలపై కూలబడి నీరస స్వరంతో కుమిలి కుమిలి దుఃఖించింది. ఉసూరుమని నిట్టూర్చి "ఎలాంటి మనిషి ఎలాగ మారి పోయారు !" అని రవంతసేపు నిర్ఘాంతపడింది. ఆమె కా సమ యంలో రంగనాయకుని తొలి వలపు, ఒకొక్కనాడు తన సందర్శనంకోసమై పడిన ఎడతెగని ఆరాటము మొదలయినవి ఒకటొకటే జ్ఞప్తికి వచ్చాయి. శ్రీరంగంలో గడిచిపోయిన దివసాలన్ని విచిత్ర మనోజ్ఞ స్వప్నాలవలె స్ఫురించాయి !

వాస్తవానికి రంగనాయకుడు అర్ధరాత్రి వరకు రామా నుజ మఠంలో నిలిచిపోతున్నందుకు హేమ అంతగా ఖేదపడ

లేదు. ప్రజ మెచ్చుకొని బహూకరించిన కానుకలలో చాలా భాగం మఠాని కర్పించినా ఆమె ఆ విషయమే తలపెట్టలేదు. కాని క్రమక్రమంగా రామానుజుని యెడల ఇనుమడిస్తున్న భక్తితో రంగనాయకుడిక తనమాటే తలపెట్టక యతిగా మారిపోగలడేమో అని చాలా భయపడింది. ఒక్క బ్రాహ్మణులే కాక శేషించిన వర్ణాలవారు కొందరు ఆచార్యుని కంతేవాసులై సన్యాసులైన సంగతి ఆమె ఇరుగు పొరుగమ్మల ద్వారా అనేక పర్యాయాలు కర్ణాకర్ణిగా విన్నది. రామానుజుల యెడల రంగనాయకుని భక్తి ప్రపత్తు లెక్కువయినకొద్ది ప్రతిదినము ఆమె గుండెలో ఒక పెద్ద రాయి పడింది. విపరీతమయిన ఆందోళనతో మఠానికి వెళ్ళవద్దని మాటిమాటికి అడ్డుకొన్నది. కాని రవంతయినా ప్రయోజనం కలగలేదు ! పైగా వెళ్ళవద్దని నిర్బంధించిన కొద్ది రంగనాయకుడు మరింతగా మితిమీరి బిర్ర బిగుసుకు పోతున్నాడు. ఆ పరిస్థితిలో మరి మార్గాంతరం గోచరించక తిరిగి నిచుళాపురం వెళ్ళిపోగలనని బెదిరించి చూసింది. అంతేగాని, ఆమె కెన్నడు అటువంటి సంకల్పమే కలగలేదు. వాస్తవానికి ఆ మాట తలుచుకోగానే భరించరాని ఏహ్యాభావంతో ఆమె శరీరం జలదరించింది.

ఎన్నెన్ని విధాల ప్రయత్నించినా రంగనాయకుని మఠాభినివేశ మేమాత్రము సడలలేదు. అయితే ఇక ఇప్పుడేమి చెయ్యాలి ! ఎంత సేపాలోచించినా ఆమెకేమి పాలుపోలేదు. పోనీ రామానుజ యతీశ్వరుల నొకమారు సందర్శించి తన గోడు వెళ్ళబోసుకొంటే ? అందువల్ల తన కోరిక కొంతవరకు నెరవేరవచ్చును. రామానుజుని యెడల రంగనాయకుని భక్తి

ప్రపత్తు లాంటివి. ఈ విషయంలో మాత్రం అత డింకెవ్వరి మాట రవంతయినా చెవికెక్కనీయడు. అయితే తనవంటి వేశ్య నా మఠంలో అడుగుపెట్టనిస్తారా ? ఒకవేళ ఎలాగో అలాగ లోపలికి వెళ్ళి మొరపెట్టుకుంటే మాత్రం ప్రయోజన మేమిటి? స్వరసంగ పరిత్యాగం చేసిన రామానుజులవంటి యతీశ్వరులు తనవంటి వారాంగనమాట పాటించి ఆర్ద్ర దృష్టితో ఆదరించి ఆదుకొంటారా ! తన కేవిధంగాను మనఃఖేదం కలిగించవద్దని రంగనాయకుని కాజ్ఞాపిస్తారా ! హేమసుందరి కేమాత్రము ధైర్యం కలగలేదు. అంతలోనే ఆయన దయార్ద్ర హృదయు లని రంగనాయకు డన్నమాట తటాలున స్ఫురించింది. "పోనీ ఒకసారి వెళ్ళి వారి ఎదటపడి నా ఘోష వెళ్ళబోసుకుంటాను. అనుకున్న పని జరిగితే జరుగుతుంది లేకపోతే లేదు ! ఇంత మాత్రంలోనే మునిగిపోయేదేది లేదుగదా !" అని లోలోపల నిశ్చయించుకొన్నది. ఇక మాటి మాటికి మఠానికి వెళ్ళవద్దని అదేపనిగా రంగనాయకునికి అడ్డుపడడంవల్ల రవంతయినా ప్రయోజనం లేదని నిశ్చయించుకొన్నది. అందుచేత అతడింటికి తిరిగివచ్చినప్పుడిక ఆ విషయమే తలపెట్టలేదు. రంగనాయకుని కామె తటస్థవైఖరి మరింత ఆశ్చర్యం కలిగించింది.

# 23

తన ఉదాసీన వైఖరివల్ల రంగనాయకునిలో కొంత కాకపోయినా కొంతయినా మార్పు రాగలదని హేమసుందరి ఎంతయినా ఆశించింది. ఎంతగా విసుగుదల చూపించినా ఎంతో ఓరిమి వహించి ప్రసన్నముఖంతో అలతి నగవుతో ప్రతి సమాధానా లిచ్చింది. అయినా ఆవంతయినా ప్రయోజనం కనబడలేదు. ఆనాటి కానాటికి రంగనాయకుని పరధ్యానం మితిమీరింది. రామానుజుల పేరుచ్చరించినంతలోనే అతని కటాక్షాలలో కన్నీరు నిలిచింది. రంగనాథస్వామి ఎదట నిలబడి సాము గరిడీ లారంభించినప్పు డిక అతని శరీర స్పృహే సడలిపోయింది. హేమసుందరి గొడవ పెట్టడం మానినప్పటినుండి అత డెప్పుడు ఆమె నొక్క పల్లెత్తుమాటయినా అనలేదు. ఎంతో ఆత్మీయతతోనే ప్రసంగించాడు. అయితే ఎల్లవేళల రామానుజుని గూర్చిన ఘోషే తప్ప అతని నోట వేరొక్క మాటే వెలువడలేదు! సాయంకాలంవేళ స్వామిని సందర్శించి తిరిగి వచ్చినప్పుడు కేవలం మతి చలించిన మనిషిలా ఎడతెగని తన్మయతతో ఏదో ఆలోచిస్తున్నట్టు కనిపించాడు.

ఆ మరునా డుదయమే లేచి హేమసుందరి వంట ఇంటిలో ప్రవేశించింది. ఇటీవల కొంతకాలంనుంచి రంగనాయకుడు ఆమె సాహాయ్యంకోసం ఒక పరిచారిక నేర్పాటు చేశాడు. అయినా ఏమి తోచక, కాలక్షేపంకోసం హేమసుందరి ముఖ్యమయిన పనులన్ని తానే చక్కబెట్టుకొన్నది. కాని ఆమె మనస్సు

మాత్రం సర్వదా రంగనాయకుని గూర్చిన ఎడతెగని మథనతో సతమతమయింది.

ఇంచుమించుగా జాము పొద్దెక్కినా దట్టంగా కమ్ముకొన్న పొగమంచుతో ఇంకా బాగా తెల్లవారినట్టే కనిపించ లేదు నేలమీద కాలూనడంకోసం సూర్యకిరణా లాకాశంలో తెలితెలి మంచు తెరలతో ఎడతెగని పోరాటం కొనసాగిస్తున్నాయి. వీధులలో అస్పష్టంగా ప్రజ్వలిస్తున్న చలిమంటల చుట్టు జేరిన బాలబాలికల నీలినీడ లటుఇటు కదలాడుతున్నాయి. చెట్ల ఆకులమీదనుండి దిగజారిన మంచుబిందువు లొకటొకటే వాన చినుకులవలె నేలమీద రాలుతున్నాయి. పక్షు లక్కడక్కడ రెక్క లల్లల్లాడించి మీదపడిన మంచునీటి బిందువు లొక్కుమ్మడిగా తొలగించుకొని పైపై కెగిరి పోవలెనని ప్రయత్నిస్తున్నాయి. దూరదూరంగా శ్రీరంగనాథ దేవాలయంలో ప్రాతఃకాల మంగళ తూర్యధ్వని ఆ పరిసరంలో అంతట మంద్ర మంద్రంగా మారుమ్రోగింది.

ఆ సవ్వడి విని రంగనాయకుడు స్వామి ఊరేగింపులో తనమల్ల వినోదాల ప్రదర్శనంకోసం బయలుదేరాడు. హేమసుందరి అది గమనించి తన వంటపని మధ్యలోనే నిలిపివేసి చిలక కొయ్యమీద వేసిన సరిగంచు ఉత్తరీయం తీసి అతనిచేతి కందించింది. "ఎంతసేపటికి తిరిగి వస్తారు ?" అన్నట్టు అతనివైపు చూచింది.

"మధ్యాహ్నం మూడు జాములవరకు ఊరేగింపు పూర్తి కాదేమో ! ధనుర్మాసోత్సవాలు జరుగుతున్నాయి మరి. అందాకా నాకోసం కనిపెట్టుకుని ఉండక్కరలేదు."

అన్నాడు రంగనాయకు డెంతో ముభావంగా.

"ఏనాడు లేనిది ఎందుకింత ఆలస్యం !"

హేమ కొంచెం ఆశ్చర్యపడి అడిగింది.

"ఏమో మరి నా కేం తెలుసు !"

"పోనీయండి ! అంతవరకు కనిపెట్టుకుని ఉంటాను. తగుస నమ్మా అని మీకంటె ముందే భోంచేసి నే నిక్కడ వెలగ బెట్టే రాచకార్యమేమి ఉంది ?"

హేమ కంఠంలో రవంత డగ్గుత్తిక తొణికిస లాడింది.

"సరే, నీ ఇష్టం !"

అంటీ అంటనట్టు సమాధానం చెప్పి రంగనాయకుడు ఒక్క అంగలో వీధిలో పడి స్వామి దేవాలయంవైపు సాగి పోయాడు. హేమసుందరి మరి కొంతసేపటివరకు తన కన్నులే నమ్మలేక పోయింది. "చూస్తూ ఉండగానే నామీద ఎంతటి విసుగు, చిరాకు బయలుదేరాయి. ఇంతకి నేనేమి చేశాన ఈ రుసరుసలు ! మఠానికి వెళ్ళవద్దని అన్నాననేగా ! నేను చేసుకున్న కర్మ ఇలాగ ఉన్నప్పుడు ఒకరి ననవలసిన పని ఏమి ఉంది ! నానాటికి ఈయన వెర్రి తలదాటి పోతూంది. ఇక ఆలస్యం చేస్తే లాభంలేదు !" అని ఉసూరుమని నిశ్వసించింది. మరికొంత సేపటివరకు అలాగే దిగాలుపడి నిలబడి త్వరగా వంట పూర్తిచేసి, ఇప్పుడే వస్తానని పనిమనిషితో చెప్పి రామానుజ మఠానికి బయలుదేరింది.

హేమ మఠావరణంలో అడుగుపెట్టిన సమయంలో లోపల దేవరాజస్వామి కర్చన జరుగుతున్నది. రామానుజుడే స్వయంగా, యథావిధిగా ఆ పూజ నిర్వర్తిస్తున్నాడు. దేవ రాజస్వామి రామానుజ మఠం దైవం. ఆ విశాల భవనంలో వెనుకభాగంలో ప్రత్యేకించిన గదిలో ఆ స్వామి అర్చామూర్తి సన్నిధిని వెలువడిన వేదమంత్ర ఘోషతో మేళవించిన ద్రావిడ పాశురాల ధ్వని ఆ ప్రాంతంలో అంతట ప్రతిధ్వనిస్తున్నది. మధ్యమధ్యన తామరపూలతో, కలవలతో రూపొందించిన మామిడి తోరణాలతో మఠ ద్వారాలు కలకల లాడు తున్నాయి. సింహద్వారాని కిరువైపుల వేర్వేరు వర్ణాలతో చిత్రించిన పెద్ద పెద్ద శంఖ చక్రాలు పొద్దుటి ఎండపడి అపూర్వ సౌందర్యంతో తరళిస్తున్నాయి. ఎర్రని పూలగుత్తులతో గాలిలో కదలాడుతున్న కరవీరాల కొమ్మలకు కట్టిన కాషాయ వస్త్రాలటు ఇటు కదలాడుతున్నాయి. మఠానికి పై పైన సమున్నత కేతనంపై గరుత్మంతుని మూర్తి నిశ్చల పక్షాలతో సమున్నత చంచువుతో అమృతకుంభం కోసం అమరలోకం వైపు సాగిపోతున్నట్టు గోచరిస్తున్నది.

శిరస్సొకించుక వంచుకొని నెమ్మది నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ హేమ లోపల ప్రవేశించగానే అంతేవాసులు కొందరెంతో ఆశ్చర్యపడి కొంచెం దూరంగా తొలగి పోయారు. మఠానికి అపరిచితు లెవరయినా వచ్చినప్పుడు వారి సగౌరవాదరణ దాశరథి విధి. అందుచేత ఒక బ్రహ్మచారి త్వరగా లోపలికి వెళ్ళి అతనికి ఆ విషయం నివేదించాడు. మరి కొంత సేపటికి దాశరథి అక్కడికి వచ్చి ఆమె నెంతో గౌరవిస్తు

మహిళలకోసం ప్రత్యేకించిన ఒక విశాలమయిన గదిలో విశ్రమింపజేసి "రామానుజు లిప్పుడు దేవరాజస్వామి నర్చిస్తున్నారు. పూజ అయిపోవచ్చింది. ఇక ఎంతోసేపు పట్టదు. అంతవరకు మీ రిక్కడ వేచి ఉండండి. నే నిప్పుడే తిరిగి వస్తాను" అని చెప్పి లోపలికి వెళ్ళిపోయాడు.

హేమ అంతకుపూర్వ మెన్నడు మఠంలో అడుగుపెట్ట లేదు. అందుచేత ఆమె రాక దాశరథికి రవంత ఆశ్చర్యం కలిగించింది. ఇక హేమసుందరికి ఆ భవంతి అంతా ఎంతో వింతగా కనబడింది. అంతకు మును పెన్నడు కని విని ఎరగని ఒక క్రొత్త లోకంలా స్ఫురించింది. గంభీర స్వరంతో మారు మ్రోగుతున్న శ్రీ సూక్త పురుష సూక్తాల పారాయణం ఆమె హృదయాని కొకింత ప్రశాంతి కలిగించింది. క్రమక్రమంగా ఆ సవ్వడి మందగించింది.

అయిదారు నిమిషాలు గడిచిన తరువాత దాశరథి అక్కడికి తిరిగి వచ్చి హేమసుందరిని రామానుజుని సన్నిధికి తోడుకొనిపోయాడు. ఆ యతీశ్వరుని కనుసన్న గ్రహించి స్వామి ప్రసాదం పళ్ళెరంతో ఆమె ముందుంచి తిరిగి ద్వారాని కవతల నిలుచున్నాడు. హేమ తన కేర్పరచిన చిత్రాసనం మీద కూర్చోడానికి కొంచెం సంకోచించింది.

"అలాగ నిలబడిపోయావేమిటమ్మా! భయం లేమతే! కూర్చో తల్లీ!" అని రామానుజుడు ఉట్టిపడుతున్న వాత్సల్యంతో హెచ్చరించిన తరవాత ఎంతో కుంచించుకుపోయి నెమ్మదిగా కూర్చున్నది. రవంత ప్రసాదం నోట బెట్టుకున్నది.

కాని ఆ యతీశ్వరుని ఆర్ద్రానురాగంతో ఆమె కది పూర్తిగా స్వీకరించక తప్పలేదు. రామానుజుని అనునయ ప్రసంగం వినీ వినగానే కన్నతల్లి ప్రేముడి ఎటువంటిదో మొట్టమొదటగా అప్పుడే ఆమె కవగత మయింది. కంఠం గద్గదికతో తొణికిస లాడింది. చీర చెరగుతో నేత్రాంతా లద్దుకొని కొంచెం శిరస్సు పైకెత్తి రామానుజుని ముఖవైఖరి పరిశీలించింది. గభీర కరుణతో సంచలిస్తున్న ఆ యతీశ్వరుని కనుదోయి వైపు చూచి అస్పష్ట స్వరంతో ముమ్మొందుగా తన సంగతి వెల్లడించి రంగ నాయకుని విషయం ప్రస్తావించబోయింది. మరి మాటాడలేక లోలోపల నుండి ఉవ్వెత్తుగా ఉప్పొంగుతున్న దుర్భర దుఃఖా వేగంతో వివశురాలై ఒక్కమారుగా వలవల విలపించింది. రామానుజ యతి ఎంతో అప్యాయంగా చల్లని పలుకులతో ఆమె నోదార్చినా ప్రయోజనం కలగలేదు. హేమసుందరి శోకోద్వేగం ఒక్కుమ్మడిగా కట్టలు తెంచుకొని సన్నని రోదన స్వరంతో ఎడతెగని కన్నీటి రూపంలో పరవళ్లు తొక్కింది.

దాశరథి నిలువునా నిర్ఘాంతపడి ఆమె నిరంతర పరిదీన రోదన ధ్వని ఆకర్ణించాడు. కొత్తగా ఆచార్యుని సందర్శించిన వారిలో కొంద రొక్కొక్కప్పుడు ఆ విధంగా ఉవ్వెత్తుగా ఉప్పొంగిన దుఃఖోద్వేగంతో ఆక్రోశించడం అత డనేక పర్యాయా లవలోకించాడు! వారి హృదయాంతరాల్లో దుస్సహ దుఃఖ భావా లెన్నెన్నో అణగి మణగి ఉంటాయి. అటువంటి వారికి తమ గోడు ఆలకించి ఆర్చేవారు తీర్చేవారు ఎవ్వరు కనబడరు! వారా నీరవశోకా లలాగే ఎడతెగని ఓరిమితో

భరిస్తారు. రామానుజుని వంటి కరుణార్ద్రమూర్తిని సందర్శించ గానే ఆ దుర్భర వేదనాభారాలొక్కమారుగా కట్టలు తెంచుకొని ప్రవహిస్తాయి. ఆచార్యుని సందర్శించగానే హేమసుందరి కదే విధమయిన అనుభూతి కలిగి ఉండవచ్చును! "అయ్యో! లోకంలో మానవుల గుండెల లోతు లెంతటి దుస్సహ యాతనలతో కాలి కాలి కుమిలిపోతున్నాయోగదా!" అని ఆలోచించి దాశరథి ఉసూరుమని ఒక వేడి నిట్టూర్పు విడిచిపెట్టాడు. అంతలోనే రామానుజుని కృపార్ద్రకంఠం మంద్ర మధురంగా ప్రతిధ్వనించింది :

"అమ్మా! నీవు చెప్పదలుచుకున్నదేదో నే నెరుగుదును! అయితే మ టిమాటికి అదేపనిగా విలపించినందువల్ల ప్రయోజనమేమిటి? మనస్సు నిలవరించుకో!. ఇంతకి పెద్దబెడద ఏది రాలేదుగదా! మరి ఎందుకు నీ కింతటి మథన? కొంచెం ధైర్యం తెచ్చుకుంటే క్రమక్రమంగా అన్ని అవే సానుకూలపడతాయి."

హేమసుందరి కా చల్లని ఓదార్పు మాటలతో కొంచెం ధైర్యం కలిగింది. ఒక్క చూపుతోనే తన రాక అంతరార్థం గ్రహించిన ఆయన అపూర్వశక్తికి కెంతో అక్కజపడింది. చీర కొంగుతో చెక్కిళ్ల మీద ధారకట్టి ప్రవహించిన కన్నీరు తుడుచుకొన్నది. ఆచార్యుని ముఖంమీద ఏకాగ్రదృష్టి నిలిపి ఎడతెగని డగ్గుత్తికతో తన గోడు వెళ్ళబోసుకొన్నది :

"స్వామీ! మీవంటివారి దగ్గర నే నేమని విన్నవించుకో గలను! నా అన్నవాళ్ళ నందరిని కాదని వారి వెంటపడి ఇక్కడికి వచ్చాను. కొంతకాలంవరకు నా కేలోటు కనబడలేదు.

వారు నన్నెంతో ఆప్యాయంగా కళ్ళు కప్పుకుని ఆదరించారు. కాని ఇటీవల వారి కింటి మాటే పట్టడంలేదు. ఎన్నెన్నివిధాల మొత్తు కున్నా నా మాట చెవి కెక్కనీయడంలేదు. పొద్దస్తమానము మీమీదే వారి దృష్టి. తండ్రివంటి మీలాంటివారితో కాక నా కష్టసుఖా లింకెవరితో మనవి చేసుకోగలను! ఇక వారు నా మానాన నన్ను విడిచిపెట్టి మఠంలో చేరిపోతారేమో అని భయపడుతున్నాను. తమ రొక్కసారి వారిని కొంచెం మందలిస్తే చాలు! నా కింతకన్న విన్నవించుకోవలసిన దేది లేదు.”

తన అభ్యర్థన విని రామానుజయతి ఏకాగ్ర దృష్టితో ఏదో ఆలోచిస్తున్నారని హేమసుందరి గ్రహించుకొన్నది. కోరిక నెరవేరకపోదని కొంచెం ధైర్యపడింది. అంతలోనే రామానుజుని ప్రశాంత గంభీర కంఠధ్వని వినిపించింది :

“ఇక్కడ ఉన్నంతసేపు అతడు నా శిష్యుల దగ్గర ద్రావిడ పాశురాలు కొన్ని నేర్చుకొంటున్నాడు. ఇక మిగిలిన సమయాలలో స్వామిని సేవించుకొంటూ అందరిచేత ఔనౌ ననిపించుకొంటున్నాడు. ఇందుచేత ఇంటిదగ్గర ఉండడాని కతనికి బొత్తిగా తీరిక చిక్కడంలేదేమో!...పోనీ నీ మీద బొత్తిగం ఇష్టం లేదనుకొన్నప్పుడు...తిరిగి నిచుళాపురం వెళ్ళిపోవచ్చును కదా! ఇంటిదగ్గర నీ కేవిధమయిన లోటు ఉండదుగదా! మరి ఎందు కింత ఆందోళన ?”

ఆ ప్రశ్న విన్న తరువాత హేమసుందరి గొంతెండి పోయింది. మాట తడబడింది! ఏమేమో వెళ్ళబోసుకోవాలని ఎంతయినా ఆత్రపడింది. కాని ఏ మాత్రము సాధ్యపడలేదు. రంగనాయకుని విడిచిపెట్టి తిరిగి ఇంటికి వెళ్ళిపోవలసినదని ఆజ్ఞా

పిస్తున్నారని గ్రహించుకొన్నది. అతనిని ఒక్కసారి మందలించి మంచిబుద్ధి చెప్పవలసినదని ప్రాధేయపడింది. కాని ఆవంతయినా ప్రయోజనం కలుగలేదు. "అయ్యో! పుట్టెడాశతో ఇక్కడికి వచ్చానే! రామానుజు లెంతో జాలిగుండె కలవారని ఆయన అన్నారే! ఇదేమిటి? చిట్టచివరి కింత కఠినంగా మాట్లాడు తున్నారు!" అని రవంతసేపు మధనపడింది. అకస్మాత్తుగా ముంచుకొని వస్తున్న దుఃఖావేశం గుండెలోనే చిక్కబట్టుకొని లోలోపలే అణగించివేసుకొన్నది. దోసిలికట్టి దీనాతిదీన స్వరంతో ప్రాధేయపడింది :

"మీవంటి మహనీయులే ఈవిధంగా సెలవిచ్చిన తర వాత మరి నే నేమని విన్నవించుకోగలను. ఇక వేరే దిక్కు లేక మీ పాదాలే నమ్ముకొని గంపెడాశతో ఇక్కడికి వచ్చాను. అన్ని తెలిసిన తమ సన్నిధిని నేనేమని మొరపెట్టుకో గలను! తమ దయవల్ల వారికి తిరిగి నా మీద ఆదరం కలిగితే సరేసరి! లేకపోతే నేనిక నిచుళాపురం పోదలుచుకోలేదు. వారికే బరువైనప్పుడు మరి నేను బ్రతికి ఉంటే మాత్రం ప్రయోజన మేమిటి? తమవంటివారికే దయ కలగనప్పుడు ఇక నా కావేరి తల్లి ఒక్కటే దిక్కు!"

ఆ ప్రతి సమాధానం విన్న మరికొంతసేపటివరకు ఆ యతీశ్వరుని నోట మాటే వెలువడలేదు. తిరిగి నిశ్చల దృష్టితో ఆమె ముఖంవైఖరి పరిశీలించి చల్లని పలుకులతో సమాశ్వా సించాడు :

"తప్పు! తల్లీ! అలాగ మాట్లాడకూడదు! ఇంతకి ఆ శ్రీరంగశాయి సంకల్పం ఎటువైపు తిరుగుతున్నదో ఎవరు

చెప్పగలరు? కొంచెం ఓరిమి వహించి ప్రతిదినము సాయం కాలం స్వామిని సేవించుకొని మనసారా ధ్యానించుకో! ఆ కృపానిధి పాదపద్మా లాశ్రయించినవారి కెన్నడు అశుభం కలగ లేదు. అనవసరంగా ఆరాటపడి కుంగి కృశించి నందువల్ల ప్రయోజన మేమి ఉన్నది!"

ఆ ఓదార్పుతో హేమసుందరి కొంచెం తేరుకొన్నది. కాని ఆయన కొంచెం మందలిస్తే రంగనాయకుడు బాగా దారిని పడగలడని ఆమె ఎంతో ఆశించింది. అదే నిరీక్షతో అక్కడికి వచ్చింది. కాని ఆయన నోట అటువంటి మాటే వెలువడ లేదు! అందుచేత కొంచెం తలవంచుకొని బాగా తటపటా యిస్తూ తన లోలోపలి కోరిక వెల్లడించింది:

"తప్పక ప్రతిదినము స్వామిని సేవించుకొంటాను. అయితే తమ రొక్కసారి వారిని కొంచెం మందలిస్తే..."

అంతలోనే రామానుజుని పెదవులపై దరహాసితం తరళించింది:

"అమ్మా! మానవమాత్రులం, మనవల్ల ఏమవుతుంది? అంతా ఆ స్వామి దయ! ఇంతకి ఏది ఎలాగ జరగవలసి ఉంటే అది అలాగ జరుగుతుంది. అయితే ఇక్కడ అనవసరంగా కాల క్షేపం కానీయవద్దని అతనితో అంటానులే. దానికేమి!"

రామానుజుని ముఖతః హేమ మనసారా ఆశించిన ప్రతి సమాధానం రాలేదు. ప్రతి మాట బాగా తూచి తూచి వాడిన, "ఇక్కడ అనవసరంగా కాలక్షేపం కానీయవద్దని అతనితో అంటానులే! దానికేమి!" అన్న ప్రత్యుత్తరం

మాత్రమే వెలువడింది. అది ఆమె కేమాత్రం సంతృప్తి కలిగించలేదు! అయినా మరి చేయగలిగిన దేది లేక ఉసూరుమని నిశ్వసించి రామానుజుని కెంతో భక్తితో సాగిలపడి నమస్కరించి సెలవు తీసుకుని తన భవంతికి తరలిపోయింది.

ఆమె అక్కడికి రాకపూర్వమే రంగనాయకు డింటికి చేరుకొన్నాడు. వీథి గుమ్మంలో హేమ కనబడకపోయేసరికి అతనికి కొంచెం ఆశ్చర్యంవేసింది. అంతలోనే దాసి అతనిని సమీపించి "ఇప్పుడే వస్తానని చెప్పి అమ్మగారెక్కడికో వెళ్ళారు బాబూ! ఎందుచేతనోగాని ఇంకా రాలేదు మరి!" అన్నది.

"మిట్టమధ్యాహ్నవేళ ఇరుగుపొరుగుల ఇళ్ళకు వెళ్ళడం హేమ కలవాటులేదే! ఎక్కడికి వెళ్ళింది చెప్మా!" అని వితర్కించుకొన్నాడు రంగనాయకు డెంతో ఆశ్చర్యపడి.

మరికొంతసేపటికి హేమ ఇంటిలో అడుగుపెట్టింది. రంగనాయకుడు ఆమె కెదురుగా వెళ్లి కొంచెం తటపటాయిస్తూ ఎంతో ఆత్రంగా అడిగాడు:

"ఎక్కడికి వెళ్ళావు హేమా!"

"పొద్దుటినించి ఏమీ తోచక ఒకసారి మఠానికి వెళ్ళి రామానుజుల దర్శనం చేసుకుని వచ్చాను."

హేమసుందరి తలవంచుకొని ఎంతో ముభావంగా సమాధానం చెప్పింది. తమ కుటుంబం గొడవ హేమ ఆయన దగ్గర వెళ్ళబోసుకొని ఉండవచ్చునని రంగనాయకు డనుమానించాడు.

కాని ఆ భావం రవంతయినా వ్యక్తం కానీయలేదు. పైగా ఆత్మీయత ఉట్టిపడుతున్న ప్రసన్న వైఖరితో ప్రశ్నించాడు:

"నాతో రమ్మంటే ఎప్పుడు వచ్చావు కాదుగదా!... సరేలే, దీని కేమిగాని ఇంతకి ఏమన్నారాయన?"

మఠంలో జరిగిన వివరాలన్ని తెలుసుకోవాలని అత డెంతో ఆతపడ్డాడు. అనేక విధాల ప్రశ్నించాడు. అయితే హేమ ఆ వివరా లేవి రంగనాయకుని కెరిగించలేదు.

"అనడాని కేమి ఉంది? వారి దర్శనం చేసుకుని ప్రసాదం తీసుకున్నాను. ప్రతిదినము సాయంకాలం స్వామి దర్శనానికి వెళ్ళమన్నారు. అంతే!"

రంగనాయకుని కా ప్రత్యుత్తరం కొంతవరకు సంతృప్తి కలిగించకపోలేదు. అందుచేత దినదినము తప్పక దేవాలయానికి వెళ్ళవలసినదని ప్రోత్సహించాడు. ఆనాటినించి అతని రాక పోకలను గురించి ఆమె ఎన్నడు ప్రశ్నించలేదు. లోలోపల ఎంతగా మథనపడుతున్నా పైపైకి చిరునవ్వుల చెంగలింపుల తోనే ప్రత్యుత్తరా లిచ్చింది. హేమ కొండంత ఆశతో రామానుజయతిని సందర్శించింది. ఆయన ఏ సంగతి ఇతమిత్థమని విస్పష్టంగా తేల్చి చెప్పలేదు. అందుచేత రంగనాయకు డెప్పటి కయినా తనని దిక్కులేని దానిని చేసి తన దారిని తాను తరలి పోగలడేమో అని లోలోపల చాలా భయపడింది. అందుచేత ఏ విధంగా నయినా అతని మనస్సు నొప్పించడంవల్ల వ్యవహారం మరింతగా ముదిరి చెయ్యిదాటి పోగలదేమో అని ఆందోళన పడింది. కనకనే స్వామిని సేవించుకోవలసినదన్న రామానుజుని

ఆనతి అక్షరశః శిరసావహించింది. ప్రతిదినము ఫల పుష్పాలతో అర్చన జరిపించింది. అర్చకులందరు వెళ్ళిపోయేవేళ సమీపించినా స్వామి సమక్షంలో ప్రగాఢ భక్తితో సాగిలపడి దోసిలి కట్టి తన దుర్భర మనోవేదన వెళ్ళబోసుకొన్నది. దిక్కులేని దీనురాలికి రవంత దారి చూపించి ఆదుకుని కాపాడవలసినదని ప్రాధేయపడింది.

# 24

రంగనాయకుడు రామానుజ మఠ ప్రాంగణంలో అడుగుపెట్టిననాడే అతనిని గూర్చి పుకారు లొకటి రెండు బయలుదేరాయి. క్రమక్రమంగా అతని యెడల ఆచార్యుని వాత్సల్య దృష్టి అతిశయించిన కొద్ది అవి మరింతగా విజృంభించాయి. రంగనాయకుని భుజంమీద అలవోకగా ఆనుకొని రామానుజు డెంతో ఆత్మీయతతో ప్రసంగిస్తూ శ్రీరంగేశుని సందర్శనంకోసం బయలుదేరడం మొట్టమొదట మఠ బ్రహ్మచారులలో కొందరి కెంతో విడ్డూరంగా కనబడింది. అయితే ప్రముఖులయిన అంతేవాసు లెవ్వరు దానికంతగా ఆశ్చర్యపడ లేదు. ఆశ్రయించిన అనుచరుల యెడల రామానుజుని అపూర్వాదరణ ధోరణు లింతకు మునుపు వా రెన్నోమారులు తామై స్వయంగా పరిశీలించారు. అందుచేత మరి కొన్నాళ్ళవరకు కేవలం తటస్థదృష్టితో తమ కేమి పట్టనట్టు మాట్లాడ కూరు కొన్నారు. కాని క్రమక్రమంగా రంగనాయకుని యెడల రామానుజుని వాత్సల్య వైఖరి బాగా మితిమీరిన పిమ్మట వారిలో వారి కా విషయమై కొంత మథన బయలుదేరింది.

రామానుజుని అనుచరులలో కొందరు బ్రహ్మచారులు. చాలా కాలం బ్రహ్మచర్యవ్రతం నిర్వర్తించిన పిమ్మట గాని సన్యాస దీక్ష లభించదు. మరి కొందరు గృహస్థులు. వారెవ్వరు మఠంలో నివసించరు. మరికొందరు సమస్తము పరిత్యజించి సన్యాసం స్వీకరించిన యతీశ్వరులు. ఇక మఠానికి వచ్చిపోయే శ్రీరంగ పౌరులలో చాలమంది సదాచార తత్పరులయిన సజ్జనులు.

మొట్టమొదట రంగనాయకుని పుట్టు పూర్వోత్తరాలేవి వారెవ్వరికి తిన్నగా తెలియలేదు. కాని క్రమక్రమంగా అతనిని గూర్చిన యథార్థ విషయాలు కొన్ని కొంతవరకు విస్పష్టంగా తెలిశాయి. వేషభాషలను బట్టి అతడెవరో సామాన్య కర్షకుని కుమారుడని వారూహించుకొన్నారు. ఆనాటికానాటికి నిచుళాపురంనుండి శ్రీరంగంవరకు పాకివస్తున్న పుకారులవల్ల తామూహించినవి యథార్థాలే అని వారందరు ధ్రువపరుచుకొన్నారు. ఇక హేమసుందరి అతని భార్య కాదనీ, నిచుళాపురంలో పేరెన్నికగన్న వారాంగన శృంగారమంజరి పెంపుడు కుమార్తె అనీ కనిపెట్టడానికి వారికెంతోకాలం పట్టలేదు. బాహాటంగా ఆ వేశ్య నింటపెట్టుకొన్న అటువంటి మోటుమనిషి యెడల రామానుజుల కంతటి ఆత్మీయత ఏర్పడడం శిష్యులలో కొంతమంది కేమాత్రము సరిపడలేదు.

మఠంలో నివసిస్తున్న అంతేవాసులలో దాశరథి రామానుజుని కతి సన్నిహితుడైన బంధువు. తర్క వ్యాకరణాది శాస్త్రాలారింటితోబాటు ద్రావిడ వేద పాశురాల రహస్యా

లా బాలాగ్రంగా మథించిన మహా మనిషి. అత డంతగా పొడగరి కాదు. రవంత హ్రస్వాకృతి. దృఢశరీరుడు. సంపెంగవంటి సమున్నత నాసిక కిరువైపుల అమర్చినట్టున్న గుండ్రని నేత్రాలలో గట్టి పట్టుదల, నిరంతర కార్యదీక్ష కొట్టవచ్చినట్టు స్ఫురిస్తాయి. మఠంలో నివసిస్తున్న శిష్యు లందరిలోను చిన్న అయినా ఒక్కొక్కప్పుడు రామానుజు లతనితో పాశురాల వ్యాఖ్యానాలపై చర్చ సాగిస్తున్నప్పుడు పెద్దలు కొందరు ఆశ్చర్య విస్ఫారిత నేత్రాలతో ఆలకిస్తూ ఉంటారు. మఠం చుట్టు ఉన్న పూదోట సంరక్షణం, ఆచార్య సందర్శనార్థం వచ్చిన అతిథుల ఆదరణ అతని దైనందిన విధికృత్యాలు. కాని రామానుజుని పరిచర్యపై దాశరథి కెనలేని మక్కువ. అతని వయస్సింకా నాలుగు పదు లతిక్రమించలేదు. కాని ఇంచు మించుగా ఇరవై సంవత్సరాలకు పూర్వమే సన్యసించి రామానుజ యతీశ్వరుని అడుగుజాడ లనుసరించాడు.

ఇటీవల హేమసుందరీ రంగనాయకుల యెడల ఆచార్యుని అత్యద్భుత వాత్సల్యం పరిశీలించిన కొద్ది దాశరథికి ఆయన జీవితపథంలో చాలా కాలం క్రితం సంఘటిల్లిన ఒక విషాదమయ సన్నివేశం జ్ఞప్తికి వచ్చింది. అది సంస్మరించగానే దాశరథి విలోచనాంతాలలో వేడివేడి కన్నీటి బిందువు లావిర్భవించాయి. అది ఆచార్యుని ధర్మపత్ని తంజమాంబ మనుగడలో ఎదురు పడిన దుర్భర దుఃఖ సంఘటన.

రామానుజుడు అప్పటికింకా సన్యసించలేదు. తంజమాంబ శీలవతి; సౌందర్యవతి. వట్టి అమాయకురాలు. భర్త మాట కెన్నడు ఎదురాడని పరమసాధ్వి. కాని ఆచారాల

యెడల ఆమె కెనలేని పట్టుదల, అభినివేశము. అంతటి వెర్రి చాదస్తం కూడదని రామానుజుడు ఒకటి రెండుమారులు కొంచెం గట్టిగానే హెచ్చరించాడు. అప్పటినుండి ఆమె భర్త ఆనతి అక్షరశః అనుసరించవలెనని నిశ్చయించుకొన్నది. కాని తీరా ఆచరణలో మాత్రం పుట్టింట, అత్తవారింట తాత ముత్తాతల కాలంనించి అనూచానంగా అనుసరిస్తున్న సదాచార సంప్రదాయా లొకించు కయినా అతిక్రమించలేకపోయింది.

కాంచీపూర్ణుడు కాంచీనగరంలో వరదరాజస్వామి పరమ భక్తాగ్రణి. సామాన్యుల దృష్టిలో దేవాలయంలో స్వామి మూర్తి కేవల శిలాప్రతిమవలె గోచరించవచ్చును. కాని కాంచీపూర్ణునికి మాత్రం వరదరాజస్వామి సదాజాజ్వల్యమాన మయిన చైతన్యంతో తొణికిసలాడుతున్న ప్రత్యక్ష దైవతము! తెల్లవారు జాము మొదలుకొని రాత్రివరకు వరదుని పరిచర్యా దృష్టి తప్ప కాంచీపూర్ణుని కింకొక ధ్యాస లేదు. ఆ భక్తాగ్రణి పొద్దుటి వేళ కొంచెం ఎండ ముదరగానే స్వామి కేమయినా అసౌఖ్యం కలిగినదేమో అని గజగజ వణికిపోయేవాడు! ఎంతో అడకువతో వింజామరతో సేవిస్తూ ఏకాగ్రదృష్టితో స్వామి ముఖంవైపవలోకించేవాడు.

ఆ పరమభాగవత శిఖామణిని సందర్శించినప్పటినించి ఆయన ముఖతః అష్టాక్షరీ మంత్రం స్వీకరించవలెనని రామానుజుని ఎడదలో విపరీతమయిన తహతహ విజృంభించింది. అంతేవాసిగా స్వీకరించి అనుగ్రహించవలసినదని అనేక పర్యాయాలు పదాలపై వాలి ప్రార్థేయపడ్డాడు. అయినా కాంచీపూర్ణుడా ప్రార్థన ఆలకించనట్టే మాట్లాడ కూరుకొన్నాడు. అంతేగాని

"వా రిప్పుడే మీకోసం వెళ్ళారు. మీరు కనబడక పోయేసరికి మాడవీధులన్నీ గాలిస్తున్నారో ఏమో! లేకపోతే ఈపాటికి తిరిగి రావలసినదే! ఏమయినా వచ్చే వేళయింది. ఇక ఆట్టే ఆలస్యం కాదు."

కాని కాంచీపూర్ణుడిక వేచి ఉండలేక కాదు కూడదని పట్టు పట్టడంవల్ల మరి తిరస్కరించలేక వంటఇంటి కవతల చావడిలో ఒక వివిక్త ప్రదేశంలో విస్తరివేసి వడ్డించింది. వంటకా లొకటొకటే తెచ్చి వడ్డంటున్నా సావకాశంగా భోజనం చేయవలసిదని బ్రతిమాలుకొన్నది. కాని కాంచీ పూర్ణుడు తొందర తొందరగా తన భోజనం ముగించుకొన్నాడు. తిన్న విస్తరి తానే ఎత్తి దూరంగా పారవేసి, గోమయంతో ఆ ప్రదేశం అంతా జాగ్రత్తగా అలికి శుభ్రంచేసి తిరిగి వరద రాజస్వామి సన్నిధికి వెళ్ళిపోయాడు! తంజమాంబ కాంచీ పూర్ణుడు తినగా మిగిలిన వంటకాలలో రవంతయినా మిగల నీయలేదు. అవి అన్నీ పనిమనిషి కిచ్చివేసింది. తిరిగి స్నానం చేసి, మడి కట్టుకుని అతి త్వరితంగా భర్తకోసం వంట ప్రారంభించింది. అంతలోనే రామానుజుడు తిరిగివచ్చి భార్యముఖతః జరిగిన వృత్తాంతం యావత్తు విని మరి తన కన్నులే నమ్మలేక నిశ్చల పాషాణ ప్రతిమలా నిర్ఘాంతపడి రెండు చేతులతోను తల గట్టిగా పట్టుకుని దుర్భర మానసిక వ్యధతో అట్టుడికినట్టుడికి పోయాడు:

"అయ్యో! నే నీవేళ ఆ పరమ భాగవతోత్తముని పాదాల సాన్నిధ్యంలో భుక్త శేషం ఆరగించవచ్చునని ఎంతయినా ఉవ్విళ్లూరిపోయానే! ఎంతటి ఘోరాపచారం

జరిగిన దీవేళ! అయ్యో! నే నెంతటి దురదృష్టవంతుడనో కదా!"

రామానుజుడు మరికొంత సేపటివరకు లోలోపలే కుమిలి కుమిలి పలవించాడు. అంతకుమునుపు తంజమాంబ కాయన సంకల్పం రవంతయినా తెలియలేదు! అయినా తన తప్పిదం మన్నించవలసినదని ఉప్పొంగుతున్న డగ్గుత్తికతో దోసిలికట్టి వేడుకొన్నది. కాని రామానుజు డామె విజ్ఞప్తి ఆలకించినట్టే గోచరించలేదు. అంతేకాదు! ఆ నాటి కిక అన్నపానాలే ముట్టలేదు.

ఇంకొకమారు మంగలి ఒకడు రామానుజునికి అభ్యంగన స్నానం చేయించడం కోసం వచ్చి వాకిట నిలుచున్నాడు. వానివైపు చూడగానే రామానుజుని నిండు గుండె ద్రవించింది! అన్నమో! రామచంద్రా! అంటున్నది ఆ మంగలి దీనాతిదీన క్షీణదృష్టి! "గడచిన రెండు మూడు నాళ్ల నుండి ఒక్క అన్నం మెతుకయినా నోట పెట్టుకోలేదేమో!" అని ఎంతో జాలి పడ్డాడు రామానుజుడు! వెంటనే గృహిణిని పిలిచి ఇంత అన్నం పెట్టవలసినదని ఆదేశించాడు. అప్పటికే మడి కట్టుకుని వంట ప్రారంభించిన తంజమాంబ—

"ఇప్పుడే నేను వంట ప్రారంభించాను! ఇంతలో అన్నం ఎక్కడినించి వస్తుంది?" అన్నది. ఆ పైన పోనీ కొంచెం చద్ది అన్నమైనా ఉంటే పెట్టమని రామానుజు డన్నాడు. తంజమాంబ అది విని రవంత విసుగుదలతో "మన యింట చద్ది ఆరగించేవా రెవరున్నారు? అది మాత్రం ఎక్కడినించి వస్తుంది?" అని తన పనిపాటలలో మునిగిపోయింది. రామానుజు డామాటకు కేవిధంగాను ప్రత్యుత్తర మీయలేదు! వంట ఇంటి

లోలోపలికి వెళ్లి పాత్రలన్ని మిక్కిలి మెళకువతో పరిశీలించాడు. ఎక్కడో ఒక గిన్నెలో ఆ మంగలికి చాలినంత అన్నం కనబడింది. వెంటనే ఆ క్షుధార్తుని కది పెట్టినపిమ్మటే తన అభ్యంగన స్నానం ముగించుకొన్నాడు. అంతేకాని గృహిణి నొక పల్లెత్తుమాటయినా అనలేదు!

మరికొంత కాలం గడచిన తరువాత రామానుజునికి మరింతగా మనస్తాపహేతువయిన ఇంకొక సంఘటన జరిగింది.

అలాగలాగ మరికొన్నాళ్లు గడచిన పిమ్మట రామానుజుడు మహాపూర్ణుడన్న శ్రీవైష్ణవాచార్యునివద్ద అష్టాక్షరీమంత్రంతో పాటు వాలాయిర ప్రబంధమన్న నాలుగు వేల ద్రావిడ వేద పాశురాల పరమరహస్యాలు విశేషార్థాలతో బాటు ఆమూలాగ్రంగా అధ్యయనంచేసి ధన్యుడ నయినానని ఆనందించాడు. ఆ సమయంలో ఆచార్యుడు, అంతేవాసి రామానుజుడు కాంచీపురంలో ఒకే గృహంలో నివసించేవారు. మహాపూర్ణుడప్పటికి బాగా పెద్దవాడయినాడు, మిక్కిలి వృద్ధురాలయిన ధర్మపత్ని తప్ప ఆయన కిక నా అన్నవారెవరు లేరు! అయితే రామానుజుడు ఆయన కేవిధమయిన కొదవ కలగనీయలేదు. కన్న కుమారునివలె అనుదినము నిరంతరభక్తి శ్రద్ధలతో పరిచర్య లాచరించాడు.

ఒకనాటి ఉదయం ఆచార్య శిష్యుల గృహిణు లిద్దరు తాళ్లతో మూతులు బిగించిన చిన్నచిన్న బిందెలతో తమ ఇంటి కల్లంత దూరంలో ఉన్న బావిలో నీళ్లు తోడుకుంటున్నారు. ఆ సమయంలో మహాపూర్ణుని పత్ని బిందెలో నీళ్లు కొంచెం తొణికి రెండు మూడు చుక్కలు తంజమాంబ మడి

నీళ్లు బిందెలో పడ్డాయి. దానితో ఆమె తన బిందెలో నీళ్లొక్క చుక్కయినా మిగలకుండా నేలమీద గుమ్మరించింది. ఆచార్య పత్ని వైపు చురచుర చూసి పరుషస్వరంతో రుసరుస లారంభించింది:

"ఏమమ్మా! అంత బొత్తిగా కన్నూ మిన్నూ కానకపోతే ఎలాగ! చూడు! నీ మూలాన కష్టపడి తోడుకున్న బిందెడు నీళ్లు నేలపాలయిపోయాయి! గురుభార్య వయినంతమాత్రన గుండెమీద కుంపటిలా కూర్చోవాలా! కాస్త మా నాయన గారు అహితాగ్ని లన్నమాటయినా గమనించపోతే ఎలాగ? ఇంతకీ నిన్నననవలసిన పని ఏమి ఉంది? అత్తింట అడుగుపెట్టి నప్పటినించి మా ఆచారాలు, సంప్రదాయాలు అన్ని మంటకలిసి పోతూనే ఉన్నాయి. ఇప్పుడిక ఏమనుకుంటే మాత్రం ఏమి లాభం! నుదుటిమీద రాత ఇలాగ ఉన్నతరువాత?"

వాస్తవానికి మహాపూర్ణుని భార్య చేసినది అంతగా ఎలుగెత్తి ఉట్టంకించదగినంత పెద్ద తప్పిదంకాదు. కాని తంజమాంబ వంటి సదాచారశీల దృష్టిలో అది గొప్ప అపరాధమే! అందు చేత ఆ పండు ముత్తయిదువ కొంతవరకు ఏదోవిధంగా సమాధానపడి తన పొరపాటు మన్నించివలసినదని వేడుకొన్నది. తిరిగి నీళ్లు తోడుకోవలసినదని బ్రతిమాలుకొన్నది. అయినా తంజమాంబ ఏమాత్రము శాంతించలేదు. వట్టి బిందె మాత్రమే బుజానపెట్టుకుని గిరుక్కున వెనక్కి తిరిగివెళ్లిపోయింది. ఆ ధోరణి గమనించి మహాపూర్ణుని భార్య ఎంతో ఆందోళనపడి భర్తతో ఆనాడు బావి దగ్గిర జరిగిన సంఘటన అంతా పూసగుచ్చినట్టు చెప్పింది. మహాపూర్ణు డది విని శిష్యున కది తెలిసిన

పక్షంలో ఎంతో నొచ్చుకోగలడనీ, ఆ తరువాత తంజమాంబ ఎడల అతని కెంతయినా వైమనస్యం కలగవచ్చుననీ భయపడి వెంటనే అక్కడినించి కదిలి వేరొక చోటికి వెళ్లిపోవాలని నిశ్చయించుకొన్నాడు. తిరుపతి, కంచీ, శ్రీరంగము ఆళ్వారులనాటినించి శ్రీవైష్ణవుల కత్యంత పునీతములయిన పుణ్యక్షేత్రాలు. అందుచేత ఆ మరునాడే భార్యతో కలిసి ముమ్మొందుగా తిరుపతి సేవించుకొని అనతికాలంలోనే శ్రీరంగం చేరుకొన్నాడు. ప్రయాణానికి పూర్వం చూచాయగా నయినా రామానుజునికి తన సంకల్పం తెలియనీయలేదు. మహాపూర్ణునికి అంతేవాసి యెడల గల ఆత్మీయదృష్టి అట్టిది!

ఆచార్యు డగస్మాత్తుగా కంచివిడిచి వెళ్లిన తరువాతగాని రామానుజుని కా విషయం తెలియలేదు. వరదరాజస్వామిని సేవించుకొని మిట్టమధ్యాహ్నం వేళ ఇంటికి తిరిగివచ్చిన తరువాత వృద్ధు లయిన ఆచార్య దంపతు లిద్దరు ఇంట కనిపించకపోయేసరికి అతని కది ఒక పెద్ద పిడుగుపాటయింది! తంజమాంబ తన మాటలవల్ల అంతటి విడ్డూరం జరగగలదని కలలో నయినా ఊహించి వుండలేదు. అందుచేత ఆమె కా సంఘటన ఎంతో మనస్తాపం కలిగించింది. "గుండెమీద కుంపటి" వంటి మాట తన నోటినుండి వెలువడినందు కెంతయినా పశ్చాత్తాప పడింది. కాని ఏమి లాభం! అంతలో భర్త వచ్చి ఆ విషయం ప్రశ్నించాడు. ఆమె జరిగిన సంగతి అంతా యథాతథంగా చెప్పివేసింది. తన తప్పిదం మన్నించవలసినదని తిరిగి పరిదీన స్వరంతో బ్రతిమాలుకొన్నది. కాని రామానుజు డిక లోలోపల నుండి భగ్గుమని ప్రజ్వలించిన తీవ్ర క్రోధావేశం నిగ్రహించుకోలేక

శక్తికొద్ది చేతులతో శిరస్సు మొత్తుకొన్నాడు. చెక్కిళ్ళపై ప్రవహిస్తున్న కవోష్ణ బాష్పాలతో తిరిగి తిన్నగా వరదరాజ స్వామి ఆలయం వైపు వెళ్ళిపోయాడు. మరి ఆనాటిక భార్య ముఖంవైపే చూడలేదు.

అప్పటినించి తంజమాంబ భర్తయెడల మిక్కిలి భయ భక్తులతోనే మసులుకొన్నది. కాని ఆమెమీాద తలవనితలంపుగా పెద్ద పిడుగుపడినట్లొక ఘోరాపద విరుచుకుపడింది.

ఆ మరునాడు కూడా రామానుజుడామెతో సంభా షించలేదు. అందుచేత తంజమాంబ భరించరాని దుఃఖావే శంతో కుంగి కృశిస్తున్నది. ఆపైన కొంచెం ముసురు పట్టడం వల్ల ఎన్ని విధాల ప్రయత్నించినా పొయ్యి రాజుకోలేదు. ముఖం కుంకుమరాశిలా ఎర్రబడింది. కాటుక కన్నీరు చెక్కిళ్ళపై ధారకట్టి ప్రవహించింది. ఇంటినిండా దట్టంగా పొగ అలుము కొన్నది. శుభమల్లే ఈవేళ ఇదేమి అపశకునమో మరి! అని తంజమాంబ ఎంతయినా మథనపడింది. రామానుజుడు తెల్ల వారకమునుపే లేచి నాథస్వామి పుష్కరిణివైపు వెళ్ళి పోయాడు. ఇంచుమించుగా రెండు జాముల వేళ అతిక్ర మిస్తున్నా అత డింటికి చేరుకోలేదు. తంజమాంబ ఆ తల పోతతో లోలోపల కుమిలి కుమిలి దుఃఖిస్తున్నది. అదే సమ యంలో పొయ్యి అదే పనిగా ఊదడంవల్ల నిప్పు నెరసొకటి ఎగిరి కుడి కంటిలో పడింది.

అంతలోనే ముక్కాలి ముదుసలి బ్రాహ్మణు డొకడు ఆతిథ్యంకోసం తలుపుతట్టి గొంతెత్తి ఆక్రోశించాడు. అసలే పొయ్యి రాజుకోక పొద్దుటినించి సతమతమవుతున్న తంజమాంబ

అది విని "బాబూ ! ఇదేమి కర్మమోగాని ఈ వేళ ఎంతసేపటికి పొయ్యి రాజుకోవడంలేదు. నేటికి అగ్రహారంలో ఇంకొకరి ఇంటి కెక్కడికయినా వెళ్ళండి !" అని అనునయగర్భిత స్వరంతో ఆదేశించింది. ఆ ముక్కాలి ముదుసలి ఉసూరుమని నిట్టూర్చి "పోనీ, స్వామి దేవాలయంలో నయినా పట్టెడుప్రసాదం లభించ గలదేమో !" అన్న ఆశతో అటువైపు తరలిపోయాడు.

దేవాలయం సింహద్వారం దాటి లోపల అడుగు పెట్ట గానే రామానుజు డాతని కెదురుపడి ఎంతో ఆప్యాయంగా ప్రశ్నించాడు:

"ఇదేమిటి ! బాబూ ! ఇంత నీరసంగా కనుపిస్తున్నారు. ఇంతవరకు భోజనమే చెయ్యలేదా ఏమిటి ?"

రామానుజుడు అతనికి కొంచెం పరిచితుడు. అందుచేత ఆకటి చిచ్చు నిగ్రహించుకోలేని ప్రగాఢ గద్గదికతో తన యధార్థస్థితి వెల్లడించాడు:

"లేదు నాయనా ! నిన్న రాత్రికూడా పచ్చి మంచినీళ్ళ తోనే కాలక్షేపం చేశాను. ఏమిచెయ్యను ? ఇప్పుడిప్పుడే మీా ఇంటికి వెళ్ళాను. వీలుపడ దన్నారు. మరి గత్యంతరం లేక..."

రామానుజు డా ప్రతి సమాధానం విని రెండు మూడు నిమిషాలపాటు తనలో తానేదో ఆలోచించుకొన్నాడు:

"అదేమి మాట ! ఎందుకు వీలుపడదు ? మా ఇంట భోజనం చేసి వెళ్ళుదురుగాని ఉండండి ! ఇప్పుడే వస్తాను."

ఒక అరగడియలోగానే తిరిగి రామానుజు డొక తాళ పత్ర శుభలేఖతో తిరిగి అక్కడికివచ్చి పచ్చి కొబ్బరి బొండము,

పంచెల చాపు, చీర, పసుపుకుంకుమ ఆయన చేతిలో ఉంచాడు. నెమ్మదిగా బ్రతిమాలుకొన్నాడు:

"వెంటనే వీటితో బాటు ఈ శుభలేఖ తీసుకుని వెళ్లి మా ఇంటిలో ఇవ్వండి! ఇది తిరుచానూరినించి వచ్చినదని చెప్పండి. కొంచెం పనిచూసుకుని త్వరగానే నే నక్కడికి వస్తున్నాని చెప్పండి! మన మిద్దరము కలిసి భోజనం చేద్దాము!"

భోజనం మాట వినగానే ఆ వృద్ధ బ్రాహ్మణునికి ప్రాణం లేచివచ్చింది. తొందర తొందరగా అడుగులు వేసుకుంటూ తిరిగి రామానుజుని గృహం వైపు సాగిపోయాడు. ఆ శుభలేఖ చూడగానే తంజమాంబ పట్టరాని ఉల్లాసంతో ఉబ్బి తబ్బిబ్బయింది. అది ఆమె చెల్లెలి వివాహ మహోత్సవాహ్వాన పత్రిక. వెంటనే తంజమాంబను పుట్టింటికి పంపించవలసినదనీ, ఏమాత్రం వీలున్నా తప్పక ఆమెతో బయలుదేరవలసినదనీ ఆమె తండ్రి అల్లుని పేర వ్రాసిన శుభాహ్వాన మది.

తంజమాంబ ఎంతోకాలంనించి పుట్టింటి కొకమారు వెళ్లవలెనని ఉబలాటపడుతున్నది. చెల్లెలి వివాహ మన్నమాట చెవిని పడగానే కొండంత సంతోషంతో వెంటనే ప్రయాణ సన్నాహా లారంభించవలెనని నిశ్చయించుకొన్నది. అవిసె నూనెతో ముంచిన గుడ్డలే కట్టెలుగా వాడి అతి త్వరితంగా వంట ముగించుకొని అనుక్షణము భర్త రాకకోసం నిరీక్షించింది. రామానుజు డింటిలో అడుగు పెట్టగానే భర్తతో బాటు అతిధి కెంతో ఆదరంతో అన్నం వడ్డించింది. భోజనా లయిన తరువాత తనతో కలిసి పుట్టింటికి రావలసినదని ప్రాధేయపడింది. ఆ శుభసమయంలో నయినా తన తప్పిదాలు మన్నించ

వలసినదని తొణికిస లాడుతున్న డగ్గుత్తికతో ప్రతిమాలు కొన్నది. భర్త ముఖభంగిమలో ప్రసన్నత గోచరించగానే తనతో బాటు పుట్టింటికి రాగలడని ఎంతో సంబరపడింది.

కాని రామానుజు డార్ద్రహసితంతో తన అశక్తత వెల్ల డించాడు:

"తిరుమల సేవించుకొంటున్న కాంచీపూర్ణులు నేడో రేపో తిరిగి ఇక్కడికి రానున్నారు. ఆ తరువాత ఆయన త్వరలోనే తిరిగి శ్రీరంగం వెళ్లిపోతున్నారు. ఆయన స్వయంగా తా మిచ్చ టికి విజయంచేస్తున్నామని కబురు పంపించారు. ఈ పరిస్థితిలో నా కేమి పాలుపోవడంలేదు! ఈయన నీకు నాకు సాక్షాత్తు తండ్రివంటివారు. వీరితో కలిసి ఈసారికి నువ్వు ఒక్కతెవే అక్కడికి వెళ్ళి బంధువు లందరిని చూసిరా! అత్తవారికి, మామగారికి నా నమస్కారాలని చెప్పడంమాత్రం మరిచిపో వద్దుసుమా! ఎన్నెన్నివిధాల ప్రయత్నించినా రాలేకపోయి నానని చెప్పి మన్నించవలసినదని వేడుకో!"

తంజమాంబ తిరిగి బలవంతం చేసింది గాని ప్రయోజనం లేదని గ్రహించుకుని ఉసూరుమని నిట్టూర్చి భర్త పాదాలు రెండు కళ్ళ కద్దుకొని ఆ వృద్ధబ్రాహ్మణునితో కలిసి పుట్టింటికి ప్రయాణమయింది. రెండెడ్ల బండిమీద కాంచీపుర పొలిమేర వరకు వా రిద్దరిని సాగనంపిన తరవాత రామానుజు డుసూరుమని నిట్టూర్చి తిరిగి తన ఇంటికి వెళ్ళిపోయాడు. ఆ మరునా డుద యమే లేచి వరదరాజస్వామిని సందర్శించి విరజా హోమం యథావిధిగా నిర్వర్తించి కాషాయాంబరధారణతో మనోవా క్కాయ కర్మల నిరంతరం విగ్రహానికి చిహ్నమయిన త్రిదం

డంతో సన్యాసాశ్రమం స్వీకరించాడు. తన జన్మ తరించిందని అమందానంద భరితుడయినాడు. కాని తానే కల్పించి లిఖించిన శుభలేఖతో తంజమాంబ నావిధంగా మభ్యపెట్టి పుట్టింటికి పంపించవలసి వచ్చినందుకు లోలోపల ఇనుమిక్కిలిగా కించపడక పోలేదు. అయితే దైవ ప్రేరేపణ ఆ విధంగా పరిణమించి నప్పుడు తా నిక చేయగలిగిన దేది లేదని తిరిగి కొంతవరకు సమాధాన పడ్డాడు.

దాశరథి కీ వృత్తాంతాలలో చాలావరకు సన్నిహిత బాంధవులవల్ల తెలిశాయి. మరికొన్ని శ్రీరంగంలో నివసిస్తున్న కొందరు వృద్ధ శిష్యుల ముఖతః విన్నాడు. ఎంతగా ఆలోచించినా అతనికి ఒక సదాచార పరత తప్ప తంజమాంబ యెడల ఎన్నదగిన అపరాధమేది కానరాలేదు! ఆ తప్పిదమయినా సాంప్రదాయికుల కెవరికి ఒక దోషంగా కనబడలేదు. పైగా గొప్ప సుగుణంగానే స్ఫురించింది. మరి అటువంటి సాధ్వి నన్యాయంగా ఒక కపటలేఖ సృష్టించి విడిచి పెట్టవలసినంత అక్కర ఏమి వచ్చింది? మహాపూర్ణుని వంటి ఆచార్యపురుషులే ధర్మపత్నులతో తమ వైష్ణవ ధర్మం పరిపాలించుకోవడంలేదా! ఆ సాధ్వి పాదధూళితో సరిపోల్చడానికయినా హేమసుందరి కేమాత్రము అర్హతలేదే! మరి ఆమె ఎడల, రంగనాయకుని యెడల ఆచార్యుని కింతటి ప్రగాఢ వాత్సల్యం పెంపొందడానికి కేమి కారణము?

రామానుజుడు సన్యసించిన మరికొంత కాలానికి దాశరథి ఏదో పనిమీద తిరుచానూరు వెళ్లి తంజమాంబ నొకమారు సందర్శించాడు. అతనిని చూడగానే ఆమె ముఖంమీద

చీరచెరగు కప్పుకుని క్షీణకంఠ స్వరంతో కుమిలి కుమిలి వల పించింది. హేమసుందరీ, రంగనాయకుల అదృష్టానికే మాత్రము దాశరథి అసూయపడలేదు. కాని హేమ ఆచార్యుని ఆదరం చూరగొన్నప్పు డతనికి తంజమాంబ దుర్భర దైన్యాక్రోశం తటాలున జ్ఞప్తికి వచ్చి శ్రుతికుహారాలలో ప్రతిధ్వనించింది! సన్యసించిన క్షణం నుండి రామానుజు డెన్నడు ఆమె మాటే తలపెట్టలేదు శ్రీరంగంలో గృహిణు లెందరో ఆచార్యుని సందర్శించి తమ నిగూఢ దుఃఖభారాలు తొలగించుకుంటు న్నారు. కాని తంజమాంబవంటి సాధ్వీమతల్లి ఆ మాత్రం చల్లని ఓదార్పు మాటలకైనా నోచుకోలేదు! ఇంతకి ఆమె చేసిన ఘోరాపరాధమేమి ఉన్నది?

ఆమె దుస్సహ మనోవేదన స్మరించినప్పుడు దాశరథి కొకొక్కమారు శ్రీ రామానుజుడు లక్ష్మణస్వామి దేవేరి ఊర్మిళాదేవి నీరస వియోగ దుఃఖం జ్ఞప్తికి వచ్చేది. పరమ కారుణికుడయినా ఆదికవి వాల్మీకి మహర్షి తన రామాయణంలో ఎక్కడ ఊర్మిళాదేవి గభీర శోకం మాటే ఉట్టంకించలేదు! భర్త అగ్రజునితో పాటు అరణ్యంలో నివసించినంతకాలం ఆమె ఆ వియోగయాతన కేవలం ప్రశాంతమానంతో, ఎడతెగని ఓరి మితో సహించింది. అదేవిధంగా మఠంలో పెద్ద లెవ్వరు మరి తంజమాంబ విషయమే సంస్మరించడంలేదు! రామానుజునివంటి కృపార్ద్రహృదయుడే ఆమె మాట పూర్తిగా విస్మరించినప్పు డితరు లెవ్వరు తంజమాంబ గోడే పట్టించుకోకపోవడంలో ఆశ్చర్య మేమి ఉన్నది? ఆ గాథ తలపెట్టినప్పుడు దాశరథి కొకొక్కప్పుడు రామానుజుని వంటి వజ్ర కఠిన హృదయుడలీ

లోకంలో ఇంకెవ్వరు లేరని అనిపించింది! అయినా హేమ సుందరీ, రంగనాయకుల యెడల ఏర్పడిన తన వైఖరి ఎన్నడు సూచనప్రాయంగా నయినా ఆచార్యుని కెరుకపడనీయ లేదు. ఇటీవల కొన్నాళ్ళ క్రితమే ఏదో ప్రసంగ సందర్భంలో గీర్వాణ కవి అనంతసూరితోను, కూరాగ్రహారాధిపతి కూరేశునితోను, మఠనిర్వాహణాధికారి యజ్ఞమూర్తితోను మాత్రమే ఆ విషయం కొంచెం ముచ్చటించాడు.

అయితే తమ తమ ప్రత్యేక ధోరణులను బట్టి మాత్రమే వారా విషయం పర్యాలోచించారు. అనంతసూరికి జీవితంలో ఎక్కడ ఎటువంటి అదృష్టము పట్టలేదు. మనోహర కంఠస్వరంతో మేళవించిన కవితామాధురి ఒక్కటే చిన్ననాటినుండీ ఒక పెన్నిధిలా తోడుపడింది. అయితే అతనికి విపరీతమయిన పర ధ్యానం. మరచిపోయిన వస్తువులు, వ్యవహారాలు, తిరిగి జ్ఞప్తికి తెచ్చుకుని వాని అన్వేషణలో, అనుసరణలోనే అతని ఆయుర్దాయంలో సగం భాగం గడిచిపోయింది! అయిదారుగురు, అన్న దమ్ములు, తల్లిదండ్రులు మొదలయిన ఆత్మీయుల నందరిని విడిచి అనంతసూరి పత్నితో కలిసి శ్రీరంగంలో వేరే ఒక చిన్నకుటీరంలో నివసిస్తున్నాడు. ఆ పూటయినా గడవనీయని, ఎడతెగని లేమితో తన మనుగడ కొనసాగించుకొంటున్నాడు. అయితే గీర్వాణ కవితాభిమానులు కొందరు అప్పుడప్పుడతనిని తగినంత ధనసహాయంతో ఆదుకోకపోలేదు. , కాని అతని చేతిలో ఎంత సొమ్మయినా ఆట్టేసేపు నిలవదు. అనంతసూరి కొంచెం పొడగరి, కోలముఖము, చీటికిమాటికి ఆవేశంతో చలించిపోయే గభీర విలోచనాలు. ఆచార్యుని యెడల అతని భక్తి అపారము. అందుచేత హేమసుందరీ, రంగనాయకులపై రామానుజుని

అపూర్వ వాత్సల్య ధోరణి అతని కంతగా విపరీతంగా కనిపించ లేదు. అదీగాక ఆయన లోతుగుండెల కదలిక ఎవ్వరికి తెలియ వని అతని గట్టి నమ్మిక. అందుచేత ఆ విషయాన్ని గురించి అత డంతగా పట్టించుకోలేదు.

ఇక కూరాగ్రహారాధిపతి కూరేశుడు శ్రీరంగం రాక పూర్వం పేరెన్నికగన్న సంపన్న గృహస్థుడు. కాని అతని కెంతకాలానికి సంతతి కలుగలేదు. ఎంత సంపత్తి ఉంటేమాత్రం! ఏం లాభం! నట్టింటపారాడే పసిపాప లేకపోవడంవల్ల అతని మహనీయ మందిరం బావురుమన్నది. కూరేశుడు తన అగ్ర హారంలో గొప్ప విద్వాంసుడన్న ప్రతిష్ఠ గడించుకొన్నాడు. అందుచేత శిష్య సంతతికి విద్యా దానంతో, అగ్రహార వ్యవ హారాల పర్యవేక్షణతో అతని కేదో విధంగా కాలక్షేప మయింది. కాని సంతాన దారిద్ర్యంతో అతని భార్య క్రమ క్రమంగా మతిలేని మనిషిలా మారిపోయింది. వారిద్దరికి భోగ భాగ్యాల కేవిధమయిన కొదవలేదు. అయితే జీవితంలో ఒక అధిగమించరాని అఖాత మేదో ఏర్పడ్డట్లు కనపడింది. బ్రతు కంతా బాగా ముసురుపట్టిన దుర్దినంలా తయారయింది. ఆనాటి కానాటికి కూరేశుని పత్ని ఆరోగ్యం పాడయింది. చిక్కి శల్యమయిపోతున్న ఆమె పరిస్థితి గమనించగానే అతని గుండె బరువెక్కువయింది. ఆ సమయంలోనే అతనికి రామానుజ యతితో అతి సన్నిహితమయిన పరిచయభాగ్యం లభించింది. క్రమ క్రమంగా అది ప్రగాఢభక్తిగా పరిణమించింది. కూరేశు డానాటినించి సంపత్తి అంతా మఠం కోసము, నిరంతర దాన ధర్మాలకోసం వ్యయం చేశాడు. వట్టి కట్టుబట్టలతోనే భార్యతో

బాటు శ్రీరంగం చేరుకొని వేరొకచోట నివసిస్తున్నాడు. కేవలం పురాణ ప్రవచనాలతో లభించిన స్వల్పాతిస్వల్పమైన ద్రవ్యంతోనే తన దైనందిన జీవిక కొనసాగించుకొన్నాడు. రంగనాయకుని రాకపోక లెక్కువయిన కొద్దీ మత ప్రతిష్ఠ మంట గలిసి పోగలదేమో అని అతని కొకింత అలజడి కలిగింది.

ఒకనా డదే విషయం గోవిందయతితో ప్రస్తావించాడు. ఇటీవల ఆయన ఎవ్వరితోను ఎక్కువగా ప్రసంగించడం లేదు. కొంతకాలంనించి మౌనవ్రతం స్వీకరించాడు. ఎప్పుడయినా కొంచెం మాట్లాడినా సూత్రప్రాయంగానే ప్రసంగించాడు. అందుచేత కూరేశుని ప్రసంగం వినగానే "ఏది ఎలాగ జరగ వలసి ఉంటే అలాగ జరుగుతుంది. అన్నిటికి రామానుజులే ఉన్నారుగదా! అనవసరంగా మన కెందుకీ మథన?" అని వేరొక విషయం ప్రసంగించాడు, అంతేగాని మరి ఆ మాటే ఎత్తుకోలేదు.

గోవిందయతి పూర్వాశ్రమంలో రామానుజుని పినతల్లి కుమారుడు, ఆయనతో బాటు యాదవ ప్రకాశుడన్న అద్వైత వేదాంత విద్వాంసుని సన్నిధిని బ్రహ్మసూత్రాలు, భగవద్గీత, ఉపనిషత్తులు కూలంకషంగా అభ్యసించిన విద్యాఖని. ఒకసారి తన గురువులతో కలసి వారణాసి సేవించుకొని బాగీరథీ నదిలో లభించిన అపూర్వ శివలింగంతో తిరిగి వచ్చి అది కాళహస్తిలో ప్రతిష్ఠించాడు. ఆనాటినించి కేవల శైవుడై కాళహస్తీశ్వరుని నిరంతర సేవలో పంచాక్షరీమంత్రం ప్రగాఢ జపంలో నిమగ్నుడై పరమ మాహేశ్వరుడన్న మహాప్రతిష్ఠ గడించుకొన్నాడు. కాని మరికొంతకాలం గడచిన తరవాత శ్రీశైల పూర్ణుడన్న వేంక

టేశ్వర భక్తాగ్రేసరుని సాంగత్యశక్తివల్ల శ్రీవైష్ణవదీక్షస్వీకరించి, సన్యసించి శ్రీరంగక్షేత్రం చేరుకొని రామానుజుని కంతేవాసి అయినాడు. గోవిందయతి మిక్కిలి వృద్ధుడు. మఠంలో నివసిస్తున్న బ్రహ్మచారులందరు ఆ వృద్ధ యతిని రామానుజునితో సరిసమానంగా గౌరవిస్తూంటారు. మఠ నిర్వాహణాధికారి యజ్ఞమూర్తి యతి ఎడదలో ఆయన యెడల యెనలేని భక్తి, ప్రపత్తి పాదుకొన్నవి. అందుచేత మఠ నిర్వాహణలో చిన్న చిన్న వ్యవహారాలలో గోవిందయతి అభిప్రాయాల ప్రకారమే నడుచుకొంటూ ఉంటాడు. కాని గోవిందయతి ప్రశాంత మౌన వ్రతం విసర్జించిన వేళ ఎన్నడో కాని తటస్థపడదు. బాగా ముడతలు పడిన ఆ వృద్ధమూర్తి కనుబొమలలో అంతర్లీనము లయిన వీక్షణాలెల్లవేళల శ్రీరంగేశుని చరణకమలాలే ధ్యానిస్తూ మిణుగులవలె మెరుస్తూ ఉంటాయి!

# 25

మధ్యాహ్నం రెండుజాముల పొద్దు తిరిగింది. అది మఠవాస్తవ్యులందరు రవంత విశ్రమించే వేళ. కాని యజ్ఞమూర్తికి మాత్రం కొంచెమయినా కన్నుమూసి మేను వాల్చడాని కెక్కడ తీరిక చిక్కలేదు! మఠంలో ప్రతి చిన్న విషయము స్వయంగా పరిశీలిస్తేనేగాని అతనికే మాత్రము తృప్తి కలగదు. ఆచార్యులేసంగతి ఏ మాత్రము పట్టించుకోరనీ, అయినా ఇటీవల కొన్ని సంవత్సరాలనించి మఠంలో ఆ[illegible]న ఉనికివల్లనే ఎవ్వరికి ఏవిధమయిన కొదవ కలగకుండా [illegible] సవ్యంగా సాగిపోతున్నా

యనీ అతడెరుగును. మఠ నిర్వాహణ విషయంలో రామానుజు నిది కేవలం నిర్లిప్తమయిన తటస్థదృష్టి. యజ్ఞమూర్తి ఒక్కొక్కప్పుడు ఆచార్యుని ఆలోచన అనుసరించి నడుచుకోవా లని సంకల్పించుకొంటాడు. కాని చిరునవ్వుతో మేళవించి గంభీర మౌనముద్రమాత్రమే ప్రత్యుత్తరరూపంలో సాక్షాత్క రిస్తుంది! అందుచేత ఆయనమీద ఆధారపడడంవల్ల మరి ప్రయోజనం లేదని నిశ్చయించుకొన్నాడు. కాని ఒక్కొక్కప్పుడు యజ్ఞమూర్తి దాశరధి, కూరేశుడు, అనంతసూరి మొదలయిన ప్రధాన శిష్యుల హితోక్తు లనుసరిస్తూ ఉంటాడు. ఇందువల్లనే ఈ నాడతడు తన గదిలో కూర్చుని దాశరధి రాకకోసం నిరీక్షించాడు. కాని ఎందుచేతనోగాని అనుకున్న సమయానికి అత డక్కడికి రాలేదు!

యజ్ఞమూర్తి కిప్పుడొక పెద్ద విషమ సమస్యవచ్చి పడింది! ఆనాటికానాటికి సామాన్య దైనందిన మఠ నిర్వాహ ణమే మిక్కిలి దుస్సాధ్యమయిపోతున్నది. శ్రీరంగంలో సంపన్ను లనేకు లింతకుపూర్వం మఠానికి వచ్చి ఆచార్యుని సందర్శించి దేవరాజస్వామిని సేవించుకొని విరివిగా కానుక లర్పించి ధన్యుల మయినామని ఆనందించేవారు. కాని హేమసుందరీ రంగనాయ కుల రాకపోక లెక్కువయినకొద్ది వారిలో చాలామంది అక్క డికి రావడమే మానుకొన్నారు. ఆ భక్తులలో కొందరు సదా భాగ్య భోగాలతో తులతూగుతున్న సంపన్నులు! తమ జీవి తంలో సమస్త సౌఖ్యాలు చాలా జాగ్రత్తగా సమకూర్చు కొన్న నిపుణులు! వారి కిక కొదవయినది ఆ ముష్మికమయిన ఐశ్వర్యం ఒక్కటే! కనక ముదిమి బాగా పైబడిన కొద్దీ, అటు

వంటి పరలోక సంపత్తికోసం తహతహలాడడం ప్రారంభిం చారు! కాని వారందరు వైదిక ధర్మ నిష్ఠాగరిష్ఠులు! హేమాంబా ధనుర్దాసుల సాంగత్యంవల్ల మఠానికేగాక, ఆచార్యునికి కూడా ఎన్నటికి చెరగని పాతిత్యమాలిన్యం సంక్రమించిందని గట్టిగా నిశ్చయించుకొన్నారు! ఒకరిద్దరు రామానుజుని యజ్ఞమూర్తి సమక్షంలో గట్టిగా ఉట్టంకించారు. కాని ప్రయోజనం కలగలేదు. క్రమక్రమంగా అతని ఆశక్తత గ్రహించి ఇక మఠం వైపే రావడం మానుకొన్నారు. మిగిలిన వారంతగా సంపన్నులు కారు. వారి హృదయాలలో రామానుజుని యెడల అచంచలమయిన ప్రగాఢ భక్తి పాదుకొన్నది. కాని వారివల్ల మఠానికి లభించే కానుకలు చాలా తక్కువ. ఇంకా మిగిలినవారిలో ఎక్కువమంది ఆఘ్రాటయినా గడవక గంపెడు సంసారాల తాపత్రయాలతో సతమతమవుతున్న సామాన్య గృహస్థులు! ఏదో తృణమో పణమోగాని అటువంటివారేమి ఈయగలరు! క్రమక్రమంగా మఠంలో బ్రహ్మచారులు కొందరు కాషాయ వస్త్రాలు కూడా లేక చిన్న చిన్న అంగవస్త్రాలతోనే కాలక్షేపం చేస్తున్నారు! ఇటువంటి పరిస్థితులలో మఠ నిర్వహణం కొనసాగించడం మిక్కిలి దుస్సాధ్యమయిపోతున్నదని అతని కనిపించింది.

యజ్ఞమూర్తి బక్కపలచని మనిషి. కొంచెం పొడగరి. కోలముఖము, శుష్కనాసిక. సూదులవంటి చూపులతో అతడెటువంటి దురవగాహమయిన శాస్త్ర రహస్యమయినా ఇట్టే చీల్చి పెకలించకలడు! అంతేకాదు. ప్రతి లౌకిక వ్యవహారం అతడామూలాగ్రంగా పరిశీలించి క్షణంలో అవగాహన చేసుకోగలడు! సాంప్రదాయికమయిన ప్రాచీన తర్క శాస్త్రమే

కాక, బౌద్ధ జైన తర్కశాస్త్రాలు రెండు కూలంకషంగా మధిం చిన మహా విద్వాంసుడు! ఆనాడు దక్షిణాపథంలో చెదరు వాటుగా మిగిలిన బౌద్ధ జైన విద్వాంసు లెవ్వరయినా అతని కెదటపడి నిలిచి విశిష్టాద్వైత వేదాంత చర్చ ఆరంభించడానికే భయపడిపోయేవారు!

యజ్ఞమూర్తి శ్రీరంగం చేరుకోక పూర్వమే, రామా నుజుని చరణా లాశ్రయించక మునుపే సన్యసించి అద్వైత మత ప్రస్థానంతో వివదించే ఔత్తరాహ మహాపండితుల నందరిని శాస్త్రవాదంలో పూర్తిగా ఓడించి జయించి జేజే లందు కొన్నాడు! శ్రీరంగంలో రామానుజ యతీశ్వరు లొకరు విశిష్టా ద్వైత మన్న నూతన ప్రస్తానం వెలయిస్తున్నారని విని బళ్ల కొలది భూర్జ తాళపత్ర గ్రంథాలతో శిష్యప్రశిష్యుల కోలా హలంతో ఆ నగరంలో ప్రవేశించాడు! ఆ మరునాడే తనతో వివదించ వలసినదని రామానుజ యతి కాహ్వాన పత్రిక పంపిం చాడు.

రామానుజునికన్న యజ్ఞమూర్తి వయస్సులో బాగా పిన్న. అయినా రామానుజుడు ఎంతో గౌరవంగా ఆ మహా మనీషిని సందర్శించి ఉట్టిపడుతున్న అడకువతో విన్నవించాడు:

"మీను మిగిలిన విద్వద్వరేణ్యులు మీరు! ఎక్కడ అడుగుపెట్టిన విజయలక్ష్మి అనుక్షణము మిమ్మలనే వరిస్తున్నది! ఇక వాదోపవాదాల కక్కర ఏమి ఉన్నది? జితోస్మి అని అంగీకరిస్తున్నాను! మీవంటి పండిత ప్రకాండు లీ భరత వర్షంలో ఇంకెవ్వరు లేరు!"

ఆ ప్రత్యుత్తరం వినీవినగానే యజ్ఞమూర్తి పట్టరాని అహంకారావేశంతో హుంకరించాడు :

'అయితే మీరిక ఈ శ్రీ వైష్ణవ సంప్రదాయానికి స్వస్తిచెప్పి పరిపూర్ణ మాయావాదమే పరమ ప్రమాణమని అంగీకరిస్తున్నారా ?'

ఆ విధంగా హెచ్చరించినా రామానుజుడేమాత్రము చెక్కుచెదరలేదు ! ఆ యతీశ్వరుని పెదవులపై అనంగీకార సూచక మయిన ప్రసన్న దరహాసం మాత్రమే తరళించింది :

"మాయా వాదులీ ప్రపంచం యావత్తు మిథ్య అన్న సిద్ధాంతంతో తలమునకలై రవంతయినా తామేమని ప్రసంగిస్తున్నారో గమనించుకోవడంలేదు ! లోకంలో ఉన్న సర్వమూ మాయ అయినప్పుడు వాదోపవాదాలు, జయాపజయాలు మాత్రం మిథ్యలు కావా ? అంతే కాదు ! మరి మాయావాదం మాత్రం మిథ్యకాదా !"

ఆ వ్యంగ్యాధిక్షేపణ యజ్ఞమూర్తి నిండు గుండెలో తీవ్రాతి తీవ్రమయిన త్రిశూలాగ్రంలా [illegible]డుచుకొన్నది ! మరు క్షణంలోనే తోకతొక్కిన తాచులా కస్సుమని చెలరేగి విశిష్టాద్వైత సిద్ధాంత చర్చ ప్రారంభించాడు ! మహా విద్వద్వరేణ్యుల సమక్షంలో వారిద్దరిమధ్య ఎడతెగని వాదోపవాద ధూళి చెల రేగింది ! కాని చిట్టచివరికి రామానుజుడే పరాజితు డయినాడు! ముఖం రవంత వివర్ణమయింది ! అయినా తన సుస్థిర ధైర్యం విసర్జించలేదు ! శిరస్సాకించుక వంచుకొని శిష్యులతో బాటు మఠానికి మరలిపోయాడు ! ఆనాటి అర్ధరాత్రివేళ మఠంలో విజయంచేసి ఉన్న దేవరాజస్వామి సన్నిధిని సాష్టాంగ నమ

స్ఫూర్తి సమర్పించి మాటిమాటికి ఇనుమడిస్తున్న ప్రగాఢ గద్గది కతో ప్రతిమాలుకొన్నాడు :

'స్వామీ! పురాతనమయిన ఆళ్వారు లందరు శ్రీ వైష్ణవ సంప్రదాయ పద్ధతి అనుసరించి ఆనంద తన్మయతో నీ పాదపద్మా లందుకొన్నారు! కాని క్రమక్రమంగా మాయావాద ధూళి ధూసరితమై నీ అడుగుదోయి అదృశ్యమయిపోతున్నది! ప్రచండ వాద కోలాహలంతో శుద్ధాద్వైతవాదు లన్ని వైపుల విజృంభించి అమాయకుల నందరిని భ్రమింప జేస్తున్నారు. అయ్యో! మానవుల కిక నీ చరణ యుగళి శీతలచ్ఛాయ లభించదా!'

మరి రామానుజుని నోట మాట వెలువడలేదు! కపో లాలపై కవోష్ణబాష్పధార నిరంతరమై ప్రవహించింది. దుస్సహ దైన్యభారంతో అవశుడై ఆ నాటి రాత్రి దేవరాజస్వామి పాద సన్నిధిలోనే నిద్రించాడు. అలాగ ఎంతసేపు గడిచిందో ఆ భక్తశిఖామణికే తెలియదు! ప్రభాతవేళ హృదయాంతరా ళంలో "యతీశ్వరా! ఎందుకు నీ కింత తపన! అనతికాలం లోనే భక్తిప్రపత్తి మార్గం లోకంలో అంతట విశృంఖలమై విస్తరించ బోతున్నది!" అన్న గభీర సమాశ్వాసనం భోరుమని మారు మ్రోగింది! ఉల్లాసావేశంతో తటాలున లేచి రామా నుజ యతి స్వామి పాదాలపై వాలి నిశ్చల నిశిత దృష్టితో ముఖ వైఖరి పరిశీలించాడు. వికసిస్తున్న చిరునగవుతో ఆ దివ్య మూర్తి తనతో ప్రసంగిస్తున్నట్టే భాసించింది.!

మరునాడు హర్షావేశంతో జాజ్వల్యమాన మయిన రామానుజుని వదన భంగిమ గమనించి యజ్ఞమూర్తి మరి తన

కన్నులే నమ్మలేక నిలువునా నిర్ఘాంతపడి "నిన్న ఈయన ముఖం వివర్ణమై వెలవెలబోయినదే! ఈ నా డెందుచేతనో హేమంత బాలభాస్కర మూర్తివలె ప్రజ్వలిస్తున్నదే! అతి లోకమయిన అపూర్వశక్తితో తరళిస్తున్నదే! ఏమి ఈ పుణ్యా మూర్తి తేజోవైభవము!" అని నిశ్చల శిలామూర్తివలె నిలు చున్నాడు! అదే క్షణంలో యజ్ఞమూర్తికి తన శుష్కతర్క వాద ధోరణి యావత్తు ఎందుకు కొరగాని వట్టి మాటల పటా టోప మన్న దృఢనిశ్చయం కలిగింది! పనికిమాలిన తన వృథా హంకారం విడిచిపెట్టి ఆయన పాదాలపై వాలి పసిపాపవలె విలపించి వేడివేడి కన్నీటితో అభిషేకించవలెనన్న తహతహ కలిగింది! పరుష ప్రసంగ శూలాగ్రాలతో ఆ పునీతమూర్తి మనస్సెంతో నొప్పించినందుకు తన కంతకన్న సముచిత మయిన ప్రాయశ్చిత్త మేది లేదని నిశ్చయించుకొన్నాడు.

కేవల కర్కశ తర్క చర్చలలో తన మనుగడ అంతా వ్యర్థమయిపోయినదని అనేక విధాల మథనపడి రామానుజుని పాదధూళిలో వాలి తన వాదం కేవలం భ్రాంతి మూలకమని నివేదించి, కరుణించి అంతేవాసిగా స్వీకరించి శ్రీ వైష్ణవ దీక్ష అనుగ్రహించ వలసినదని బ్రతిమాలుకొన్నాడు.

రామానుజుడు క్షణకాలం మిక్కిలి ఆశ్చర్యపడి అతని నెంతో ఆదరంతో లేవనెత్తి ప్రగాఢాశ్లేషంతో ఆదరించాడు:

"నాయనా! మహనీయ మనీషివి నీవు! ఎంతెంతటి అహంకార మయినా విడిచిపెట్టవచ్చు గాని, పాండిత్యాహంకార పరిత్యాగమాత్రం మిక్కిలి దుష్కరము! దేవరాజస్వామి

కరుణాపూరమే నీ కిట్టి పరిణతి కలిగించినది ! సందేహంలేదు ! ధన్యుడవు నీవు !"

ఆనాటినించి యజ్ఞమూర్తి దేవరాజ ముని అన్న ప్రత్యేక నామధేయంతో రామానుజ యతి ఏర్పరిచిన ప్రత్యేక మఠంలో నివసించాడు. కాని ఆచార్యుని అనురోధంవల్ల మరి కొంత కాలానికది విడిచిపెట్టి శ్రీ వైష్ణవ మత నిర్వహణ విధి శిరసా వహించాడు. అప్పటినించి సర్వదాయామఠంలోనే నివసించాడు. ప్రతి స్వల్పవిషయము వేయి కన్నులతో పరిశీలించాడు. అతని ఆధ్వర్యంలో ఆ మత ప్రశస్తి దక్షిణాపథంలోనే కాక భారత వర్షంలో నలువైపుల వ్యాపించింది. కాని నేటి కా ప్రతిష్ట అంతా క్రమక్రమంగా మంటగలిసిపోతున్నదని యజ్ఞమూర్తి ఎంతో ఆందోళనపడ్డాడు ! శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రవర్తకులు నాథముని స్వయంగా రూపొందించిన మత మది ! ఆ పైన యామునాచార్యుని కాలంలో అది అనేక విధాల పెంపొంది, విశాల వటవృక్షంవలె విస్తరించింది. రామానుజు డక్కడ అడుగుపెట్టినప్పటినించి ఆ మత మొక పుణ్యక్షేత్రమే అయినది ! కాని, ఇటీవల ఆ ప్రాభవం క్రమక్రమంగా క్షీణిస్తున్నదని నిశ్చయించి యజ్ఞమూర్తి సుదీర్ఘ విశ్వాసం విడిచిపెట్టాడు.

అప్పటికి మధ్యాహ్నం మూడోయామం కూడా గడిచి పోయింది. క్రమక్రమంగా నీలి నీలి నీడలు తూర్పు దిశవైపు ప్రయాణిస్తున్నాయి. గున్న మామిళ్లపై దట్టంగా అలముకొన్న కొండమల్లె తీగలనుండి పూలొకటొకటే నేలమీద రాలుతున్నవి. వేరొకచోట మిగల ముగ్గిన వేరు పనసపై వాలిన తేనెటీగల సవ్వ జుంజుమ్మని వినిపిస్తున్నది. యజ్ఞమూర్తి

కెదురుగా వకుళవృక్షంమీద గూటిలో సాలీడు నీరెండలో నిశ్చింతంగా నిద్రిస్తున్నట్టు విశ్రమించింది. అతని పక్కనే చిన్న చీమల బారు క్షణ క్షణము మనుగడకోసం కలకండ రేణువులు సేకరించుకొంటున్నది! యజ్ఞమూర్తి దృష్టి అప్రయత్నంగా అటువైపు తిరిగింది. అలవోకగా ఇంకొక కవోష్ణ నిశ్వాసం వెలువడింది.

"చిన్న చిన్న చలి చీమలు కూడా ఏ విషయమయిన లోటు లేకుండా సుఖంగా జీవిస్తున్నవి! కాని దేవరాజస్వామి చరణాలే శరణ్యాలని నమ్ముకొన్న శ్రీ వైష్ణవ బ్రహ్మచారులకు మాత్రం పట్టెడన్నమే కరవై పోతున్నది! ఎంతటి దుర దృష్టము!"

యజ్ఞమూర్తి నిశితమయిన నియమ పరిపాలన కలవాటు పడిన నిరంతర నిష్ఠాపరుడు. అతని పర్యవేక్షణలో మఠంలో ప్రతి చిన్న ఏర్పాటు సకాలంలో సక్రమంగా యథాతథంగా సాగిపోవలసిందే! ఎక్కడయినా ఒక్కలోటు కనిపిస్తే ఆనాడత నికి ఒంటిమీద వేలకొలది తేళ్లు జెర్రులు ప్రాకినట్టనిపిస్తుంది. అప్పుడప్పుడు హేమసుందరి రంగనాయకుల రాక పోకలతో మఠంలో మాటి మాటికి ఎదురుపడుతున్న లోటుపాట్లతో సరిగా ఆతని కదే విధమయిన దుస్సహానుభూతి కలిగింది! అయినా ఇంతకాలంనించి అతడవి కొంచెం ఓరిమి వహించి సహించాడు. ఇప్పుడది కాస్త అడుగంటింది. దాశరథితో సంప్ర దించిన తరవాత ఏదో ఒకదారి తొక్కక తప్పదని నిర్ణయించు కొన్నాడు. అంతలోనే ద్వారంలో సవినయంగా నిలుచున్న

ఆతని ముఖం ప్రత్యక్షమయింది. యజ్ఞమూర్తి దాశరథి నార్ద్రకంఠంతో లోలోపలి కాహ్వానించాడు:

"రా! నాయనా! ఎందు కలాగ అక్కడే నిలుచుండి పోయావు!"

దాశరథి నెమ్మదిగా వచ్చి అతనిసరసన కూర్చున్నాడు. యజ్ఞమూర్తి రవంతసే పాతని వైమనస్య ధోరణి పరిశీలించి ప్రశ్నించాడు:

"ఎందుచేత నాయనా! ఇంత ఆలస్య మయింది? విశేష మేమి లేదుకదా!"

దాశరథి కొంచెం సంకోచిస్తూ నెమ్మదిగా తన మనో వేదన వెళ్లబోసుకున్నాడు:

"ఏమని చెప్పను! నిన్న, మొన్న బ్రహ్మచారు లందరు అర్ధాకలితోనే కాలక్షేపం చేశారని మీా రెరుగుదురు గదా! ఈ సంగతి ఆచార్యుల చెవిని పడిందేమో! వారిక వచ్చి మంచినీళ్లయినా ముట్టడం మానివేశారు. నేను పాదాలమీాద పడి ప్రాధేయపడిన తర్వాత పిడికెడు ప్రసాదం మాత్రమే ఆర గించారు. ఇక ఈవేళ స్వామి ప్రసాదానికి కూడా కొరత ఏర్పడ్టట్లు కనిపించింది. అయితే నేను కలగజేసుకుని ఏదో విధంగా ఏర్పాటు చేయించాను. ఇక రేపటికి భక్తు లెవర యినా పదార్థాలు పంపిస్తే సరేసరి! లేకపోతే బ్రహ్మచారుల తోబాటు దేవరాజస్వామి కూడా పస్తుండవలసిందే! ఇందు చేతనే నా రాక కొంచెం ఆలస్యమయింది."

ఆ ప్రసంగం వినగానే యజ్ఞమూర్తి ముఖం వెలవెల బోయింది:

"దాశరథీ! ఈ అప్రతిష్ట" పాతిత్యము ఒక్క మారుగా నా నెత్తిన పడవలసి ఉన్నది కాబోలు! లేకపోతే ఎప్పుడు లేనిది ఇంతటి లేమి ఎందుకు తటస్థ పడుతుంది! ఇంతకుమునుపే నేనీ విషయం వారితో సంప్రతించవలెనని అనుకొన్నాను. అయితే కొంచెం సంకోచించాను. కాని మరి గత్యంతరంలేదు. మఠానికి సంబంధించిన వ్యవహారాలన్నీ సర్వదా ఒక కంట కనిపెట్టి ఉండవలసిన విధి నాది. పట్టణంలో సంపన్నులు కొంత మంది హేమసుందరీ రంగనాయకుల పుట్టుపూర్వోత్తరా లుట్టంకించి ఇటువంటివారిని మఠంలో అడుగుపెట్టనీయడం న్యాయమేనా?" అని నిలవరిస్తున్నారు. నేనైనె వారి కేమని సమాధానం చెప్పగలను? పోనీ అనుకుంటే ఆచార్యు లిటువంటి విషయాలలో కేవలం తటస్థులు. ఇక మిగిలిన సదాచార పరాయణులు కొంద రిక్కడికి రావడమే మానుకొన్నారు. క్రొత్తగా శ్రీవైష్ణవ దీక్ష స్వీకరించిన ముగ్గురు బ్రహ్మచారు లీవేళ అకస్మాత్తుగా మఠం విడిచిపెట్టి వెళ్లిపోయారు. ఇక మిగిలినవారు మాత్రం ఎంతకాలమని ఆకటి చిచ్చు భరించి నిలబడగలరు! ...పోనీ నీ వొక్కసారి వారితో ఈ సంగతి ప్రస్తావిస్తే..."

దాశరథి అంతే వాసులందరిలోను మిక్కిలి పిన్న. అందుచేతనే ఆచార్యుని కతని యెడల అపార వాత్సల్యం పేరుకొన్నదని యజ్ఞమూర్తి అంతకు మునుపే గ్రహించుకొన్నాడు. కనకనే దాశరథి ద్వారా ఆ విషయం గురుదేవుని కెరిగించడం మిక్కిలి సముచితం కాగలదని నిశ్చయించుకొన్నాడు. కాని దాశరథి దానికంతగా అంగీకరించినట్లు కనబడలేదు:

"నేను తప్పక మీ ఆజ్ఞ శిరసావహించవలసినదే! అయితే తీరా వారి ఎదట నిలబడిన తరవాత నా నోట ఈ మాట వెలువడదేమో అని భయపడుతున్నాను. నే నెక్కడ, వా రెక్కడ? తగుదనని ఈ సంగతి ఆయన ఎదట ప్రస్తావించగలనా? పోనీ కూరేశులుగాని, అనంతసూరిగాని ఈ వ్యవహారం నిర్వహిస్తే..."

యజ్ఞమూర్తి ఉసూరుమని నిశ్వసించాడు:

"అబ్బే! వారివల్ల ఏమవుతుంది? ఆచార్యులు కేవలం అవతారమూర్తులని వారి గట్టి నమ్మకం. అటువంటి వా రీ సంగతి ప్రస్తావించగలరా?"

"పోనీ గోవింద యతీశ్వరుల నొక్కమారు ప్రార్థిస్తే—"

ఇది మంచి ఆలోచనే కాని ఆయన ఇటీవల కొంత కాలంనించి మౌనవ్రతం అవలంబించారు. అది ఇంతలో పరిసమాప్తంకాదు"

దాశరథి కిక ఏమనడానికి పాలుపోలేదు:

"మఠ నిర్వహణభారం వహిస్తున్నది మీ రేకదా! అటువంటప్పుడు మీరే స్వయంగా ఈ వ్యవహారం వారితో విన్నవిస్తే అపచారం ఏమిటి?"

యజ్ఞమూర్తి కా ఆలోచన మొట్టమొదట తట్టకపోలేదు. అయితే మఠ నిర్వహణలో అత డెన్నడు తన లౌకిక దృష్టి విడనాడలేదు. లోకంతో వ్యవహరించినంతవరకు అది తప్పదని అతని గట్టి నమ్మకం. అందుచేత దాశరథి వంటివా రెవ్వరయినా ముమ్ముందుగా ఆచార్యునితో ఆ వ్యవహారం విన్నవిస్తే, ఆ తర

వాత తనమార్గం సుకరం కాగలదని అనుకొన్నాడు. కాని దాశ రథి ఆ విధంగా వెనకంజ వేసిన తరవాత తానై స్వయంగా వ్యవహరించక తప్పదని నిర్ణయించుకొని దాశరథి కది తెలియ జేశాడు. అత డంతకన్న వేరొక గత్యంతరమేది లేదని చెప్పి వేరొక విధినిర్వహణకోసం రామానుజుని సన్నిధికి తరలి పోయాడు.

యజ్ఞమూర్తి ఆనాటి రాత్రి అంతేవాసు లందరు విశ్ర మించిన సమయంలో నెమ్మదిగా ఆచార్యుడున్న గది ద్వారాని కవతల నిలుచున్నాడు. సందర్శనాని కనువయిన తరుణం కోసం నిరీక్షించాడు. అది మార్గశీర్ష శుద్ధ చతుర్దశి. గుమ్మపా లవంటి పండువెన్నెల తరగలతో జాబిల్లి లోకం సమస్తము ముంచెత్తు తున్నాడు. ఆ పరిశుభ్ర జ్యోత్స్నా ప్రవాహంతో మేళవించిన సన్నని తెలి మంచు ముసుగులో సుదూర భవనాలు, వాటి చుట్టూ, ఏపుగా పెరిగిన ఫలవృక్షాలు దృశ్యాదృశ్య స్వరూపా లతో సాక్షాత్కరించాయి. ఏపుగా గుబురుగా పెరిగిన చెట్ల కింది నీలి నీడలు ఆ వెన్నెల వెల్లువలో మరింతగా చిక్కబడి నట్టు స్ఫురించాయి. బాగా మందగించిన చిరుగాలి రెపరెపలలో కొబ్బరి పోకల ఆకు లల్లన కదలినప్పు డుదయించిన గలగల ధ్వని లీలగా నలువైపుల వ్యాపించింది. క్రమక్రమంగా ప్రశాంత మయిన ఆ పరిసరంలో అంతట మనోజ్ఞమయిన హేమంత శోభ ఆదమరచి నిద్రిస్తున్నట్టు గోచరించింది. ఎక్కడ ఒక్క చిన్న కదలికయినా గోచరించని ధవళకౌముదీపూరం ప్రపంచంలో ప్రతి ప్రాణిని ఆనందావేశంతో అల్లనల్లన ముంచెత్తుతున్నట్టు పొడకట్టింది. సన్నని జాలి పిలుపులా వినిపించే కావేరీ తరంగ

ఘోషలో ఎక్కడో ఒక ఆల కాపరి మునివేళ్ళ కొనలనుండి వెలువడిన మురళీ సంగీత ధ్వని స్పష్టాస్పష్టంగా వినిపించింది. మతావరణలో పూదోటలో పారిజాత పుష్పాలొకటొకటే ఆ గాన తన్మయతతో మైమరచినట్టు అప్పుడప్పుడు నేలపై తూలి పడుతున్నాయి.

ఆచార్యుని ప్రఫుల్ల నేత్రాలా మనోహర చంద్రికా తరంగాలలో వేడిన మీనులవలె విహరిస్తున్నాయని గ్రహించడానికి యజ్ఞమూర్తి కెంతో సేపు పట్టలేదు. "ఈ విశ్రాంతి సమయంలో సందర్శనం న్యాయం కాదేమో! పోనీ రేపుదయమే ప్రసంగించవచ్చును. దానికేమి!" అనుకుని వెనక్కి తిరిగి వెళ్ళిపోవాలని సంకల్పించుకొన్నాడు. అంతలోనే రామానుజుని ఆహ్వానం వినిపించింది :

"అదేమిటి నాయనా! అక్కడే నిలబడిపోయావు.! లోపలికి రా!"

యజ్ఞమూర్తి రామానుజుని సమక్షంలో నిలుచున్నాడు. తన సరసన కూర్చోవలసినదని ఆయన చేయెత్తి ఆహ్వానించాడు. కాని శిరస్సు కొంచెం వంచుకొని అతడలాగే నిలుచున్నాడు. క్రమంగా తన ప్రసంగం ప్రారంభించాడు :

"తమ కెరుకపడని దేమి ఉన్నది? అయినా ఒక ముఖ్య విషయం విన్నవించవలనని వచ్చాను."

"ఏమిది?" అన్నట్టు రామానుజుని విశాల ఫాలతలిపై చిన్న బొమముడి విరిగింది :

"ఎందుచేతనోగాని ఎంతో వ్యాకులపడుతున్నట్టున్నావే!" పెదవులపై చిరునవ్వు అలవోకగా తరళించింది.

"అవును! ఎన్నడు లేనిది, దేవరాజస్వామి నిత్యధూప దీప నైవేద్యాలకు కూడా అనుదినము తడుముకోవలసిన దురవస్థ ఏర్పడినది."

రవంత సేపాలోచించిన రామానుజుని పెదవులనుండి "—ఏమిటి కారణం?" అన్న ప్రశ్న వెలువడింది. అంతలోనే యజ్ఞమూర్తి అందుకొన్నాడు:

"ఏమని విన్నవించను! హేమాంబా ధనుర్దాసు లిక్కడ అడుగుపెట్టినప్పటినుండి మఠంలో సదాచారపరుల కెవ్వరికి అది సుతరాము రుచించలేదు. అయినా కొంతకాలంపాటు ఓరిమి వహించారు. మొన్న నాతో నయినా ఆ విషయం ప్రస్తావించకుండా అకస్మాత్తుగా ముగ్గురు బ్రహ్మచారు లిక్కడ నుంచి వెళ్ళిపోయారు! అంతేకాదు. ఇటీవల సాంప్రదాయికులయిన సంపన్ను లెవ్వరు మన మఠంలో అడుగు పెట్టడమే మానుకొన్నారు."

అంతలోనే రామానుజుని పెదవులపై అలక్ష్య సూచకమైన దరహాసితం వికసించి కపోలాలపై విస్తరించింది:

"యజ్ఞమూర్తి! సౌఖ్యాల కోసం మన మిక్కడికి రాలేదుకదా! అని గమనించిన బ్రహ్మచారు లెవరయినా తీరని నైరాశ్యంతో తిరిగి వెళ్ళిపోయి ఉండవచ్చును. ఇక సంపన్నుల మాట! భిక్షాన్నాలతో కాలక్షేపం చేయవలసిన మనకిక వారి ఐశ్వర్యాలవల్ల ప్రయోజన మేమి ఉన్నది! ఇంతకి

ఇక్కడికి చేరుకోవలసినవా రెప్పటికయినా వచ్చి తీరుతారు. ఇక మిగిలినవా రేదో విధంగా దూర దూరంగా తొలగిపోతారు. ఎందుకు నీ కీ లేనిపోని తపన ?"

ఆ ప్రతి సమాధానంతో మరి యజ్ఞమూర్తి నోటమాట వెలువడలేదు. ఆచార్యుని అచంచల ధైర్యం గమనించి అత డొక క్షణకాలం నిర్ఘాంతపడి తిరిగి ఒకింత అస్పష్ట స్వరంతో విన్నవించాడు :

"అయితే ఇంకొక మనవి. హేమాంబా ధనుర్దాసుల పుట్టు పూర్వోత్తరా లేమాత్రము తమకు తెలిసినట్టు లేదు. నిచుళాపురంలో అత డొక సామాన్య భూస్వామి కడగొట్టు కుమారుడని తెలిసింది. అయితే దీనిలో విడ్డూర మేమి లేదు. పరమ భాగవతోత్తములు తిరుప్పాణాళ్వారు కడజాతివారు కారా ! ఆ మహా భక్తశిఖామణి చరణధూళి పురాతన శ్రీవైష్ణవు లందరు శిరసావహించ లేదా ? అంతమాత్రంచేత మించిపోయిన దేమి ఉన్నది ?..."

రామానుజుని జిజ్ఞాసా దృష్టి అతని వైపు తిరిగింది. యజ్ఞమూర్తి తిరిగి కొంచెం తటపటాయిస ప్రస్తావించాడు:

"అయితే మన ధనుర్దాసు నిచుళాపురంలో ఒక భాగ్యశాలి ఇంట జొరబడి కాళ్ళు కీళ్లు తొలిగించి అపార సువర్ణరాశి చేజిక్కించుకొని శ్రీరంగంలో తలదాచుకొన్నాడట ! రంగ నాయకుడన్న మొదటి పేరు మార్చుకుని ప్రచ్ఛన్న వేషంతో సంచరిస్తున్నాడట. హేమాంబ యథావిధిగా వివాహమాడిన భార్య కానే కాదు ! ఆమె కేవలం వారాంగన; అదీగాక అతడు వట్టి తాగుబోతని లోకు లనేకు లంటున్నారు."

రామానుజు లా మాటలేవి బొత్తిగా వినిపించుకోవడం మానివేసి వెన్నెల తేటవై పవలోకిస్తునారని యజ్ఞమూర్తి మరుక్షణంలోనే గ్రహించుకొన్నాడు. ఉసూరుమని నిశ్వసించి తొణికిసలాడుతున్న అడకువతో తిరిగి విన్నవించుకొన్నాడు :

"ఎంతటి పతితుల దుశ్చర్యలయినా తా మేమాత్రము చెవిని పడనీయరని నాకు తెలియకపోలేదు. కాని మరి గత్యంతరం కానరాలేదు. ఇందువల్లనే తిరిగి తిరిగి విన్నవించుకొంటున్నాను. హేమాంబా ధనుర్దాసుల బెడదవల్ల మత ప్రతిష్ఠ నానాటికి మంటగలిసిపోతున్నది ! క్రమక్రమంగా తమ అంతేవాసు లందరికి పట్టెడన్నమే కరువై పోగలదేమో అన్న ఆందోళన కలుగుతున్నది. ఇంతకి మత నిర్వహణ నా విధి కనక ఇన్ని విధాల మీ కిది నివేదించుకొంటున్నాను."

అంతలోనే రామానుజుని ముఖతః చిన్న కలకల హాసం చెలరేగింది :

"నాయనా ! ఎందుకీ లేనిపోని పాపాల పునశ్చరణ ! ఇంతకీ ఇతరుల దోషా లెన్నడానికి మన మెంతటివారము ! సరే, దీని కేమిగాని, మహనీయులయిన ఆళ్వారులకాలంనించి ఈ మతాని కేవిధమయిన కొరత రానీయక అనుక్షణము వేయి కళ్ళతో సంరక్షించినవా రెవరో నీ వెరుగుదువా ?"

యజ్ఞమూర్తికా విషయమై రవంతయినా సందేహం కలగలేదు !

"నాథమునీంద్రులు, యామునాచార్యులు, మహాపూర్ణులు, కాంచీపూర్ణులు, శ్రీశైలపూర్ణులు మొదలయిన మహామహులు !"

"వాస్తవానికి వీరెవ్వరు మన సంరక్షకులు కానేకారు !"

యజ్ఞమూర్తి ఎంతో ఆశ్చర్యపడి ప్రశ్నించాడు :

"మరి ఎవ్వరు ?"

"అయ్యో ! నీకీమాత్రం జ్ఞప్తికి రాలేదేమి ?...సర్వదా మన సంరక్షకులు దేవరాజస్వామి ! నీవు పేర్కొన్నవా రందరు కేవలం నిమిత్త మాత్రులే !"

యజ్ఞమూర్తి కప్పటికిగాని తన ప్రత్యుత్తరంలో గల తప్పిదం బోధపడలేదు. క్షణకాలం విస్తుపోయి అలతి నగవుతో తన పొరబాటు వ్యక్తీకరించాడు :

"అవును ! తా మన్నది యథార్థమే ! అయితే తెల్ల వారితే ఆ స్వామి నివేదన కేమీ లేదే అని సదా ఆందోళన పడవలసివస్తున్నది. మరి నేనేమి చెయ్యను !"

రామానుజుని ముఖతః చిన్న నిట్టూర్పు వెలువడింది.

"యజ్ఞమూర్తీ ! సర్వసంగ పరిత్యాగం చేసినా నీ కెందు చేతనో గాని సంసార తాపత్రయంమాత్రం సడలలేదు. తమ నివేదన కేమి లేదని స్వామికి తెలియదనుకొన్నావా !"

"ఎంత మాట ! తెలియదని కాదు. అలాగని భారం యావత్తు స్వామిమీద విడిచివేసి మనం చేతులు ముడుచుకుని కూర్చోగలమా ? మనుష్య ప్రయత్న మన్నది ఒకటి ఉన్నది కదా !"

"నీ వన్నది నిజమే ! యావచ్ఛక్తి వినియోగించి నీ కర్తవ్యం నీవు యథావిధిగా నిర్వహించుకొన్నావు. మరి

నీవు గాని, నేను గాని చేయగలిగిన దేమి ఉన్నది? ఇకనయినా ఈ ఆందోళన విడిచిపెట్టి గుండెమీద చేయి పెట్టుకుని సుఖంగా నిద్రపో! ఇంతకి స్వామి సంకల్పం ప్రకారం ఏది ఎలాగ జరగ వలసి ఉంటే అలా జరిగిపోతుంది! మధ్య నీకెందుకీ మథన!"

యజ్ఞమూర్తి కిక ప్రత్యుత్తరాని కెక్కడ ఆవంతయినా ఆస్కారం కనబడలేదు! ఉసూరుమని నిట్టూర్చి రామానుజుని పాదాలపై వాలి నమస్కరించి వీడ్కొన్నాడు. హేమాంబా ధనుర్దాసుల యెడల ఆచార్యుని వైఖరి అతని కేమాత్రము సంతృప్తి కలిగించలేదు! మత వ్యవహారాల యెడల, బ్రహ్మచారుల యెడల ఆయన ఔదాసీన్యం మరింతగా మనస్తాపం కలిగించింది. అందువల్ల ఆనాటి రాత్రి తెల్లవారుజాము పర్యంతము అతని కంటి కొక్క కునుకయినా పట్టలేదు!

# 26

క్రమ క్రమంగా రంగనాయకుని మద్యపానాసక్తి దానంతటు అదే దూరంగా తొలగిపోయింది. అంతేకాదు! మరి ఆత డెప్పుడు మద్యశాల మాటే తలపెట్టలేదు! హేమసుందరికి మాట ఇచ్చినప్పటినించి ఎన్నడు ఇక కాంతామణి పేరే తలపెట్టలేదు! మిగిలిన నృత్యాది వినోదాలతో బాటు మల్లుల చెలిమి ఎడల కూడా అతని కెంతో విరక్తి కలిగింది. వా రెప్పుడయినా వీథులలో కనపడి పలకరిస్తే, అంటీ అంటనట్టు ఎంతో మర్యాదగా సమాధానా లిచ్చి తప్పించుకొన్నాడు. అయితే స్వామి ఉత్సవాలలో తన విధినిర్వహణ ఎడల అతని గాఢాసక్తి

క్రమక్రమంగా ఇనుమడించింది. తీరిక సమయాలలో రామానుజుని సందర్శనాభిలాష మరింతగా విజృంభించింది. హేమసుందరి కిది కొంత ఆందోళన కలిగించపోలేదు! అయినా ఆమె మరి గత్యంతరంలేక అన్నింటికి ఆ శ్రీరంగశాయి ఒక్కడే దిక్కని నిశ్చయించుకొన్నది. అనుదినము స్వామి సందర్శనమే తన కిక పరమశరణ్యమని నమ్ముకొన్నది. అప్పుడప్పుడు పౌరజనుల సమక్షంలో కొనసాగించిన మల్ల విద్యా వినోదాలవల్ల లభించిన కానుకలతో రంగనాయకుని కేవిధమయిన కొదవ లేకుండా సంసారయాత్ర సుఖంగా సాగిపోయింది.

అయితే సింహాచలం ఘోరస్మృతి తలుచుకొన్నప్పుడత నది పీడని మనశల్యంలా వేధించింది. ఒకనాటి సాయంకాలం శ్రీ రంగ పౌరుల సమక్షంలో మల్ల వినోదం ముగించుకొని విరివిగా కానుక లందుకొని ఇంటికి తిరిగివస్తున్న సమయంలో అతనికి అకస్మాత్తుగా గోపాలయ్య కనిపించాడు. రంగనాయకుడు డెంతో ఆత్మీయతతో దగ్గరకి వెళ్ళి కుశల ప్రశ్నాదికం ముగిసిన తరువాత రవంత ఆశ్చర్యంతో ప్రశ్నించాడు.

"గోపాలయ్యా! రెండు మూడు వారాలలోనే మళ్లీ ఇక్కడికి వచ్చి మా ఇంట దిగుతా నన్నావు! ఒకవేళ వచ్చి నన్ను చూడకుండానే తిరిగి వెళ్ళిపోయావా? లేక రానేలేదా? ఈ మధ్యన ఎక్కడ నీ జాడే లేదే!"

ఇంటిదగ్గర ఏవో తొందర పను లుండడంవల్ల అనుకొన్నంత త్వరగా శ్రీరంగం రావడం పడలే దన్నాడు గోపాలయ్య. ఇప్పుడు కూడా నిలుచున్న పాటుగా శీఘ్రంగా తిరిగి వెళ్ళిపోవలసిన అగత్యం వచ్చిపడిందని బాగా నొచ్చుకున్నాడు. రంగ

నాయకు డతని ధోరణి కనిపెట్టి మరి అంతగా బలవంత పెట్టలేదు! కాని ఒక చిన్న ఉపకారం చేసిపెట్టవలిసినదని వేడుకొన్నాడు. సింహాచలం వ్యవహారం అతనికి పూసగుచ్చి నట్లు వెల్లడించి తా నిచ్చిన సొమ్ముతో ఆ దురదృష్టవంతుని కుటుంబాని కేవిధమయిన లోటు రాకుండా చూడవలసిదని బ్రతి మాలుకొన్నాడు. అయితే ఆ సంగతిమాత్రం మరి రెండో కంటివాడి కెవడికి తెలియనీయవద్దని గట్టిగా హెచ్చరించాడు.

గోపాలయ్య ఆ ఘోర వృత్తాంతం విని మొట్ట మొదట ఎంతో ఆశ్చర్యపడ్డాడు. మాటిమాటికి అనేక విధాల ప్రశ్నించి దానిలో రంగనాయకుని తప్పిద మేమి లేదని కొంతవరకు సంతృప్తిపడ్డాడు. అయితే సింహాచలంవంటి నమ్మినబంటు తిరుమలరెడ్డి దురాలోచనవల్ల ఆ విధంగా కావేరి పాలయినాడే అని కంట నీరు పెట్టుకొన్నాడు. ఏది ఏమయినా చేసిన పని మాత్రం చాలా చెడ్డదని నెచ్చెలిని మాటి మాటికి మంద లించాడు. అయితే దుస్సహ పశ్చాత్తాపంతో మేళవించిన రంగనాయకుని దైన్యధోరణి గమనించి సొమ్ము చాటుమాటుగా సింహాచలం కుటుంబాని కందీయడాని కంగీకరించాడు. తిరిగి ఇంకొకమారు శ్రీరంగం వచ్చినప్పుడు తప్పక ఆతిథ్యం స్వీకరించ గలనని మాట ఇచ్చి, అత డందించిన విలువయిన కానుకలు కొన్ని స్వీకరించి తీయ తీయని ప్రసంగంతో వీడ్కొన్నాడు.

రంగనాయకుని కప్పటికి గుండెమీద మోపిన పెద్ద బరు ఒకటి తొలగిపోయిన ట్లనిపించింది. వెంటనే ఇంటికి తిరిగివచ్చి భోజనాలవేళ హేమసుందరి కా సంగతి తెలియజేశాడు. ఆమె ఆతని ఔదార్యాని కెంతో సంతోషించి అభినందించింది:

"అవును ! మరి ! మధ్యన ఆ నిర్భాగ్యు డన్యాయంగా కావేరి పాలయిపోయాడు ! ఆంబోతు ఆంబోతు పోట్లాడుకొని మధ్యన లేగదూడ కాళ్లు విరిచేశాయిట ! పాపం చిట్టచివరకి వాడి బతు కిలాగ తెల్లారిపోయింది ! పోనీయండి ! ఏదో చేత నయిన సాయం చేశారు ! ఇంతకి మీరే పాపము ఎరుగరు కదా !"

రంగనాయకుని కానాడు బొత్తిగా భోజనం సయించ లేదని గ్రహించడానికి హేమసుందరి కెంతోసేపు పట్టలేదు.

"ఇదేమి టీవేళ ఇలాగున్నారు ! ఒంట్లో బాగాలేదా ?"

"లేకేమి ? మొన్న శ్రీశైలం చెప్పిన మాటలు విన్నప్పటి నించి నా మన స్సేమి బాగా లేదు. మనం మఠానికి వెళ్లడం ఆ యజ్ఞమూర్తిగారి కేమాత్రము ఇష్టం లేదట ! మన మూలాన తగు మనుష్యు లెవ్వరు అక్కడ అడుగుపెట్టడమే లేదట ! అందు చేత ఆనాటి కానాటికి బ్రహ్మచారుల కింత అన్నం దొరకడమే గగనమైపోతున్నదట !"

"ఈ సంగతి శ్రీశైలానికెలా తెలిసిందో ! ఎప్పుడయినా మీ రతని దగ్గరికి వెడుతున్నారా ?"

"లేదు. మొన్న స్వామి పుష్కరిణి ఒడ్డున కనిపించి చెప్పాడు. ఇక తన మాటే తలపెట్టకనే అస్తమానము మఠం లోనే కాలక్షేపం చేస్తున్నానని ఒక వేళ నేనంటే కొంచెం అసూయ పడుతున్నాడేమో తెలియదు మరి ! అయినా ఈ మధ్య బ్రహ్మచారులు కొందరు ఎంతో ఇబ్బంది పడుతున్నట్టే కనిపించారు. అయ్యో ! మన మూలాన మఠాని కెంతటి ఇబ్బంది కలుగుతున్నదో !"

నిజానికి హేమసుందరి కా పరిణామం కొంత వరకు సంతోషం కలిగించింది. మొట్టమొదటనించి ఆచార్యుని యెడల ఆతని ప్రగాఢ భక్తి హేమ కెంతో అలజడి కలిగించింది. ఆ నిరంత రాందోళన ఇంతవరకు ఆమె నడుగడుగునా వెంటాడి స్తూనే ఉన్నది. అయినా ఇంతకాలంనించి ఆమె ఎడతెగని ఓరిమితో వహించింది. ఇప్పు డిక అతని మనస్సు కష్టపెట్టడంవల్ల మరి ప్రయోజన మేమి లేదని గ్రహించుకొని నెమ్మదిగా అడిగింది:

"అయితే రామానుజు లెప్పు డయినా అక్కడికి రావద్దని మిమ్మల్ని హెచ్చరించారా?"

ఆ ప్రశ్న విని రంగనాయకు డెంతో ఆశ్చర్యపడ్డాడు!

"ఎంతమా టన్నావు! ఆయన మాటలలో నా కెప్పుడు అటువంటి సూచనే స్ఫురించలేదు! పైగా ఎప్పు డయినా ఒక నాడు వెళ్ళకపోతే "నిన్న రాలేదేమి నాయనా!" అని ఎంతో ఆప్యాయంగా అడుగుతున్నారు. ఇంతకి వారి దర్శనం కోసమే కదా నే నక్కడికి వెడుతున్నది?"

హేమ రవంతసే పాలోచించింది:

"దేవుడు వరమిచ్చినా పూజారి అడ్డుకొన్నాడట! అలా గుంది ఆ మఠాధిపతి వరస! పోనీయండి! వారి కంత ఇష్టం లేకపోయి నప్పుడు మన మక్కడికి వెళ్ళడం ఎందుకు? ఎప్పు డయినా నేను వెళ్ళినా అంతే! వారిలో కొందరు నన్ను పురుగుని చూసినట్టు ఈసడించి దూరదూరంగా తప్పుకొంటున్నారు. అయినా నేనేమి పట్టించుకోవడంలేదు లెండి! కాని ఇటీవల అక్కడ అడుగు పెట్టడానికే నాకు మనసొప్పడం లేదు."

"పోనీలే ! హేమా ! ఎప్పుడు వెళ్ళినా ఆచార్యులెంతో ఆదరంతో పలకరిస్తున్నారు గదా ! మరి మిగిలిన వారితో మన కేమి పని ! అదీగాక మనవల్ల అంతమంది లేనిపోని ఇబ్బందుల పాలవుతున్నప్పుడు మాటిమాటికి అక్కడికి వెళ్ళడం కూడా న్యాయం కాదేమో ! వారి మాట తలుచుకుంటే నా కీవేళ అన్నం కూడా తిన్నగా సయించడంలేదు."

రంగనాయకుడు ఆదరాబాదరాగా భోజనం ముగించుకొని ఒక దంతం పెట్టెలో తన రత్నాంగుళీయకాలయిదు, ముంజేతి కడియము ఉంచి హేమ వైపు చూచి కొంచెం తటపటాయిస్తూ "నీ నగ లేమయినా ఇస్తావా ?" అన్నాడు. ఆమె ఎందుకన్నట్టు సన్నగా బొమముడి విరిచింది.

"ఒకసారి మఠంవైపు వెళ్ళివద్దామని అనుకుంటున్నాను."

హేమ క్షణంలో అతని అభిప్రాయం గ్రహించింది. "అవును ! బ్రహ్మచారులక్కడ పట్టెడన్నానికి కూడా ఇబ్బంది పడుతున్నారని తెలిసినప్పుడు మన కేమి పట్టనట్టు చూస్తూ ఊరుకుంటే ఎలాగ !"

ఆమె వెంటనే తన మెడలో మిక్కిలి విలువయిన సువర్ణాలంకారాలు కొన్ని తీసి అతని చేతిలో ఉన్న పెట్టెలో ఉంచింది. రంగనాయకు డది మూసి, మఠానికి బయలుదేరాడు.

"ఇంత మిట్ట మధ్యాహ్నంవేళ వెళ్ళడ మెందుకు ? కొంచెం చల్లబడిన తరవాత వెళ్ళకూడదా ?"

హేమ అనునయగర్భిత స్వరంతో ప్రశ్నించింది.

"చలికాలం ఎండ కూడా ఒక ఎండేనా ?" రంగనాయకు డలాగే తొందర తొందరగా అడుగులు వేసుకుంటూ సాగి పోయాడు. అతడు మఠంలో అడుగుపెట్టేసరికి రెండు జాము లయింది. మొట్టమొదట రంగనాయకుడా అలంకారాలతో నింపిన పేటిక దాశరథి కందీయవలెనని అనుకొన్నాడు. అది మఠంలో వా రందరు రవంత విశ్రమించేవేళ. అందుచేతనే దాశ రథి ద్వారంలో కనబడి ఉండకపోవచ్చునని రంగనాయకు డను కొన్నాడు. నెమ్మదిగా ఆ అంతేవాసి విశ్రమించిన ప్రదేశంలో ప్రవేశించి దేవరాజస్వామికి తన కానుక లర్పించవలసినదని ఎంతో వినయంతో వేడుకొన్నాడు. కాని దాశరథి కొంచెం సంకోచించి "స్వయంగా మీరే ఇవి యజ్ఞమూర్తిగారికి సమ ర్పించకూడదా ?" అన్నాడు.

"వా రెక్కడ ఉన్నారో !" అన్నాడు రంగనాయకుడు రవంత ఆశ్చర్యపడి. అత డింతకు మును పెప్పుడు స్వామి పేరిట దాశరథికే తన కానుక లర్పించాడు. నే డాతని సంకోచంతో రంగనాయకుని గుండెలో కొంచెం గుబులు బయలుదేరింది.

"ఇప్పుడే దిగుడు బావి దగ్గరికి వెళ్ళారు. తోటమాలితో ఏదో మాట్లాడుతున్నట్టున్నారు ! అదిగో, వారి గదిలో చిత్రా సనాని కెదురుగా కొంచెంసేపు విశ్రమించండి ! ఎంతోసేపు ఆలస్యం కాదు. ఇప్పుడే తిరిగి వస్తారు."

రంగనాయకుడు దాశరథి నిర్దేశించిన చోట కూర్చుని యజ్ఞమూర్తి రాకకోసం నిమేష మొక యుగంగా నిరీక్షించాడు. అలాగ ఒక అరగడియ గడిచినా యజ్ఞమూర్తి తిరిగి రాలేదు.

అంతలోనే మఠం పెరటిలో ఒక పెద్ద కలకలం చెలరేగింది. బ్రహ్మచారులు కొంద రెలుగెత్తి పరుష స్వరాలతో ఒక రొకరిని నోరారా దూషించుకొంటున్నారు. రంగనాయకు డిన్నాళ్లనుండి మఠావరణలో ఎక్కడవెవ్వరు కొంచెం గొంతెత్తి మాట్లాడిన సవ్వడి కూడా వినలేదు. అందుచేత ఇప్పుడా పోట్లాట అతని కెంతో ఆశ్చర్యం కలిగించింది! వారి కలహ కోలాహలం కమ్రక్రమంగా రంగనాయకుని వీనుదోయిలో విస్ప ష్టంగా ప్రతిధ్వనించింది:

"ఈ వేళ ఉదయం ఇక్కడ ఆరవేసుకొన్న ఉత్తరీయం ఎక్కడికి పోతుంది? నువ్వే తీసిఉంటావు! లేకపోతే అది రెక్కలు కట్టుకుని ఎక్కడికయినా ఎగిరిపోతుందా?" ఒకటి రెండు మాసాల క్రితం కొత్తగా మఠంలో చేరిన ఒక బ్రహ్మ చారి గొంతెత్తి గర్జించాడు.

"నీ ఉత్తరీయం గొడవ నే నెరగనయ్యా, మహాను భావా! ఎందు కలా గొంతు చించుకుంటావు?" ప్రతి సమా ధానం మరింత కర్ణ కఠోరంగా వినిపించింది.

"అయ్యో! నీ ఉత్తరీయమే కాదు! నా శాటీ కూడా కనబడడం లేదయ్యా, ఏమయిపోయిందో గాని!"

"ఇదిగో! సోమయాజీ! నీవు గాని నా ఉత్తరీయం తీశావా? ఇంకెవరున్నారు తియ్యడానికి! నువ్వే తీసిఉండాలి!"

మొట్టమొదటి కొత్త బ్రహ్మచారి గొంతు తిరిగి మరింత పరుషస్వరంతో ప్రతిధ్వనించింది.

"ఏమో నే నెరగను!"

సోమయాజి అన్న ఇంకొక బ్రహ్మచారి సమాధానం మరింత దురుసుగా దూసుకుపోయింది.

"ఇదిగో, నువ్వు ఇక్కడ అడుగపెట్టి నప్పటినించి చూస్తు న్నాను. నీ వాలకం ఏమి బాగాలేదు. తీస్తే చెప్పు. నీ కేమి భయంలేదు. లేకపోతే ఇది మన మఠం ధర్మాధికారివరకు వెళ్ళి పోతుంది. కొంచెం జాగ్రత్తగా ఆలోచించుకో !"

"ఏమిటయ్యా నువ్వు చేసేది ? యజ్ఞమూర్తి గారితో చెప్పుకుంటావో, ఇంకెవరితో చెప్పుకుంటావో చెప్పుకో ! ఆయన గాని వచ్చి నా తల తీసేస్తాడా ?"

ఆ కలహం క్రమక్రమంగా మితిమీరింది. రోషావేశాలు మాటిమాటికి శ్రుతిమించి బాగారాగాన పడ్డాయి. ఎవ రెవ రితో మాట్లాడుతున్నారో విస్పష్టంగా వినబడలేదు. కర్ణ కఠోర మయిన కోలాహలం మాత్రం క్రమక్రమంగా రెచ్చి పోయింది.

"మాటలు మాత్రం తిన్నగా రానీ లేకపోతే చూడు నిన్నేం చేస్తానో !"

"ఏమిటి చేస్తావు ! నా ఉత్తరీయము, ఆయన శాటీ నువ్వే తీశావు ! ముమ్మాటికి నువ్వే తీశావు ! లేకపోతే అవి రెండు అమాంతంగా ఎక్కడి కెగిరిపోతాయి ! ఇన్నాళ్ళనుంచి ఎప్పుడయినా ఈ మఠంలో ఇంతటి ఘోరం జరిగిందా ?"

"నోరు ముయ్ ! మళ్ళీ కనక ఆ మాట రెట్టించావంటే మెడ దొరక బుచ్చుకొని వీధిలోకి విసరివేస్తాను, తెలి సిందా ..."

పట్టరాని దూరాగ్రహావేశంతో సోమయాజి భగ్గుమని ప్రజ్వలించాడు !

"ఆఁ ఆఁ ఏమన్నావు ! మెడ దొరక బుచ్చుకొని వీధి లోకి విసిరివేస్తావురా ! పశువా !"

"ఏమన్నావు ! పశువునా నేను !"

సోమయాజి కళ్ళెర్రజేసి, పిడికిలి బిగించి అతని మీదికి లంఘించబోయాడు !

"నీలాంటి పచ్చి దొంగకన్న పశువే కోటిరెట్లు నయం!"

ఆ కర్కశాధిక్షేపణతో వారొకరొకరితో తలపడి పోట్లాట ప్రారంభించి ఉండవలసినదే !

అంతలోనే యజ్ఞమూర్తి ఒక్క అంగలో అక్కడికి వచ్చి వారిద్దరిని వేరుచేసి శాంతించవలసినదని గట్టిగా హెచ్చరించడంతో ఆ కలహం క్రమక్రమంగా చల్లారింది. కాని తలవని తలంపుగా అకస్మాత్తుగా ఎదురుపడిన ఆ దుస్సంఘటనతో అతనికి హృదయం వేయి శకలాలుగా విడిపోతున్నంత దుస్సహ వేదన కలిగింది ! అతని ఎరుకలో అటువంటి ఘోర పరిస్థితి ఎన్నడు సంభవించలేదు ! ఎంతగా జాగ్రత్తగా పరిశీలించినా వారి వస్త్రాల జాడలయినా ఎక్కడ గోచరించలేదు ! సరే, ఆపైన నెమ్మదిగా కనుక్కోవచ్చునన్న ధైర్యంతో యజ్ఞమూర్తి నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ తన గదిలో ప్రవేశించారు.

మఠాధిపతి లోపల అడుగు పెట్టగానే రంగనాయకుడు ఎంతో అడకువతో లేచి నిలుచున్నాడు. యజ్ఞమూర్తి అతడు పట్టుకొన్న పెట్టె కొంత వింతగా పరిశీలించాడు.

"ఏమిటి బాబూ! విశేషం! ఇలాగ వచ్చారు?" రంగ నాయకునికా ప్రశ్నలో రవంత పౌరుష్యం ప్రతిధ్వనించింది. అందుచేత దానికి సూటిగా సమాధానం చెప్పలేదు.

"పాపం మఠంలో బ్రహ్మచారులు శాటీలు కూడా లేక ఎంతో ఇబ్బంది పడుతున్నారులా ఉంది!"

యజ్ఞమూర్తి కతని సానుభూతి అంతగా రుచించలేదు!

"అబ్బే! అలాంటి ఇబ్బంది ఏమిలేదు! అంతా సవ్యం గానే నడిచిపోతున్నది! ఆ బ్రహ్మచారులందరు ఇంకా ముక్కు పచ్చలారని పసివారు! ఇళ్ళదగ్గర తమ కేవిధమయిన లోటు లేకపోయినా ఆచార్యుల యెడల ప్రగాఢ భక్తి శ్రద్ధలతో అంతే వాసులయినారు! ఏవేవో ఇబ్బందులవల్ల మాటా మాట అనుకున్నారు! అంతే!"

అసలే యజ్ఞమూర్తి తన ఆధ్వర్యవంలో అనుచరుల కంతటి దురవస్థ తటస్థించినదని అట్టుడికి నట్టుడికి పోతున్నాడు! దానికంతటికి ప్రధాన కారణ మనుకొన్న రంగనాయకుడు తల వని తలంపుగా అదే సమయంలో ఇక్కడ కనబడగానే చిర కాలంనుండి లోలోపల అణగించి వేసుకొన్న అతని దురా గ్రహం తటాలున తలకెక్కింది! అయినా యజ్ఞమూర్తి అది అనన్య సామాన్య నిగ్రహంతో లోలోపలే అణగించి వేసుకొన్నాడు!—అంతలోనే మఠావరణంలో రవంత కలహ కోలా హలం చెలరేగింది

రంగనాయకు డింతవరకు అలాగే నిలుచున్నాడు. యజ్ఞ మూర్తి అతనిని తన కెదురుగా పరిచిన చిత్రాసనం మీద

కూర్చోవలసినదని కూడా అనలేదు ! రంగనాయకునికి మఠంలో అటువంటి అమర్యాద జరగడాని కదే మొదలు ! అయినా అత డెక్కడ చెక్కుచెదరలేదు ! అతి నగవుతో ఉట్టిపడుతున్న అడ కువతో పెట్టె తెరిచి మఠాధిపతి ముందుంచి విన్నవించాడు !

"ఎప్పుడు లేనిది ఈ మధ్యన మీవంటి మహనీయు లందరికిని నా మూలాన ఎంతో ఇబ్బంది కలుగుతున్నట్టున్నది ! దయచేసి ఈ కానుకలు స్వీకరించి స్వామికి సమర్పించండి !"

యజ్ఞమూర్తి ఎటువంటి కష్టా లెదురుపడినా ఎంతో గుంభనగా సహించుకోగలడు ! కాని రంగనాయకుని అతి వినీత వైఖరి ఒక్కమారుగా ఆతని ఓరిమి అంతా క్షణంలో సడలించి వేసింది ! మరి భరించలేక తోక తొక్కిన తాచులా కస్సు మన్నాడు :

"నీ పాపిష్ఠి ద్రవ్యం మా కక్కరలేదు ! తీసుకుపో !"

రంగనాయకుని కా ధారుణాధిక్షేపణ వినీ వినగానే నడి నెత్తిమీద పెద్ద పిడుగు మొత్తినట్టనిపించింది ! ఎంతగా ప్రయ త్నించినా మరి కొంతసేపటివరకు అతని నోట మాటే వెలు వడలేదు ! అయినా అతికష్టంమీద తమాయించుకొన్నాడు. ఇనుమడించిన అడకువతో శిరస్సు కొంచెం వంచుకొని దోసిలి కట్టి తిరిగి నివేదించుకొన్నాడు !

"నేను పాపినయితే కావచ్చును ! కాని నా ఈ ద్రవ్యం మాత్రం పాపిష్టిది కాదు ! శ్రీరంగంలో చెమట ఓర్చి కష్టపడి సంపాదించుకొన్న సొమ్మిది ! నా మాట నమ్మండి ! దయ తలిచి స్వీకరించండి !"

అంతలోనే యజ్ఞమూర్తి రూక్ష వీక్షణం ఛెంగ్ర నిప్పులు చెరిగింది !

"నీ పుట్టు పూర్వోత్తరాల సంగతి నాకు తెలియదనుకున్నావా! నిచుళాపురంలో నీ దొంగతనం సంగతి అంతా బయటపడిందిలే ! కొంచెం ఒళ్ళు దగ్గిర పెట్టుకుని జాగ్రత్తగా మసులుకో !"

మరి రంగనాయకుని నోట మాట పెగలలేదు ! అతని శిరస్సు ఇంకా కిందికి వంగిపోయింది ! నాలుక పిడచగట్టుకుపోయినట్టనిపించింది. యజ్ఞమూర్తి ఇక అతనివైపయినా చూడక పక్కనున్న తాళపత్రాల కవిలెకట్ట తెరిచి ఆదాయ వ్యయాల లెక్కలు పరిశీలించడం ప్రారంభించాడు. అప్పటికి రంగనాయకుడు తెలివితెచ్చుకొని, కోలుకొని శిరస్సుమాత్రం మరి పైకెత్తలేక అస్పష్ట స్వరంతో విన్నవించాడు !

"మీరాగన్నమాట నిజమే ! కాని, అది చాలా కాలం క్రితం జరిగిన సంగతి ! ఆ సొమ్మంతా అయిపోయి అప్పుడే చాలాకాలమయింది. ఇది వీధి మొగలలో సాము గరిడీలతో ఒక్కొక్క చిల్లిగవ్వ చొప్పున గడించుకొన్న సొమ్ము ! స్వామి పాదాలమీద పడి ప్రమాణం చెయ్యమన్నా చేస్తాను ! నా మాట నమ్మండి ! పాపం బ్రహ్మచారులు నా మూలాన కట్ట బట్టలేక, తిన తిండిలేక కౌపీనాలతోనే కాలక్షేపం చేస్తున్నారులా ఉంది ! దయవుంచి ఈ సొమ్ము స్వామి కర్పించండి ! మఠంలో ఇన్ని ఇబ్బందులు పడుతున్నట్టు నాకు ఇటీవలే తెలిసింది. లేకపోతే ఇంతకముసుపే కొంత సొమ్ము సమర్పించి

ఉందును. ఎల్లుండి ఇంకా కొన్ని కానుకలు సమర్పించు కొంటాను !"

ఆ ప్రసంగం యజ్ఞమూర్తికి మరింతగా క్రోధావేశం కలిగించింది. నిశితమయిన తార్కిక దృష్టితో క్షణకాలంలో రంగనాయకుని ప్రత్యుత్తరంలోగల అసంబద్ధత అవగాహన చేసుకొన్నాడు. సొమ్ము మంచిదయితేమాత్రం! పాపికి సంబంధించినది పాపద్రవ్యం కాకపోతుందా ? ఇదెక్కడి మాట ! అయితే ఆ విషయమై రంగనాయకునివంటి అజ్ఞానితో వివరించ దలుచుకోలేదు ! అందుచేత లోలోపల చెలరేగుతున్న అక్కస్సంతా అతి కష్టంమీద అణగించివేసుకొని ఒక్క నమస్కారం పెట్టి నిశితమయిన రూక్ష దృష్టితో హెచ్చరించాడు !

"బాబూ ! ఇన్నాళ్లనించి అయినదేదో అయిపోయింది! ఇక నువ్వు స్వామికి కానుక లేవి చెల్లించ నక్కరలేదు ! ఇంకొక్క మాట ! ఆ వేశ్యామణితో కలిసి ఇక్కడ అడుగు పెట్టకపోతే మా కదే పదివేలు ! ఇన్నాళ్లనించి ఆచార్యుల ముఖంచూసి ఎంతో ఓపిక పట్టి ఎందు కెందుకని మాట్లాడక కూరుకున్నాను ! ఇక ఉన్నమాట కాస్తా చెప్పక తప్పలేదు!"

రంగనాయకుని కా హెచ్చరికతో ఒక్కమారుగా తల కొట్టివేసినట్టయింది ! ఇన్నాళ్లనించి వట్టి మోట మనుషులు మల్లులు కూడా అతని నింతగా ఆక్షేపించి అవమానించలేదు ! మఠంలో నయినా ఇటీవల చురుకు చూపులు మాత్రమే ఎదురు పడ్డాయి. అంతేగాని పెదవి కదిపి అతని నెవ్వరు పల్లెత్తుమాట అనలేదు ! ఆచార్యుని నోట అమృత మధురమయిన ఆత్మీయ

ప్రసంగమేగాని చూచాయిగా నయినా మరొక్క ధోరణి వినబడలేదు! అందుచేత అతని హృదయం చంద్ర నిప్పుల కుంపటిలో పెట్టినట్లు దుర్భర యాతనతో కుత కుతలాడి ఉడికింది! అయినా అతడా యమయాతన మిక్కిలి ఓరిమితో నిగ్రహించుకొని అలాగే తల వంచుకొని కూర్చున్నాడు. రంగ నాయకుని కిక ఏమనడానికి పాలుపోలేదు. మఠాధిపతి ఏకాగ్ర దృష్టితో తన ముందున్న కలివె కట్టలు పరిశీలించడం ప్రారంభించాడు. అంతలోనే మఠావరణంలో తిరిగి పెద్ద రణగొణధ్వని చెలరేగింది! బ్రహ్మచారులలో కొందరు గొంతు లెత్తి ఒక రొకరిని గట్టిగా తిట్టుకొంటున్నారు! క్షణకాలం ఆ కోలాహలం విన్నాడు యజ్ఞమూర్తి, మరి భరించలేక చేతులతో చెవులు రెండు మూసుకుని ఒక్క అంగలో ఆ పూలతోటవైపు వెళ్లి పోయాడు!

అత డక్కడినించి వెళ్ళిన రెండు మూడు నిమిషాలలోనే బ్రహ్మచారుల కలహ కోలాహలం పూర్తిగా శాంతించింది. కాని యజ్ఞమూర్తి మరి అక్కడినించి తిరిగిరాలేదు! రంగ నాయకుని కిక ఏమి చెయ్యడానికి పాలుపోలేదు! ఇంతకీ తా నర్పించిన కానుక లాయన స్వీకరించినట్టా? తిరస్కరించినట్టా? అతని కేమి అంతుచిక్కలేదు. "సరే ఒకవేళ అక్కరలేకపోతే తిరిగి తిన్నగా మా ఇంటికి పంపించివేస్తారు! లేకపోతే వారికి తోచినట్టు చేసుకుంటారు!" అని రంగనాయకు డుసూరుమని నిశ్వసించాడు. అతనికి యజ్ఞమూర్తి తీవ్రాధిక్షేపణలో గల అంతరార్థమేమో బోధపడలేదు. సామాన్యంగా ఆచార్యుని అనుమతి లేనిదే ఆయన తానై సాహసించి ఏ వ్యవహారము

ఇదమిత్థంగా నిర్ణయించడని రంగనాయకుడిన్నాళ్లనించిగు ర్తిస్తూనే ఉన్నాడు. అందుచేత రామానుజుని సంపూర్ణాంగీకృతితోనే మఠాధికారి తన యెడల అంతటి వైషమ్యంతో వ్యవహరించి ఉండవచ్చునని అనుమానించాడు. కాని, అతని కంత గట్టి నమ్మిక కలగలేదు! ఏది ఏమయినా ఆచార్యుల నొకసారి సందర్శించి తిరిగి తన భవంతికి తరలిపోవచ్చునని నిశ్చయించు కొన్నాడు.

కాని ఆచార్యుని గది సమీపించేసరికి అతని కల్లంత దూరంలో చిత్రాసనంమీద కూర్చున్న యజ్ఞమూర్తి కనిపించాడు. మరి కొంత దూరంలో వేరొకవైపు ద్వారంలో దాశరథి చేతులు కట్టుకుని నిలుచున్నాడు. బహుశః దాశరథి ద్వారా యజ్ఞమూర్తిని తమ సన్నిధికి రావలసినదని రామానుజులాదేశించి ఉండవచ్చునని రంగనాయకు డూహించుకున్నాడు. ఆయన వెళ్ళిపోయిన తరువాత, తన దర్శనం ముగించుకోవచ్చునని నిశ్చయించుకున్నాడు. తాళపత్ర గ్రంథ మేదో పఠిస్తున్న రామానుజ యతి రవంత శిరస్సు పైకెత్తి యజ్ఞమూర్తి ముఖ వైఖరి గమనించి ప్రగాఢాదర దృష్టితో ప్రశ్నించాడు :

"ఏమిటి యజ్ఞమూర్తి! ఎందుకోగాని బాగా మదనపడు తున్నట్టున్నావే! ఆ బ్రహ్మచారు లెందు కలాగ గొంతులు చించుకొంటున్నారు! ఇంతకి ఏమి జరిగింది...నాయనా! మనది శ్రీ వైష్ణవ మతమేనా"

మఠాధిపతి ముఖంమీద కత్తివాటు వేసినా నెత్తురు చుక్కలేదు! శిరస్సు బాగా కిందికి వంచివేసుకుని ఉసూరుమని నిశ్వసించి విన్నవించాడు:

"ఏమని మనవి చెయ్యను! ఆ బ్రహ్మచారు లందరు అర్థాకళ్లతోనే సరిపెట్టుకుంటున్నారు! అందుచేత బాగా బ్రతిమాలుకొని అదుపులో పెట్టినా మాటిమాటికి ఇట్టే రెచ్చిపోతున్నారు ! శాటీ ఒకటి, ఉత్తరీయం ఒకటి ఎవరు తీశారో గాని, ఎక్కడ కనబడడంలేదు! మిగిలినవారు ఆ నింద అంతా సోమయాజిమీద నెట్టివేస్తున్నారు. అతడు నే నే పాపమూ ఎరగను మొర్రో అని మొత్తుకొంటున్నాడు!..."

రామానుజ యతి అంతలోనే ఆర్థోక్తిలో అందుకొని ఉసూరుమని నిశ్వసించాడు.

"వట్టి శాటీలకోసమేనా మన మిక్కడికి చేరుకొన్నది ?..."

యజ్ఞమూర్తి కిక ఊపిరాడలేదు !

"ఇంతకీ పాపం వారిని అనవలసినదేమి ఉన్నది! కొంచెం సిరి సంపదలున్న భక్తు లెవ్వరు మన మఠం వైపే రావడం మానుకొన్నారు! అందుచేత ఎంతగా ప్రయత్నించినా ఆపూట గడవడమే గగనమయిపోతున్నది!"

రామానుజ యతి ముఖతః తిరిగి ఒక సుదీర్ఘ నిశ్వాసం వెలువడింది !

"యజ్ఞమూర్తీ! ఐశ్వర్యవంతుల యెడల నీ వెంతో ఆశ పెట్టుకొన్నట్టున్నావు! ఎన్నెన్ని విధాల ప్రయత్నించినా వారు సిరిసంపదలమీద పేరుకొన్న తమ విపరీత వ్యామోహం విడనాడకోగలరా! ఎక్కడో సకృత్తుగాగాని ఐశ్వర్యం ఔదార్యంతో మేళవించదు! ఇంతకీ ఒకరి గోడు మనకేల ? స్వామి

స్వయంగా అనుగ్రహించిన భిక్షాపాత్ర లున్నాయిగదా ! మరి ఎందుకు నీకీ తేనిపోని ఆందోళన !"

ఆ ప్రశ్నతో యజ్ఞమూర్తి అట్టుడికినట్టుడికిపోయాడు ! మరి భరించలేక దుస్సహ నైరాశ్యంతో నివేదించాడు :

"స్వామీ ! భిక్షాపాత్రల మాట నాకు జ్ఞప్తికి రాక పోలేదు ! కాని ఎన్నడు లేనిది మఠాని కింతటి దుఃస్థితి తటస్థించి నదే అని ఎంతో అల్లల్లాడిపోతున్నాను. కొంతకాలంనించి ఎంతగా ప్రయత్నించినా ఆదాయ వ్యయాల లెక్క-లెక్కడ ముడిపడడం లేదు. ఏమి చెయ్యను !"

అయినా రామానుజుని పెదవులపై సూక్ష్మ దరహా సితం మాత్రమే సాక్షాత్కరించింది :

"ఎందుకు నాయనా ! నీకీ లేనిపోని మథన ! అన్నిటికి ఆ దేవరాజస్వామి ఉన్నారు గదా ! ఎప్పుడు ఎడ తెగని అనా సక్తదృష్టి అలవరచుకో ! అన్ని వాటంతట అవే నెరవేరు తూంటాయి ! ఒకవేళ నెరవేరకపోయినా మన మిక చెయ్యగలి గినదేమి లేదు !...అన్నట్లు రంగనాయకుని మాట వినబడ్డట్టు న్నది ! అతడుగాని ఇక్కడికి వచ్చాడా ?"

తమ ఇద్దరి మధ్య నడిచిన ప్రసంగం రామానుజునికి విన బడగలదని అత డూహించలేదు ! అందువల్ల ఆ ప్రశ్న విని యజ్ఞమూర్తి రవంత నిర్ఘాంతపడ్డాడు :

"అవును ! ఇప్పు డిప్పుడే కొన్ని కానుకలతో నా దగ్గి రికి వచ్చి అవి స్వీకరించవలసినదని వేడుకొన్నాడు. ఇటీవల

అతని రాకపోకలవల్లనే మన కింతటి ఇబ్బంది కలుగుతున్నది ! అయినా తీరా వచ్చిన తరవాత మరి కాదనలేక అవి స్వీకరించాను. కాని ఇక అతని సామ్మొక్కరలేదని నిష్కర్షగా చెప్పివేశాను. మరి ఇక్కడ అడుగుపెట్టవద్దని కూడా గట్టిగా హెచ్చరించాను !"

ఆ ప్రత్యుత్తరం వినగానే రామానుజుని ముఖంపై దుస్సహ వ్యధారేఖ తాండవించింది !

"అయ్యయ్యో ! ఎంతపని చేశావు ! స్వామికి కానుక లర్పించవలెనని వచ్చిన వారిని కాదనడానికి మన మెవ్వరం నాయనా !" తాను చేసిన పని ఆచార్యుల కంతటి తీవ్ర మన స్తాపం కలిగించగలదని యజ్ఞమూర్తి ఒకించుకయినా ఊహించి ఉండలేదు ! అందువేత ఆయన ముఖం వైపయినా కన్నెత్తి చూడలేక ఎంతో ఖిన్నుడై శిరస్సు వంచుకొన్నాడు. రామానుజు డంతలోనే తిరిగి ప్రశ్నించాడు :

"అయితే రంగనాయకుడు వెంటనే తిరిగి వెళ్ళిపోయి నాడా !"

"లేదనుకొంటాను !"

అదే క్షణంలో శాటీతో, ఉత్తరీయంతో ఒక బ్రహ్మచారి అక్కడికి వచ్చి వారిద్దరికి సవినయంగా నమస్కరించాడు. యజ్ఞమూర్తి వైపు తిరిగి అవి రెండు పెరటిలో ఒకమూల దట్టంగా అలముకొన్న గుమ్మడి పాదులో దొరికినట్లు వెల్లడించాడు. గాలి కెగిరిపోయి లుంగలు చుట్టుకొని అక్కడ పడి ఉండవచ్చునని అందరు అనుకొంటున్నారని విన్నవించాడు. సెలవు తీసుకొని వాటితోపాటు తిరిగి వెళ్ళిపోయాడు.

యజ్ఞమూర్తి ముఖాన మరి కత్తి వాటు వేసినా నెత్తురు చుక్కలేదు! ఆ ఖిన్న ధోరణి గమనించి ఆచార్యుడార్ద్ర స్వరంతో సమాశ్వాసించాడు!

"నాయనా! అనవసరంగా ఆత్రపడుతున్నావుగాని చిట్ట చివరికన్నీ సవ్యంగానే సాగిపోతాయి. ఇంతమాత్రానికే ఆ బ్రహ్మచారులు తమలో తాము కలహించుకొన్నారు! నీకు తీరని మనోవ్యథ కలిగించారు!"

యజ్ఞమూర్తి కప్పటికి తన తప్పిదం పూర్తిగా తెలిసి వచ్చింది. రవంతయినా ఓరిమి సహించలేని బ్రహ్మచారులు మూలాన, కానుక లర్పించవలెనని వచ్చిన రంగనాయకుని మీద విరుచుకుపడి మరి మఠంలో అడుగుపెట్టవద్దని గట్టిగా హెచ్చరించి అవమానించాడు! అతని మనస్సొక్కమారుగా శతధా వికలమయింది! మరి ఆ యాతన సహించలేక ఆచార్యుని కెదురుగా సాగిలపడి అస్పష్ట స్వరంతో నివేదించాడు!

"ఎంతగా నిగ్రహం అవలంబించినా చిట్టచివరికి నావల్ల పెద్ద అపరాధమే జరిగిపోయింది! ఇక ఈ మఠ నిర్వహణ నావల్ల కాదు! నన్ను మన్నించి కరుణించి ఇది నాకంటె పెద్దల కెవ్వరికయినా అప్పగించండి! నా కిది బొత్తిగా తలకు మించిన పని! మరి నేనీ బరువు మోయలేను!"

దుస్సహమానసిక వ్యథతో యజ్ఞమూర్తి కంఠస్వరంలో రవంత గద్గదిక పొడగట్టింది. తిరిగి అలతినగవుతో రామానుజ యతి అతనిని సమాశ్వాసించాడు:

"యజ్ఞమూర్తి! ఈ భారమంతా స్వామి శిరస్సు మీద మోపి ఉంటే నీ కింతటి మనోవ్యథ కలిగి ఉండదు! ఇంతకి

ఈ బరువంతా మోస్తున్నది ఆయనే కాని మనం కానేకాదు! ఇక ఎందుకు మన కీ లేనిపోని ఆరాటము!"

యజ్ఞమూర్తి మరి మాట్లాడలేదు! గంభీర మౌనముద్రతో తిరిగినమస్కరించి మిక్కిలి అడకువతో వీడ్కోనవలెనని సంకల్పించుకొన్నాడు కాని, ఆచార్యు డాతని నంతటితో విడిచిపెట్ట లేదు.

"నాయనా! నావల్ల మీ కందరికి అడుగడుగునా ఎన్నెన్నో కష్టా లెదురుపడుతున్నట్టున్నాయి!"

అయినా యజ్ఞమూర్తి మౌన వైఖరిలో ప్రసన్నత గోచరించలేదు! ఎట్టకేల కెంతో అడకువతో దోసిలికట్టి విన్నవించుకొన్నాడు:

"ఎంతమాట! అజ్ఞుడను! నేను మీ కేమని నివేదించుకోగలను! నా అసమర్థతవల్లనే నేటికి మన మతానికి కింతటి అప్రతిష్ట కలిగినది! ఇప్పటికయినా కరుణించి నా కీ ఆందోళన తొలగించవలసినదని ప్రార్థన."

అయినా ఆచార్యుడు కేవలం గంభీర మౌనముద్ర వహించినట్టు గ్రహించి యజ్ఞమూర్తి మరి ప్రసంగించలేక అస్పష్ట స్వరంతో వీడ్కొన్నాడు. వారిద్దరి మధ్యన సాగిన ప్రసంగం విని మఠాధిపతి ముఖవైఖరి పరిశీలించిన పిమ్మట రంగనాయకుని కెంతో కనువిప్పు కలిగింది! అంతలోనే అతడు దాశరథి కనుసన్నతో గదిలోపల ప్రవేశించి ఆచార్యునికి కినుమడించిన అడకువతో సాగిలపడి నమస్కరించి క్షణకాలం నిర్మల కారుణ్యంతో తొణికిసలాడుతున్న విశాలనేత్రాల వైపవలో

శించి శిరస్సు వంచుకొన్నాడు. అతని కా వెడద కనుదోయి వైపు చూడగానే ఓరగా ఒరిగిన ఇంద్రధనుస్సువంటి కనుబొమ్మల మధ్యభాగంలో వేగు జుక్కలవలె తరళిస్తున్న శ్రీ రంగశాయి సువిశాల విలోచన ద్వయిధాళవళ్యం తటాలున సాక్షాత్కరించింది! నేత్రాంతాలలో వేడి వేడి కన్నీటి బిందువు లొకటి రెండు పొటమరించాయి. "అయ్యో! నా కిక ఆచార్యుల సాంగత్య భాగ్యం లభించను కాబోలు!" అనుకొని ఉసూరుమని నిశ్వసించాడు.

రామానుజు డాతని దైన్యధోరణి గమనించి తొణికిస లాడుతున్న ఆప్యాయతతో ఆర్ద్ర కంఠస్వరంతో సమాశ్వాసించాడు:

"నాయనా! యజ్ఞమూర్తి తొందరపడి నీ మన స్సెంతో నొప్పించినట్టున్నాడు! అయితే అతని మాటలేవి నీవు పాటించ నక్కరలేదు! యథా ప్రకారంగా ఇక్కడికి వస్తూ పోతూ ఉండ వచ్చును!"

అయినా రంగనాయకుడు డేమాత్రము వంచినతల పైకెత్తలేదు.

"తమ దయ ఎంతటిదో నాకు తెలికపోలేదు! కాని నా రాకపోకలవల్ల మఠాని కా పూట గడవడం కూడా గగనమయి పోతున్నట్టున్నది! నా జాతకమే అటువంటిది! నే నేమి చెయ్యను!"

రంగనాయకుని ముఖతః సుదీర్ఘ విశ్వాసం వెలువడింది. అదే క్షణంలో ఆచార్యుని అభిప్రాయం గ్రహించిన దాశరథి

లోపల ప్రవేశించి స్వామి ప్రసాదం రంగనాయకుని ముందుం చాడు. అత డది స్వీకరించి తిరిగి ఆచార్యుని కెంతో అడకువతో సాష్టాంగ నమస్కృతి సమర్పించి వీడ్కొన్నాడు. వీధి మలుపులో కనిపించినంతవరకు అతడు మాటి మాటికి రామానుజుని నేత్రాలపై నవలోకిస్తూనే ఉన్నాడు.

ఇంటిలో అడుగుపెట్టిన తరవాత హేమవైపు చూచి, "ఇక ఈ నాటితో మఠానికి నాకు ఋణం తీరిపోయింది" అన్నాడు. ఆమె అదిరిపడింది.

"అదేమిటి ? అలాగంటున్నారు ? ఆచార్యు లేమయినా ఇక అక్కడికి రావద్దని అన్నారా ?"

"వారి నోట అటువంటి మాట ఎన్నడు వెలువడదు! కాని నే నక్కడకు వెళ్ళడం మఠాధిపతి కే మాత్రము ఇష్టం లేదు! అదీగాక మన రాకపోకలవల్ల వారికెంతో ఇబ్బందికలుగుతున్నది. అనవసరంగా మన కెందుకీ అపనింద! ఇక నే నక్కడ అడుగు పెట్టదలచుకోలేదు !"

వాస్తవాని కా పరిణామంవల్ల హేమసుందరి లోలోపల ఎంతో సంతోషించింది. కాని దుస్సహ ధైన్యంతో దిగాలుపడి కూర్చున్న అతని ముఖవైఖరి గమనించి రవంత ఓదార్చింది:

"పోనీయండి ! వారి కంత ఇష్టం లేకపోయిన తరవాత మనమేమి చెయ్యగలము !, అయినా వారికి మనకి సాపత్య మేమిటి ? ఇంతకి ఆచార్యు లేమి అనలేదుగదా ! మన కదే పదివేలు !"

అయినా రంగనాయకుని ముఖవైఖరిలో రవంతయినా మార్పు కనబడలేదు! ఉసూరుమని నిశ్వసించి పెడముఖం పెట్టుకొని కూర్చున్నాడు. హేమ ఆ ధోరణి గమనించి నిలువునా నిర్ఘాంతపడి వల్లమాలిన మనస్తాపంతో లోలోపల సణుగుకొన్నది:

"మళ్లీ ఏదోవిధంగా అక్కడికి వెళ్ళినా బాగుండును! ఈయన ధోరణి చూస్తే అప్పుడే మతిపోయినట్టున్నారు! ఆయ్యో! రాత! ఎందు కీ లేనిపోని యాతన!"

# 27

ఆపైన హేమసుందరి కాని, రంగనాయకుడు కాని ఎన్నడు మఠంలో అడుగు పెట్టలేదు! అలాగ వారం పది రోజులు గడిచిపోయాయి! కొంచెం సిరి సంపదలున్నవారి కెవ్వరికి ఆ వార్త అంత త్వరగా తెలియలేదు. అందువల్ల మఠం మీద వారి వైఖరిలో మార్పేమి గోచరించలేదు! అయినా యజ్ఞమూర్తి పరిస్థితులన్నీ క్రమ క్రమంగా తప్పక చక్కబడ గలవని బాగా సంతృప్తిపడ్డాడు. ఇటీవల రంగనాయకు డర్పించిన కానుకలతో ప్రస్తుతానికి మఠాని కే లోటు రానీయకుండా కాలక్షేపం చెయ్యవచ్చునని అతని కెంతో ధైర్యం కలిగింది. అయితే ఆచార్యుని ధోరణిలో మాత్రం యజ్ఞమూర్తి కొక వింత గోచరించింది. రెండు మూడు మారులాయన హేమసుందరీ రంగనాయకుల విషయం ప్రశ్నించాడు. యజ్ఞమూర్తి వా

రిటీవల మఠంవైపే రావడం మానుకొన్నారని రవంత ముభా వంతో సమాధానం చెప్పి తప్పించుకొన్నాడు.

అది జరిగిన మరునాటి తెల్లవారుజామున మఠంలో ఒక పెద్ద కలకలం చెలరేగింది! ప్రభాతవేళ గభీర మధుర స్వరంతో మఠదైవతం దేవరాజస్వామి స్తోత్ర శ్లోక పారాయణం రామా నుజయతి కొక నిరంతర పరిపాటి. ఆ మనోహరంద్ర కంఠధ్వని ఆ నాడం తేవాసు లెవ్వరికి వినబడలేదు! అది వారందరికి ఎంతో విడ్డూరంగా స్ఫురించింది. వారి ఎరుకలో ఆచార్యు డెన్నడు తన దైనందిన నియమక్రమం రవంతయినా అతిక్రమించ లేదు! "నేడు వారి కేమయినా కొంచెం అస్వస్థత కలిగినదేమో" అని మొట్టమొదట వారిలో వారు కొంచెం సమాధాన పడ్డారు.

మరికొంతసేపటికి దాశరథి ఎంతో ఆత్రతతో యజ్ఞ మూర్తిని సమీపించి "ఆచార్యు లెక్కడ కనబడడం లేదు! వా రెక్కడికి వెళ్ళారు?" అని ప్రశ్నించాడు. ఆ ప్రశ్నతో యజ్ఞ మూర్తి మతిపోయినట్టయింది! వారిద్దరు కలిసి మఠంలో, పూల తోటలో నలుమూలల గాలించారు! ఎక్కడా ఆచార్యుని జాడ కనబడలేదు! ఎక్కడికి బయలుదేరినా దాశరథినిగాని, యజ్ఞ మూర్తినిగాని వెంటబెట్టుకొని వెళ్ళేవా డాయన! ఎందుచేతనో గాని ఈ నా డది జరగలేదు.

కాంచీపూర్ణుడు, శ్రీశైలపూర్ణుడు, గోష్ఠీపూర్ణుడు వర రంగాచార్యుడు, మాలాధరుడు పురాతన శ్రీవైష్ణవ ధర్మసంప్ర దాయ ప్రవర్తకుడు యామునాచార్యుని ప్రియాంతేవాసులు.

వా రయిదుగురు రామానుజునికి పరమాచార్యులై శ్రీవైష్ణవ ధర్మ రహస్యాలుపదేశించారు. వారిలో వరరంగాచార్యుడు మాత్రమే ఇటీవల కొంతకాలం నించి శ్రీరంగంలో నివసిస్తు న్నాడు. రామానుజయతి అప్పుడప్పుడు ఆ భక్తాగ్రణిని సంద ర్శించి ద్రావిడ ప్రబంధ పాశురాల పరమ రహస్యా లవగాహన చేసుకుంటూ ఉండడం ఒక పరిపాటి. ఆచార్యు డొకవేళ అక్క-డికి వెళ్ళి ఉండవచ్చునని అనుమానించి యజ్ఞమూర్తి అనంత సూరిని అక్క-డికి పంపించాడు. కాని, ఆయన కనబడలేదు. అప్పుడే అరుణోదయం అయింది. రామానుజు లొకవేళ శ్రీరంగ నాథ దేవాలయానికిగాని, కావేరి స్నానానికి గాని, వెళ్ళి ఉండ వచ్చునని దాశరథి కొక ఊహ తట్టింది. గోవిందయతి, కూరా గ్రహారాధిపతి వేర్వేరుగా ఆ ప్రదేశాలవైపు వెళ్ళి నలుమూలల గాలించి తిరిగి వచ్చారు. కాని ఆచార్యు లెక్క-డ కనబడలేదు! గోవిందయతి, అనంతసూరి మొదలయిన ప్రధాన శిష్యు లప్ప టికి మఠం విడిచిపెట్టి ఆయన ఎక్క-డికయినా వెళ్ళిపోయి ఉండ వచ్చునని భయపడ్డారు. యజ్ఞమూర్తికి, దాశరథికి క్రమక్రమంగా అదే అభిప్రాయం కలిగింది. ఇటీవల రామానుజుని ప్రగాఢ నిరం తర మౌన ముద్ర దానికొక గట్టి తార్కా-ణగా స్ఫురించింది.

మరికొంతసేపలాగ గుంజాటనపడిన తరవాత ఆచార్యు లొకవేళ ధనుర్దాసు భవంతికి వెళ్ళారేమో అన్నాడు యజ్ఞ మూర్తి. సన్యాసాశ్రమం స్వీకరించిన తరవాత ఆచార్యుడెన్నడు పని కట్టుకుని ఒకరి ఇంట అడుగుపెట్టలేదని వారికి తెలియక పోలేదు. అయినా లోలోపల పీడిస్తున్న అనుమానంతో వా రుభయులు ధనుర్దాసు భవంతికి బయలుదేరారు. ఆచార్యుల

కొకవేళ తన ఎడల రవంత వైమనస్యం కలిగినదేమో అని యజ్ఞమూర్తి మార్గ మధ్యలో పరిపరి విధాల మదనపడ్డాడు. ధనుర్దాసు భవంతి ఆవరణ ద్వారం దాటి లోపల అడుగుపెట్ట గానే యజ్ఞమూర్తి, దాశరధి మరి తమ కన్నులే నమ్మలేక నిలు వునా నిర్ఘాంతపడ్డారు!

హేమాంబా ధనుర్దాసు లిద్దరు ఆచార్యునివంటి మహా నీయ వ్యక్తి తమ ఇంట అడుగు పెట్టగలరని కలలోనయినా ఊహించి ఉండలేదు! అందుచేత వారిద్దరు మాటిమాటికి తొందర తొందరగా అటు ఇటు తిరుగుతూ ఎంతో ఆడకువతో అడుగులకు మడుగులొత్తుతున్నారు. పైడిపూలతో నలువైపుల అలంకరించిన ఒక పీటమీద ఆయన విశ్రమించిన తరవాత వారిద్దరు చేతులు కట్టుకొని నిలుచున్నారు. ఆచార్యుని అను రోధంవల్ల ఎట్టకేలకు వట్టి నేలమీద చతికిలబడ్డారు. అలాగలాగ అయిదారునిమిషాలు గడిచిన తరవాత రామానుజులు వారిద్దరికి స్వయంగా అష్టాక్షరీ మంత్రం ప్రసాదించబోతున్నారని యజ్ఞ మూర్తి, దాశరధి గ్రహించడాని కెంతో సేపు పట్టలేదు.

అ సంఘటన అంతేవాసులకు ఎంతయినా ఆశ్చర్యం కలి గించింది! ఇటీవల రామానుజు లెవ్వరికి స్వయంగా అష్టాక్షరీ మంత్రోపదేశం ప్రసాదించలేదు. ఇంచుమించుగా ఆయనతో సమాన వయస్కుడయిన గోవిందయతి ముఖతః మాత్రమే కొంద రా మంత్రోపదేశం స్వీకరించారు. ఇది మఠాధిపతి యజ్ఞమూర్తి గోవిందయతిని ప్రార్థించి తానై చేసిన ఏర్పాటు. దానికి కొన్ని కారణాలున్నాయి. ఎవ్వరికయినా అష్టాక్షరీ మంత్రం ఉపదేశించినప్పుడు ఆనా డంతా ఉపవసించడం ఆచా

ర్యుని కొక పరిపాటి. ఆయన వృద్ధుడయినందువల్ల అంతటి శ్రమ కలిగించడం భావ్యం కాదన్న ఆలోచనతోనే మఠాధిపతి ఆ నూతన పద్ధతి ప్రారంభించాడు. అంతకు మునుపే దానికి రామానుజుని హృదానాంగీకార ముద్ర లభించింది. అటువంటప్పుడు అకస్మాత్తుగా హేమాంబా ధనుర్దాసులవంటివారికి ఆచార్యులు స్వయంగా మంత్రం ప్రసాదించడానికేమి కారణము? ...ల సదాచారపరులయిన నిష్ఠాపరులెందరో రామానుజుని ముఖతః ఆ మంత్రం స్వీకరించవలెనని అభిలషించారు. కాని, ఆచార్యునికి అది ఎంతో శ్రమ కాగలదన్న ఆలోచనతో యజ్ఞమూర్తి వారి ప్రార్థన కనుమతించలేదు! ఎన్నో విధాల ప్రతిమాలుకొని గోవిందయతి ముఖతః అది స్వీకరించవలసిందని వేడుకొన్నాడు. ఆచార్యులే ఆ యతీశ్వరుని కటువంటి అపూర్వాధికారం ప్రసాదించినప్పుడు ప్రత్యేకించి ఆ వృద్ధమూర్తిని శ్రమపెట్టటం భావ్యం కాదని చెప్పి, వారందరిని ఒప్పించాడు. గోవిందయతి యెడల ఏర్పడిన అపార గౌరవంవల్ల క్రమ క్రమంగా ఆ నిష్ఠాపరు లందరు ఆ పద్ధతి కంగీకరించారు. ఆనాటి కానాటి కది ఒక పరిపాటిగా పరిణమించింది.

అటువంటప్పుడు ఆచార్యుడు స్వయంగా ధనుర్దాసువంటి సామాన్య వ్యక్తి ఇంట అడుగుపెట్టి, పనికట్టుకుని స్వయంగా మంత్రోపదేశం ప్రసాదించడానికిగల కారణమేమో ఎంతగా ఆలోచించినా వారి కవగాహన కాలేదు. ఏది ఏమయినా తా మిక ఆ విధంగా నిలబడి ఉండడం మర్యాదకాదన్న తలపోతతో వారిద్దరు ఆ భవంతి వీధి అరుగుమీద పరిచిన ఒక తుంగ చాపమీద కూర్చున్నారు. మధ్యలో లోపలికి వెళ్ళడం సము

చితంకాదని మంత్రోపదేశ పరిసమాప్తికోసం ప్రతిక్షణముూ నిరీక్షించారు. ఆ సమయంలో ధనుర్దాసు కంఠస్వరం వారిద్దరికి విస్పష్టంగా వినిపించింది. అప్పటి కతనికి ఆచార్యులు తమ కిద్దరికి అష్టాక్షరి యథావిధిగా ఉపదేశించి బోతున్నారన్న నిశ్చయం కలిగింది కాబోలు ! తాను దానికి బొత్తిగా అనర్హుడనని విన్నవించుకొంటున్నాడు. స్వకీయ పంకిల చరిత్ర అంతా ఆమూలాగ్రంగా స్వల్పాతి స్వల్పమయిన చిన్న సంఘటన కూడా విడిచిపెట్టకుండా విస్పష్టంగా వెల్లడించుకొన్నాడు. ఇంతకుమునుపు కొన్ని అసత్యాలు చెప్పి, మభ్యపెట్టినందుకు కృపార్ద్ర దృష్టితో క్షమించవలసినదని తిరిగి దోసిలికట్టి ప్రాధేయపడ్డాడు. అతని ముఖతః వెలువడిన ఆ యథార్థ వృత్తాంతం యావత్తు వినగానే వారిద్దరికి ఎంతో ఆశ్చర్యం వేసింది. హేమసుందరి ఎంత అశకువతో తలవంచుకొని కూర్చున్నది. అత డలాగే గుక్క తిప్పుకోకుండా తన గోడు వెల్లడించుకొంటున్నాడు. పూజ్యులయిన సజ్జనులకేగాని తనవంటి పాపికంతటి అర్హత ఆవంతయినా లేదని తిరిగి డగ్గుత్తికతో మొరపెట్టుకొన్నాడు. తమ కది ఉపదేశించవలదని పాదాల మీద వాలి ప్రాధేయపడ్డాడు.

వారిద్దరు ఆ తరుణంలో వీధి వైపున ఉన్న గవాక్షంలో నించి ఆచార్యుని ముఖవైఖరి పరిశీలించారు. అలతినవ్వు మాత్రమే గోచరించింది. ఆచార్య డాతనిని వెల్లివిరిసిన వాత్సల్యంతో లేవనెత్తి చల్లని పలుకులతో సమాశ్వాసించాడు :

"నాయనా! సత్పురుషు లెప్పటికయినా పరమేశ్వర సాన్నిధ్యం చేరుకొంటారు. వారి మార్గం సుగమమే ! ఇక మిగి

లిన వారికోసమే ప్రత్యేకించి స్వామి శ్రీరంగంలో అవతరించారు! ఎందుకు నీకింత ఆరాటం?"

అయినా రంగనాయకు డా మంత్రం స్వీకరించడాని కంగీకరించలేదు. తనవంటి మహా పాతకి మరి లోకంలో ఇంకెక్కడ ఉండడని తిరిగి విన్నవించుకొన్నాడు. అయినా ఆచార్యుని పెదవులపై ప్రసన్న దరహాసితం మాత్రమే తరళించింది:

"పుణ్యాత్ములు మాత్రమే తామెంతో పాపాత్ములమని అనుకుంటారు! మిగిలిన వారందరు తమవంటి సత్పురుషు లెక్కడ ఉండరని అహంకరిస్తారు! తాము చేసినవి ఒప్పులే అని సమర్థించుకొంటారు. సరే దీనికేమిగాని, ఈ మంత్రానికి పెద్ద నియమనిష్ఠ లేవి లేవు! తోచినప్పుడెప్పుడయినా కొంచెం మనస్సులో జపించుకొంటే చాలు. క్రమక్రమంగా అదే చేయి పట్టుకొని స్వామి సమక్షానికి తోడుకొని పోగలదు!"

ఆ విధంగా ధైర్యం చెప్పిన తరువాత రంగనాయకుని కిక అంగీకరించక తప్పలేదు. హేమసుందరి కుపదేశించినపిమ్మట మంత్రం యథావిధిగా స్వీకరించాడు. మున్ముందుగా తనమొదల ఆచార్యుల కంతటి అనుగ్రహం కలిగినందుకు ఆమె లోలోపల ఎంతో సంతోషించింది. వా రిద్దరు తిరిగి ఆచార్యునికి సాష్టాంగ నమస్కారా లర్పించి అతి వినీతులై చేతులు కట్టుకుని నిలుచున్నారు. ఆచార్యుడు ఆ దంపతుల శిరస్సు లల్లన స్పృశించి ఆర్ద్రకంఠంతో ఆశీర్వదించాడు. మంత్రోపదేశం ముగిసినదని గ్రహించిన యజ్ఞమూర్తి, దాశరథి అదే క్షణంలో లోపల ప్రవేశించారు. రంగనాయకు డింతవరకు వా రిద్దరు తన భవంతి అరుగుమీద కూర్చున్నట్లు గుర్తించలేదు. ఆ శిష్యు లిద్దరిన్నీ

చూడగానే ఆశ్చర్య విస్ఫారిత నేత్రాలతో సవినయంగా నమ స్కరించి యథోచితంగా గౌరవించాడు. రామానుజయతి లేత నవ్వుతో తరళిస్తున్న పెదవులతో అంతేవాసుల నమస్కారా లందుకొని హేమసుందరీ రంగనాయకుల నిద్దరిని వీడ్కొన్నాడు. దాశరథి భుజం అవలంబనంగా స్వీకరించి అల్లనల్లన శ్రీరంగ దేవాలయంవైపు సాగిపోయాడు. అంతేగాని మఠంవైపు మరల లేదు! యజ్ఞమూర్తి అది గమనించి లోలోపల ఇనుమడించిన మథనతో వారి ననుసరించాడు.

అప్పటి కించుమించుగా అరజాము పొద్దెక్కింది. వీధు లలో ఇరువైపుల ఒత్తుగా పెరిగిన పసిర పచ్చికలమీద నిలి చిన మంచు బిందువులు పుష్యమాస నవోదయ కాంతితో పైడి ముత్యాలవలె ప్రకాశించాయి. గాలిలో తేలిపోతున్న ధూళి కూడా దేవ కాంచనాల పుప్పొడివలె తరళించింది. ఆ సువర్ణ సూర్యోదయ వేళలో దివ్య మనోహర కాంతి వాహిని వరదవెల్లువలతో నేల నాలుగువైపుల ఒక్కమారుగా ముంచెత్తుతున్నట్టు గోచరించింది! దుఃఖితులు ఎలుగెత్తి సమా శ్వాసిస్తున్నట్టు శ్రీరంగ దేవాలయ ఘంటాధ్వని అల్లంత దూరంలో మాటి మాటికి మారుమ్రోగింది. బాటలలో చలి మంటలనుండి వెలువడిన సన్నని ధూమరేఖల బారులు అలసా లస పంచనాలతో పొగమంచు తెరలతో మేళవిస్తున్నాయి. దేవాలయ మార్గంలో నీ రెండలో హిమవర్షంలో చలిమంటల చుట్టు జేరిన బాలబాలికల ముఖాలు మాత్రం విస్పష్టంగా గోచ రించాయి. క్రమక్రమంగా పౌరు లనేకులు స్వామి సందర్శనా ర్థమై దేవళంవైపు సాగిపోతున్నారు.

రామానుజయతి శిష్యులతో బాటు రంగనాథస్వామిని సందర్శించి తీర్థ ప్రసాదాలందుకొని గర్భాలయాని కనతి దూర ములో ఉన్న విశాల కళ్యాణ మంటపంలో విశ్రమించాడు. ఆయన దృష్టి అప్రయత్నంగా ఆలయ శిఖరాల స్వర్ణ కలశాల వైపు తిరిగినదని దాశరథి గ్రహించుకొన్నాడు. ఏకాగ్రదృష్టితో ఏదో విషయం పర్యాలోచిస్తున్నారని యజ్ఞమూర్తి నిశ్చ యించుకొన్నాడు. అందుచేత వారిద్దరికి ప్రసంగ ప్రారంభాని కేమాత్రము అవకాశం లభించలేదు. అయితే మఠంలో దేవ రాజస్వామి పూజా సమయం సమీపిస్తున్నది. అది ఆచార్యుని సమక్షంలో యథావిధిగా జరిగే అర్చన. అయినా ఆచార్యు లా విషయమే తలపెట్టినట్టు కనబడలేదు! యజ్ఞమూర్తి మరి వేచి ఉండలేక ఎంతో అడకువతో దోసిలికట్టి దేవరాజస్వామి పూజ వేళ అతిక్రమిస్తున్నదని విన్నవించాడు. తిరిగి మఠానికి వచ్చేయ వలసినదని ప్రార్థించాడు. తెలియక చేసిన తన అపరాధా లార్ద్ర దృష్టితో మన్నించవలసినదని ప్రాధేయపడ్డాడు.

రామానుజుని పరిపూర్ణ దృష్టి అంతేవాసివైపు తిరిగింది. పెదవులపై చిరునవ్వులవోకగా మొలకెత్తింది.

'యజ్ఞమూర్తీ! దీనిలో నీ తప్పిదమేమిలేదు. యతి ఒకే ఒక చోట చిరకాలం నివసించరాదని మన శాస్త్రాలుద్ఘోషిస్తు న్నాయి. అదీగాక అక్కడ నా ఉనికివల్ల మీ కందరికి ఎంతో ఇబ్బంది కలుగుతున్నట్టున్నది...మరి అనవసరంగా ఆలస్యం కానీయక త్వరగా వెళ్ళి స్వామిపూజ ప్రారంభించండి!'

ఆ ప్రత్యుత్తరంతో యజ్ఞమూర్తి గుండెలో రాయి పడింది. ఆచార్యు లిక మఠంలో అడుగుపెట్టరన్న విపరీత భీతి

కలిగింది ! అతని కేమి పాలుపోలేదు. దాశరథివైపు చూచాడు. నిలువునా నిర్ఘాంతపడి అత డలాగే ఆచార్యుని ముఖవైఖరి పరిశీలించి శిరస్సు వంచుకొన్నాడు, యజ్ఞమూర్తి కిక ఊపిరాడ లేదు ! అస్పష్ట స్వరంతో అత్యంత వినీత వైఖరితో విన్నవించాడు :

"రంగనాయకునికి స్వయంగా తామే మంత్రోపదేశం ప్రసాదించారు. ఇది మాకెంతో ఆశ్చర్యం కలిగించింది ! మేమెవ్వరము అతని కింతటి అర్హత కలిగినదని అనుకోలేదు ! నావల్ల అతని యెడల పెద్ద అపరాధమే జరిగిపోయింది."

యజ్ఞమూర్తి ఉట్టిపడుతున్న అడకువతో తిరిగి అంజలి ఘటించి వేడుకొన్నాడు. అంతలోనే రామానుజయతి తిరిగి ప్రసన్న ముఖవైఖరితో ప్రసంగించాడు.

"నాయనా ! దీనిలో విడ్డూరం ఏమి ఉన్నది ! శ్రీరంగేశుని అపార కృపవల్ల అతనికి జాజ్వల్యమానములయిన స్వామి సహజ దివ్య విశాల నేత్రయుగళి సాక్షాత్కార భాగ్యమే లభించింది !"

ఆ ప్రతి సమాధానం వినగానే యజ్ఞమూర్తి, దాశరథి నిశ్చల పాషాణ ప్రతిమలవలె నిశ్చేష్టితులయినారు ! వారెరిగినంతవరకు ఆచార్యులొక్కరికే తక్క, వృద్ధ శిష్యులెవ్వరికి అటువంటి మహాదృష్టం కలగలేదు ! మఠవాసు లందరిలోను వృద్ధుడు, మహామనీషి, సౌజన్యమూర్తి అయిన గోవింద యతికి కూడా అటువంటి మహనీయ భాగ్యం లభించలేదు ! ఇక రంగనాయకు డేవిధంగా ఆలోచించినా మహాపాపి ! అత డంతకుమునుపు చేయని దుశ్చర్యలేదు ! ఆ పైన ఆవంతయినా

శాస్త్ర పాండితి లేదు. అటువంటి మోటు మనిషికి శ్రీరంగ శాయి దివ్య విశాల విలోచనాల సాక్షాత్కార భాగ్యం లభించినదంటే అతని కేమాత్రము నమ్మిక కలగలేదు! కాని, ఆచార్యులే విస్పష్టంగా నొక్కి వక్కాణించినపుడిక విశ్వసించక తప్పలేదు! అయినా అతని ముఖంలో సందేహాశ్చర్యాల ఛాయ తొలగలేదు. రామానుజు డది గమనించి అలవోకగా చిరునవ్వు చిందించి ప్రశ్నించాడు :

"యజ్ఞమూర్తీ! ఎందుకు నీ కింతటి సందేహం! వైకుంఠ ద్వార పాలకులు జయ విజయుల పురాతన గాథ విన్నావు కదా?"

"అవును! విన్నాను!"

అర్థాంగీకార స్వరంతో తలపంకించాడు యజ్ఞమూర్తి. అతని కా పురాతన వృత్తాంతం విస్పష్టంగా జ్ఞప్తికి వచ్చింది. బ్రహ్మమానస పుత్రులు సనకసనందను లొకప్పుడు వైకుంఠంలో ప్రవేశిస్తూంటే తెలియక జయ విజయు లిద్దరు వారి నడ్డుకొన్నారు. ఎన్నెన్ని విధాల బ్రతిమాలుకొన్నా లోపల అడుగుపెట్టనీయలేదు! వారికి ప్రాణం విసిగింది! భూలోకంలో జన్మించవలసినదని క్రోధ భీకరులై శపించారు. ఆ జయ విజయుల కప్పటికి సనక సనందనుల ప్రాభవం పరిపూర్ణంగా బోధపడింది! మన్నించవలసినదని కాళ్ళావేళ్ళాపడి ప్రాధేయపడ్డారు. విష్ణుదేవుని వియోగం క్షణకాలమయినా సహించలేమని మొరపెట్టుకొన్నారు. చిట్టచివరికి సనకసనందనుల కిద్దరికి వారిమీద జాలికలిగింది. సత్పురుషులై ఆరు జన్మలలో తిరిగి వైకుంఠ ద్వారం చేరుకొంటారా? లేక పరమ దుర్మార్గులై మూడు

జన్మలలోనే చేరుకొంటారా? అని ప్రశ్నించారు. జయ విజయులు మూడు జన్మలలోనే తిరిగి స్వకీయ స్థానాలలో ప్రవేశించవలెనని నిశ్చయించుకొన్నారు. క్రమక్రమంగా హిరణ్యాక్ష హిరణ్యకశిపులై, రావణ కుంభకర్ణులై, శిశుపాల దంతవక్త్రులై మానవ లోకంలో అవతరించి శాపవిముక్తి సంపాదించుకొన్నారు. ఆ వృత్తాంతం యజ్ఞమూర్తి స్మృతి పీఠిలో క్రొక్కారు మెరుపులా మెరిసింది. ఎంతెంతటి పాపాత్ములయినా ఒక్కొక్కప్పుడు సజ్జనులకన్న శీఘ్రంగానే పరమేశ్వర సాన్నిధ్యం చేరుకోగలరని ఆచార్యులు ఆ గాథ ద్వారా సూచిస్తున్నారని యజ్ఞమూర్తి గ్రహించుకొన్నాడు. అందుచేత రంగనాయకుని శ్రీరంగశాయి దివ్య నేత్రాల సాక్షాత్కార సాధనలో ఆశ్చర్యమేమి లేదన్నట్టు ఆయన తన కుపదేశిస్తున్నారని కూడా యజ్ఞమూర్తికి స్ఫురించింది. కాని, అతని నిశిత తార్కిక దృష్టికి మాత్రం సంపూర్ణ సంతృప్తి కలగలేదు. రంగనాయకునికి జయ విజయులతో సామ్య మేమిటి? ఇతడెక్కడ? వారెక్కడ! అదీగాక సనక సనందనల శాపానుగ్రహ శక్తివల్ల వైకుంఠ ద్వారపాలకుల కటువంటి అదృష్టం కలిగి ఉండవచ్చును! కాని రంగనాయకుడు ఎవంతయినా వారితో సరిపోలగలడా? నరకమెక్కడ? నాగలోక మెక్కడ? అని లోలోపల ప్రశ్నించుకొన్నాడు. కాని, తిరిగి దోసిలికట్టి వెల్లి విరిసిన వినయంతో లోలోపలి జిజ్ఞాస వ్యక్తీకరించుకొన్నాడు!

"నే నీ పురాతన వృత్తాంతం చాలాకాలం క్రితమే విన్నాను. కాని, ఆ జయ విజయు లెక్కడ? రంగనాయకు డెక్కడ? అపూర్వమయిన తమ ఆశ్రిత పక్షపాతమే అతని కింతటి అదృష్టం కలిగించి ఉండవచ్చునని అనుకొంటున్నాను."

రవంతసేపు రామానుజయతి తన మౌనముద్ర విడిచి పెట్టలేదు. తిరిగి అలతి నగవుతో అంతేవాసి ముఖ వైఖరి పరిశీలించాడు :

"యజ్ఞమూర్తి ! రంగనాయకుని యెడల నాకేదో వల మాలిన పక్షపాతం కలిగినదని మీరందరు అనుకొంటున్నట్టు న్నారు ! కాని నాకెవ్వరిమీద రవంతయినా అటువంటి దృష్టి లేదు. అనన్య సామాన్యమయిన ఎడతెగని తపనవల్లనే అతని కంతటి మహాదృష్టం కలిగింది."

యజ్ఞమూర్తికా ప్రత్యుత్తరంలోగల పరమార్థం మేమా త్రము బోధపడలేదు. కనుక తిరిగి శిరస్సాకించుక వంచుకుని ప్రశ్నించాడు :

"నాకు తమ అభిప్రాయం తిన్నగా అవగాహన కాలేదు !"

రామానుజయతి గభీర వాత్సల్యా వార్ణదృష్టితో తిరిగి ప్రసంగించాడు :

"నాయనా ! దీనిలో బోధపడకపోవడానికేమి ఉన్నది ? రంగనాయకుడు హేమసుందరి కోసం రాత్రింబగళ్లు అదేపనిగా పరితపించాడు. ఎక్కడా దారి తెన్ను కనబడక శ్రీరంగనాథుని కామె నేత్రాలతో తులతూగగల బంగారు కన్నుల జంట సమ ర్పించగలనని మొక్కున్నాడు. లోకపావని ఆకాశ గంగానది వరద వెల్లువవలె తీవ్రమయిన ప్రగాఢానురక్తి అతని హృద యంలో ఉప్పొంగింది ! మరి దానితో అతని కిక ఊపిరాడ లేదు !— క్రమక్రమంగా అదే అతని కిటువంటి మహనీయ

భాగ్యం ప్రసాదించింది! హేమసుందరికూడా ఎన్నెన్ని కష్టా లెదురుపడినా అతని నెన్నడు విడిచిపెట్టలేదు! వాస్తవానికి వారిద్దరు వివాహితులు కారు. కాని పుణ్య దంపతులయినట్టే భావించుకొన్నారు. అంతే కాదు! ఎంతెంతటి తప్పిదాలు చేసి నట్టు తెలిసినా వారి కొకరొకరి యెడల అన్యోన్యత ఆవంత యినా సడలలేదు. అంతటి అతిలోకమయిన ప్రేమానుబంధం వల్లనే వారిద్దరికి అనాయాసంగా అష్టాక్షరీ, మంత్రోపదేశం లభించింది. ఇంకొకమాట! మల్ల విద్యపై అనితర సాధారణ మయిన ఏకాగ్రతకూడా అతని కెంతో తోడుపడింది! అంతేగాని దీనిలో నా పక్షపాత మేమాత్రము లేదుసుమా!"

యజ్ఞమూర్తి పట్టరాని ఆశ్చర్యావేశంతో తల మునక లయినాడు! భక్తి జ్ఞాన కర్మ యోగాలన్న మూడే మూడు మార్గాలలో మానవుల కందరికి పరమేశ్వర సాక్షాత్కారం లభించగలదని అత డంతకు మునుపు అవగాహన చేసుకొన్నాడు. కాని ఆచార్యులీనాడు ప్రగాఢమయిన కామినీ వ్యామోహం కూడా స్వామి సాక్షాత్కార సౌధాని కొక పెద్ద మెట్టుగా పరిణమించినట్టు ప్రసంగిస్తున్నారు! ఇదేమిటీ విడ్డూరం! అని తనలో తాను ఎంతయినా ఆశ్చర్యపడ్డాడు. అదీ గాక రంగనా యకు డొక సామాన్య కర్షకుని కుమారుడు. అంతే కాదు! అంతకుమును పాతడు చెయ్యని దుష్కార్యం లేదు! హేమ సుందరి కేవలం హీనమయిన మనుగడ కొనసాగించుకొన్న వారాంగన! కాని అతి లోకమయిన ఆమె ప్రేముడివంటి అనురక్తి లోకంలో ఇంకెక్కడ లేదన్నట్టు ఆచార్యులెంతో గౌరవంతో ప్రశంసిస్తున్నారు! అదీగాక మల్ల విద్యాభినివేశం

వల్ల ఏర్పడిన ఏకాగ్రతకూడా రంగనాయకునికి శ్రీరంగేశుని దివ్య విలోచనాల సాక్షాత్కృతి కెంతో తోడుపడినట్టు సమర్థిస్తున్నారు! యజ్ఞమూర్తి ఆలోచనా పరంపర లావిధంగా మెరుపుల తోరణంలా సాగిపోయాయి! అంతేగాని ఆచార్యుని ప్రసంగంవల్ల అతని కేమాత్రము సంతృప్తి కలగలేదు! క్రమక్రమంగా లోలోపల తీరని జిజ్ఞాస ఇనుమడించింది. మరి భరించలేక తీవ్రంగా బొమముడి విరిచి ప్రశ్నించాడు:

"తమవంటివారితో నే నేమని ప్రసంగించగలను! హేమసుందరీ రంగనాయకులవంటివారి కింతటి అదృష్టం కలిగినప్పుడిక లోకంలో ధర్మాధర్మాల మాటేమిటి? వాటి కిక తిలోదకాలు విడిచిపెట్టవలసినదేనా?"

మరికొంతసేపటివరకు రామానుజుని ముఖతః ప్రత్యుత్తరం వెలువడలేదు! మిక్కిలి జటిలమయిన తన ప్రశ్నకాచార్యు లేవిధంగా సమాధానం చెప్పగలరోఅన్న తహతహతో యజ్ఞమూర్తి ప్రతి సమాధానం కోసం నిమేషమొక యుగంగా నిరీక్షించాడు. అంతలోనే రామానుజుని వదనంపై దరహాసితం తరళించినది:

"నాయనా! యజ్ఞమూర్తి! మహా తార్కికుడవు! నీకు నే నేమని ప్రతి సమాధానం చెప్పగలను! నా కిటువంటి జిజ్ఞాస కలగకపోలేదు! కాని చాలా కాలానికి పూర్వమే నా కొకనాడు స్వామికారుణ్య దృష్టి మనం పతితులని అనుకొన్న వారిమీదనే ఎక్కువ ప్రసరించినట్టు గోచరించింది! ఆనాటి నించి నే నీ ధర్మాధర్మ నిర్ణయభారం స్వామిమీదే విడిచిపెట్టి ఆయన సంకల్పం ప్రకారమే నడుచుకొంటున్నాను. అయితే

లోక దృష్టిలో న్యాయాన్యాయాల వివేచనము, దాని కను కూలమయిన నడవడిక మిక్కిలి ఆవశ్యకము లే ! నీ వన్నది యథార్థమే ! కాని నే నిక ఆ గోడే తలపెట్టడం లేదు !"

ఆ ప్రత్యుత్తరం యజ్ఞమూర్తి కొంతవరకే సంతృప్తి కలిగించింది. చిరకాలంనుండి శ్రీరంగశాయి సాక్షాత్కార సంపత్తి కధీశ్వరులయిన ఆచార్యు లాయన సంకల్పం ప్రకారం తమ మనుగడ కొనసాగించుకోవచ్చును ! వారి కది నిష్కంటక మయిన రాజమార్గమే కావచ్చును ! కాని తనవంటి సామా న్యుల కిక ధర్మాధర్మ నిర్ణయంలో దిక్కెవరు ? అని లోలోపల రవంతసేపాలోచించుకొన్నాడు. అప్పుడే ఆచార్యుని సమక్షంలో ఆ జిజ్ఞాస వ్యక్తీకరించవలెనని అనుకొన్నాడు. అంతలోనే శ్రీరంగేశుని గర్భాలయంలో నుండి వెలువడిన గభీర ఘంటా ధ్వని ఆ ప్రాంతంలో నలువైపుల ప్రతిధ్వనించింది. అంతలోనే అతనికి ఆనాటి దేవరాజస్వామి పూజవేళ బాగా మించిపోగల దేమో అని లోలోపల విపరీతమయిన ఆందోళన చెలరేగింది. అందుచేత మరి ఆ జిజ్ఞాస వెల్లడించలేదు ! అంతలోనే తిరిగి రామానుజయతి మంద్ర గభీర కంఠధ్వని అతని వీనుదోయిలో మారు మ్రోగింది.

యజ్ఞమూర్తి ! నీ జిజ్ఞాస నా కవగతమయింది ! నీవేదో అడగవలెనని అనుకొని కొంచెం సంకోచిస్తున్నట్టున్నావు. నిశ్చల భక్తితో నిరంతర చిత్తశుద్ధితో దారి చూపించవలసినదని స్వామిని వేడుకొన్నప్పుడు ధర్మాధర్మ సందేహం క్షణంలో మంచువిడిపోయినట్టు విడిపోగలదు ! స్వయంగా శ్రీరంగేశు లే నీ చెయ్యి పట్టుకుని నడిపించుకు పోగలరు ! నే నొకప్పుడు

శ్రీరంగంలో దీనాతిదీనులయిన పతితుల దుస్థితి చూచి కుమిలి కుమిలి దుఃఖించాను. స్వామి సన్నిధికిపోయి, "అయ్యో ! వారి కిక దిక్కెవరు స్వామీ ! అని మాటి మాటికి మొర పెట్టు కొన్నాను; అప్పుడు నా కా కృపానిధి దివ్యమూర్తి చేతులెత్తి లోకంలో మానవుల నందరిని కౌగలించుకో బోతున్నట్టు సాక్షాత్కరించింది ! ఆయన కుడిచేయి సజ్జనులవైపు తిరిగింది. ఎడమచేయి పతితులయిన పాపులవైపు తిరిగింది. అయితే ప్రగాఢ కారుణ్యంతో సంచరిస్తున్న ఆ బాహువు కుడిచేతికన్న కొంచెం ఎక్కువగనే ఒరిగినట్లు కనబడింది. నాటినించి నా సందేహం పటాపంచలయింది !"

యజ్ఞమూర్తి ఆ ప్రసంగం విని నిలువునా నిర్ఘాంతపడి "స్వామి స్వయంగా మార్గ దర్శకులయినప్పుడిక సంశయాల కవ కాశమే లేదు ! కాని నావంటి అజ్ఞాన జాత్యంధుల కిక దిక్కెవ్వరు ?" అని లోలోపల వితర్కించుకొన్నాడు. ఉసూరుమని విశ్వసించి చేతులు జోడించి విన్నవించుకొన్నాడు :

"మీరన్నది అక్షరశః యథార్థమే కావచ్చును. కాని మావంటివారికడుగడుగునా సందేహాలే ! అయితే దేవరాజ స్వామి అర్చనవేళ అతిక్రమిస్తున్నది ! మీ కోసం గోవిందయతి పడిగాపులుపడి కూర్చుని నిరీక్షిస్తున్నారేమో !"

అంతటితో రామానుజుని ముఖంపై గంభీర మౌనముద్ర సాక్షాత్కరించింది.

"సర్వసమర్థులయిన మీ రుభయులు ఉన్నారుగదా ! మొట్టమొదటే అన్నానుకదా ! యతి చిరకాలం ఒకేచోట

నివసించరాదని! నాయనా! మరి ఆలస్యం చెయ్యక మీరిద్దరు త్వరగా తిరిగి వెళ్లండి!"

ఆ ప్రత్యుత్తరంతో యజ్ఞమూర్తి నాలుక పిడచకట్టుకుని పోతున్నట్టయింది! మరి ఆ వేదన సహించలేక పాదాలపై వాలి తెలియక చేసిన తన తప్పిదం మన్నించి తిరిగి మఠానికి విజయం చెయ్యవలసినదని ప్రాధేయపడ్డాడు. అయినా ఆచార్యుని గభీర మౌనధోరణి సడలలేదు యజ్ఞమూర్తి గత్యంతరం కానలేక దుర్భర దైన్యంతో దాశరథి వైపవలోకించాడు. అంతవరకు ఏకాగ్రదృష్టితో వారి ప్రసంగం విన్న ఆ మౌని అల్లన నవ్వి, మిక్కిలి అడకువతో దోసిలికట్టి విన్నవించాడు:

"స్వామి అడుగడుగునా మీరు మార్గదర్శకులు! అదే విధంగా మీరు మాకందరికి సర్వదా సంరక్షులు! ఇటువంటి మీ రక్కడికి అడుగుపెట్టినప్పు డది మఠం కానేకాదు! మీ రెక్కడవుంటే అదే మా శ్రీవైష్ణ మఠం! మరి మే మక్కడికి మరలి పోదలుచుకోలేదు!"

ఆతని దృఢనిశ్చయ వైఖరి గమనించి రామానుజయతి క్షణకాలం నిర్ఘాంతపడి అల్లన నవ్వి ప్రసన్న మధుర స్వరంతో ప్రసంగించాడు:

"దాశరథీ! మొట్టమొదట నేటినుంచి భిక్షాటనంతోనే కాలక్షేపం చెయ్యవలెనని అనుకొన్నాను. కాని మిమ్మల్ని అందర్ని విడిచిపెట్టి నే నెక్కడికి పోగలను! దేవరాజస్వామి నా పాదా లింతకు పూర్వమే మీతోబాటు బంధించి తమ బంధీగా చేసుకొన్నారు!"

వారిద్దరికి ఆ ప్రతిసమాధానంతో ప్రాణం లేచివచ్చినట్ట యింది! దాశరథి భుజంమీద ఆనుకొని రామానుజయతి నెమ్మదినెమ్మదిగా తిరిగి మఠంవైపు సాగిపోయాడు. కాని వారిద్దరిని అనుసరించిన యజ్ఞమూర్తి హృదయంలో తీరని జిజ్ఞాసా మథన అదే విధంగా చెలరేగింది!

# 28

దేవాలయావరణంలో కళ్యాణ మంటపంలో పరమా శ్చర్యంతో సుదీర్ఘ ప్రసంగం కొనసాగించిన పిమ్మట యజ్ఞమూర్తి కొక వినూతన ప్రపంచంలో ప్రవేశించినట్టయింది! తానింతకు మునుపు హేమసుందరీ రంగనాయకులకన్న అధమాధములీ లోకంలో ఇంకెక్కడ గోచరించరని నిశ్చయించుకొన్నాడు. అందువల్లనే వారిద్దరియెడల ఎడతెగని హేయదృష్టి అలవరచు కొన్నాడు! కాని పరమభక్త శిఖామణులు, సత్పురుషులు అయిన శ్రీవైష్ణవు లెవ్వరికి లభించని శ్రీరంగేశుని సువిశాల సహజ దివ్యనేత్రాల సాక్షాత్కార సంపత్తి రంగనాయకుని కవ లీలగా చేకూరినదని ఆచార్యులే అన్నారు! అంతేకాదు. మల్ల విద్యలో ఏకాగ్రతకూడా అతని కా విషయంలో ఎంతో తోడుపడినదని ప్రశంసించారు! స్వయంగా వారిద్దరికి అష్టా క్షరీ మంత్రోపదేశం ప్రసాదించారు! వారి అనురక్తి, అన్యో న్యత అనన్య సాధారణాలని ప్రశంసించారు! ధర్మాధర్మాల ప్రసక్తి తెచ్చినప్పుడు శ్రీరంగశాయి సంకల్పబలమే తమ నడ వడి కాలంబనమని విస్పష్టంగా వ్యాఖ్యానించారు! ఆ ప్రసంగం

విన్న పిమ్మట శ్రీ వైష్ణవ ధర్మ రహస్యం అణువంతయినా తన కవగాహన కాలేదని యజ్ఞమూర్తి కనిపించింది! ఆ విషయంలో తన అనన్య సామాన్య పాండితి ఎందుకు కొరగాక, కేవలం వ్యర్థమై పోయినదని గుర్తించి ఉసూరుమని నిశ్వసించాడు.

యజ్ఞమూర్తి అద్వైత పరమార్థ మనదగిన మాండూక్యోపనిషత్తు కూలంకషంగా మథించి అమూలాగ్రంగా అవగాహన చేసుకొన్నాడు. శూలాగ్రంవంటి సునిశిత మేధాసంపత్తి కల మహా మనీషి కే పరమాత్మ స్వరూపం సమగ్రంగా అవగాహన కాగలదని ఆ ఉపనిషత్తు అడుగడుగునా నొక్కి-వక్కాణించింది! ఆచార్యుని సాన్నిధ్యం చేరుకోక పూర్వం అత డదే ప్రస్థానం అనుసరించాడు. అటుపిమ్మట భక్తి ప్రపత్తుల యెడల పరమ గౌరవం కుదిరినా అతని కా పూర్వధోరణి పూర్తిగా నశించ లేదు! అందుచేత రంగనాయకునివంటి పామరుని కంతటిఅదృష్టం కలిగినదని వినగానే అకస్మాత్తుగా అతని కేదో 'పెద్ద అఘాతం తగిలినట్టయింది!

ఆ పైన పదెనిమిది రోజులు గడిచిన తరువాత అతని కొక విషమ సమస్య ఎదురుపడింది. ఎన్నెన్ని విధాల తల బ్రద్దలుకొట్టుకున్నా యజ్ఞమూర్తి కది రవంతయినా అవగాహన కాలేదు! అందుచేత విద్యావయోవృద్ధుడు గోవిందయతితో ఒకసారి సంప్రతించవలెనని నిర్ణంచుకొన్నాడు. ఇటీవల ఆ వృద్ధ మూర్తి అకస్మాత్తుగా మౌననిష్ఠ విడిచివేసినట్టు విన్నాడు. నెమ్మదిగా పూలతోటవైపు సాగిపోయాడు.

అప్పటికి మూడు జాముల పొద్దు తిరిగింది. గోవిందయతి ఆనాడు తోటలో సురపొన్న నీడలో పసిరి పచ్చికమీద

కూర్చుని ఏకాగ్రదృష్టితో దేవరాజస్వామి కొరకు పొన్న పూల మాలిక అల్లుతున్నాడు. అతని చుట్టు ఒత్తుగా రాలిన సురపొన్న పూలతో ఆ పరిసరంలో నలుమూలల వేర్వేరు రీతుల రంగ వల్లిక లేర్పడ్డాయి. అల్లంతదూరంలో నుండి సన్నని తంబురా శ్రుతి వంటి సన్నని గండు తుమ్మెదల సవ్వడి వినిపించింది.

యజ్ఞమూర్తి ఎంతో అడకువతో గోవిందయతి సరసన కూర్చున్నాడు. ఆ వృద్ధయతి కొంచెం తల పైకెత్తి తన మాలిక అల్లిక కొంత నిలిపి బొమ్ముడి విరిచి ప్రశ్నించాడు !

"ఇదేమిటి ? ఎంతో పనివేళ వచ్చావే! విశేషా లేవయినా ఉన్నాయా ?"

యజ్ఞమూర్తి ఉస్సూరుమని నిశ్వసించాడు. "లేకేమి ! హేమసుందరీ రంగనాయకుల మంత్రోపదేశం వ్యవహారం యావత్తు విన్నారుగదా ! ఆచార్యుల అనుగ్రహదృష్టి అంతటితో ఆగలేదు."

గోవిందయతి అలవోకగా చిరునవ్వు చిందించి ప్రశ్నార్థకంగా బొమముడి విరిచి యజ్ఞమూర్తి ఆందోళన వైఖరి పరిశీలించాడు. అంతలోనే అత డందుకొన్నాడు :

"విశిష్టాద్వైత ప్రస్థాన వ్యాప్తికోసం భరత వర్షంలో అంతట డెబ్బయి అయిదుగురు పీఠాధిపతుల నేర్పరచవలెనని ఆచార్యు లిటీవల సంకల్పించుకొన్నారు ! వారిలో రంగనాయకు డొకడు ! నా కీ విషయం ఈవేళ ఉదయమే తెలిసింది.

ఆ వృత్తాంతం వినగానే గోవిందయతి ముఖంలో విపరీత మయిన ఆశ్చర్యావేశం పొడగట్టగలదని అతడెంతో ఆత్రంతో

నిరీక్షించాడు. కాని అటువంటిదేమి గోచరించలేదు. యజ్ఞమూర్తి రవంత ఆశ్చర్యపడి తిరిగి తన ప్రసంగం కొనసాగించాడు :

"అంతేకాదు. నన్నే వెళ్ళి ఈ విషయంలో రంగనాయకుని అనుమతి సంపాదించవలసినదని ఆదేశించారు. దీనికి నేనేమి ఆశ్చర్యపడలేదు. అయితే పరమ బ్రహ్మణ్యులయిన మహా విద్వాంసులు మాత్రమే అధిష్ఠించవలసిన శ్రీవైష్ణవపీఠం రంగనాయకుని వంటి అజ్ఞాని కందిస్తున్నారే అని ఎంతయినా మథన పడ్డాను. ఇది విన్నప్పటినించి నాకు మతిపోయినట్టయినది ! కొంచెం సాహసించి ఆచార్యులతోనే ఈ విషయం చూచాయగా ప్రస్తావించాను. వారది ఆలకించనట్టు మాట్లాడ కూరుకొన్నారు. దీనిలో గల పరమార్థ మేమో నా కేమాత్రము బోధపడలేదు !"

అయినా గోవిందయతి ముఖంలో యజ్ఞమూర్తి చిన మహాశ్చర్య రేఖ పొడకట్టలేదు. మౌనముద్ర మాత్రమే రవంతసేపు స్థిరపడింది. అంతలోనే అధరంపై చిరునవ్వు చెంగిలించింది ?

"నాయనా ! యజ్ఞమూర్తి ! దీనిలో నాకంతటి విడ్డూర మేమి కనబడలేదు. ఆచార్యుల మనుగడలో చాలాకాలానికి పూర్వమే ఒక మహాద్భుతం జరిగింది. నీ వది విని ఉండలేదేమో ! లేకపోతే నీ కింతటి మథన కలగదు."

"నే నెన్నడు వినలేదే ! ఏ మా సంఘటన !"

యజ్ఞమూర్తి ఎంతో ఆశ్చర్యపడి ప్రశ్నించాడు. గోవింద యతి ప్రసన్న ముఖవైఖరితో తిరిగి తన ప్రసంగం ప్రారంభించాడు :

"ఆచార్యుల కిప్పుడు అరవైనాలుగవ ఏడు నడుస్తున్న దనుకుంటాను. అంటే ఇది ఇంచుమించుగా ముప్ఫయి ఏళ్ల క్రితం జరిగినదన్న మాట ! రామానుజుల గురువరేణ్యులు గోష్ఠీపూర్ణులు ఒకప్పుడు గోష్ఠీ పురంలో మొట్టమొదటగా అష్టాక్షరీ మంత్రం యథావిధిగా అంతేవాసి కుపదేశించాడు. ఆపైన నాయనా ! ఇది మహాద్భుత మయిన మంత్రరాజం సుమా ! ఇది ఆలకించి నంతలోనే ఎంతెంతటి మహా పాతిత్యాలయినా క్షణంలో పటాపంచలై పోగలవు! అనతికాలంలోనే శ్రీమహావిష్ణు సాయుజ్యం కరతలామలకం కాగలదు ! అయితే అనర్హుల కెవ్వరికి ఇది ఉపదేశించరాదు. ఈ కట్టడి అతిక్రమిస్తే తప్పక ఘోర నరకం సంప్రాప్తించగలదు సుమా !" అని హెచ్చరించారు. ఆపైన ఏమి జరిగిందో తెలుసునా ?"

యజ్ఞమూర్తి ఆ ప్రశ్న కేవిధంగాను ప్రతి సమాధానం చెప్పలేదు. ఇనుమడించిన జిజ్ఞాసతో తదనంతర వృత్తాంతం కోసం నిరీక్షించాడు. అంతలోనే గోవిందయతి తన అపూర్వగాథ తిరిగి ప్రారంభించాడు !

"రామానుజు లా సాయంకాలమే గోష్ఠీ నగరంలో గోపాల దేవాలయం సమున్నత గోపురంపై అంతస్తుమీద నిలిచి "ఇదిగో పెన్నిధి ! రండి రండి !" అని బాటసారుల నందరిని గొంతెత్తి పిలిచి ఆ మంత్రం స్వీకరించవలసిందని దోసిలికట్టి వేడుకొన్నారు ! తమ యావచ్ఛక్తి వినియోగించి ఆ మంత్ర

గభీర మధుర స్వరంతో మాటిమాటికి ఎలుగెత్తి ఉచ్చరించారు. ఆనాడు కొన్ని వేల మంది గోష్ఠీనగర పౌరు లా మంత్రాక్షరాలన్ని విస్పష్టంగా ఆకర్ణించారు."

యజ్ఞమూర్తి నిలువునా నిర్ఘాంతపడ్డాడు! "మరి గోష్ఠీపూర్ణులు వారి నడ్డుకోలేదా ?"

"అడ్డుకోకేమి! అడ్డుకొన్నారు. "ఎంత పని చేశా వీవేళ! అయ్యో! నాయనా! నీ కిక ఘోర నరక దుర్గతి తప్పదు!" అని హెచ్చరించారు.

"దానిమీద ఆచార్యు లేమన్నారు ?"

ఎంతో ఆత్రంగా ప్రశ్నించాడు యజ్ఞమూర్తి.

"అదే చెబుతున్నాను. విను! ఆయన ఎక్కడ చెక్కుచెదరలేదు. ఎంతో అడకువతో దోసిలికట్టి నిలిచి "పోనీయండి! నా కొక్కడికే కదా ఆ ఘోర నరక దుర్గతి! ఆమంత్రం విన్న వారందరు పాపవిముక్తులై స్వామి సాయుజ్యం చేరుకొంటారు కదా! నా కదే పదివేలు!" అని ఆ గోష్ఠీపూర్ణుల పాదాలపై వాలిపోయారు."

యజ్ఞమూర్తి ఆ మహాద్భుత వృత్తాంతం విని తిరిగి క్షణకాలం నిలువునా నిర్ఘాంత పడ్డాడు. గోవిందయతి అది గమనించి అల్లన నవ్వి ప్రసంగించాడు!

"యజ్ఞమూర్తీ! ఇదేదో మహాద్భుత వృత్తాంతమని ఆశ్చర్యపడుతున్నట్టున్నావు! ఆచార్యు మనుగడలో ఇంతకన్న అత్యద్భుత వృత్తాంతా లున్నాయి. అద్వైత వేదాంతనిధి యాదవ ప్రకాశులవద్ద రామానుజులు బ్రహ్మసూత్రాలు, ఉప

నిషత్తులు, భగవద్గీత, శంకర భగవత్పాదుల భాష్యాలతో పాటు పఠించారని నీ వెరుగుదువు కదా ! ఆ సమయంలో, కొన్ని కొన్ని ఉపనిష ద్వాక్యాలకు రామానుజులు విశిష్టాద్వైతపర ములయిన వినూతన వ్యాఖ్యానా లారంభించారు. యాదవ ప్రకాశుల కది సుతరాము రుచించలేదు. కాని క్రమక్రమంగా రామానుజుల వ్యాఖ్యానమే సముచిత మయినదని మహా విద్వాంసులు కొందరు సమర్థించారు. అందువల్ల ఆయన పట్ట రాని దురాగ్రహంతో ప్రజ్వలించారు. వారణాసీయాత్ర మిషతో రామానుజుల నకస్మాత్తుగా చంపించివేయవలెనని శాయ శక్తులా ప్రయత్నించారు. దైవానుగ్రహంవల్ల ఆచార్యు లా ఘోరాపద గడిచి గట్టెక్కి ప్రాణాలతో బయటపడ్డారు. ఆ తర వాత యాదవ ప్రకాశుల కుతంత్రం వారి కా మూలాగ్రంగా అవగత మయినది. అయినా రామానుజు లేమాత్రము ఆయన యెడల ఆగ్రహించ లేదు. పైగా మరికొంతకాలం గడిచిన తర వాత అంతేవాసిగా స్వీకరించారు !"

యజ్ఞమూర్తి కా గాథ మరింతగా ఆశ్చర్యం కలిగిం చింది. తిరిగి గోవిందయతి అలవోకగా చిరునవ్వు చిందించాడు:

"ఇంకొక్క చిన్న విషయం వింటే బాగా పగబట్టిన పాపుల యెడల నయినా వారి వైఖరి ఎటువంటిదో నీ కవగతం కాగలదు. శ్రీరంగ దేవాలయంలో ఇంతకు మునుపున్న ప్రధానా ర్చకు లెవరో నీ వెరుగుదువుగదా ! ఆయన నానాటికి నలు వైపుల వ్యాపిస్తున్న రామానుజుల అపూర్వ ప్రతిష్ఠ సహించ లేక కళ్ళలో నిప్పులు పోసుకున్నాడు. ఆచార్యుల నెలాగయినా రూపుమాపివేయవలెనని నిశ్చయించుకొన్నాడు. ఒకటి రెండు

మారు లాయన అన్నపానాలలో విషం కలిపించాడు. చిట్ట చివరి కా అర్చకుని పత్ని మనస్సు కరిగింది. అన్నంలో విషం కలిసినదని ఆచార్యుల కతి రహస్యంగా నివేదించింది. ఇంకొకసారి ప్రధానార్చకుడు శ్రీరంగనాథస్వామి పాదోదకంలో విషం కలిపించి రామానుజుల కందించాడు. ఆనాటితో తన శని పీడ విరగడయిపోగలదని ఎంతయినా ఆనందించాడు. కాని ఆయన ఆ విషం ఆరగించి అరగించుకొన్నారు. తరవాత ఆ వృత్తాంతం తెలిసినా ఏమాత్రము ఆగ్రహించలేదు. పైగా అతనిని ప్రగాఢ వాత్సల్యంతో ఆదరించారు!"

యజ్ఞమూర్తి కా పురాతన గాథ లేపీ తెలియదు. ఉసూరుమని నిశ్వసించాడు!

"అయ్యో! ఆచార్యులు సాక్షాత్తు సౌజన్యమూర్తులు కదా! అటువంటివారినే చంపించివెయ్యాలని అతని కెందుకంతటి దుర్బుద్ధి పుట్టింది!"

"యజ్ఞమూర్తీ! దీనికి మన మేమి ఆశ్చర్యపడనక్కర లేదు. లోకం తీరే అంత!...అటువంటి మహనీయ కారుణ్యమూర్తి హేమసుందరీ రంగనాయకులు కిద్దరికి అష్టాక్షరీ మంత్రం ప్రసాదించారని విన్నప్పుడు నాకేమి ఆశ్చర్యం కలగ లేదు. లోక దృష్టిలో వా రిద్దరు సచ్చరిత్రులు కాకపోవచ్చును. కాని చాలా సరళ స్వభావులు. వారి తీవ్ర పరస్పరానురాగమే చిట్టచివరి కీవిధంగా పరిణమించి ఫలించింది. అదీగాక ఈమధ్యన దీనిని గురించి ఆలోచిస్తూంటే నా కింకొక విషయం స్ఫురించింది. పతితులన్న వారి యెడల మన కందరికి బాగా కనువిప్పు కలిగించడానికని, శ్రీరంగనాథుని దివ్య నేత్రాల వెన్నెల వెలు

గులే హేమసుందరీ, రంగనాయకుల రూపంలో అవతరించిన వన్న దృఢ నిశ్చయం కలిగింది. విశిష్టాద్వైత వేదాంత విజ్ఞాన ఖనివి నీ కింతకన్న నే నేమని వివరించగలను !"

యజ్ఞమూర్తి అది విని ఉస్సూరుమని నిశ్వసించి శిర స్సాకించుక వంచుకొన్నాడు. గోవిందయతి అతని లోలోపలి పశ్చాత్తాప వైఖరి గమనించి అలతి నగవుతో తిరిగి ప్రస్తావించాడు !

"నాయనా ! ఆచార్యులు మనతో ఎంతో కలిసికట్టుగా మాట్లాడుతూంటారు. ఒక్కొక్కప్పుడు పరిహాస ప్రసంగా లారంభిస్తూ ఉంటారు. తాము చాలా సామాన్య పురుషుల లన్నట్టు స్ఫురింప జేస్తూంటారు. కాని జాలితో ప్రేమాడితో తొణికిస లాడుతున్న ఆయన నిండు గుండె లోతులు మాత్రం మన కే మాత్రం తెలియవు ! రంగనాయకునికి శ్రీరంగేశుని దివ్య విలోచనాల సాక్షాత్కార భాగ్యం లభించినదని ఆచార్యులే అన్నారుకదా ! మరి తిరిగి ఇంతలోనే వా రిద్దరికి మంత్రోపదేశం ప్రసాదించవలసినంత ఆవశ్యకత ఏమి ఉన్నది! దీని అంతరార్థమేమో గ్రహించుకొన్నావా ?"

యజ్ఞమూర్తి మరి కొన్ని క్షణాలవరకు మాట్లాడ లేదు. చిట్టచివరి కొక నిట్టూర్పు విడిచిపెట్టాడు.

"మొదటినించి నా కిదంతా అయోమయంగానే ఉన్నది! ఇక నావంటి అజ్ఞుడీ లోకంలో లేడని అనిపిస్తున్నది !"

"ఆచార్యులు ముమ్ముందుగా రంగనాయకుని అర్హత కనుగొన్నారు. హేమసుందరి ఆపైన అతని ధోరణి కనిపెట్టి తిరిగి

నిచుళాపురం వెళ్ళిపోగలదేమో అనుకున్నారు. కాని అతని యెడల ఆమె ప్రగాఢానురక్తి గమనించిన పిమ్మట ఆయన కామె యెడల కూడా ఎంతో వాత్సల్యం కలిగింది. కనకనే మొట్టమొదట ఆమెకే అష్టాక్షరీ మంత్రం ప్రసాదించారు. అనంతరమే రంగనాయకుని కది ఉపదేశించారు."

"ఆచార్యు లా విధంగా స్వయంగా వా రిద్దరికి ఉపదేశించగలరని నేను కలలో కూడా ఊహించి ఉండలేదు."

"నేను మాత్రం అనుకొన్నానా! నిజానికి ఆయన కారుణ్య దృష్టి ఎటువంటిదో మన కెవ్వరికి తెలియనే తెలియదు. అంతేకాదు! ఎంతో సన్నిహితంగా, అప్యాయంగా ప్రసంగిస్తున్నా, ఆయన యదార్థ స్వరూపమేమో మనకెవ్వరికీ అవగాహన కాలేదు! ఈ మధ్యన నా సమక్షంలోనే ఒక అద్భుతం జరిగింది.

"ఏమది ?"

యజ్ఞమూర్తి ఎంతో ఆత్రతతో గోవిందయతి ముఖ వైఖరి పరిశీలించాడు!

"అదే చెబుతున్నాను. నేను మౌన నిష్ఠ అవలంబించిన పిమ్మట ఆచార్యులు నా కెదురుగా కూర్చుని మా చిన్ననాటి ఆటపాటల మాటలతో మాటి మాటికి కవ్వించి నవ్వించవలెనని ప్రయత్నించారు. నే నెంతో ఆశ్చర్యపడ్డాను. అయినా నా మౌన వ్రతం విడిచిపెట్టలేదు. అది గమనించి ఆయన కలకల నవ్వి "గోవిందా! శ్రీరంగేశులే స్వయంగా పనికట్టుకుని వచ్చి సమక్షంలో నిలిచినా, మరి నీ మౌన దీక్ష విడిచిపెట్టవు

కాబోలు !" అని చలోక్తు లారంభించారు. అప్పటికి నాకాయన మాటలలో అంతరార్థం సంపూర్ణంగా బోధపడింది. వెను వెంటనే నా నిష్ఠ విసర్జించాను."

యజ్ఞమూర్తి రవంతసేపు నిర్ఘాంతపడ్డాడు !

"మీ కేమి బోధపడినదో గాని నా కాయన పరిహాస పరమార్థ మేమి అవగాహన కాలేదు.

"నాయనా ! దీనిలో అంత దుర్గ్రాహ్యమైన పరమ రహస్య మేమి లేదు. విశిష్టాద్వైత ప్రస్థాన సారం గ్రహించిన వారి కాయన మాటలలో అవగాహన కాని దేది కనబడదు. శ్రీరంగనాథస్వామి ప్రత్యేకించి వైకుంఠంలోనే కాక, వేర్వేరు అంశలతో ప్రాణులలో, మానవులలో, ప్రపంచంలో సర్వత్రా నివసిస్తున్నారు. మరి మాయ అన్నది ఎక్కడ లేనే లేదు. ఇదేకదా విశిష్టాద్వైత పరమార్థము !

"అటువంటప్పుడు తోటివారి యెడల మానవదృష్టి స్వామికి మాత్రం సమన్వయించదా ? ఇదీ వారి పరిహాసంలో గల పరమార్థం! కనకనే కేవలం పతితులని మనవంటివా రందరు ఈస డించుకొంటున్న వారి యెడల ఆయన అపార కరుణాదృష్టి ప్రసరిస్తున్నది ! కాని మన కది ఎంతో విడ్డూరంగా కనిపిస్తున్నది !"

ఆ ప్రసంగంతో యజ్ఞమూర్తి లోలోపలి మథన యావత్తు మంచు విడిపోయినట్టు పోయింది :

"మీ రన్నది ప్రత్యక్షరము యథార్థమే ! ఎంతగా ఎన్నెన్ని గ్రంథాలు మథించినా ఈ మాత్రం సామాన్య

విషయం కూడా నా కవగాతం కాలేదు ! ఇంతకాలంనించి ఎడ తెగని అజ్ఞానాంధకారంలోపడి కొట్టుమిట్టాడుతున్నాను.

అతడంతలోనే లేచి నిలబడి రంగనాయకుని భవంతికి ప్రయాణమయినాడు. గోవిందయతి తన మాలతోబాటు నాలు గయిదు అడుగులవరకు అతని ననుసరించి తిరిగి చల్లని పలుకు లతో హిత వుపదేశించాడు :

"నాయనా! పామరుల కెవ్వరికి పరమేశ్వర సాక్షా త్కారం లభించదని మనవంటి వా రందరు అహంకరిస్తూ ఉంటారు ! కాని విద్వాంసులకన్న వారే ఆయన కెక్కువ సన్ని హితులని నా నమ్మిక ! కనకనే ఆచార్యు లతనికి పీఠాధిపత్యం ప్రసాదించవలెనని సంకల్పించి ఉంటారు ! మరి ఈ విషయమై నీవేమాత్రము మధనపడ నక్కరలేదు !"

"ఔను ! మీ రన్నది నిజమే ! నా కిప్పటికి కనువిప్పు కలిగింది ! మరి సెలవు ! అతని దగ్గిర కిప్పుడే బయలుదేరు తున్నాను."

అత్యంత వినీత వైఖరితో వీడ్కొన్నాడు యజ్ఞమూర్తి. మఠాధిపతి రంగనాయకుని భవంతి గుమ్మంలో అడుగు పెట్టే సరికి ఎక్కడికో బయలుదేరిన అత డెదురుపడ్డాడు. యజ్ఞ మూర్తి రాక గమనించి రంగనాయకుడు కొంతసే పాశ్చర్య పడ్డాడు. సగౌరవంగా ఎదురుగాపోయి వీధి అరుగుమీద వేసిన వ్యాఘ్ర చర్మంమీద కూర్చోబెట్టి ఎంతో వినయంతో సరసనే సమాసీను డయినాడు. యజ్ఞమూర్తి మొట్టమొదట కుశల ప్రశ్నతో ప్రసంగం ప్రారంభించి ఆచార్యుని ముఖతః ఉపదేశం

స్వీకరించిన అదృష్టశాలివని అభినందించాడు. అయినా రంగ నాయకుడు ఉబ్బి తబ్బిబ్బైపోలేదు :

"అదంతా వారి అనుగ్రహమే! లేకపోతే నావంటి అజ్ఞానికి అంతటి అర్హత ఎక్కడిది ?"

"అబ్బే! దీనిలో తమ అనుగ్రహం లేశమాత్రమయినా లేదని ఆచార్యులే ఆనాడు నాతో అన్నారు."

ఆ తరవాత యజ్ఞమూర్తి దేవాలయంలో కల్యాణ మంటపంలో తనకు, ఆచార్యునికి మధ్య నడిచిన ప్రసంగం సంగ్రహంగా అతనికి తెలియచేశాడు. రంగనాయకు పది విని మరింతగా ఆశ్చర్యపడ్డాడు. మరికొన్ని క్షణాలవరకు అతని నోట మాటే వెలువడలేదు. అంతలోనే యజ్ఞమూర్తి తాను వచ్చిన పని తెలియజేసి సగౌరవ దృష్టితో అతని నభినందించాడు. "మేలుకొన్నావా? కలగన్నావా?" అని రంగనాయకుడు క్షణ కాలం నిశ్చేష్టితు డయినాడు యజ్ఞమూర్తి మాటమీాద అతని కేమాత్రము నమ్మిక కలగలేదు. మఠాధిపతి తిరిగి అది యథార్థమే అని తిరిగి రెట్టించిన తరవాత అతని కిక విశ్వసించక తప్ప లేదు!

"ఆచార్యుల కొకవేళ నామీాద దయ తప్పినదేమో! లేకపోతే నే నెక్కడ! మీావంటి మహనీయ విద్వాంసులు స్వీకరించదగిన శ్రీవైష్ణవ పీఠాధిపత్య మెక్కడ! మన్నించండి! ఇది నావల్ల అయ్యే పనిగాదు."

"ఇది శ్రీమద్రామానుజుల ఆనతి. ఆయనే స్వయంగా నన్నిచటికి పంపించారు."

రంగనాయకుడు సవినయంగా శిరస్సాకించుక వంచుకొని దోసిలికట్టి విన్నవించాడు :

నేను దీని కేమాత్రము తగనన్నానని వారికి విన్నవించండి !"

"అర్హతానర్హతలు నిర్ణయించవలసినవారు ఆచార్యులు కాని, మనం కాము. వారే స్వయంగా స్వీకరించవలసినదని ఆదేశించినప్పుడు కాదని తిరస్కరించడం భావ్యం కాదు."

అయినా రంగనాయకుడు తన పట్టు విడిచి పెట్టలేదు. తాను కేవలం అనర్హుడనని మాటి మాటికి విన్నవించు కొన్నాడు. యజ్ఞమూర్తి కిక ఏమనడానికి పాలుపోలేదు. కొంచెం సే పాలోచించాడు :

"స్వయంగా వచ్చి నీవే వారికీ సంగతి నివేదించడం మంచిది."

"ఔను ! ఇది మంచి ఆలోచనే ! అయితే మీారు కూడా కొంచెం వెంట వచ్చి సాయపడాలి !"

యజ్ఞమూర్తి దాన్ని కంగీకరించిన తరవాత వారిద్దరు మఠానికి బయలుదేరారు. మరి కొంత సేపటికి రామానుజ యతిని సందర్శించారు. రంగనాయకుడు ఆచార్యుని సమక్షంలో అడుగు పెట్టినంతలోనే పాదాలపై సాగిలపడి నమస్కరించి విన్నవించాడు :

"తమ ఆజ్ఞ యజ్ఞమూర్తిగారు నా కింతకు మునుపే వెల్లడించారు. అయితే నే నెక్కడ ? ఆ పీఠాధిపత్య మెక్కడ !

మీ ఆజ్ఞ తిరస్కరించినందుకు మన్నించవలసినదని ప్రాధేయ పడుతున్నాను."

రామానుజు డతనిని ఎంతో అప్యాయతతో లేవనెత్తి తిరిగి ప్రగాఢాత్మీయ దృష్టితో ప్రోత్సహించాడు:

"నాయనా! దీనికి నీవు అన్నివిధాల అర్హుడవే! సందేహంలేదు!"

అయినా రంగనాయకుడు తన పట్టుదల విడిచి పెట్టలేదు. మన్నించవలసిందని మాటిమాటికి ప్రాధేయపడ్డాడు. ఆపైన ఆచార్యుని ముఖంలో మరికొన్ని క్షణాలవరకు గభీర మౌన ముద్ర మాత్రమే స్థిరపడింది. మరికొంతసేపటి కాయన యజ్ఞమూర్తి వైపు చూచి రవంత సేపాలోచించాడు.

"చూడు నాయనా! యజ్ఞమూర్తి కిటీవల వల్ల మాలినంత పని పేరుకొన్నది. పోనీ నీవు మన మన మఠంలో కోశాధికారిగా వ్యవహరించి ఆ బరువు కొంచెం తగ్గించకూడదా?"

రంగనాయకుని కా సూచన తిరస్కరించడం భావ్యం కాదని అనిపించింది. కొంచెం సంకోచిసూ నీళ్ళు నమిలాడు.

"మఠాధిపతులు అడుగడుగునా సాయపడితే నా కిది అంతగా కష్టమైన పనికాదు. తప్పక తమ ఆజ్ఞ శిరసావహించగలను."

యజ్ఞమూర్తి ఆ నియమాని కంగీకరించాడు. రంగనాయకుడు వా రిద్దరికి అతి వినీతి వైఖరితో నమస్కరించి సెలవు తీసుకుని తిరిగి తన భవంతికి బయలుదేరాడు. ఇటీవల ఆచార్యునికి తన యెడల ఇనుమడించిన వాత్సల్య దృష్టి తలుచుకోగానే

అతని నేత్రాంతాలలో కన్నీటి బిందువులు లేక ధారగా ప్రవహించాయి. తన తపన బలిమివల్లనే శ్రీరంగేశుని దివ్య విలోచనాల సాక్షాత్కార భాగ్యం లభించినదని ఆచార్యు లన్న మాట సంస్మరించినప్పుడు అతని కెంతో ఆశ్చర్యం కలిగింది. నిజంగా నాలో అంతటి తపన ఏమి ఉన్నది ? వారి అనుగ్రహమే నా కటువంటి మహనీయ భాగ్యం ప్రసాదించింది ! లేకపోతే నే నెక్కడ ? స్వామి సాక్షాత్కార మెక్కడ ? అయితే ఆచార్యుల నోట ఎన్నడు అసత్యం వెలువడదే ! మరి ఆయన ఎందు కలాగ సెలవిచ్చారో ! లేకపోతే అందరి ఎదట తామే అంతటి మహత్కార్యం నెరవేర్చినట్లు ప్రసంగిస్తారా ?...అయితే మాట వరసకయినా ఆయన అసత్యం చెప్పరే ! తమ ఘనత వెల్లడించడాని కిష్టం లేనప్పుడు అలవాటయిన గభీరముద్ర స్వీకరించ వచ్చునే ! అదంతా నాతపన ఫలితమే అని ఎందుకన్నారో ! ఎన్నెన్ని విధాల ఆలోచించినా అతనికా జటిల ప్రశ్న కెంతసేపటికి తగిన సమాధానం స్ఫురించలేదు. చిట్టచివరికి "దీనికింత ఆలోచన ఎందుకు ? ఆచార్యు లపార కరుణా సముద్రులు !" అని నిశ్చయించుకొన్నాడు.

రామానుజుని పెడద కనుదోయిలో తొణికిసలాడుతున్న కారుణ్యచ్ఛాయ సంస్మరించగానే అతని కన్నెదట శ్రీరంగేశుని విశాల విలోచన యుగళి నిశ్చలమయిన పైడి మెరుపుల జంట వలెతళుక్కుమని ప్రకాశించింది. చిన్ననాటినుండి అతడు నిచుళాపురం గ్రామవృద్ధులనోట శ్రీరంగశాయి కేవలంపతితపావనులైన కరుణాస్వరూపులన్న అభివర్ణన ఆకర్ణించాడు. కాని అప్పు డది అతని కేమాత్రము అవగాహన కాలేదు. ఇటీవల రామానుజుల

అపార కృప తెలుసుకొన్నప్పుడు రంగనాయకునికి ఆ సూక్తితో గల అంతరార్థం రవంత బోధపడింది. "శక్తి సామర్థ్యంలో, కరుణలో, ప్రాభవంలో స్వామి ఆచార్యులకన్న కొంచెం గొప్ప వారయి ఉండవచ్చును. లోకాలే సృష్టించగలిగిన శ్రీరంగ నాథుని కృప నావంటి పాపి కెలాగ బోధపడుతుంది!" లోలో పల కొంచెం సమాధాన పడ్డాడు రంగనాయకుడు. సజ్జనులే కాక, తనవంటి అధమాధములు కూడా అనేక మార్గాలలో ఎడతెగని దుఃఖా లనుభవించి చిట్టచివరి కాయన చల్లని అడు గుల నీడలలో మేను వాల్చి, విశ్రమించి ఆనందిస్తున్నారని నిశ్చ యించుకొన్నాడు. తనవంటి మహా పాతకిమీదే స్వామి కంతటి దయ కలిగినప్పుడు మిగిలినవారి యెడల ఆయన కెంతయినా జాలి కలిగి తీరుతుంది. వా రందరిని వేర్వేరు దారులలో క్రమ క్రమంగా తమవైపే ఆకర్షించుకొంటున్నారు. మరి సందేహం లేదు! ఎంతో సంతృప్తిపడ్డాడు రంగనాయకుడు. అతని కా క్షణంలో శ్రీరంగనాథుని సువిశాల నేత్రాలే కాక, సమగ్ర స్వరూపం సమస్తము హృదయ నయనాల సమక్షంలో సాక్షా త్కరించింది. చెక్కిళ్ళపై ఆనంద బాష్పాల విరళధారలై ప్రవ హించాయి! లోకంలో స్వార్థ శూన్యమయిన జాలి, కరుణ, ఔదార్యము, ప్రేమ, ఆత్మీయత తొణికిసలాడిన హృదయాలే శ్రీరంగశాయి దేవళాలనికూడా గ్రహించుకొన్నాడు. తిరిగి అతని కటాక్షాలలో నుండి కన్నీటి బిందువు లొకటి రెండు పొటమరించాయి.

అదే సమయంలో అతనికి నిచుళాపురంలో గడిచిన జీవితమంతా ఒక వినూతన రూపంలో అతి విచిత్రంగా కనిపిం

చింది. తిరుమల రెడ్డి మాటిమాటికి కక్షకట్టి అనేకవిధాల వేధించాడు. చంపించివేయించాలని కూడా శాయశక్తులా ప్రయత్నించాడు. ఆ పగ భరించలేక అత డకస్మాత్తుగా శ్రీరంగం చేరుకొన్నాడు. అక్కడ రామానుజుల సందర్శన భాగ్యం లభించింది దానికి తిరుమలరెడ్డి పరోక్షంగా ప్రధాన కారణభూతుడని గ్రహించుకొన్న పిమ్మట రంగనాయకునికి అతడొక మహోపకారిలా సాక్షాత్కరించాడు! ఇన్నాళ్ళనించి అతని యెడల లోలోపల పేరుకొన్న అక్కస్సంతా ఒక్కమారుగా మంచు విడిపోయినట్టు విడిపోయింది. బద్ధశత్రువులే ఒక్కొక్కప్పుడు మహోపకారులు కాగలరని అత డీనాడు అకస్మాత్తుగా గ్రహించుకొన్నాడు. తన మాట చెప్పగానే ఈసడించివేసిన శృంగారమంజరి యెడల, కోపించిన తల్లిదండ్రులయెడల అతని కదే విధమయిన ఆర్ద్ర దృష్టి కలిగింది. వారి కెప్పటి కయినా తన యెడల అభిమానం కలగకపోదని లోలోపల కొంచెం సంతృప్తిపడ్డాడు. ఎడతెగని తల్లిదండ్రుల పోరే శ్రీరంగ ప్రయాణం ప్రేరేపించినదని గ్రహించగానే అతని కెంతో ఆశ్చర్యం కలిగింది. "అన్నీ మంచికే వస్తాయి" అన్న లోకుల సూక్తిలో గల పరమార్థం అతని కిప్పుడు సమగ్ర స్వరూపంతో భాసించింది. సింహాచలాన్ని తలుచుకోగానే అతని కెంతో జాలి వేసింది. తిరిగి ఆ దురదృష్టవంతుని కుటుంబాని కడుగడుగునా సాయపడాలని గట్టిగా నిశ్చయించుకొన్నాడు.

నెమ్మది నెమ్మదిగా అడుగులు వేసుకొంటూ రంగనాయకుడు ఇంటిలో అడుగు పెట్టేసరికి హేమసుందరి అప్పుడే దీపం వెలిగించి అతని రాకకోసం నిమేష మొక యుగంగా నిరీక్షిస్తున్నది. ప్రశాంత సంధ్యాకాంతిలో చెక్కిళ్ళపై ప్రతిఫలిస్తున్న

కాంచన కర్ణాభరణాల కాంతులలో బెడిసి మీనుల జంటవలె మిలమిలలాడుతున్న ఆమె సువిశాల విలోచనాలవైపు పవలో కించగానే రామానుజ శ్రీరంగేశుల మనోజ్ఞ నయనాల జంట లోకదాని వెనుక వేర్వొకటి తటాలున అతని హృదయాంతరాళంలో సాక్షాత్కరించాయి! మరికొన్ని క్షణాలవరకు అతని వైఖరిలో విపరీతమయిన పరధ్యానం గోచరించింది.

"ఇదేమి టిలాగున్నా రీవేళ! మఠంలో గాని తిరిగి మళ్ళీ విద్ధూర మేమయినా జరిగిందా?"

రంగనాయకుని నిశ్చలదృష్టి హేమసుందరి వెడద కనుదోయి లోతులలో చిక్కుకొన్నది. ఉల్లాస పారవశ్యంతో తల మునకలై రామానుజు లానాడు పీఠాధిపతిగా అభిషేకించదలిచిన విషయం వెల్లడించాడు.

"నిజమేనా?"

హేమసుందరి పైడి బొమ్మలా నిర్ఘాంతపడి నిలుచున్నది

"నిజమే! అయితే నేను దాని కంగీకరించలేదనుకో! కాని చిట్ట చివరికి మఠంలో కోశాధిపతిగానయినా వ్యవహరించవలసినదని ఆజ్ఞాపించారు. వారి మాట కాదనలేక అంగీకరించాను."

"అమ్మయ్య! ఇంతేకదా అయితే ఇక మన పసివాడికి ఆచార్యుల పేరే పెట్టుకుంటాను. మఠాధిపతి మాట వినబడగానే మీా సన్యాసాని కేమయినా ప్రయత్నాలు జరుగుతున్నాయేమోనని చాలా భయపడ్డాను."

రంగనాయకుడా సుందరిని మృదువుగా కౌగలించుకొని అలవోకగా విశాల నేత్రాలు ముద్దుపెట్టుకొన్నాడు!

"ఎందుకు హేమా! నీకింతటి ఆరాటం! ఇటీవల నాలో సన్యాసం స్వీకరించాలన్న సంకల్పం మొలకెత్తినదని గ్రహించి ఆచార్య్యులేమన్నారో తెలుసునా! "నాయనా! చెయ్యి పట్టుకుని హేమసుందరి నిన్ను శ్రీరంగస్వామి సన్నిధికి తీసుకువచ్చింది. అదీగాక లోకంలో అంతటా నివసిస్తున్నట్టే ఆమె అంతరాంతరంలో కూడా స్వామి ఉన్నారుగదా! ఇక ఆయన కోసమని ప్రత్యేకించి సన్యసించి నీ వెక్కడికి పోగలవు? అంతట ఉన్నవారాయనేగదా? ఆపైన నీ వింకా చాలా చిన్నవాడవు! బాగా పెద్దవాడవయిన తరవాత అప్పటి మాట ఆలోచించుకోవచ్చునులే!" అన్నారు. అందుచేత నే నప్పటినుంచి ఆ మాటే తల పెట్టలేదు. అనవసరంగా కంగారుపడి కాళ్ళు విరగదొక్కుకోకు!

"అలాగా! అయితే స్వామి నా మొర ఆలకించారన్న మాట. ఇక మొక్కుబడి చెల్లించుకోవడం ఒక్కటే తరువాయి."

రంగనాయకు డెంతో ఆశ్చర్యపడ్డాడు!

"ఏమని మొక్కుకున్నావు!"

"నా కడుపున ఒక కాయ కాచి, పసివాడితో పాటు మీరు పది కాలాలపాటు నట్టింట పారాడుతూంటే పచ్చల హారం సమర్పిస్తానని మొక్కుకున్నాను."

"అమ్మ దొంగా! రెండు మూడు పెద్ద కోరికలతో మెలికపెట్టి ఎంత విచిత్రంగా మొక్కుకున్నావు! స్వామి నీ మాయ గ్రహిస్తే మరి కోరిక చెల్లిస్తారా?"

రంగనాయకుడు కొంచెం కొంటెతనంతో చిరునవ్వు చిందించాడు.

"ఏరి కోరి ఆచార్యులే మీవంటి గజదొంగని కోశాధికారిగా నియమించుకోలేదా ఏమిటి? మీకన్న నే నేమయినా తీసిపోయానా? అప్పుడే నా కోరిక కొంత నెరవేరినట్టే! స్వామి దయతలిస్తే మిగిలినది కూడా నెరవేరకేం జేస్తుంది!"

"అబ్బో! నువ్వు నాకన్న రెండాకు లెక్కువ చదువుకొన్న గొప్ప గజదొంగవి! నిండు గుండె నిలువునా దోచుకున్నావు"

వ్యంగ్యంగా ఒక ఛలోక్తి విసిరాడు రంగనాయకుడు కలకల నవ్వి. హేమసుందరి మరి ప్రతి సమాధానం చెప్పలేక ఒకించుక తల వంచుకొన్నది. ఆ కొత్త మొక్కుబడితో స్ఫురించిన హేమ ప్రేముడి లోతు గ్రహించినంతలోనే అతని కామె పాదాలమీద వాలి ముద్దులతో ముంచెత్తాలన్న తహతహ కలిగింది. క్షణంలో ఆ సంకల్పం గ్రహించుకొన్న హేమసుందరి అంతలోనే కొంచెం దూరంగా తొలిగి నిలుచున్నది!

"చాలు! చాల్లెండి! మీ వెర్రి చేష్టలు! మధ్య వైష్ణవానికి పంగనామా లెక్కువన్నట్టుంది మీ ధోరణి!"

ఆనాటినుంచి హేమసుందరీ రంగనాయకుల జీవితయుగళి అనుక్షణము రామానుజుల మత పరిచర్యలకే అంకితమయింది. అంతే కాదు. స్వామి ఉత్సవాలలో, ఊరేగింపులలో సాము గరిడీల వినోదాలమీద రంగనాయకుని శ్రద్ధ నానాటికి అతిశయించింది. ఎప్పుడయినా వారాని కొకమారు వీధి మొగలో

నిలబడి వినోదా లారంభించగానే పైడి వెండి చక్రాలు కోకొల్లలుగా అతని పాదాల దగ్గిర వర్షించాయి! అందువల్ల అతని మనుగడ ఏ విధమయిన కొదవ లేకుండా హాయిగా గడిచి పోయింది. రంగనాయకుడు తన సంపాదనలో చాలా భాగం మఠాని కర్పించాడు. అలాగే ప్రత్యేకించి కొంత సొమ్ము సింహాచలం కుటుంబానికి అందేటట్టు గట్టి ఏర్పాటు చేశాడు.

ఆచార్యుని మంత్రోపదేశం వార్త విన్న పిమ్మట ధర్మకర్త ఎంతో ఆశ్చర్యపడి అతని భృతి ఇనుమడించవలెనని నిశ్చయించాడు. కాని రంగనాయకుడు దాని కంగీకరించలేదు. ఏ విధమయిన జీతము, భత్యము లేకుండా సదా స్వామి సేవ కనుమతించవలసినదని వేడుకొన్నాడు. నిమేషకాలం నిర్ఘాంతపడిన పిమ్మట ధర్మకర్త అతని ప్రార్థన కంగీకరించి అనేక విధాల అభినందించాడు.

రంగనాయకునికి రామానుజులు స్వయంగా తామే అష్టాక్షరి అనుగ్రహించారన్న వార్త చెవినపడిన పిమ్మట పౌర ప్రముఖుల కందరికి అతని యెడల విపరీతమయిన గౌరవం కలిగింది. క్రమక్రమంగా వా రందరు మఠానికి వచ్చి దేవరాజ స్వామిని సందర్శించి విరివిగా కానుక లర్పించడం ప్రారంభించారు. ఆ వార్త విన్న తరువాత మఠం విడిచిపెట్టి వెళ్ళిపోయిన బ్రహ్మచారు రొక రొకరే తిరిగి వచ్చి తమ తప్పిదాలు మన్నించవలసినదని యజ్ఞమూర్తి నర్థించారు. అతని అనుమతితో తిరిగి మఠంలో ప్రవేశించారు. క్రమక్రమంగా శ్రీరంగేశుని యెడల హేమసుందరీ, రంగనాయకుల కేర్పడిన అపూర్వ ప్రగాఢ భక్తి గోవిందయతి వంటి పరమబ్రహ్మజ్ఞ్యులకే ఎన్నిక

చేసి మన్నించదగిన గొప్ప ఒరవడిగా గోచరించింది ! వారి అన్యోన్యత, సౌజన్యము, సరళ వర్తనము క్రమక్రమంగా మత వాస్తవ్యులకే ఎంతో ఆశ్చర్యం కలిగించాయి !

శ్రీమద్రామానుజుని విశిష్టాద్వైత ప్రస్థాన ప్రభావంవల్ల దక్షిణ భారతంలో పల్లెపట్టులలో, పట్టణాలలో అంతట అసంఖ్యాక సముత్తుంగ దేవాలయా లావిర్భవించాయని చరిత్రవేత్తలందరు ఏకగ్రీవంగా నిర్ణయిస్తున్నారు. అవి పరమేశ్వరుని కోసం భక్తిపరవశమయిన జనానీకం పైకెత్తిన సుదీర్ఘ నిశ్చల హస్తాలవలె తరలిస్తున్నాయని వేనోళ్ళ అభివర్ణిస్తున్నారు. అయితే అపార కృపానిధి రామానుజయతి వంటి పుట్టువు లయిన హేమసుందరీ రంగనాయకుల వంటి వారి నెందరెందరో మహనీయ మానవ స్వర్ణ దేవాలయాలుగా మలిచిన విషయం గుర్తించిన చరిత్రకారు లెంతో మంది లేరు !



సమాప్తం.

# NVKR

## వారి

# ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. | ఏడు కొండలు | రు. 1-75 |
| 2. | భూగర్భంలో సాగరయాత్ర | రు. 3-00 |
| 3. | విశాల నేత్రాలు | రు. 5-00 |
| 4. | బంగారు పంజరం | రు. 4-00 |

ప్రతులకు :

నిమ్మగడ్డ వెంకట కృష్ణారావు & సన్సు

బుక్ పబ్లిషర్సు

పార్కు రోడ్ — విజయవాడ-1.